قَالُواْ رَبَّنَآ أَمَتَّنَا ٱثۡنَتَيۡنِ وَأَحۡيَيۡتَنَا ٱثۡنَتَيۡنِ فَٱعۡتَرَفۡنَا بِذُنُوبِنَا فَهَلۡ إِلَىٰ خُرُوجٖ مِّن سَبِيلٖ ١١

**11**. వారు ఇలా అంటారు: "ఓ మా ప్రభూ! నీవు మాకు రెండుసార్లు మరణాన్ని ఇచ్చావు మరియు రెండుసార్లు జీవితాన్ని ఇచ్చావు.[1] ఇప్పుడు మేము మా పాపాలను ఒప్పుకుంటున్నాము. కావున ఇప్పుడైనా ఇక్కడి (నరకం) నుండి బయటపడే మార్గం ఏదైనా ఉందా?"

ذَٰلِكُم بِأَنَّهُۥٓ إِذَا دُعِيَ ٱللَّهُ وَحۡدَهُۥ كَفَرۡتُمۡ وَإِن يُشۡرَكۡ بِهِۦ تُؤۡمِنُواْۚ فَٱلۡحُكۡمُ لِلَّهِ ٱلۡعَلِيِّ ٱلۡكَبِيرِ ١٢

**12**. (వారికి ఇలా సమాధానం ఇవ్వబడుతుంది): "దీనికి కారణమేమిటంటే వాస్తవానికి అద్వితీయుడైన అల్లాహ్‌ను ప్రార్థించమన్నప్పుడు మీరు తిరస్కరించారు మరియు ఆయనకు భాగస్వాములు కల్పించబడినప్పుడు, మీరు విశ్వసించారు! ఇప్పుడు తీర్పు మహోన్నతుడు, మహనీయుడు[2] అయిన అల్లాహ్ చేతిలో ఉంది."[3]

هُوَ ٱلَّذِي يُرِيكُمۡ ءَايَٰتِهِۦ وَيُنَزِّلُ لَكُم مِّنَ ٱلسَّمَآءِ رِزۡقٗاۚ وَمَا يَتَذَكَّرُ إِلَّا مَن يُنِيبُ ١٣

**13**. ఆయనే మీకు తన అద్భుత సూచనలను చూపించేవాడు మరియు ఆకాశం నుండి మీ కొరకు జీవనోపాధిని అవతరింపజేసేవాడు. కాని, ఆయన వైపునకు పశ్చాత్తాపంతో మరలేవారు తప్ప, ఇతరులు వీటిని గ్రహించలేరు.

---

1. చూడండి, 2:28. రెండు మరణాలు అంటే మొదటిది మానవుడు ఉనికిలోకి రాకముందు ఉన్నస్థితి. రెండవది భూలోక జీవితంలో మరణించటం. రెండు జీవితాలంటే మొదటిది భూలోక జీవితం, రెండవది పరలోక జీవితం. వ్యాఖ్యాతలందరూ ఈ విశదీకరణతో ఏకీభవిస్తున్నారు.
2. చూడండి, 4:34.
3. దైవప్రవక్త ('స'అస) ప్రవచనం: తీర్పు దినమున స్వర్గానికి అర్హులైన వారు స్వర్గానికి పంపబడతారు. నరకానికి అర్హులైన వారు నరకానికి. ఆ తరువాత అల్లాహ్ (సు.తా.) అంటాడు: 'ఎవని హృదయంలో ఆవగింజంత విశ్వాసం ఉందో అతనిని నరకం నుండి తీయండి.' అప్పుడు వారు తీయబడతారు. వారు కాలి నల్లబడిపోయి ఉంటారు. వారు జీవనదిలోకి త్రోయబడతారు. వారు నది ఒడ్డున మొగ్గలు అంకురించినట్లు, అంకురించి బయటికి వస్తారు. (అబూ సయీద్ అల్-ఖుద్రీ కథనం; బు'ఖారీ, ముస్లిం, నసాయి', మరియు ఇబ్నె 'హంబల్) ఈ విధంగా కొంతైనా విశ్వాసమున్నవారు క్షమించబడతారు.

فَٱدۡعُواْ ٱللَّهَ مُخۡلِصِينَ لَهُ ٱلدِّينَ وَلَوۡ كَرِهَ ٱلۡكَٰفِرُونَ ﴿١٤﴾

**14**. కావున (ఓ విశ్వాసులారా!) మీరు మీ ధర్మాన్ని (భక్తిని) కేవలం ఆయనకే ప్రత్యేకించుకొని, అల్లాహ్‌ను మాత్రమే ప్రార్థించండి సత్యతిరస్కారులకు ఇది ఎంత అసహ్యాకరమైనా!

رَفِيعُ ٱلدَّرَجَٰتِ ذُو ٱلۡعَرۡشِ يُلۡقِي ٱلرُّوحَ مِنۡ أَمۡرِهِۦ عَلَىٰ مَن يَشَآءُ مِنۡ عِبَادِهِۦ لِيُنذِرَ يَوۡمَ ٱلتَّلَاقِ ﴿١٥﴾

**15**. ఆయన మహోన్నతమైన స్థానాలు గలవాడు,[1] (సర్వాధికార) సింహాసనానికి ('అర్ష్‌కు) అధిపతి;[2] తన దాసులలో తనకు ఇష్టమైన వారిపై, తన ఆజ్ఞ ప్రకారం, తన దివ్యజ్ఞానాన్ని (రూ'హ్‌ను) అవతరింప జేస్తాడు,[3] ఆయనతో సమావేశమయ్యే దినమును గురించి హెచ్చరించటానికి;

يَوۡمَ هُم بَٰرِزُونَۖ لَا يَخۡفَىٰ عَلَى ٱللَّهِ مِنۡهُمۡ شَيۡءٞۚ لِّمَنِ ٱلۡمُلۡكُ ٱلۡيَوۡمَۖ لِلَّهِ ٱلۡوَٰحِدِ ٱلۡقَهَّارِ ﴿١٦﴾

**16**. ఆ రోజు వారందరూ బయటికి వస్తారు. వారి ఏ విషయం కూడా అల్లాహ్ నుండి రహస్యంగా ఉండదు. ఆ రోజు విశ్వ సామ్రాజ్యాధికారం ఎవరిది? అద్వితీయుడూ, ప్రబలుడూ[4] అయిన అల్లాహ్‌దే!

ٱلۡيَوۡمَ تُجۡزَىٰ كُلُّ نَفۡسِۭ بِمَا كَسَبَتۡۚ لَا ظُلۡمَ ٱلۡيَوۡمَۚ إِنَّ ٱللَّهَ سَرِيعُ ٱلۡحِسَابِ ﴿١٧﴾

**17**. ఆ రోజు ప్రతిప్రాణికి తాను సంపాదించిన దాని ప్రతిఫలం ఇవ్వబడుతుంది. ఆ రోజు ఎవ్వరికీ అన్యాయం జరుగదు. నిశ్చయంగా, అల్లాహ్ లెక్క తీసుకోవటంలో అతి శీఘ్రుడు.

---

1. రఫీ'ఉ: Exalted, ఉన్నత స్థానాలు గలవాడు, **అర్-రాఫి'ఉ:** (సేకరించబడిన పదం) The Exalter, of the believer by prospering him. Exalter of the obedient. విశ్వాసులను ఉన్నతస్థాయిలోకి ఎత్తువాడు, **పైకెత్తేవాడు** లేక విధేయులను ప్రశంసించువాడు. ఇది అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లలో ఒకటి.
2. చూడండి, 7:54.
3. అర్-రూ'హు: దివ్యజ్ఞానం, చూడండి, 16:2, 42:52 అక్కడ కూడా రూ'హ్ దివ్యజ్ఞానంగా పేర్కొనబడింది. 19:17, 78:38 మరియు 97:4లలో రూ'హ్, జిబ్రీల్ (అ.స.)ను సూచిస్తోంది.
4. **అల్-ఖహ్హారు:** తన సృష్టిపై **సంపూర్ణ అధికారం**, ఆధిపత్యం గలవాడు, లోబరచుకొనేవాడు, **ప్రబలుడు**. అల్-ఖాహిరుకు చూడండి, 6:18, 61. **అల్ వా'హిద్**కు చూడండి, 2:133. **అల్-వా'హిద్ అల్-ఖహ్హార్**లకు చూడండి.12:39, 13:16, 14:48, 38:65, 39:4, 40:16.

وَأَنذِرْهُمْ يَوْمَ ٱلْـَٔازِفَةِ إِذِ ٱلْقُلُوبُ لَدَى ٱلْحَنَاجِرِ كَـٰظِمِينَ ۚ مَا لِلظَّـٰلِمِينَ مِنْ حَمِيمٍ وَلَا شَفِيعٍ يُطَاعُ ﴿١٨﴾

18. మరియు (ఓ ము'హమ్మద్!) సమీపంలో రానున్న దినాన్ని గురించి వారిని హెచ్చరించు. అప్పుడు గుండెలు గొంతుల వరకు వచ్చి అడ్డుకొని, ఊపిరి ఆడకుండా చేస్తాయి. (ఆ రోజు) దుర్మార్గులకు, ఆప్తమిత్రుడు గానీ, మాట చెల్లునట్టి సిఫారసు చేసేవాడు గానీ,[1] ఎవ్వడూ ఉండడు.

يَعْلَمُ خَآئِنَةَ ٱلْأَعْيُنِ وَمَا تُخْفِى ٱلصُّدُورُ ﴿١٩﴾

19. ఆయన(అల్లాహ్)కు చూపులలోని నమ్మకద్రోహం మరియు హృదయాలలో దాగివున్న రహస్యాలు అన్నీ తెలుసు.

وَٱللَّهُ يَقْضِى بِٱلْحَقِّ ۖ وَٱلَّذِينَ يَدْعُونَ مِن دُونِهِۦ لَا يَقْضُونَ بِشَىْءٍ ۗ إِنَّ ٱللَّهَ هُوَ ٱلسَّمِيعُ ٱلْبَصِيرُ ﴿٢٠﴾

20. మరియు అల్లాహ్, న్యాయంగా తీర్పుచేస్తాడు. మరియు వారు ఆయన(అల్లాహ్)ను వదలి ఎవరినైతే ప్రార్థిస్తూ ఉన్నారో, వారు ఎలాంటి తీర్పుచేయలేరు. నిశ్చయంగా, అల్లాహ్! ఆయన మాత్రమే సర్వం వినేవాడు, సర్వం చూసేవాడు. (3/8)

۞ أَوَلَمْ يَسِيرُوا۟ فِى ٱلْأَرْضِ فَيَنظُرُوا۟ كَيْفَ كَانَ عَـٰقِبَةُ ٱلَّذِينَ كَانُوا۟ مِن قَبْلِهِمْ ۚ كَانُوا۟ هُمْ أَشَدَّ مِنْهُمْ قُوَّةً وَءَاثَارًا فِى ٱلْأَرْضِ فَأَخَذَهُمُ ٱللَّهُ بِذُنُوبِهِمْ وَمَا كَانَ لَهُم مِّنَ ٱللَّهِ مِن وَاقٍ ﴿٢١﴾

21. * ఏమీ? వారు భూమిలో సంచారం చేసి తమకు ముందు గతించిన వారి ముగింపు ఎలా జరిగిందో చూడలేదా? వారు, వీరికంటే ఎక్కువ బలం గలవారు. మరియు వీరికంటే ఎక్కువ గుర్తులను భూమిలో వదిలిపోయారు; కాని అల్లాహ్ వారి పాపాలకుగానూ వారిని పట్టుకున్నాడు మరియు అప్పుడు వారిని అల్లాహ్ పట్టునుండి కాపాడేవాడు ఎవ్వడూ లేకపోయాడు.

1. సిఫారసుకు చూడండి, 10:3.

ذَٰلِكَ بِأَنَّهُمْ كَانَت تَّأْتِيهِمْ رُسُلُهُم بِٱلْبَيِّنَٰتِ فَكَفَرُوا۟ فَأَخَذَهُمُ ٱللَّهُ ۚ إِنَّهُۥ قَوِىٌّ شَدِيدُ ٱلْعِقَابِ ﴿٢٢﴾

22. ఇలా ఎందుకు జరిగిందంటే! వారి ప్రవక్తలు వారివద్దకు స్పష్టమైన సూచనలు తీసుకొని వచ్చిఉన్నారు! కాని వారు, వారిని తిరస్కరించారు, కాబట్టి అల్లాహ్ వారిని శిక్షకు గురిచేశాడు. నిశ్చయంగా, ఆయన మహా బలశాలి, శిక్ష విధించటంలో కఠినుడు.

وَلَقَدْ أَرْسَلْنَا مُوسَىٰ بِـَٔايَٰتِنَا وَسُلْطَٰنٍ مُّبِينٍ ﴿٢٣﴾

23. మరియు వాస్తవంగా, మేము మూసాను మా సూచన(ఆయాత్)లతో మరియు స్పష్టమైన అధికారంతో పంపి ఉన్నాము;

إِلَىٰ فِرْعَوْنَ وَهَٰمَٰنَ وَقَٰرُونَ فَقَالُوا۟ سَٰحِرٌ كَذَّابٌ ﴿٢٤﴾

24. ఫిర్'ఔన్, హామాన్ మరియు ఖారూన్‌ల[1] వద్దకు! కాని వారు: "ఇతను మాంత్రికుడు, అసత్యవాది!" అని అన్నారు.

فَلَمَّا جَآءَهُم بِٱلْحَقِّ مِنْ عِندِنَا قَالُوا۟ ٱقْتُلُوٓا۟ أَبْنَآءَ ٱلَّذِينَ ءَامَنُوا۟ مَعَهُۥ وَٱسْتَحْيُوا۟ نِسَآءَهُمْ ۚ وَمَا كَيْدُ ٱلْكَٰفِرِينَ إِلَّا فِى ضَلَٰلٍ ﴿٢٥﴾

25. తరువాత అతను మా వద్దనుండి సత్యాన్ని వారి ముందుకు తీసుకొనిరాగా వారన్నారు: "ఇతనిని విశ్వసించే వారందరి పుత్రులను చంపండి మరియు వారి స్త్రీలను బ్రతకనివ్వండి."[2] కాని సత్యతిరస్కారుల పన్నాగాలు వ్యర్థమే అవుతాయి.

---

1. ఖారూన్, మొదట మూసా ('అ.స.)ను అనుసరించాడు. తరువాత అవిశ్వాసుడయ్యాడు. వివరాలకు చూడండి, 28:76. హామాన్, కొరకు చూడండి 28:6, అతడు ఫిర్'ఔన్ సభలో మంత్రిగా ఉండేవాడు.
2. ఫిర్ఔను, మూసా ('అ.స.) జన్మానికి ముందు కూడా తాను బానిసలుగా చేసి ఉంచిన బనీ-ఇస్రాయీ'ల్ సంతతి వారి మగ సంతానాన్ని పుట్టిన వెంటనే చంపిస్తూ ఉండేవాడు. ఎందు కంటే వారి సంతతిలోని బాలుడు అతని నాశనానికి కారకుడవుతాడని, అతనికి, జ్యోతిష్యులు చెప్పి ఉంటారు. ఈ సారి మూసా ('అ.స.) మరియు అతని సంతతి వారి మధ్య అవిశ్వాసం, కలహాలు రేకెత్తించే ఉద్దేశ్యంతో వారి పుత్రులను చంపమని ఆజ్ఞాపిస్తాడు. వారు పలికిన మాటలకు చూడండి, 7:129.

وَقَالَ فِرۡعَوۡنُ ذَرُونِيٓ أَقۡتُلۡ مُوسَىٰ وَلۡيَدۡعُ رَبَّهُۥٓۖ إِنِّيٓ أَخَافُ أَن يُبَدِّلَ دِينَكُمۡ أَوۡ أَن يُظۡهِرَ فِي ٱلۡأَرۡضِ ٱلۡفَسَادَ ٢٦

**26**. మరియు ఫిర్'ఔన్ ఇలా అన్నాడు: "మూసాను చంపేపని నాకు వదలిపెట్టండి; అతనిని తన ప్రభువును పిలుచుకోనివ్వండి. వాస్తవానికి, నా భయమేమిటంటే, అతను మీ ధర్మాన్ని మార్చవచ్చు లేదా దేశంలో కల్లోలాన్ని రేకెత్తించవచ్చు!"

وَقَالَ مُوسَىٰٓ إِنِّي عُذۡتُ بِرَبِّي وَرَبِّكُم مِّن كُلِّ مُتَكَبِّرٖ لَّا يُؤۡمِنُ بِيَوۡمِ ٱلۡحِسَابِ ٢٧

**27**. మరియు మూసా అన్నాడు: "నిశ్చయంగా, నేను లెక్కతీసుకోబడే రోజును విశ్వసించని ప్రతి దురహంకారి నుండి కాపాడటానికి, నాకూ మరియు మీకూ కూడా ప్రభువైన ఆయన (అల్లాహ్) శరణు వేడుకుంటున్నాను!"[1]

وَقَالَ رَجُلٞ مُّؤۡمِنٞ مِّنۡ ءَالِ فِرۡعَوۡنَ يَكۡتُمُ إِيمَٰنَهُۥٓ أَتَقۡتُلُونَ رَجُلًا أَن يَقُولَ رَبِّيَ ٱللَّهُ وَقَدۡ جَآءَكُم بِٱلۡبَيِّنَٰتِ مِن رَّبِّكُمۡۖ وَإِن يَكُ كَٰذِبٗا فَعَلَيۡهِ كَذِبُهُۥۖ وَإِن يَكُ صَادِقٗا يُصِبۡكُم بَعۡضُ ٱلَّذِي يَعِدُكُمۡۖ إِنَّ ٱللَّهَ لَا يَهۡدِي مَنۡ هُوَ مُسۡرِفٞ كَذَّابٞ ٢٨

**28**. అప్పుడు తన విశ్వాసాన్ని గుప్తంగా ఉంచిన ఫిర్'ఔన్ కుటుంబపు ఒక వ్యక్తి ఇలా అన్నాడు:[2] "ఏమీ? మీరు, 'అల్లాహ్‌యే నా ప్రభువు.' అని అన్నందుకు, ఒక వ్యక్తిని చంపగోరుతున్నారా? వాస్తవానికి, అతను మీ ప్రభువు తరఫునుండి మీ వద్దకు స్పష్టమైన సూచనలు తీసుకొని వచ్చాడు కదా! మరియు ఒకవేళ అతను అసత్యవాది అయితే, అతని అసత్యం అతని మీదనే పడుతుంది! కాని ఒకవేళ అతను సత్యవంతుడే అయితే, అతను హెచ్చరించే (శిక్ష) మీపై పడవచ్చు కదా! నిశ్చయంగా, అల్లాహ్ మితిమీరే అసత్యవాదికి సన్మార్గం చూపడు!

---

1. ఫిర్'ఔన్, మూసా ('అ.స.)ను చంపగోరినప్పుడు అతను ఈ విధంగా ప్రార్థించారు. దైవప్రవక్త ('స'అస) కూడా తమకు శత్రువుల భయం ఉంటే ఈ దు'ఆ చేసేవారు. ముస్నద్ అ'హ్మద్, 4/415 'ఓ అల్లాహ్ (సు.తా.) మేము నిన్ను వారికి విరుద్ధంగా ఉంచుతున్నాము. మరియు వారి ఆగడాల నుండి నీ రక్షణ కోరుతున్నాము.'
2. ఇటువంటి గాథకు చూడండి, 36:20-27.

يَٰقَوْمِ لَكُمُ ٱلْمُلْكُ ٱلْيَوْمَ ظَٰهِرِينَ فِى ٱلْأَرْضِ فَمَن يَنصُرُنَا مِنۢ بَأْسِ ٱللَّهِ إِن جَآءَنَا ۚ قَالَ فِرْعَوْنُ مَآ أُرِيكُمْ إِلَّا مَآ أَرَىٰ وَمَآ أَهْدِيكُمْ إِلَّا سَبِيلَ ٱلرَّشَادِ ﴿٢٩﴾

**29**. "ఓ నా జాతి ప్రజలారా! ఈ నాడు రాజ్యాధికారం మీదే; దేశంలో మీరు ప్రాబల్యం వహించి ఉన్నారు, కాని ఒకవేళ అల్లాహ్ శిక్ష మనమీద వచ్చిపడితే, అప్పుడు మనకెవడు సహాయం చేయగలడు?" అప్పుడు ఫిర్'ఔన్ అన్నాడు: "నాకు సముచితమైన మార్గమే నేను మీకూ చూపుతాను, నేను మీకు మార్గదర్శకత్వం చేసేది కేవలం సరైన మార్గం వైపునకే!"[1]

وَقَالَ ٱلَّذِىٓ ءَامَنَ يَٰقَوْمِ إِنِّىٓ أَخَافُ عَلَيْكُم مِّثْلَ يَوْمِ ٱلْأَحْزَابِ ﴿٣٠﴾

**30**. మరియు విశ్వసించిన ఆ వ్యక్తి అన్నాడు: "నా జాతి ప్రజలారా! నిశ్చయంగా పూర్వం అనేక సంఘాలకు దాపురించిన దినమే మీకూ దాపురించునేమోనని నేను భయపడు తున్నాను!

مِثْلَ دَأْبِ قَوْمِ نُوحٍ وَعَادٍ وَثَمُودَ وَٱلَّذِينَ مِنۢ بَعْدِهِمْ ۚ وَمَا ٱللَّهُ يُرِيدُ ظُلْمًا لِّلْعِبَادِ ﴿٣١﴾

**31**. "నూ'హ్, 'ఆద్, స'మూద్ మరియు వారి తరువాత వచ్చిన జాతులవారికి వచ్చి నటువంటి (దుర్దినం). మరియు అల్లాహ్ తన దాసులకు అన్యాయం చేయగోరడు.

وَيَٰقَوْمِ إِنِّىٓ أَخَافُ عَلَيْكُمْ يَوْمَ ٱلتَّنَادِ ﴿٣٢﴾

**32**. "మరియు ఓ నాజాతి ప్రజలారా! వాస్తవానికి నేను, మీరు పరస్పరం పిలుచుకునే, ఆ దినం[2] గురించి భయపడుతున్నాను."

---

**1**. ఫిర్'ఔన్ చూపే మార్గం సత్యమైనది కాదు, చూడండి, 11:97.

**2**. పునరుత్థానదినమున స్వర్గవాసులు మరియు నరకవాసులు ఒకరినొకరు పిలుచు కుంటారు, చూడండి, 7:48-49.

يَوْمَ تُوَلُّونَ مُدْبِرِينَ مَا لَكُم مِّنَ ٱللَّهِ مِنْ عَاصِمٍ ۗ وَمَن يُضْلِلِ ٱللَّهُ فَمَا لَهُۥ مِنْ هَادٍ ﴿٣٣﴾

**33.** ఆ రోజు మీరు వెనుదిరిగి పారి పోవాలనుకుంటారు, కాని అల్లాహ్ (శిక్ష) నుండి మిమ్మల్ని తప్పించేవాడు ఎవ్వడూ ఉండడు. మరియు అల్లాహ్ మార్గభ్రష్టత్వంలో వదలిన వాడికి, మార్గదర్శకుడు ఎవ్వడూ ఉండడు.

وَلَقَدْ جَآءَكُمْ يُوسُفُ مِن قَبْلُ بِٱلْبَيِّنَٰتِ فَمَا زِلْتُمْ فِى شَكٍّ مِّمَّا جَآءَكُم بِهِۦ ۖ حَتَّىٰٓ إِذَا هَلَكَ قُلْتُمْ لَن يَبْعَثَ ٱللَّهُ مِنۢ بَعْدِهِۦ رَسُولًا ۚ كَذَٰلِكَ يُضِلُّ ٱللَّهُ مَنْ هُوَ مُسْرِفٌ مُّرْتَابٌ ﴿٣٤﴾

**34.** మరియు వాస్తవానికి ఇంతకు పూర్వం యూసుఫ్ మీ వద్దకు స్పష్టమైన ప్రమాణాలు తీసుకొనివచ్చాడు. కాని మీరు అతడు తెచ్చిన వాటిని గురించి సందేహంలో పడ్డారు. చివరకు అతడు మరణించినప్పుడు, మీరన్నారు: "ఇక అల్లాహ్ ఇతని తరువాత ఏ ప్రవక్తనూ పంపడు!"[1] ఈ విధంగా అల్లాహ్ మితిమీరి ప్రవర్తించేవారిని, సందేహంలో పడేవారిని మార్గభ్రష్టత్వంలో వదలుతాడు.

ٱلَّذِينَ يُجَٰدِلُونَ فِىٓ ءَايَٰتِ ٱللَّهِ بِغَيْرِ سُلْطَٰنٍ أَتَىٰهُمْ ۖ كَبُرَ مَقْتًا عِندَ ٱللَّهِ وَعِندَ ٱلَّذِينَ ءَامَنُوا۟ ۚ كَذَٰلِكَ يَطْبَعُ ٱللَّهُ عَلَىٰ كُلِّ قَلْبِ مُتَكَبِّرٍ جَبَّارٍ ﴿٣٥﴾

**35.** ఎవరైతే అల్లాహ్ సూచన (ఆయాత్)లను గురించి తమ దగ్గర ఏ ఆధారంలేనిదే వాదిస్తారో, వారు అల్లాహ్ దగ్గర మరియు విశ్వసించిన వారి దగ్గర ఎంతో గర్హణీయులు. ఈ విధంగా అల్లాహ్ దురహంకారీ, నిర్దయుడూ (క్రూరుడు) అయిన ప్రతి వ్యక్తి హృదయం మీద ముద్రవేస్తాడు.

وَقَالَ فِرْعَوْنُ يَٰهَٰمَٰنُ ٱبْنِ لِى صَرْحًا لَّعَلِّىٓ أَبْلُغُ ٱلْأَسْبَٰبَ ﴿٣٦﴾

**36.** మరియు ఫిర్'ఔన్ ఇలా అన్నాడు: "ఓ హామాన్! నా కొరకు ఒక ఎత్తైన గోపురాన్ని నిర్మించు, బహుశా (దానిపైకి ఎక్కి) నేను మార్గాలను పొందవచ్చు -

---

**1.** బహుశా ఈజిప్ట్‌లో యూసుఫ్ ('అ.స.) తమ తెగవారైన హిక్సోస్ (Hyksos) వారిలోనే ప్రవక్తగా పరిగణించబడ్డారు. వారు 'అరబ్బులు. హిబ్రూ భాషతో కలిసే భాష మాట్లాడేవారు. ఇతర ప్రజలు అతనిని ప్రవక్తగా ఎంచలేదు.

أَسْبَٰبَ ٱلسَّمَٰوَٰتِ فَأَطَّلِعَ إِلَىٰٓ إِلَٰهِ مُوسَىٰ وَإِنِّي لَأَظُنُّهُۥ كَٰذِبًاۚ وَكَذَٰلِكَ زُيِّنَ لِفِرْعَوْنَ سُوٓءُ عَمَلِهِۦ وَصُدَّ عَنِ ٱلسَّبِيلِۚ وَمَا كَيْدُ فِرْعَوْنَ إِلَّا فِي تَبَابٍ ﴿٣٧﴾

**37**. "ఆకాశాలలోనికి వెళ్ళే మార్గాలు - మరియు వాటి ద్వారా నేను మూసా దేవుణ్ణి చూడటానికి. ఎందుకంటే, నిశ్చయంగా నేను అతనిని అసత్యవాదిగా భావిస్తున్నాను!" మరియు ఈ విధంగా ఫిర్ఔన్‌కు తన దుష్కార్యాలు మంచివిగా కనబడ్డాయి. మరియు అతడు సన్మార్గం నుండి నిరోధించబడ్డాడు. మరియు ఫిర్ఔన్ యొక్క ప్రతి పన్నాగం అతనిని నాశనానికి మాత్రమే గురిచేసింది.

وَقَالَ ٱلَّذِيٓ ءَامَنَ يَٰقَوْمِ ٱتَّبِعُونِ أَهْدِكُمْ سَبِيلَ ٱلرَّشَادِ ﴿٣٨﴾

**38**. మరియు విశ్వసించిన ఆ వ్యక్తి ఇంకా ఇలా అన్నాడు: "నా జాతి ప్రజలారా! నన్ను అనుసరించండి, నేను మీకు సరైన మార్గం వైపునకు మార్గదర్శకత్వం చేస్తాను.

يَٰقَوْمِ إِنَّمَا هَٰذِهِ ٱلْحَيَوٰةُ ٱلدُّنْيَا مَتَٰعٌ وَإِنَّ ٱلْءَاخِرَةَ هِيَ دَارُ ٱلْقَرَارِ ﴿٣٩﴾

**39**. "నా జాతి ప్రజలారా! నిశ్చయంగా, ఈ ఇహలోక జీవిత సుఖం తాత్కాలికమైనదే మరియు నిశ్చయంగా, పరలోకమే శాశ్వతమైన నివాసస్థలము.

مَنْ عَمِلَ سَيِّئَةً فَلَا يُجْزَىٰٓ إِلَّا مِثْلَهَاۖ وَمَنْ عَمِلَ صَٰلِحًا مِّن ذَكَرٍ أَوْ أُنثَىٰ وَهُوَ مُؤْمِنٌ فَأُوْلَٰٓئِكَ يَدْخُلُونَ ٱلْجَنَّةَ يُرْزَقُونَ فِيهَا بِغَيْرِ حِسَابٍ ﴿٤٠﴾

**40**. "దుష్కార్యాలు చేసినవానికి, వాటికి సరిపోయే ప్రతీకారం మాత్రమే లభిస్తుంది. మరియు విశ్వసించి సత్కార్యాలు చేసేవాడు, పురుషుడైనా లేదా స్త్రీ అయినా! అతడు (ఆమె) విశ్వాసి అయితే; అలాంటి వారు స్వర్గంలో ప్రవేశిస్తారు.[1] అందు వారికి అపరిమితమైన జీవనోపాధి ఇవ్వబడుతుంది.[2] (1/2)

---

**1**. పాపులకు వారి దుష్టకార్యాలకు సరిసమానమైన శిక్షయే ఇవ్వబడుతుంది. విశ్వసించి సత్కార్యాలు చేసేవారు మాత్రమే స్వర్గానికి హక్కుదారులు. విశ్వసించక ఎన్ని సత్కార్యాలు చేసినా అవి వ్యర్థమే అవుతాయి. అదే విధంగా సత్కార్యాలు చేయని విశ్వాసి కూడా కేవలం విశ్వాసం ఆధారంగా స్వర్గానికి హక్కుదారుడు కాజాలడు, సత్కార్యాలు చేసి, అల్లాహ్ (సు.తా.) కరుణిస్తే తప్ప.

**2**. రిజ్‌ఖున్: జీవనోపాధి, అంటే కేవలం అన్న పానీయాలే కాక, అన్నీ మంచి వస్తువులు, సుఖసంతోషాలు, తెలివితేటలు మొదలైనవి. ఏవైతే సుఖమయ జీవితానికి అవసరమో!

۞ وَيَـٰقَوۡمِ مَا لِيٓ أَدۡعُوكُمۡ إِلَى ٱلنَّجَوٰةِ وَتَدۡعُونَنِيٓ إِلَى ٱلنَّارِ ﴿٤١﴾

41. * "మరియు నా జాతి ప్రజలారా! ఇది ఎంత విచిత్రమైన విషయం! నేనేమో మిమ్మల్ని ముక్తి వైపునకు పిలుస్తున్నాను. మరియు మీరేమో నన్ను నరకాగ్ని వైపునకు పిలుస్తున్నారు.

تَدۡعُونَنِي لِأَكۡفُرَ بِٱللَّهِ وَأُشۡرِكَ بِهِۦ مَا لَيۡسَ لِي بِهِۦ عِلۡمٞ وَأَنَا۠ أَدۡعُوكُمۡ إِلَى ٱلۡعَزِيزِ ٱلۡغَفَّـٰرِ ﴿٤٢﴾

42. "మీరు నన్ను - అల్లాహ్‌ను తిరస్కరించి - ఎవరిని గురించైతే నాకు ఎలాంటి జ్ఞానంలేదో! వారిని, ఆయనకు భాగస్వాములుగా కల్పించమని పిలుస్తున్నారు. మరియు నేనేమో మిమ్మల్ని సర్వశక్తిమంతుని, క్షమాశీలుని వైపునకు పిలుస్తున్నాను.

لَا جَرَمَ أَنَّمَا تَدۡعُونَنِيٓ إِلَيۡهِ لَيۡسَ لَهُۥ دَعۡوَةٞ فِي ٱلدُّنۡيَا وَلَا فِي ٱلۡأٓخِرَةِ وَأَنَّ مَرَدَّنَآ إِلَى ٱللَّهِ وَأَنَّ ٱلۡمُسۡرِفِينَ هُمۡ أَصۡحَٰبُ ٱلنَّارِ ﴿٤٣﴾

43. "నిస్సందేహంగా! వాస్తవానికి, మీరు దేని వైపునకైతే (ప్రార్థించటానికి) నన్ను పిలుస్తున్నారో! దానికి ఇహలోకంలోను మరియు పరలోకంలోను ప్రార్థనాఅర్హత లేదు.[1] మరియు నిశ్చయంగా, మనందరి మరలింపు అల్లాహ్ వైపునకే మరియు నిశ్చయంగా, మితిమీరి ప్రవర్తించే వారే నరకాగ్ని వాసులవుతారు.

فَسَتَذۡكُرُونَ مَآ أَقُولُ لَكُمۡۚ وَأُفَوِّضُ أَمۡرِيٓ إِلَى ٱللَّهِۚ إِنَّ ٱللَّهَ بَصِيرُۢ بِٱلۡعِبَادِ ﴿٤٤﴾

44. "కావున నేను మీతో చెప్పే విషయం ముమ్ముందు మీరే తెలుసుకోగలరు. ఇక నా వ్యవహారాన్ని నేను అల్లాహ్‌కు అప్పగిస్తున్నాను. నిశ్చయంగా, అల్లాహ్ తన దాసులను కనిపెట్టుకొని ఉంటాడు."

فَوَقَىٰهُ ٱللَّهُ سَيِّـَٔاتِ مَا مَكَرُواْۖ وَحَاقَ بِـَٔالِ فِرۡعَوۡنَ سُوٓءُ ٱلۡعَذَابِ ﴿٤٥﴾

45. ఆ తరువాత అల్లాహ్ అతనిని వారు పన్నిన చెడుకుట్రల నుండి కాపాడాడు. మరియు ఫిర్'ఔన్ జనులను దుర్భరమైన శిక్ష చుట్టుకున్నది.

---

1. ఇలాంటి అర్థమిచ్చే వాక్యాల కోసం చూడండి, 46:5, 35:14.

ٱلنَّارُ يُعۡرَضُونَ عَلَيۡهَا غُدُوًّا وَعَشِيًّاۚ وَيَوۡمَ تَقُومُ ٱلسَّاعَةُ أَدۡخِلُوٓاْ ءَالَ فِرۡعَوۡنَ أَشَدَّ ٱلۡعَذَابِ ﴿٤٦﴾

**46.** ఆ నరకాగ్ని! వారు దాని యెదుటకు ఉదయమూ మరియు సాయంత్రమూ రప్పింపబడుతూ ఉంటారు.[1] మరియు (పునరుత్థాన) దినపు ఘడియ వచ్చినపుడు: "ఫిర్'ఔన్ జనులను తీవ్రమైన శిక్షలో పడవేయండి!"[2] అని ఆజ్ఞ ఇవ్వబడుతుంది.

وَإِذۡ يَتَحَآجُّونَ فِي ٱلنَّارِ فَيَقُولُ ٱلضُّعَفَٰٓؤُاْ لِلَّذِينَ ٱسۡتَكۡبَرُوٓاْ إِنَّا كُنَّا لَكُمۡ تَبَعٗا فَهَلۡ أَنتُم مُّغۡنُونَ عَنَّا نَصِيبٗا مِّنَ ٱلنَّارِ ﴿٤٧﴾

**47.** ఇక వారు నరకాగ్నిలో పరస్పరం వాదులాడుతున్నప్పుడు, (ఇహలోకంలో) బలహీనులుగా పరిగణింపబడినవారు పెద్ద మనుషు(నాయకు)లుగా పరిగణింపబడే వారితో ఇలా అంటారు: "వాస్తవానికి, మేము మిమ్మల్ని అనుసరిస్తూ ఉండేవారము, కావున మీరిప్పుడు మానుండి నరకాగ్నిని కొంతనైనా తొలగించగలరా?"

قَالَ ٱلَّذِينَ ٱسۡتَكۡبَرُوٓاْ إِنَّا كُلّٞ فِيهَآ إِنَّ ٱللَّهَ قَدۡ حَكَمَ بَيۡنَ ٱلۡعِبَادِ ﴿٤٨﴾

**48.** దురహంకారంలో మునిగిఉన్న వారు (ఆ పెద్ద మనుషులు) ఇలా అంటారు: "వాస్తవానికి, మనమందరం అందులో (నరకాగ్నిలో) ఉన్నాం. నిశ్చయంగా, అల్లాహ్ తన దాసుల మధ్య వాస్తవమైన తీర్పుచేశాడు!"

---

**1.** గోరీలలో ఉన్నవారు ఉదయం మరియు సాయంత్రం దాని ముందు ప్రవేశ పెట్టబడతారు. ఇదే గోరీల శిక్ష, 'అజాబె ఖబ్ర్!' దీనిని గురించి ఎన్నో 'హదీస్'లు ఉన్నాయి. 'ఆయి'షహ్ (ర. 'అన్హా) దైవప్రవక్త ('స'అస)తో ప్రశ్నిస్తే అతను ఇలా అన్నారు: 'అవును గోరీల శిక్ష తథ్యం.' ('స'హీ'హ్ బు'ఖారీ) మరొక 'హదీస్': మీలో ఎవరైనా మరణిస్తే అతనికి ఉదయం మరియు సాయంత్రం అతని చోటు (స్వర్గంలో లేక నరకంలో అతని స్థానం) చూపబడుతుంది. మరియు అతనితో అనబడుతుంది: 'ఇదే నీ గమ్యస్థానం. పునరుత్థాన దినమున అల్లాహ్ (సు.తా.) నిన్ను ఇక్కడికే పంపుతాడు.' ('స'హీ'హ్ బు'ఖారీ, 'స'హీ'హ్ ముస్లిం). చనిపోయిన తరువాత పునరుత్థానదినం వరకు ఉండే కాలాన్ని బర్'జఖ్ అంటారు.

**2.** ఆలి-ఫిర్'ఔన్: అంటే, ఫిర్'ఔన్, అతని జాతివారు మరియు అతని అనుచరులందరూ.

وَقَالَ ٱلَّذِينَ فِى ٱلنَّارِ لِخَزَنَةِ جَهَنَّمَ ٱدْعُواْ رَبَّكُمْ يُخَفِّفْ عَنَّا يَوْمًا مِّنَ ٱلْعَذَابِ ﴿٤٩﴾

49. మరియు నరకాగ్నిలో పడివున్న వారు, నరకపు రక్షకులతో: "మా శిక్షను కనీసం ఒక్కరోజు కొరకైనా తగ్గించమని, మీరు మీ ప్రభువును ప్రార్థించండి!" అని అంటారు.

قَالُوٓاْ أَوَلَمْ تَكُ تَأْتِيكُمْ رُسُلُكُم بِٱلْبَيِّنَٰتِ ۖ قَالُواْ بَلَىٰ ۚ قَالُواْ فَٱدْعُواْ ۗ وَمَا دُعَٰٓؤُاْ ٱلْكَٰفِرِينَ إِلَّا فِى ضَلَٰلٍ ﴿٥٠﴾

50. వారు (రక్షకులు) అంటారు: "ఏమీ? మీ వద్దకు స్పష్టమైన సూచనలు తీసుకొని మీ దైవప్రవక్తలు రాలేదా?" అప్పుడు వారంటారు: "అవును (వచ్చారు)!" వారికి ఇలా జవాబివ్వబడుతుంది: "అయితే మీరే ప్రార్థించండి!" కాని సత్యతిరస్కారుల ప్రార్థన నిష్ఫలమే అవుతుంది.

إِنَّا لَنَنصُرُ رُسُلَنَا وَٱلَّذِينَ ءَامَنُواْ فِى ٱلْحَيَوٰةِ ٱلدُّنْيَا وَيَوْمَ يَقُومُ ٱلْأَشْهَٰدُ ﴿٥١﴾

51. నిశ్చయంగా, మేము మా ప్రవక్తలకు మరియు విశ్వసించినవారికి ఇహలోక జీవితంలో మరియు సాక్షులు నిలబడేరోజున కూడా సహాయము నొసంగుతాము.[1]

يَوْمَ لَا يَنفَعُ ٱلظَّٰلِمِينَ مَعْذِرَتُهُمْ ۖ وَلَهُمُ ٱللَّعْنَةُ وَلَهُمْ سُوٓءُ ٱلدَّارِ ﴿٥٢﴾

52. ఆ రోజు దుర్మార్గులకు వారి సాకులు ఏ మాత్రం ఉపయోగకరం కావు. వారికి (అల్లాహ్) శాపం (బహిష్కారం) ఉంటుంది.[2] మరియు వారికి అతి దుర్భరమైన నిలయం ఉంటుంది.

وَلَقَدْ ءَاتَيْنَا مُوسَى ٱلْهُدَىٰ وَأَوْرَثْنَا بَنِىٓ إِسْرَٰٓءِيلَ ٱلْكِتَٰبَ ﴿٥٣﴾

53. మరియు వాస్తవంగా మేము మూసాకు మార్గదర్శకత్వం చేశాము. మరియు ఇస్రాయీ'ల్ సంతతివారిని గ్రంథానికి (తౌరాత్‌కు) వారసులుగా చేశాము;[3]

---

1. పునరుత్థానదినమున దైవదూతలు మరియు దైవప్రవక్త ('అలైహిమ్ స.)లు సాక్ష్యమిస్తారు. కావున పునరుత్థానదినం, సాక్ష్యాల దినం అని కూడా అనబడుతోంది. ఇంకా చూడండి, 39:69.
2. ల'అనతున్: అంటే అల్లాహ్ (సు.తా.) కారుణ్యం నుండి బహిష్కారం.
3. చూడండి, 5:44.

هُدًى وَذِكۡرَىٰ لِأُوْلِي ٱلۡأَلۡبَٰبِ ٥٤

**54.** బుద్ధిమంతులకు మార్గదర్శకత్వంగా మరియు హితోపదేశంగా!

فَٱصۡبِرۡ إِنَّ وَعۡدَ ٱللَّهِ حَقّٞ وَٱسۡتَغۡفِرۡ لِذَنۢبِكَ وَسَبِّحۡ بِحَمۡدِ رَبِّكَ بِٱلۡعَشِيِّ وَٱلۡإِبۡكَٰرِ ٥٥

**55.** కావున నీవు సహనంవహించు! నిశ్చయంగా, అల్లాహ్ వాగ్దానం సత్యం; నీ పాపాలకు క్షమాపణవేడుకో మరియు సాయంత్రం మరియు ఉదయం నీ ప్రభువు పవిత్రతను కొనియాడు, ఆయనను స్తుతించు.

إِنَّ ٱلَّذِينَ يُجَٰدِلُونَ فِيٓ ءَايَٰتِ ٱللَّهِ بِغَيۡرِ سُلۡطَٰنٍ أَتَىٰهُمۡ إِن فِي صُدُورِهِمۡ إِلَّا كِبۡرٞ مَّا هُم بِبَٰلِغِيهِۚ فَٱسۡتَعِذۡ بِٱللَّهِۖ إِنَّهُۥ هُوَ ٱلسَّمِيعُ ٱلۡبَصِيرُ ٥٦

**56.** నిశ్చయంగా, ఎవరైతే, తమదగ్గర, ఎలాంటి ప్రమాణం లేనిదే అల్లాహ్ సూచన(ఆయాత్)లను గురించి వాదులాడుతారో, వారి హృదయాలలో వాస్తవానికి గొప్పతనపు గర్వం నిండి ఉంది. కాని వారు దానిని (గొప్పతనాన్ని) పొందజాలరు. కావున నీవు అల్లాహ్ శరణువేడుకో. నిశ్చయంగా, ఆయనే సర్వం వినేవాడు, సర్వం చూసేవాడు.

لَخَلۡقُ ٱلسَّمَٰوَٰتِ وَٱلۡأَرۡضِ أَكۡبَرُ مِنۡ خَلۡقِ ٱلنَّاسِ وَلَٰكِنَّ أَكۡثَرَ ٱلنَّاسِ لَا يَعۡلَمُونَ ٥٧

**57.** వాస్తవానికి ఆకాశాలను మరియు భూమిని సృష్టించటం, మానవులను సృష్టించటం కంటే ఎంతో గొప్ప విషయం, కానీ చాలా మంది ప్రజలకు ఇది తెలియదు.

وَمَا يَسۡتَوِي ٱلۡأَعۡمَىٰ وَٱلۡبَصِيرُ وَٱلَّذِينَ ءَامَنُواْ وَعَمِلُواْ ٱلصَّٰلِحَٰتِ وَلَا ٱلۡمُسِيٓءُۚ قَلِيلٗا مَّا تَتَذَكَّرُونَ ٥٨

**58.** మరియు గ్రుడ్డివాడు మరియు చూడగలవాడు, సమానులు కాజాలరు మరియు అదేవిధంగా! విశ్వసించి సత్కార్యాలు చేసేవారు మరియు దుర్వర్తనులు కూడా (సమానులు కాజాలరు). మీరు అర్థం చేసుకునేది చాలా తక్కువ!

**59**. నిశ్చయంగా, అంతిమ ఘడియ తప్పక రానున్నది, అందులో ఎలాంటి సందేహం లేదు. అయినా చాలా మంది ప్రజలు విశ్వసించరు.

**60**. మరియు మీ ప్రభువు ఇలా అన్నాడు: "నన్ను ప్రార్థించండి, నేను మీ ప్రార్థనలను అంగీకరిస్తాను.[1] నిశ్చయంగా, ఎవరైతే నా ప్రార్థనపట్ల దురహంకారం చూపుతారో, వారు తప్పక అవమానితులై నరకంలో ప్రవేశించగలరు."

**61**. అల్లాహ్! ఆయనే, మీ కొరకు విశ్రాంతి తీసుకోవటానికి రాత్రిని మరియు (చూడటానికి) ప్రకాశవంతమైన పగటిని నియమించినవాడు.[2] నిశ్చయంగా, అల్లాహ్ ప్రజలపట్ల ఎంతో అనుగ్రహుడు, కాని చాలా మంది ప్రజలు కృతజ్ఞతలు తెలుపరు.

**62**. ఆయనే అల్లాహ్, మీ ప్రభువు! ప్రతి దానిని సృష్టించిన వాడు. ఆయన తప్ప మరొక ఆరాధ్య దైవం లేడు! అయితే మీరు ఎందుకు మోసగింప (సత్యం నుండి మరలింప) బడుతున్నారు?[3]

**63**. ఇదే విధంగా, అల్లాహ్ సూచన (ఆయాత్)లను తిరస్కరించే వారందరూ మోసగింపబడుతూ ఉంటారు.

إِنَّ ٱلسَّاعَةَ لَأَتِيَةٌ لَّا رَيْبَ فِيهَا وَلَٰكِنَّ أَكْثَرَ ٱلنَّاسِ لَا يُؤْمِنُونَ ﴿٥٩﴾

وَقَالَ رَبُّكُمُ ٱدْعُونِىٓ أَسْتَجِبْ لَكُمْ ۚ إِنَّ ٱلَّذِينَ يَسْتَكْبِرُونَ عَنْ عِبَادَتِى سَيَدْخُلُونَ جَهَنَّمَ دَاخِرِينَ ﴿٦٠﴾

ٱللَّهُ ٱلَّذِى جَعَلَ لَكُمُ ٱلَّيْلَ لِتَسْكُنُوا۟ فِيهِ وَٱلنَّهَارَ مُبْصِرًا ۚ إِنَّ ٱللَّهَ لَذُو فَضْلٍ عَلَى ٱلنَّاسِ وَلَٰكِنَّ أَكْثَرَ ٱلنَّاسِ لَا يَشْكُرُونَ ﴿٦١﴾

ذَٰلِكُمُ ٱللَّهُ رَبُّكُمْ خَٰلِقُ كُلِّ شَىْءٍ لَّآ إِلَٰهَ إِلَّا هُوَ ۖ فَأَنَّىٰ تُؤْفَكُونَ ﴿٦٢﴾

كَذَٰلِكَ يُؤْفَكُ ٱلَّذِينَ كَانُوا۟ بِـَٔايَٰتِ ٱللَّهِ يَجْحَدُونَ ﴿٦٣﴾

---

**1**. 'హదీస్': "అద్దు'ఆఉ హువల్ 'ఇబాదహ్, వ అద్దు'ఆఉ ముఖ్ఖుల్ 'ఇబాదహ్." దు'ఆ అంటే ఇక్కడ చాలా మంది వ్యాఖ్యాతల అభిప్రాయంలో 'ఇబాదహ్ అంటే నమా'జ్. (ముస్నద్ అ'హ్మద్ 4/271) ఇంకా చూడండి 2:186.

**2**. చూడండి, 27:86.

**3**. చూడండి, 5:75, చివరి వాక్యం.

ٱللَّهُ ٱلَّذِى جَعَلَ لَكُمُ ٱلْأَرْضَ قَرَارًا وَٱلسَّمَآءَ بِنَآءً وَصَوَّرَكُمْ فَأَحْسَنَ صُوَرَكُمْ وَرَزَقَكُم مِّنَ ٱلطَّيِّبَٰتِ ۚ ذَٰلِكُمُ ٱللَّهُ رَبُّكُمْ ۖ فَتَبَارَكَ ٱللَّهُ رَبُّ ٱلْعَٰلَمِينَ ﴿٦٤﴾

**64**. అల్లాహ్‌యే! మీ కొరకు భూమిని నివాసస్థలంగా మరియు ఆకాశాన్ని కప్పుగా నియమించిన వాడు మరియు ఆయనే మీకు మంచి రూపాన్నిచ్చి, దానిని ఎంతో చక్కగా తీర్చిదిద్దాడు మరియు మీకు మంచి వస్తువులను జీవనోపాధిగా సమకూర్చాడు. ఆయనే అల్లాహ్! మీ పోషకుడు. కావున అల్లాహ్ ఎంతో శుభదాయకుడు, సర్వలోకాలకు ప్రభువు.

هُوَ ٱلْحَىُّ لَآ إِلَٰهَ إِلَّا هُوَ فَٱدْعُوهُ مُخْلِصِينَ لَهُ ٱلدِّينَ ۗ ٱلْحَمْدُ لِلَّهِ رَبِّ ٱلْعَٰلَمِينَ ﴿٦٥﴾

**65**. ఆయన సజీవుడు.[1] ఆయన తప్ప మరొక ఆరాధ్యుడు లేడు, కావున మీరు ఆయననే ప్రార్థించండి! మీ ధర్మాన్ని (భక్తిని) కేవలం ఆయన కొరకే ప్రత్యేకించుకోండి. సర్వస్తోత్రాలకు అర్హుడు, సర్వలోకాల పోషకుడైన అల్లాహ్ మాత్రమే. (5/8)

۞ قُلْ إِنِّى نُهِيتُ أَنْ أَعْبُدَ ٱلَّذِينَ تَدْعُونَ مِن دُونِ ٱللَّهِ لَمَّا جَآءَنِىَ ٱلْبَيِّنَٰتُ مِن رَّبِّى وَأُمِرْتُ أَنْ أُسْلِمَ لِرَبِّ ٱلْعَٰلَمِينَ ﴿٦٦﴾

**66**. * ఇలా అను: "నిశ్చయంగా, నా ప్రభువు తరఫునుండి, నాకు స్పష్టమైన సూచనలు వచ్చిన తరువాతనే, అల్లాహ్‌ను వదలి మీరు ఆరాధించేవాటి ఆరాధన నుండి, నేను వారించబడ్డాను మరియు నేను సర్వలోకాల ప్రభువుకు మాత్రమే విధేయుడను (ముస్లింను) అయిఉండాలని, ఆజ్ఞాపించబడ్డాను."

هُوَ ٱلَّذِى خَلَقَكُم مِّن تُرَابٍ ثُمَّ مِن نُّطْفَةٍ ثُمَّ مِنْ عَلَقَةٍ ثُمَّ يُخْرِجُكُمْ طِفْلًا ثُمَّ لِتَبْلُغُوٓا۟ أَشُدَّكُمْ

**67**. ఆయనే, మిమ్మల్ని మట్టితో సృష్టించాడు.[2] తరువాత వీర్య బిందువుతో, ఆ తరువాత పిండంతో (రక్తముద్దతో), ఆ తరువాత మిమ్మల్ని

---

**1**. అల్-'హయ్యు: సజీవుడు, నిత్యుడు, నిత్యజీవుడు. చూడండి, 2:255.

**2**. చూడండి,3:59,11:61,22:5,30:20. ఈ ఆయత్‌లో, తురాబ్‌తో సృష్టించాడని ఉంది.

ثُمَّ لِتَكُونُواْ شُيُوخًاۚ وَمِنكُم مَّن يُتَوَفَّىٰ مِن قَبۡلُۖ وَلِتَبۡلُغُوٓاْ أَجَلٗا مُّسَمّٗى وَلَعَلَّكُمۡ تَعۡقِلُونَ ٦٧

هُوَ ٱلَّذِي يُحۡيِۦ وَيُمِيتُۖ فَإِذَا قَضَىٰٓ أَمۡرٗا فَإِنَّمَا يَقُولُ لَهُۥ كُن فَيَكُونُ ٦٨

أَلَمۡ تَرَ إِلَى ٱلَّذِينَ يُجَٰدِلُونَ فِيٓ ءَايَٰتِ ٱللَّهِ أَنَّىٰ يُصۡرَفُونَ ٦٩

ٱلَّذِينَ كَذَّبُواْ بِٱلۡكِتَٰبِ وَبِمَآ أَرۡسَلۡنَا بِهِۦ رُسُلَنَاۖ فَسَوۡفَ يَعۡلَمُونَ ٧٠

إِذِ ٱلۡأَغۡلَٰلُ فِيٓ أَعۡنَٰقِهِمۡ وَٱلسَّلَٰسِلُ يُسۡحَبُونَ ٧١

فِي ٱلۡحَمِيمِ ثُمَّ فِي ٱلنَّارِ يُسۡجَرُونَ ٧٢

శిశువు రూపంలో బయటికి తీస్తాడు. ఆ తరువాత మిమ్మల్ని యుక్త వయస్సులో బలం గలవారిగా చేస్తాడు; చివరకు మిమ్మల్ని ముసలివారిగా మార్చుతాడు. మీలో కొందరు దీనికి ముందే చనిపోతారు. మరియు మీరంతా మీ నియమిత కాలం వరకే నివసిస్తారు. బహుశా మీరు అర్థం చేసుకుంటారని (ఇదంతా మీకు వివరించబడుతోంది).

**68**. జీవితాన్ని ఇచ్చేవాడు మరియు మరణింపజేసేవాడు ఆయనే! ఆయన ఏదైనా చేయాలనుకున్నప్పుడు, కేవలం దానితో: ''అయిపో!'' అని అంటాడు, అంతే అది అయిపోతుంది.

**69**. ఏమీ? నీకు తెలియదా? అల్లాహ్ సూచన(ఆయాత్)లను గురించి వాదులాడే వారు ఏవిధంగా (సత్యం నుండి) తప్పించబడుతున్నారో?

**70**. ఎవరైతే ఈ గ్రంథాన్ని అసత్యమని తిరస్కరించారో మరియు మేము మా సందేశహరులకు ఇచ్చి పంపిన దానిని (తిరస్కరించారో), వారు తప్పక త్వరలోనే (తమ పర్యవసానం) తెలుసుకుంటారు;

**71**. ఎప్పుడైతే వారి మెడలలో సంకెళ్ళు[1] (ఇనుప పట్టీలు) మరియు గొలుసులు వేయబడతాయో మరియు వారు ఈడ్చబడతారో!

**72**. సలసల కాగే నీళ్లలోకి; తరువాత నరకాగ్నిలోకి కాల్చబడటానికి.

---

**1**. మెడలలో సంకెళ్ళు - కొరకు, చూడండి, 13:5, 34:33 మరియు 36:8.

**73.** అప్పుడు వారితో అనబడుతుంది: "మీరు సాటి కల్పించే (భాగస్వాములు) ఇప్పుడు ఎక్కడున్నారు?

ثُمَّ قِيلَ لَهُمْ أَيْنَ مَا كُنتُمْ تُشْرِكُونَ ﴿٧٣﴾

**74.** "(ఎవరినైతే) మీరు అల్లాహ్‌ను వదలి (ప్రార్థిస్తూ ఉన్నారో)!" వారంటారు: "వారు మమ్మల్ని త్యజించారు! అలాకాదు దీనికి పూర్వం మేము ఎవరినీ ప్రార్థించేవారమే కాదు."[1] ఈవిధంగా అల్లాహ్ సత్యతిరస్కారులను మార్గ భ్రష్టత్వంలో వదలుతాడు.

مِن دُونِ ٱللَّهِ قَالُوا۟ ضَلُّوا۟ عَنَّا بَل لَّمْ نَكُن نَّدْعُوا۟ مِن قَبْلُ شَيْـًٔا كَذَٰلِكَ يُضِلُّ ٱللَّهُ ٱلْكَٰفِرِينَ ﴿٧٤﴾

**75.** (వారితో ఇలా అనబడుతుంది): "ఇదంతా మీరు అన్యాయంగా, భూమిలో విర్రవీగుతూ ఉన్నందుకు మరియు దురభిమానంతో ప్రవర్తించినందుకూ!

ذَٰلِكُم بِمَا كُنتُمْ تَفْرَحُونَ فِى ٱلْأَرْضِ بِغَيْرِ ٱلْحَقِّ وَبِمَا كُنتُمْ تَمْرَحُونَ ﴿٧٥﴾

**76.** "(కావున ఇప్పుడు) నరక ద్వారాలలో ప్రవేశించండి, అందులో శాశ్వతంగా ఉండటానికి. దురహంకారంతో ప్రవర్తించిన వారి నివాసస్థలం ఎంత దుర్భరమైనది!"

ٱدْخُلُوٓا۟ أَبْوَٰبَ جَهَنَّمَ خَٰلِدِينَ فِيهَا فَبِئْسَ مَثْوَى ٱلْمُتَكَبِّرِينَ ﴿٧٦﴾

**77.** కావున (ఓ ప్రవక్తా!) నీవు సహనం వహించు! నిశ్చయంగా, అల్లాహ్ వాగ్దానం సత్యం. మేము వారికి చేసిన వాగ్దానాల (శిక్ష) నుండి కొంత నీకు చూపినా! లేదా (దానికి ముందు) నిన్ను మరణింపజేసినా వారందరూ మా వైపునకే కదా మరలింపబడతారు![2]

فَٱصْبِرْ إِنَّ وَعْدَ ٱللَّهِ حَقٌّ فَإِمَّا نُرِيَنَّكَ بَعْضَ ٱلَّذِى نَعِدُهُمْ أَوْ نَتَوَفَّيَنَّكَ فَإِلَيْنَا يُرْجَعُونَ ﴿٧٧﴾

---

**1**. చూడండి, 6:23.
**2**. చూడండి, 10:46.

وَلَقَدْ أَرْسَلْنَا رُسُلًا مِّن قَبْلِكَ مِنْهُم مَّن قَصَصْنَا عَلَيْكَ وَمِنْهُم مَّن لَّمْ نَقْصُصْ عَلَيْكَ ۗ وَمَا كَانَ لِرَسُولٍ أَن يَأْتِيَ بِآيَةٍ إِلَّا بِإِذْنِ اللَّهِ ۚ فَإِذَا جَاءَ أَمْرُ اللَّهِ قُضِيَ بِالْحَقِّ وَخَسِرَ هُنَالِكَ الْمُبْطِلُونَ ﴿٧٨﴾

78. మరియు (ఓ ము'హమ్మద్!) వాస్తవానికి మేము నీకు పూర్వం అనేక ప్రవక్తలను పంపాము; వారిలో కొందరి వృత్తాంతం మేము నీకు తెలిపాము; మరి కొందరిని గురించి నీకు తెలుపలేదు. మరియు అల్లాహ్ అనుమతిలేనిదే, ఏ ప్రవక్తా కూడా ఏ అద్భుతక్రియ(ఆయాత్)లను స్వయంగా చేయలేడు.[1] కాని అల్లాహ్ ఆజ్ఞ వచ్చినపుడు, న్యాయంగా తీర్పు చేయబడుతుంది. మరియు అప్పుడు అసత్యవాదులు నష్టానికి గురి అవుతారు.

اللَّهُ الَّذِي جَعَلَ لَكُمُ الْأَنْعَامَ لِتَرْكَبُوا مِنْهَا وَمِنْهَا تَأْكُلُونَ ﴿٧٩﴾

79. అల్లాహ్ మీ కొరకు పశువులను సృష్టించాడు, వాటిమీద మీరు సవారీ చేయటానికి మరియు వాటిలో కొన్నింటిని మీరు తినుటకూను![2]

وَلَكُمْ فِيهَا مَنَافِعُ وَلِتَبْلُغُوا عَلَيْهَا حَاجَةً فِي صُدُورِكُمْ وَعَلَيْهَا وَعَلَى الْفُلْكِ تُحْمَلُونَ ﴿٨٠﴾

80. మరియు వాటి వల్ల మీకు ఇతర లాభాలు కూడా ఉన్నాయి, వాటి ద్వారా మీ హృదయాలు కోరిన చోట్లకు పోవటానికి ఉపయోగపడతాయి మరియు వాటి మీద మరియు పడవల మీద మీరు తీసుకుపోబడతారు.

وَيُرِيكُمْ آيَاتِهِ فَأَيَّ آيَاتِ اللَّهِ تُنكِرُونَ ﴿٨١﴾

81. మరియు (ఈ విధంగా) ఆయన మీకు తన సూచన(ఆయాత్)లను చూపుతున్నాడు. అయితే అల్లాహ్ యొక్క ఏ ఏ సూచనలను (ఆయాత్)లను మీరు నిరాకరిస్తారు?

---

1. చూడండి, 6:109. అద్భుతక్రియలు (ము'అజి'జాత్) కేవలం అల్లాహ్ (సు.తా.) అధీనంలోనే ఉన్నాయి. ఆయన తాను కోరినప్పుడే వాటిని చూపిస్తాడు. పూర్వకాలపు చాలా మంది ప్రవక్తల జాతి ప్రజలు, అద్భుతక్రియలు చూసికూడా విశ్వసించ లేదు.

2. చూడండి, 6:143-144.

أَفَلَمْ يَسِيرُواْ فِى ٱلْأَرْضِ فَيَنظُرُواْ كَيْفَ كَانَ عَـٰقِبَةُ ٱلَّذِينَ مِن قَبْلِهِمْ ۚ كَانُوٓاْ أَكْثَرَ مِنْهُمْ وَأَشَدَّ قُوَّةً وَءَاثَارًا فِى ٱلْأَرْضِ فَمَآ أَغْنَىٰ عَنْهُم مَّا كَانُواْ يَكْسِبُونَ ﴿٨٢﴾

**82**. ఏమీ? వీరు భూమిలో సంచరించ లేదా? అప్పుడు వీరికి పూర్వం గతించిన వారి గతి ఏమయిందో కనిపించలేదా? వారు వీరికంటే సంఖ్యాపరంగా అధికులు మరియు వీరికంటే ఎక్కువ బలవంతులు మరియు భూమిలో (ఎక్కువ) చిహ్నాలు వదలిపోయారు, కాని వారి సంపాదన వారికి ఏ విధంగానూ పనికిరాలేదు.

فَلَمَّا جَآءَتْهُمْ رُسُلُهُم بِٱلْبَيِّنَـٰتِ فَرِحُواْ بِمَا عِندَهُم مِّنَ ٱلْعِلْمِ وَحَاقَ بِهِم مَّا كَانُواْ بِهِۦ يَسْتَهْزِءُونَ ﴿٨٣﴾

**83**. ఎందుకంటే! వారి సందేశహరులు వారి వద్దకు స్పష్టమైన సూచనలు తీసుకొని వచ్చినప్పుడు, వారు తమ దగ్గరున్న జ్ఞానానికి గర్వపడ్డారు; కాబట్టి వారు దేనిని గురించి పరిహాసాలాడుతూ ఉన్నారో అదే వారిని చుట్టుకున్నది.

فَلَمَّا رَأَوْاْ بَأْسَنَا قَالُوٓاْ ءَامَنَّا بِٱللَّهِ وَحْدَهُۥ وَكَفَرْنَا بِمَا كُنَّا بِهِۦ مُشْرِكِينَ ﴿٨٤﴾

**84**. ఆ తరువాత మా శిక్షను చూసినప్పుడు వారు ఇలా అన్నారు: "మేము అద్వితీయుడైన అల్లాహ్‌ను విశ్వసిస్తున్నాము మరియు మేము (అల్లాహ్‌కు) సాటి కల్పిస్తూ వచ్చిన భాగస్వాములను తిరస్కరిస్తున్నాము."

فَلَمْ يَكُ يَنفَعُهُمْ إِيمَـٰنُهُمْ لَمَّا رَأَوْاْ بَأْسَنَا ۖ سُنَّتَ ٱللَّهِ ٱلَّتِى قَدْ خَلَتْ فِى عِبَادِهِۦ ۖ وَخَسِرَ هُنَالِكَ ٱلْكَـٰفِرُونَ ﴿٨٥﴾

**85**. కాని మా శిక్షను చూసిన తర్వాత, వారి విశ్వాసం వారికి ఏ మాత్రం లాభదాయకం కాజాలదు. ఇదే అల్లాహ్ తన దాసులకొరకు వాస్తవంగా, నియమించిన విధానం. మరియు అక్కడ సత్యతిరస్కారులు నష్టానికి గురి అవుతారు.

*****

## 41. సూరహ్ ఫు'స్సిలత్ — سُورَةُ فُصِّلَتْ

ఈ సూరహ్, 40వ సూరహ్ తరువాత అవతరింపజేయబడింది. ఫు'స్సిలత్ అంటే **ప్రతిపాదించ, వివరించ, వ్యాఖ్యానించ** బడిన విషయం. ఈ శబ్దం **3**వ **ఆయత్‌లో** ఉంది. దీని మరొక పేరు. **'హా-మీమ్ అస్-సజ్దహ్.** ఈ శబ్దం **37**వ **ఆయత్‌లో** ఉంది. 32వ సూరహ్ పేరు సజ్దా కాబట్టి, దీని ముందు 'హా-మీమ్ పెట్టబడ్డాయి. దీని అవతరణ విషయం ఈ విధంగా వివరించబడింది: దైవప్రవక్త ('స'అస) యొక్క అనుచరులు దినదినానికి ఎక్కువ కావటం చూసి, ముష్రిక్ ఖురైషులు అందరూ కలసి సమావేశం చేసి, 'ఉత్బ బిన్-రబీ'అ అనే వ్యక్తిని దైవప్రవక్త ('స'అస) దగ్గరికి రాయబారిగా పంపుతారు. అతడు దైవప్రవక్త ('స'అస)తో: 'నీకు ధనసంపత్తులు, నాయకపదవి, అందమైన స్త్రీలతో వివాహం లేక నీకు ('స'అస) ఏదైన దుష్టజిన్ బాధిస్తున్నట్లయితే దాని కొరకు మంత్రతంత్రాలు కూడా చేయిస్తాము, నీవు ప్రచారం చేసే, ఈ క్రొత్త ధర్మాన్ని విడిచి మన తండ్రితాతల ధర్మాన్ని అనుసరించు.' అని అంటాడు. అప్పుడు దైవప్రవక్త ('స'అస) ఈ సూరహ్ చదివి వినిపిస్తారు. దానితో అతడు తిరిగిపోయి ఖురైషీలతో: "అతను ('స'అస) చెప్పే మాటలు మంత్రజాలం కావు, కవిత్వం కావు, అవి సత్యాలే!" అని అంటాడు. దానికి వారు: "నీవు కూడా అతని మంత్రజాలానికి గురిఅయ్యావు!" అని అంటారు. మక్కాలో అవతరించిన ఈ సూరహ్‌లో **54 ఆయతులు** ఉన్నాయి.

C B A

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

حمٓ ﴿١﴾

**1.** 'హా -మీమ్.

تَنزِيلٌ مِّنَ ٱلرَّحۡمَٰنِ ٱلرَّحِيمِ ﴿٢﴾

**2.** దీని (ఈ ఖుర్ఆన్) అవతరణ అనంత కరుణామయుడు, అపార కరుణాప్రదాత తరఫు నుండి జరిగింది.

كِتَٰبٌ فُصِّلَتۡ ءَايَٰتُهُۥ قُرۡءَانًا عَرَبِيًّا لِّقَوۡمٍ يَعۡلَمُونَ ﴿٣﴾

**3.** ఇదొక గ్రంథం, దీని సూచనలు (ఆయాత్) తెలివిగల వారి కొరకు, 'అరబ్బీ[1] భాషలో స్పష్టమైన ఉపన్యాసం (ఖుర్ఆన్)గా **వివరించబడ్డాయి.**

**1.** చూడండి, 12:2.

بَشِيرًا وَنَذِيرًا فَأَعۡرَضَ أَكۡثَرُهُمۡ فَهُمۡ لَا يَسۡمَعُونَ ٤

4. (స్వర్గపు) శుభవార్తనిచ్చేదిగా మరియు హెచ్చరించేదిగా; అయినా చాలా మంది దీనిపట్ల విముఖత చూపుతున్నారు, కాబట్టి వారు వినటంలేదు.

وَقَالُواْ قُلُوبُنَا فِيٓ أَكِنَّةٖ مِّمَّا تَدۡعُونَآ إِلَيۡهِ وَفِيٓ ءَاذَانِنَا وَقۡرٞ وَمِنۢ بَيۡنِنَا وَبَيۡنِكَ حِجَابٞ فَٱعۡمَلۡ إِنَّنَا عَٰمِلُونَ ٥

5. మరియు వారు ఇలా అన్నారు: "నీవు దేని వైపునకైతే మమ్మల్ని పిలుస్తున్నావో, దానిపట్ల మా హృదయాల మీద తెరలు కప్పబడి ఉన్నాయి మరియు మా చెవులలో చెవుడు ఉంది మరియు నీకూ మాకూ మధ్య ఒక అడ్డుతెర ఉంది;[1] కావున నీవు నీ పని చేయి, మేము మా పని చేస్తాము."

قُلۡ إِنَّمَآ أَنَا۠ بَشَرٞ مِّثۡلُكُمۡ يُوحَىٰٓ إِلَيَّ أَنَّمَآ إِلَٰهُكُمۡ إِلَٰهٞ وَٰحِدٞ فَٱسۡتَقِيمُوٓاْ إِلَيۡهِ وَٱسۡتَغۡفِرُوهُۗ وَوَيۡلٞ لِّلۡمُشۡرِكِينَ ٦

6. (ఓ ప్రవక్తా!) ఇలా అను: "నిశ్చయంగా నేను కూడా మీలాంటి ఒక మానవుణ్ణి మాత్రమే![2] నాకు దివ్యజ్ఞానం (వ'హీ) ద్వారా ఇలా తెలుపబడింది: 'నిశ్చయంగా, మీ ఆరాధ్య దేవుడు, ఒకే ఒక్క దేవుడు (అల్లాహ్) కావున మీరు నేరుగా ఆయన వైపునకే మరలండి మరియు ఆయననే క్షమాపణకై వేడుకోండి.' " మరియు ఆయన(అల్లాహ్)కు సాటి కల్పించే వారికి వినాశం ఉంది.

ٱلَّذِينَ لَا يُؤۡتُونَ ٱلزَّكَوٰةَ وَهُم بِٱلۡأٓخِرَةِ هُمۡ كَٰفِرُونَ ٧

7. వారికి, ఎవరైతే విధిదానం (జకాత్) ఇవ్వరో మరియు పరలోకాన్ని తిరస్కరిస్తారో![3]

1. చూడండి, 7:46, 6:25.

2. చూడండి, 6:50.

3. అ'జ్జకాతు: మదీనాలో 2వ హిజ్రీలో విధిగా నియమించబడింది. కావున ఇక్కడ 'జకాత్ అంటే దానం. మొదట ఉదయం మరియు సాయంత్రం రెండు నమాజులు విధిగా చేయబడి ఉండేవి. హిజ్రత్‌కు ఒకటిన్నర సంవత్సరం ముందు మే'రాజ్‌లో ఐదు నమా'జ్‌లు విధిగా చేయబడ్డాయి. (ఇబ్నె-కసీ'ర్).

إِنَّ ٱلَّذِينَ ءَامَنُواْ وَعَمِلُواْ ٱلصَّٰلِحَٰتِ لَهُمۡ أَجۡرٌ غَيۡرُ مَمۡنُونٖ ٨

**8**. నిశ్చయంగా, ఎవరైతే విశ్వసించి సత్కార్యాలు చేస్తారో వారికి ఎడతెగని ప్రతిఫలం (స్వర్గం) ఉంటుంది. (3/4)

۞ قُلۡ أَئِنَّكُمۡ لَتَكۡفُرُونَ بِٱلَّذِي خَلَقَ ٱلۡأَرۡضَ فِي يَوۡمَيۡنِ وَتَجۡعَلُونَ لَهُۥٓ أَندَادٗاۚ ذَٰلِكَ رَبُّ ٱلۡعَٰلَمِينَ ٩

**9**.* వారితో ఇలా అను: "ఏమీ? మీరు, భూమిని **రెండు** రోజులలో సృష్టించిన ఆయన(అల్లాహ్)ను తిరస్కరించి, ఇతరులను ఆయనకు సమానులుగా నిలబెడతారా? సర్వలోకాలకు పోషకుడు ఆయనే కదా!"[1]

وَجَعَلَ فِيهَا رَوَٰسِيَ مِن فَوۡقِهَا وَبَٰرَكَ فِيهَا وَقَدَّرَ فِيهَآ أَقۡوَٰتَهَا فِيٓ أَرۡبَعَةِ أَيَّامٖ سَوَآءٗ لِّلسَّآئِلِينَ ١٠

**10**. మరియు ఆయన దానిలో (భూమిలో) దాని పైనుండి స్థిరమైన పర్వతాలను నెలకొలిపాడు[2] మరియు అందులో శుభాలను అనుగ్రహించాడు మరియు అర్థించేవారి కొరకు, వారి అవసరాలకు సరిపోయేటట్లు జీవనోపాధిని సమకూర్చాడు, ఇదంతా **నాలుగు** రోజులలో పూర్తిచేశాడు.

ثُمَّ ٱسۡتَوَىٰٓ إِلَى ٱلسَّمَآءِ وَهِيَ دُخَانٞ فَقَالَ لَهَا وَلِلۡأَرۡضِ ٱئۡتِيَا طَوۡعًا أَوۡ كَرۡهٗا قَالَتَآ أَتَيۡنَا طَآئِعِينَ ١١

**11**. అప్పుడే[3] ఆయన కేవలం పొగగా[4] ఉన్న ఆకాశం వైపునకు తన ధ్యానాన్ని మరల్చి, దానిని మరియు భూమిని ఉద్దేశించి ఇలా అన్నాడు: "మీరిద్దరు (ఉనికిలోకి) రండి మీకు ఇష్టమున్నా, ఇష్టం లేకపోయినా!" అవి రెండూ: "మేమిద్దరమూ విధేయులమై (ఉనికిలోకి) వస్తాము." అని అన్నాయి.

---

**1**. సృష్టిని ఆరు రోజులలో సృష్టించాడు. చూడండి, 7:54.

**2**. భూమిలోనుండి పర్వతాలను పుట్టించి వాటిని దానిపై నాటాడు, భూమి కదలిపోకుండా.

**3**. సు'మ్మ: 'అరబ్బీ భాషలో ఒకే విషయాన్ని బోధించే రెండువాక్యాలను కలుపుటకు గూడా ఈ శబ్దం సు'మ్మ వాడబడుతోంది. ఇక్కడ వాడబడినట్లు.

**4**. దుఖానున్: పొగ, ఇది హైడ్రోజన్ గ్యాస్ కావచ్చు. దీని నుండియే ప్రపంచంలోని మూలపదార్థాలు (Elements) అన్నీ రూపొందించబడ్డాయి. చూడండి, 2:29.

فَقَضَىٰهُنَّ سَبۡعَ سَمَٰوَاتٖ فِي يَوۡمَيۡنِ وَأَوۡحَىٰ فِي كُلِّ سَمَآءٍ أَمۡرَهَاۚ وَزَيَّنَّا ٱلسَّمَآءَ ٱلدُّنۡيَا بِمَصَٰبِيحَ وَحِفۡظٗاۚ ذَٰلِكَ تَقۡدِيرُ ٱلۡعَزِيزِ ٱلۡعَلِيمِ ١٢

**12**. కావున ఆయన వాటిని రెండు రోజులలో ఏడు ఆకాశాలుగా నిర్మించాడు, మరియు ప్రతి ఆకాశానికి దాని వ్యవహారాన్ని దివ్యజ్ఞానం (వ'హీ) ద్వారా నిర్దేశించాడు. మరియు మేము ఈ ప్రపంచపు ఆకాశాన్ని దీపాలతో (నక్షత్రాలతో) అలంకరించాము మరియు దానిని సురక్షితం చేశాము.[1] ఇదే సర్వశక్తిమంతుని, సర్వజ్ఞుని నియామకం.

فَإِنۡ أَعۡرَضُواْ فَقُلۡ أَنذَرۡتُكُمۡ صَٰعِقَةٗ مِّثۡلَ صَٰعِقَةِ عَادٖ وَثَمُودَ ١٣

**13**. ఇప్పుడు ఒకవేళ వారు విముఖులైతే వారితో ఇలా అను: " 'ఆద్ మరియు స'మూద్ జాతుల వారిపై వచ్చి పడినట్టి గొప్ప పిడుగులాంటి శిక్ష గురించి మిమ్మల్ని హెచ్చరిస్తున్నాను."[2]

إِذۡ جَآءَتۡهُمُ ٱلرُّسُلُ مِنۢ بَيۡنِ أَيۡدِيهِمۡ وَمِنۡ خَلۡفِهِمۡ أَلَّا تَعۡبُدُوٓاْ إِلَّا ٱللَّهَۖ قَالُواْ لَوۡ شَآءَ رَبُّنَا لَأَنزَلَ مَلَٰٓئِكَةٗ فَإِنَّا بِمَآ أُرۡسِلۡتُم بِهِۦ كَٰفِرُونَ ١٤

**14**. ఇక దైవప్రవక్తలు వారి వద్దకు వారి ముందు నుండి మరియు వారి వెనుక నుండి వచ్చి: "మీరు అల్లాహ్‌ను తప్ప మరెవ్వరినీ ఆరాధించకండి!" అని అన్నప్పుడు, వారు ఇలా అన్నారు: "మా ప్రభువే గనక కోరితే దేవదూతలను పంపి ఉండేవాడు.[3] కావున మేము మీ ద్వారా పంపబడిన దానిని నిశ్చయంగా, తిరస్కరిస్తున్నాము!"

فَأَمَّا عَادٞ فَٱسۡتَكۡبَرُواْ فِي ٱلۡأَرۡضِ بِغَيۡرِ ٱلۡحَقِّ وَقَالُواْ مَنۡ أَشَدُّ مِنَّا قُوَّةًۖ

**15**. ఇక 'ఆద్ వారి విషయం: వారు దురహంకారంతో భూమిలో అన్యాయంగా ప్రవర్తించే వారు. మరియు ఇలా అనే వారు: "బలంలో మమ్మల్ని మించిన వాడు ఎవడు

---

**1**. చూడండి, 15:16-18 మరియు 37:6.
**2**. 'ఆద్ జాతివారి గాథకై చూడండి, 7:65-69 మరియు స'మూద్‌వారి గాథకై చూడండి, 26:123-158.
**3**. చూడండి, 6:8-9 మరియు 15:7.

ఉన్నాడు?" ఏమీ? వారికి తెలియదా? నిశ్చయంగా, వారిని సృష్టించిన అల్లాహ్ బలంలో వారికంటే ఎంతో మించినవాడని? అయినా వారు మా సూచన (ఆయాత్)లను తిరస్కరిస్తూ ఉండేవారు!

أَوَلَمْ يَرَوْا أَنَّ ٱللَّهَ ٱلَّذِى خَلَقَهُمْ هُوَ أَشَدُّ مِنْهُمْ قُوَّةً وَكَانُوا۟ بِـَٔايَـٰتِنَا يَجْحَدُونَ ﴿١٥﴾

**16.** చివరకు మేము వారికి, ఇహలోక జీవితంలోనే అవమానకరమైన శిక్ష రుచి చూపించాలని, అశుభమైన దినాలలో వారిపై తీవ్రమైన తుఫానుగాలిని పంపాము.[1] మరియు వారి పరలోకశిక్ష దీనికంటే ఎంతో అవమానకరమైనదిగా ఉండబోతోంది. మరియు వారికెలాంటి సహాయం లభించదు.

فَأَرْسَلْنَا عَلَيْهِمْ رِيحًا صَرْصَرًا فِىٓ أَيَّامٍ نَّحِسَاتٍ لِّنُذِيقَهُمْ عَذَابَ ٱلْخِزْىِ فِى ٱلْحَيَوٰةِ ٱلدُّنْيَا ۖ وَلَعَذَابُ ٱلْـَٔاخِرَةِ أَخْزَىٰ ۖ وَهُمْ لَا يُنصَرُونَ ﴿١٦﴾

**17.** మరియు స'మూద్ వారి విషయం: మేము వారికి మార్గదర్శకత్వం చేశాము. కాని వారు మార్గదర్శకత్వానికి బదులు గ్రుడ్డి తనాన్నే ఇష్టపడ్డారు. చివరకు వారి (దుష్ట) కర్మలకు ఫలితంగా, వారిపై పిడుగులాంటి అవమానకరమైన శిక్ష పడింది.[2]

وَأَمَّا ثَمُودُ فَهَدَيْنَـٰهُمْ فَٱسْتَحَبُّوا۟ ٱلْعَمَىٰ عَلَى ٱلْهُدَىٰ فَأَخَذَتْهُمْ صَـٰعِقَةُ ٱلْعَذَابِ ٱلْهُونِ بِمَا كَانُوا۟ يَكْسِبُونَ ﴿١٧﴾

**18.** మరియు మేము వారిలో విశ్వాసులైన వారిని మరియు దైవభీతి గలవారిని రక్షించాము.

وَنَجَّيْنَا ٱلَّذِينَ ءَامَنُوا۟ وَكَانُوا۟ يَتَّقُونَ ﴿١٨﴾

**19.** మరియు (జ్ఞాపకముంచుకోండి) అల్లాహ్ యొక్క విరోధులు నరకాగ్ని వైపుకు సమీకరించబడే రోజు, వారు తమతమ స్థానాలకు పంపబడతారు.

وَيَوْمَ يُحْشَرُ أَعْدَآءُ ٱللَّهِ إِلَى ٱلنَّارِ فَهُمْ يُوزَعُونَ ﴿١٩﴾

---

**1.** తూఫాన్ గాలి వీచిన దినాలు ఆ సత్యతిరస్కారుల కొరకే అశుభమైనవి. కాని ఆ పేరు గల దినాలు అందరి కొరకూ అశుభమైనవని దీని అర్థం కాదు. వివరాలకు చూడండి, 69:6-8.

**2.** చూడండి, 69:5.

حَتَّىٰٓ إِذَا مَا جَآءُوهَا شَهِدَ عَلَيۡهِمۡ سَمۡعُهُمۡ وَأَبۡصَٰرُهُمۡ وَجُلُودُهُم بِمَا كَانُواْ يَعۡمَلُونَ ٢٠

20. చివరకు వారు దానిని (నరకాగ్నిని) చేరుకున్నప్పుడు; వారి చెవులు వారి కళ్ళు మరియు వారి చర్మాలు వారు చేస్తూ ఉండిన కర్మలను గురించి, వారికి వ్యతిరేకంగా సాక్ష్యమిస్తాయి.

وَقَالُواْ لِجُلُودِهِمۡ لِمَ شَهِدتُّمۡ عَلَيۡنَاۖ قَالُوٓاْ أَنطَقَنَا ٱللَّهُ ٱلَّذِيٓ أَنطَقَ كُلَّ شَيۡءٖۚ وَهُوَ خَلَقَكُمۡ أَوَّلَ مَرَّةٖ وَإِلَيۡهِ تُرۡجَعُونَ ٢١

21. మరియు వారు తమ చర్మాలను (అవయవాలను) అడుగుతారు: "మీరెందుకు మాకు వ్యతిరేకంగా సాక్ష్యమిస్తున్నారు?" అవి ఇలా సమాధాన మిస్తాయి: "ప్రతి వస్తువుకు మాట్లాడే శక్తి ప్రసాదించిన అల్లాహ్‌యే మమ్మల్ని మాట్లాడింపజేశాడు." మరియు ఆయనే మిమ్మల్ని మొదటి సారి సృష్టించిన వాడు, మరియు ఆయన వైపునకే మీరంతా మరలింపబడతారు.[1]

وَمَا كُنتُمۡ تَسۡتَتِرُونَ أَن يَشۡهَدَ عَلَيۡكُمۡ سَمۡعُكُمۡ وَلَآ أَبۡصَٰرُكُمۡ وَلَا جُلُودُكُمۡ وَلَٰكِن ظَنَنتُمۡ أَنَّ ٱللَّهَ لَا يَعۡلَمُ كَثِيرٗا مِّمَّا تَعۡمَلُونَ ٢٢

22. మరియు (మీరు దుష్కార్యాలు చేసేటప్పుడు) మీ చెవులనుండి మీ కండ్లనుండి మరియు మీ చర్మాలనుండి - మీకు వ్యతిరేకంగా సాక్ష్యం వస్తుందేమోనని - మిమ్మల్ని మీరు దాచుకునే వారు కాదు. అంతేకాదు మీరు చేస్తున్న ఎన్నో కార్యాలు వాస్తవంగా, అల్లాహ్‌కు తెలియటంలేదని మీరు భావించేవారు.

وَذَٰلِكُمۡ ظَنُّكُمُ ٱلَّذِي ظَنَنتُم بِرَبِّكُمۡ أَرۡدَىٰكُمۡ فَأَصۡبَحۡتُم مِّنَ ٱلۡخَٰسِرِينَ ٢٣

23. మరియు మీ ప్రభువు పట్ల మీరు భావించిన ఈ భావనే మిమ్మల్ని నాశనం చేసింది. కావున మీరు నష్టపోయే వారిలో చేరిపోయారు.

1. చూడండి, 24:24, 36:65.

فَإِن يَصْبِرُواْ فَٱلنَّارُ مَثْوًى لَّهُمْ وَإِن يَسْتَعْتِبُواْ فَمَا هُم مِّنَ ٱلْمُعْتَبِينَ ﴿٢٤﴾

24. అప్పుడు వారు సహనం చూపినా, నరకాగ్నియే వారి నివాసస్థానమవుతుంది. ఒకవేళ వారు (తమను తాము సరిదిద్దు కోవటానికి) అవకాశం కొరకు వేడుకున్నా వారికి అవకాశం ఇవ్వబడదు.[1] (7/8)

۞ وَقَيَّضْنَا لَهُمْ قُرَنَآءَ فَزَيَّنُواْ لَهُم مَّا بَيْنَ أَيْدِيهِمْ وَمَا خَلْفَهُمْ وَحَقَّ عَلَيْهِمُ ٱلْقَوْلُ فِىٓ أُمَمٍ قَدْ خَلَتْ مِن قَبْلِهِم مِّنَ ٱلْجِنِّ وَٱلْإِنسِ إِنَّهُمْ كَانُواْ خَٰسِرِينَ ﴿٢٥﴾

25.* మరియు మేము వీరికి స్నేహితులుగా (షైతానులను) నియమించాము. వారు వీరి ముందూ వెనుకా ఉన్నవాటిని వీరికి ఆకర్షణీయమైన వాటిగా చేశారు. కావున వీరికి పూర్వం గతించిన జిన్నాతుల మరియు మానవుల తరాల విషయంలో జరిగిన శిక్షా నిర్ణయమే, వీరి విషయంలో కూడా జరిగింది. నిశ్చయంగా, వీరే నష్టానికి గురిఅయిన వారయ్యారు.

وَقَالَ ٱلَّذِينَ كَفَرُواْ لَا تَسْمَعُواْ لِهَٰذَا ٱلْقُرْءَانِ وَٱلْغَوْاْ فِيهِ لَعَلَّكُمْ تَغْلِبُونَ ﴿٢٦﴾

26. మరియు సత్యతిరస్కారులు (పరస్పరం) ఇలా చెప్పుకుంటారు: "ఈ ఖుర్ఆన్‌ను వినకండి! మరియు ఇది వినిపించబడినప్పుడు వినబడకుండా విఘ్నం కలిగించండి, బహుశా మీరు ప్రాబల్యం పొందవచ్చు!"

فَلَنُذِيقَنَّ ٱلَّذِينَ كَفَرُواْ عَذَابًا شَدِيدًا وَلَنَجْزِيَنَّهُمْ أَسْوَأَ ٱلَّذِى كَانُواْ يَعْمَلُونَ ﴿٢٧﴾

27. కావున మేము నిశ్చయంగా, ఈ సత్యతిరస్కారులకు కఠినశిక్షను చవి చూపిస్తాము మరియు వారు చేస్తూ ఉండిన దుష్ట కార్యాలకు తగిన ఫలితాన్ని నొసంగుతాము -

ذَٰلِكَ جَزَآءُ أَعْدَآءِ ٱللَّهِ ٱلنَّارُ لَهُمْ فِيهَا دَارُ ٱلْخُلْدِ جَزَآءًۢ بِمَا كَانُواْ بِـَٔايَٰتِنَا يَجْحَدُونَ ﴿٢٨﴾

28. అల్లాహ్ విరోధులకు దొరికే ప్రతిఫలం ఇదే - నరకాగ్ని. అందు వారి శాశ్వత గృహం ఉంటుంది. ఇది మా సూచన(ఆయాత్)లను తిరస్కరిస్తూ వున్న దాని ప్రతిఫలం.

1. చూడండి, 6:27-28 మరియు 32:12.

29. అప్పుడా సత్యతిరస్కారులు ఇలా అంటారు: "ఓ మా ప్రభూ! మమ్మల్ని మార్గభ్రష్టులుగా చేసిన ఆ జిన్నాతులను మరియు మానవులను మాకు చూపించు; వారు మరింత పరాభవం పొందటానికి మేము వారిని మా పాదాలక్రింద పడవేసి త్రొక్కుతాము."[1]

وَقَالَ ٱلَّذِينَ كَفَرُواْ رَبَّنَآ أَرِنَا ٱلَّذَيۡنِ أَضَلَّانَا مِنَ ٱلۡجِنِّ وَٱلۡإِنسِ نَجۡعَلۡهُمَا تَحۡتَ أَقۡدَامِنَا لِيَكُونَا مِنَ ٱلۡأَسۡفَلِينَ ﴿٢٩﴾

30. నిశ్చయంగా ఎవరైతే: "అల్లాహ్‌యే మా ప్రభువు!" అని పలుకుతూ తరువాత దానిపైననే స్థిరంగా ఉంటారో![2] వారిపై దేవదూతలు దిగివచ్చి (ఇలా అంటారు): "మీరు భయపడకండి మరియు దుఃఖపడకండి, మీకు వాగ్దానం చేయబడిన స్వర్గపు శుభవార్తను వినండి!

إِنَّ ٱلَّذِينَ قَالُواْ رَبُّنَا ٱللَّهُ ثُمَّ ٱسۡتَقَٰمُواْ تَتَنَزَّلُ عَلَيۡهِمُ ٱلۡمَلَٰٓئِكَةُ أَلَّا تَخَافُواْ وَلَا تَحۡزَنُواْ وَأَبۡشِرُواْ بِٱلۡجَنَّةِ ٱلَّتِي كُنتُمۡ تُوعَدُونَ ﴿٣٠﴾

31. "మేము ఇహలోక జీవితంలో మరియు పరలోక జీవితంలో కూడా మీకు సన్నిహితులముగా ఉన్నాము. మరియు మీ కొరకు అందులో మీ మనస్సులు కోరిందంతా ఉంటుంది. మరియు మీరు ఆశించేదంతా దొరుకుతుంది.

نَحۡنُ أَوۡلِيَآؤُكُمۡ فِي ٱلۡحَيَوٰةِ ٱلدُّنۡيَا وَفِي ٱلۡأٓخِرَةِۖ وَلَكُمۡ فِيهَا مَا تَشۡتَهِيٓ أَنفُسُكُمۡ وَلَكُمۡ فِيهَا مَا تَدَّعُونَ ﴿٣١﴾

32. "ఇదంతా క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత ప్రసాదించిన ఆతిథ్యము."

نُزُلٗا مِّنۡ غَفُورٖ رَّحِيمٖ ﴿٣٢﴾

33. మరియు (ప్రజలను) అల్లాహ్ వైపునకు పిలుస్తూ, సత్కార్యాలు చేస్తూ: "నిశ్చయంగా, నేను అల్లాహ్‌కే విధేయుడ (ముస్లిం)ను!" అని పలికే వాని మాట కంటే మంచిమాట మరెవరిది?

وَمَنۡ أَحۡسَنُ قَوۡلٗا مِّمَّن دَعَآ إِلَى ٱللَّهِ وَعَمِلَ صَٰلِحٗا وَقَالَ إِنَّنِي مِنَ ٱلۡمُسۡلِمِينَ ﴿٣٣﴾

---

1. చూడండి, 7:38.

2. ఒక సహాబీ(ర'ది.'అ.) దైవప్రవక్త (సఅస)తో ఇలా ప్రశ్నించాడు: 'నాకు ఇటువంటి మాట చెప్పండి, దానితో మీ తరువాత ఎవ్వరినీ అడిగే అవసరం ఉండగూడదు!' దానికి దైవప్రవక్త ('స'అస) అన్నారు: 'ఇలా అను నేను అల్లాహ్ (సు.తా.)ను విశ్వసించాను, తరువాత దాని (విశ్వాసం) పైననే స్థిరంగాఉన్నాను.' ('స'హీ'హ్ ముస్లిం).

وَلَا تَسْتَوِى ٱلْحَسَنَةُ وَلَا ٱلسَّيِّئَةُ ٱدْفَعْ بِٱلَّتِى هِىَ أَحْسَنُ فَإِذَا ٱلَّذِى بَيْنَكَ وَبَيْنَهُۥ عَدَٰوَةٌ كَأَنَّهُۥ وَلِىٌّ حَمِيمٌ ﴿٣٤﴾

34. మరియు, మంచీ మరియు చెడులు సరిసమానం కాజాలవు. (చెడును) మంచితో తొలగించు; అప్పుడు నీతో విరోధమున్న వాడు కూడా తప్పక నీ ప్రాణస్నేహితుడు అవుతాడు.[1]

وَمَا يُلَقَّىٰهَآ إِلَّا ٱلَّذِينَ صَبَرُوا۟ وَمَا يُلَقَّىٰهَآ إِلَّا ذُو حَظٍّ عَظِيمٍ ﴿٣٥﴾

35. మరియు ఇది కేవలం సహనశీలురకు తప్ప ఇతరులకు లభించదు. మరియు ఇది[2] గొప్ప అదృష్టవంతులకు తప్ప ఇతరులకు లభించదు.

وَإِمَّا يَنزَغَنَّكَ مِنَ ٱلشَّيْطَٰنِ نَزْغٌ فَٱسْتَعِذْ بِٱللَّهِ إِنَّهُۥ هُوَ ٱلسَّمِيعُ ٱلْعَلِيمُ ﴿٣٦﴾

36. మరియు ఒకవేళ షై'తాన్ నుండి నీకు ఏదైనా కలత కలిగినపుడు, నీవు అల్లాహ్ శరణు వేడుకో.[3] నిశ్చయంగా ఆయనే సర్వం వినేవాడు, సర్వజ్ఞుడు.

وَمِنْ ءَايَٰتِهِ ٱلَّيْلُ وَٱلنَّهَارُ وَٱلشَّمْسُ وَٱلْقَمَرُ لَا تَسْجُدُوا۟ لِلشَّمْسِ وَلَا لِلْقَمَرِ وَٱسْجُدُوا۟ لِلَّهِ ٱلَّذِى خَلَقَهُنَّ إِن كُنتُمْ إِيَّاهُ تَعْبُدُونَ ﴿٣٧﴾

37. మరియు ఆయన సూచన (ఆయాత్)లలో రేయింబవళ్ళు మరియు సూర్యచంద్రులున్నాయి. మీరు సూర్యునికిగానీ చంద్రునికిగానీ సాష్టాంగం (సజ్దా) చేయకండి, కాని కేవలం వాటిని సృష్టించిన అల్లాహ్‌కు మాత్రమే సాష్టాంగం (సజ్దా) చేయండి - నిజంగానే మీరు ఆయనను ఆరాధించే వారే అయితే !

فَإِنِ ٱسْتَكْبَرُوا۟ فَٱلَّذِينَ عِندَ رَبِّكَ يُسَبِّحُونَ لَهُۥ بِٱلَّيْلِ وَٱلنَّهَارِ وَهُمْ لَا يَسْـَٔمُونَ ۩ ﴿٣٨﴾

38. ఒకవేళ వారు దురహంకారానికి పాల్పడితే! ఇక నీ ప్రభువుకు దగ్గరగా ఉన్నవారు (దేవదూతలు) రేయింబవళ్ళు ఆయన పవిత్రతను కొనియాడుతూ ఉంటారు; మరియు వారెన్నడూ అలసట చూపరు. ۩

1. చూడండి, 13:22. ఎవరైనా మీకు కీడు చేస్తే వానికి మేలు చేయండి. ఎవడైనా మీకు అన్యాయం చేస్తే వాడిని క్షమించండి. ఎవడైనా మీ మీద దౌర్జన్యం చేస్తే సహనం వహించండి. ఈ విధమైన వ్యవహారాలతో మీ శత్రువు కూడా మీ స్నేహితుడవుతాడు.
2. అంటే స్వర్గవాసం.
3. చూడండి, 7:200.

**39**. మరియు ఆయన సూచన (ఆయాత్)లలో ఒకటి: నిశ్చయంగా, నీవు భూమిని పాడు (ఎండిపోయిన బంజరు) నేలగా చూస్తున్నావు; కాని మేము దానిపై నీటిని (వర్షాన్ని) కురిపించగానే, అది పులకించి, ఉబ్బిపోతుంది. నిశ్చయంగా, దీనిని (ఈ భూమిని) బ్రతికించి లేపే ఆయన(అల్లాహ్)యే మృతులను కూడా బ్రతికించి లేపుతాడు. నిశ్చయంగా, ఆయన ప్రతిదీ చేయగల సమర్థుడు.

وَمِنْ ءَايَٰتِهِۦٓ أَنَّكَ تَرَى ٱلْأَرْضَ خَٰشِعَةً فَإِذَآ أَنزَلْنَا عَلَيْهَا ٱلْمَآءَ ٱهْتَزَّتْ وَرَبَتْ ۚ إِنَّ ٱلَّذِىٓ أَحْيَاهَا لَمُحْىِ ٱلْمَوْتَىٰٓ ۚ إِنَّهُۥ عَلَىٰ كُلِّ شَىْءٍ قَدِيرٌ ﴿٣٩﴾

**40**. నిశ్చయంగా, మా సూచనలకు వికృత అర్థం అంటగట్టే వారు మాకు కనిపించకుండా ఉండలేరు. అయితే! పునరుత్థానదినమున నరకాగ్నిలో పడవేయబడే వాడు ఉత్తముడా? లేక శాంతియుతంగా వచ్చే వాడా? మీరు కోరేది మీరు చేయండి. నిశ్చయంగా, మీరు చేసేదంతా ఆయన చూస్తున్నాడు.

إِنَّ ٱلَّذِينَ يُلْحِدُونَ فِىٓ ءَايَٰتِنَا لَا يَخْفَوْنَ عَلَيْنَآ ۗ أَفَمَن يُلْقَىٰ فِى ٱلنَّارِ خَيْرٌ أَم مَّن يَأْتِىٓ ءَامِنًا يَوْمَ ٱلْقِيَٰمَةِ ۚ ٱعْمَلُوا۟ مَا شِئْتُمْ ۖ إِنَّهُۥ بِمَا تَعْمَلُونَ بَصِيرٌ ﴿٤٠﴾

**41**. నిశ్చయంగా, తమ దగ్గరకు హితబోధ వచ్చినపుడు దానిని తిరస్కరించే వారే (నష్టపోయే వారు). మరియు నిశ్చయంగా, ఇది (ఈ ఖుర్ఆన్) చాలా శక్తివంతమైన (గొప్ప) గ్రంథం;

إِنَّ ٱلَّذِينَ كَفَرُوا۟ بِٱلذِّكْرِ لَمَّا جَآءَهُمْ ۖ وَإِنَّهُۥ لَكِتَٰبٌ عَزِيزٌ ﴿٤١﴾

**42**. అసత్యం దాని (ఖుర్ఆన్) ముందు నుండి గానీ లేదా దాని వెనుక నుండి గానీ దానిపైకి రాజాలదు. అది మహా వివేకవంతుడు, సర్వస్తోత్రాలకు అర్హుడు, అయిన ఆయన (అల్లాహ్) తరఫు నుండి అవతరింపజేయబడింది.[1]

لَّا يَأْتِيهِ ٱلْبَٰطِلُ مِنۢ بَيْنِ يَدَيْهِ وَلَا مِنْ خَلْفِهِۦ ۖ تَنزِيلٌ مِّنْ حَكِيمٍ حَمِيدٍ ﴿٤٢﴾

**1**. ఈ ఖుర్ఆన్ అన్ని విధాలుగా భద్రపరచబడింది - దాని ముందునుండి గానీ మరియు వెనుకనుండి గానీ - అంటే అసత్యవాదులు దీని ముందు నుండి వచ్చి ఇందులో దేనినీ

مَّا يُقَالُ لَكَ إِلَّا مَا قَدْ قِيلَ لِلرُّسُلِ مِن قَبْلِكَ ۚ إِنَّ رَبَّكَ لَذُو مَغْفِرَةٍ وَذُو عِقَابٍ أَلِيمٍ ﴿٤٣﴾

**43.** (ఓ ము'హమ్మద్!) వాస్తవానికి, నీకు చెప్పబడిన దానిలో పూర్వం గతించిన ప్రవక్తలకు చెప్పబడనిది ఏదీలేదు.[1] నిశ్చయంగా, నీ ప్రభువు మాత్రమే క్షమాశీలుడు మరియు బాధాకరమైన శిక్ష విధించేవాడు కూడాను.

وَلَوْ جَعَلْنَٰهُ قُرْءَانًا أَعْجَمِيًّا لَّقَالُوا۟ لَوْلَا فُصِّلَتْ ءَايَٰتُهُۥٓ ۖ ءَا۬عْجَمِىٌّ وَعَرَبِىٌّ ۗ قُلْ هُوَ لِلَّذِينَ ءَامَنُوا۟ هُدًى وَشِفَآءٌ ۖ وَٱلَّذِينَ لَا يُؤْمِنُونَ فِىٓ ءَاذَانِهِمْ وَقْرٌ وَهُوَ عَلَيْهِمْ عَمًى ۚ أُو۟لَٰٓئِكَ يُنَادَوْنَ مِن مَّكَانٍۭ بَعِيدٍ ﴿٤٤﴾

**44.** ఒకవేళ మేము ఈ ఖుర్ఆన్‌ను 'అరబ్బేతర భాషలో అవతరింపజేసి ఉండినట్లైతే వారు ఇలా అని ఉండేవారు: "దీని సూచనలు (ఆయాత్) స్పష్టంగా ఎందుకు వివరించబడలేదు?[2] (గ్రంథమేమో) 'అరబ్బేతర భాషలో మరియు (సందేశహరుడేమో) 'అరబ్బు?" వారితో ఇలా అను: "ఇది (ఈ ఖుర్ఆన్) విశ్వసించిన వారికి మార్గదర్శకత్వం మరియు స్వస్థత నొసంగేది. మరియు విశ్వసించని వారి చెవులకు అవరోధం మరియు వారి కళ్ళకు ఒక గంత. అలాంటి వారిస్థితి ఎంతో దూరం నుండి పిలువబడినవారి అరుపులాంటిది!"

---

తగ్గించలేరు. మరియు దీని వెనుక నుండి వచ్చి దీనిలో దేనినీ అధికం చేయలేరు. అంటే ఇందులో ఏ విధమైన మార్పులు తేలేరు. ఎందుకంటే ఇది మహా వివేకవంతుడు, సర్వస్తోత్రాలకు అర్హుడైన అల్లాహ్ (సు.తా.) తరఫునుండి అవతరింపజేయబడింది. మరియు ఆయనే పునరుత్థానదినం వరకు దీనిని (ఖుర్ఆన్‌ను) భద్రంగా ఉంచుతాను, అని అన్నాడు, (ఇబ్నె-కసీ'ర్).

**1**. చూడండి, 51:52-53. వ్యాఖ్యాతలు దీనిని రెండు విధాలుగా అర్థం చేసుకున్నారు. **ఒకటి:** పూర్వప్రజలు తమ ప్రవక్త('అ.స.)లతో ఇతను పిచ్చివాడు, మాంత్రికుడు, అసత్యవాదుడు, వగైరా అన్నమాటలనే ఈ మక్కా ముష్రికులు కూడా మీతో అంటున్నారు. ఈ విధమైన మాటలతో దైవప్రవక్త ఓదార్చబడుతున్నారు.
**రెండో అర్థం:** దైవప్రవక్త ('స'అస)తో ఏకాగ్రచిత్తం, ఏక దైవారాధన, (ఇస్లాం) గురించి చెప్పబడిన మాటలు, ఇంతకు ముందు ప్రవక్తలందరితో చెప్పబడిన మాటలే! (ఫత్హ్ అల్-ఖదీర్).

**2**. చూడండి, 13:37 మరియు 14:4.

وَلَقَدۡ ءَاتَيۡنَا مُوسَى ٱلۡكِتَٰبَ فَٱخۡتُلِفَ فِيهِۗ وَلَوۡلَا كَلِمَةٞ سَبَقَتۡ مِن رَّبِّكَ لَقُضِيَ بَيۡنَهُمۡۚ وَإِنَّهُمۡ لَفِي شَكّٖ مِّنۡهُ مُرِيبٖ ٤٥

**45**. వాస్తవానికి మేము మూసాకు గ్రంథాన్ని ప్రసాదించాము, కాని దాని విషయంలో కూడా భేదాభిప్రాయాలు వచ్చాయి. ఒకవేళ నీ ప్రభువు నుండి, మొదటినుంచే నిర్ణయం తీసుకోబడి ఉండకపోతే,[1] వారి మధ్య ఎప్పుడో తీర్పు జరిగివుండేది. మరియు నిశ్చయంగా, వారు దానిని గురించి ఆందోళన కలిగించే సందేహానికి గురిఅయ్యారు.

مَّنۡ عَمِلَ صَٰلِحٗا فَلِنَفۡسِهِۦۖ وَمَنۡ أَسَآءَ فَعَلَيۡهَاۗ وَمَا رَبُّكَ بِظَلَّٰمٖ لِّلۡعَبِيدِ ٤٦

**46**. ఎవడైతే సత్కార్యం చేస్తాడో అతడు తన (మేలు) కొరకే చేస్తాడు. మరియు దుష్కార్యం చేసేవాడు దాని (ఫలితాన్ని) అనుభవిస్తాడు. మరియు నీ ప్రభువు తన దాసులకు అన్యాయం చేసేవాడుకాడు.

---

1. అంటే వారికొక గడువు నిర్ణయింపబడి ఉంది మరియు వారికి వ్యవధి ఇవ్వబడుతోంది. చూడండి, 35:45

۞ إِلَيۡهِ يُرَدُّ عِلۡمُ ٱلسَّاعَةِۚ وَمَا تَخۡرُجُ مِن ثَمَرَٰتٍ مِّنۡ أَكۡمَامِهَا وَمَا تَحۡمِلُ مِنۡ أُنثَىٰ وَلَا تَضَعُ إِلَّا بِعِلۡمِهِۦۚ وَيَوۡمَ يُنَادِيهِمۡ أَيۡنَ شُرَكَآءِي قَالُوٓاْ ءَاذَنَّٰكَ مَا مِنَّا مِن شَهِيدٖ ﴿٤٧﴾

47. (*) ఆ (అంతిమ) ఘడియ జ్ఞానం కేవలం ఆయనకే చెందినది.[1] మరియు ఆయనకు తెలియకుండా ఫలాలు పుష్పకోశాల[2] నుండి బయటికి రావు మరియు ఆయనకు తెలియకుండా ఏ స్త్రీకూడా గర్భందాల్చదు మరియు ప్రసవించదు. మరియు ఏ దినమునైతే వారిని పిలిచి: "మీరు నాకు సాటికల్పించే ఆ భాగ స్వాములు ఎక్కడున్నారు?" అని అడిగితే, వారు ఇలా జవాబిస్తారు: "మాలో ఎవ్వడు కూడా దీనికి సాక్ష్యం ఇచ్చేవాడు లేడని మేము ఇదివరకే మనవి చేసుకున్నాము!"

وَضَلَّ عَنۡهُم مَّا كَانُواْ يَدۡعُونَ مِن قَبۡلُۖ وَظَنُّواْ مَا لَهُم مِّن مَّحِيصٖ ﴿٤٨﴾

48. మరియు వారు ఇంతకు పూర్వం ఆరాధించేవారంతా వారిని త్యజించి ఉంటారు. మరియు తమకు తప్పించుకునే మార్గం లేదని వారు గ్రహిస్తారు.[3]

لَّا يَسۡـَٔمُ ٱلۡإِنسَٰنُ مِن دُعَآءِ ٱلۡخَيۡرِ وَإِن مَّسَّهُ ٱلشَّرُّ فَيَـُٔوسٞ قَنُوطٞ ﴿٤٩﴾

49. మానవుడు మేలు కొరకు ప్రార్థిస్తూ ఎన్నడూ అలసిపోడు. కాని ఒకవేళ అతనికి ఏదైనా ఆపద కలిగితే, అతడు ఆశ వదలి నిరాశ చెందుతాడు.[4]

وَلَئِنۡ أَذَقۡنَٰهُ رَحۡمَةٗ مِّنَّا مِنۢ بَعۡدِ ضَرَّآءَ مَسَّتۡهُ لَيَقُولَنَّ هَٰذَا لِي وَمَآ أَظُنُّ ٱلسَّاعَةَ قَآئِمَةٗ وَلَئِن رُّجِعۡتُ

50. మరియు ఒకవేళ మేము అతనికి ఆపదకాలం దాటిపోయిన తర్వాత మా కారుణ్యాన్ని రుచి చూపిస్తే అతడు తప్ప కుండా ఇలా అంటాడు: "ఇది నా హక్కే! మరియు పునరుత్థానదినం వస్తుందని నేను భావించను. మరియు ఒకవేళ నేను నా

---

1. చూడండి, 7:187 మరియు 79:44.

2. అక్'మామ్: Sheath, Bud, Calyx, పుష్పకోశం, కవచం, ఒర, పొర, తొడిమ.

3. చూడండి, 18:53.

4. చూడండి,11:9.

ప్రభువు వద్దకు మరలింపబడినా! నిశ్చయంగా నాకు ఆయన దగ్గర మేలే ఉంటుంది." కాని మేము సత్యతిస్కారులకు వారు చేసిన కర్మలను గురించి వారికి తప్పక తెలుపుతాము మరియు వారికి భయంకరమైన శిక్షను రుచి చూపిస్తాము.

**51**. మరియు ఒకవేళ మేము మానవుణ్ణి అనుగ్రహిస్తే, అతడు మా నుండి విముఖుడై ప్రక్కకు మరలిపోతాడు మరియు ఒకవేళ తనకు ఆపదవస్తే సుదీర్ఘ మైన ప్రార్థనలు చేస్తాడు.

**52**. ఇలా అను: "ఏమీ? మీరు ఆలోచించారా? ఒకవేళ ఇది (ఈ ఖుర్ఆన్) అల్లాహ్ తరఫునుండి వచ్చిఉండి మీరు దానిని తిరస్కరిస్తే, దానిని వ్యతిరేకించటంలో చాలాదూరం పోయిన వానికంటే ఎక్కువ మార్గభ్రష్టుడెవడు?"

**53**. ఇక త్వరలోనే మేము వారికి మా సంకేతా (ఆయత్)లను, వారి చుట్టూ ఉన్న ఖగోళంలో[1] మరియు వారియందును చూపుతాము; చివరకు ఇదే (ఈ ఖుర్ఆనే) సత్యమని వారికి స్పష్టమవుతుంది. ఏమీ? నీ ప్రభువు! నిశ్చయంగా, ఆయనే ప్రతిదానికి సాక్షి, అనే విషయం చాలదా?

**54**. అదికాదు! నిశ్చయంగా, వారు తమ ప్రభువును కలుసుకునే విషయం పట్ల సందేహంలో పడివున్నారు. జాగ్రత్త! నిశ్చయంగా, ఆయన ప్రతిదానిని ఆవరించివున్నాడు.

*****

إِلَىٰ رَبِّيٓ إِنَّ لِي عِندَهُۥ لَلۡحُسۡنَىٰۚ فَلَنُنَبِّئَنَّ ٱلَّذِينَ كَفَرُواْ بِمَا عَمِلُواْ وَلَنُذِيقَنَّهُم مِّنۡ عَذَابٍ غَلِيظٖ ٥٠

وَإِذَآ أَنۡعَمۡنَا عَلَى ٱلۡإِنسَٰنِ أَعۡرَضَ وَنَـَٔا بِجَانِبِهِۦ وَإِذَا مَسَّهُ ٱلشَّرُّ فَذُو دُعَآءٍ عَرِيضٖ ٥١

قُلۡ أَرَءَيۡتُمۡ إِن كَانَ مِنۡ عِندِ ٱللَّهِ ثُمَّ كَفَرۡتُم بِهِۦ مَنۡ أَضَلُّ مِمَّنۡ هُوَ فِي شِقَاقِۢ بَعِيدٖ ٥٢

سَنُرِيهِمۡ ءَايَٰتِنَا فِي ٱلۡأٓفَاقِ وَفِيٓ أَنفُسِهِمۡ حَتَّىٰ يَتَبَيَّنَ لَهُمۡ أَنَّهُ ٱلۡحَقُّۗ أَوَلَمۡ يَكۡفِ بِرَبِّكَ أَنَّهُۥ عَلَىٰ كُلِّ شَيۡءٖ شَهِيدٌ ٥٣

أَلَآ إِنَّهُمۡ فِي مِرۡيَةٖ مِّن لِّقَآءِ رَبِّهِمۡۗ أَلَآ إِنَّهُۥ بِكُلِّ شَيۡءٖ مُّحِيطُۢ ٥٤

1. ఉదాహరణకు సూర్యచంద్రులు, రాత్రింబవళ్ళు, గాలివానలు మొదలైనవి.

## 42. సూరహ్ అష్-షూరా سُورَةُ الشُّورَىٰ

అష్-షూరా: సలహా. వ'హీ దివ్యజ్ఞాన అవతరణ సత్యమని ఈ సూరహ్ **మొదటి** మరియు చివరి ఆయతులలో విశదీకరించబడింది. ప్రవక్తలందరూ ఒకే ఒక్క సత్యప్రచారం చేశారు. అంటే అల్లాహ్ (సు.తా.) ఉన్నాడు. ఆయనే! ఒకే ఒక్క ఆరాధ్యుడు మరియు ప్రభువు. ఆయనను పోలినది విశ్వంలో ఏదీలేదు. ఆయనను దేనితోనూ పోల్చలేము. ఆయన వివరణకు అతీతుడు. ఆయన తన సృష్టిపై కారణ-పరిణామాల శాసనాన్ని విధించాడు. కావున మానవుడు ఈ జీవితంలో చేసిన దాని ఫలితాన్నే వచ్చే (పరలోక) జీవితంలో అనుభవిస్తాడు. దీనిపేరు **38**వ **ఆయత్** నుండి తీసుకోబడింది. ఈ అనుక్రమంలో ఇది మూడో సూరహ్. ఇది మక్కాలో అవతరింపజేయబడింది. ఇందులో **53 ఆయతులు** ఉన్నాయి.

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

C B A

**1.** 'హా-మీమ్.

حمٓ ﴿١﴾

**2.** 'ఐన్-సీన్-ఖాఫ్.

عٓسٓقٓ ﴿٢﴾

**3.** (ఓ ము'హమ్మద్!) సర్వ శక్తిమంతుడూ, మహా వివేకవంతుడూ అయిన అల్లాహ్, ఇదే విధంగా నీకూ మరియు నీ కంటే ముందు వచ్చిన వారికి కూడా దివ్యజ్ఞానం[1] (వ'హీ) అవతరింపజేశాడు.

كَذَٰلِكَ يُوحِىٓ إِلَيْكَ وَإِلَى ٱلَّذِينَ مِن قَبْلِكَ ٱللَّهُ ٱلْعَزِيزُ ٱلْحَكِيمُ ﴿٣﴾

---

**1.** ఏ విధంగానైతే దైవప్రవక్త ('స'అస)పై దివ్యజ్ఞానం అవతరింపజేయబడిందో, అదే విధంగా అతనికి ముందు వచ్చిన ప్రవక్తలపై కూడా అవతరింపజేయబడింది. దైవప్రవక్త ('స'అస)పై వ'హీ అవతరణను గురించి, ఒక 'స'హాబీ (ర'ది.'అ.), దైవప్రవక్త('స'అస)ను ప్రశ్నించగా ఇలా అన్నారు: ''కొన్ని సార్లు అది (వ'హీ) నా దగ్గరకు ఘంటల శబ్దంవలే వస్తుంది. ఇది చాలా కఠినతరమైనది. అది ఆగిన తరువాత నాకు అంతా కంఠస్తమైపోతుంది. కొన్నిసార్లు దైవదూత ('అ.స.) మానవరూపంలో వచ్చి నాకు చెబుతాడు. అతను చెప్పినదంతా నాకు జ్ఞాపకమైపోతుంది.'' 'ఆయిషహ్ (ర.'అన్హా) అన్నారు: ''నేను విపరీతమైన చలికాలంలో కూడా, వ'హీ అవతరణ ముగిసిన తరువాత, దైవప్రవక్త ('స'అస)ను చెమటలో మునిగిపోవటాన్ని చూశాను. మరియు అతని నుదుటి నుండి చెమట బిందువులు కారటం కూడా చూశాను.'' ('స'హీ'హ్ బు'ఖారీ).

لَهُۥ مَا فِي ٱلسَّمَٰوَٰتِ وَمَا فِي ٱلْأَرْضِۖ وَهُوَ ٱلْعَلِيُّ ٱلْعَظِيمُ ﴿٤﴾

**4**. ఆకాశాలలో మరియు భూమిలో ఉన్నదంతా ఆయనకు చెందినదే. ఆయన మహోన్నతుడు, సర్వోత్తముడు.

تَكَادُ ٱلسَّمَٰوَٰتُ يَتَفَطَّرْنَ مِن فَوْقِهِنَّۚ وَٱلْمَلَٰٓئِكَةُ يُسَبِّحُونَ بِحَمْدِ رَبِّهِمْ وَيَسْتَغْفِرُونَ لِمَن فِي ٱلْأَرْضِۗ أَلَآ إِنَّ ٱللَّهَ هُوَ ٱلْغَفُورُ ٱلرَّحِيمُ ﴿٥﴾

**5**. ఆకాశాలు, పైనుండి దాదాపు ప్రేలిపోనున్నాయి. మరియు దేవదూతలు తమ ప్రభువు పవిత్రతను కొనియాడుతూ, ఆయనను స్తుతిస్తూ ఉన్నారు మరియు భూమిలో ఉన్నవారి కొరకు క్షమాపణ కోరుతున్నారు. చూడండి, నిశ్చయంగా అల్లాహ్! ఆయనే క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత.

وَٱلَّذِينَ ٱتَّخَذُواْ مِن دُونِهِۦٓ أَوْلِيَآءَ ٱللَّهُ حَفِيظٌ عَلَيْهِمْ وَمَآ أَنتَ عَلَيْهِم بِوَكِيلٍ ﴿٦﴾

**6**. మరియు ఎవరైతే ఆయనను వదలి ఇతరులను తమ సంరక్షకులుగా చేసుకుంటారో, వారిని అల్లాహ్ కనిపెట్టుకొని ఉన్నాడు. మరియు నీవు వారికి బాధ్యుడవు కావు.[1]

وَكَذَٰلِكَ أَوْحَيْنَآ إِلَيْكَ قُرْءَانًا عَرَبِيًّا لِّتُنذِرَ أُمَّ ٱلْقُرَىٰ وَمَنْ حَوْلَهَا وَتُنذِرَ يَوْمَ ٱلْجَمْعِ لَا رَيْبَ فِيهِۚ فَرِيقٌ فِي ٱلْجَنَّةِ وَفَرِيقٌ فِي ٱلسَّعِيرِ ﴿٧﴾

**7**. మరియు ఈ విధంగా మేము నీ పై ఈ ఖుర్ఆన్‌ను, 'అరబ్బీభాషలో, దివ్యజ్ఞానం (వ'హీ) ద్వారా అవతరింపజేశాము.[2] దానితో నీవు ఉమ్ముల్-ఖురా (మక్కా)[3] మరియు దాని చుట్టుప్రక్కల వారిని హెచ్చరించటానికి మరియు - దానిని గురించి ఎలాంటి సందేహంలేని - ఆ సమావేశదినాన్ని గురించి హెచ్చరించేందుకు కూడా.[4] (ఆ రోజు) ఒక వర్గం వారు స్వర్గానికి పోతారు, మరొక వర్గం వారు మండే నరకాగ్నిలోకి పోతారు.

---

**1**. నీ బాధ్యత కేవలం మా సందేశాన్ని వారికి అందజేయటమే!

**2**. చూడండి,14:4,13:37,19:97 ప్రతిప్రవక్త('అ.స.) తనకాలపు ప్రజలభాషనే మాట్లాడే వాడు.

**3**. ఉమ్ముల్ ఖురా: అంటే అన్ని నగరాల తల్లి. మక్కా యొక్క మరొక పేరు. ఇది అతి ప్రాచీన నగరం. చూడండి, 6:92.

**4**. పునరుత్థానదినం: సమావేశదినం ఎందుకు అనబడిందంటే, ఆ రోజు అన్ని తరాలకు చెందిన మానవులు మంచివారు, చెడ్డవారు, విశ్వాసులు, అవిశ్వాసులు అందరూ సమావేశపరచబడతారు.

وَلَوْ شَآءَ ٱللَّهُ لَجَعَلَهُمْ أُمَّةً وَٰحِدَةً وَلَٰكِن يُدْخِلُ مَن يَشَآءُ فِى رَحْمَتِهِۦ ۚ وَٱلظَّٰلِمُونَ مَا لَهُم مِّن وَلِىٍّ وَلَا نَصِيرٍ ﴿٨﴾

**8**. మరియు ఒకవేళ అల్లాహ్ కోరితే వారందరినీ ఒకే సమాజంగా చేసిఉండే వాడు![1] కాని ఆయన తానుకోరిన వారిని తన కరుణకు పాత్రులుగా చేసుకుంటాడు.[2] మరియు దుర్మార్గుల కొరకు, రక్షించేవాడు గానీ సహాయపడేవాడు గానీ ఎవ్వడూ ఉండడు.

أَمِ ٱتَّخَذُوا۟ مِن دُونِهِۦٓ أَوْلِيَآءَ ۖ فَٱللَّهُ هُوَ ٱلْوَلِىُّ وَهُوَ يُحْىِ ٱلْمَوْتَىٰ وَهُوَ عَلَىٰ كُلِّ شَىْءٍ قَدِيرٌ ﴿٩﴾

**9**. లేక, వారు ఆయనను వదలి ఇతరులను సంరక్షకులుగా చేసుకున్నారా? కానీ అల్లాహ్! కేవలం ఆయనే సంరక్షకుడు మరియు ఆయనే మృతులను బ్రతికించేవాడు మరియు ఆయనే ప్రతిదీ చేయగల సమర్థుడు.

وَمَا ٱخْتَلَفْتُمْ فِيهِ مِن شَىْءٍ فَحُكْمُهُۥٓ إِلَى ٱللَّهِ ۚ ذَٰلِكُمُ ٱللَّهُ رَبِّى عَلَيْهِ تَوَكَّلْتُ وَإِلَيْهِ أُنِيبُ ﴿١٠﴾

**10**. మరియు మీరు ఏ విషయాన్ని గురించి భేదాభిప్రాయాలు కలిగివున్నారో, దాని తీర్పు అల్లాహ్ వద్దనే ఉంది.[3] ఆయనే అల్లాహ్! నా ప్రభువు, నేను ఆయననే నమ్ముకున్నాను మరియు నేను పశ్చాత్తాపంతో ఆయన వైపునకే మరలుతాను.

فَاطِرُ ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضِ ۚ جَعَلَ لَكُم مِّنْ أَنفُسِكُمْ أَزْوَٰجًا وَمِنَ ٱلْأَنْعَٰمِ أَزْوَٰجًا ۖ يَذْرَؤُكُمْ فِيهِ ۚ لَيْسَ كَمِثْلِهِۦ شَىْءٌ ۖ وَهُوَ ٱلسَّمِيعُ ٱلْبَصِيرُ ﴿١١﴾

**11**. ఆయనే ఆకాశాలు మరియు భూమి యొక్క సృష్టికి మూలాధారి. ఆయన మీలోనుండే మీ కొరకు జంటల్ని మరియు పశువులలో కూడా జంటల్ని చేశాడు.[4] ఈ విధంగా, ఆయన మిమ్మల్ని వ్యాపింపజేస్తున్నాడు. ఆయనకు పోలింది ఏదీలేదు.[5] మరియు ఆయన సర్వం వినేవాడు, సర్వం చూసేవాడు.

---

**1**. చూడండి, 5:48, 16:93, 10:19.
**2**. చూడండి, 14:4 మరియు 22:16.
**3**. చూడండి, 5:101.
**4**. చూడండి, 16:72.
**5**. అల్లాహ్ (సు.తా.)తో పోల్చదగినది విశ్వంలో ఏదీ లేదు. చూడండి, 6:100,112:4.

لَهُۥ مَقَالِيدُ ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضِۖ يَبْسُطُ ٱلرِّزْقَ لِمَن يَشَآءُ وَيَقْدِرُۚ إِنَّهُۥ بِكُلِّ شَىْءٍ عَلِيمٌ ﴿١٢﴾

**12**. ఆకాశాల యొక్క మరియు భూమి యొక్క తాళపుచెవులు ఆయనవద్దనే వున్నాయి. ఆయన తాను కోరినవానికి జీవనోపాధిని పుష్కలంగా ప్రసాదిస్తాడు మరియు (తాను కోరినవానికి) దానిని మితంగా ఇస్తాడు. నిశ్చయంగా, ఆయనకు ప్రతిదానిని గురించి బాగా తెలుసు. (1/8)

۞ شَرَعَ لَكُم مِّنَ ٱلدِّينِ مَا وَصَّىٰ بِهِۦ نُوحًا وَٱلَّذِىٓ أَوْحَيْنَآ إِلَيْكَ وَمَا وَصَّيْنَا بِهِۦٓ إِبْرَٰهِيمَ وَمُوسَىٰ وَعِيسَىٰٓۖ أَنْ أَقِيمُوا۟ ٱلدِّينَ وَلَا تَتَفَرَّقُوا۟ فِيهِۚ كَبُرَ عَلَى ٱلْمُشْرِكِينَ مَا تَدْعُوهُمْ إِلَيْهِۚ ٱللَّهُ يَجْتَبِىٓ إِلَيْهِ مَن يَشَآءُ وَيَهْدِىٓ إِلَيْهِ مَن يُنِيبُ ﴿١٣﴾

**13**. * ఆయన, నూ'హ్‌కు విధించిన (ఇస్లాం) ధర్మాన్నే, మీ కొరకు శాసించాడు మరియు దానినే (ఓ ము'హమ్మద్!) మేము నీకు దివ్యజ్ఞానం (వ'హీ) ద్వారా అవతరింపజేశాము మరియు మేము దానినే ఇబ్రాహీమ్, మూసా మరియు 'ఈసాలకు కూడా విధిగా జేశాము. ఈ ధర్మాన్నే స్థాపించాలని[1] మరియు దానిని గురించి భేదాభిప్రాయాలకు గురికాకుండా ఉండాలని. నీవు దాని వైపునకు పిలిచేది బహుదైవారాధకులకు ఎంతో సహింపలేనిదిగా ఉంది. అల్లాహ్ తాను కోరిన వానిని తన వైపునకు ఆకర్షిస్తాడు మరియు పశ్చాత్తాపంతో తనవైపునకు మరలేవానికి మార్గదర్శకత్వం చేస్తాడు.[2]

---

**1**. అద్దీను: ధర్మం అంటే అల్లాహ్(సు.తా.)ను విశ్వసించి ఆయన అద్వితీయాన్ని నమ్మి, ఆయన ప్రవక్తలను అనుసరించి, ఆయన షరీయత్‌పై నడవటం. ప్రవక్తలందరి ధర్మం ఇదే! చూడండి, 2:213. కాని వారి షరీయత్‌లలో కొన్ని భేదాలుండవచ్చు. (చూడండి, 5:48) అందుకే దైవప్రవక్త ('స'అస) అన్నారు: 'మేము (ప్రవక్తలం) అంతా సోదరులం. మా అందరి ధర్మం ఒక్కటే ఇస్లాం!' ('స'హీ'హ్ బు'ఖారీ).

**2**. అల్లాహ్ (సు.తా.), అతనికే మార్గదర్శకత్వం చేస్తాడు, ఎవడైతే స్వయంగా, అల్లాహ్ (సు.తా.) వైపునకు మరలుతాడో! ఇక ఎవడైతే మార్గభ్రష్టత్వాన్ని ఎన్నుకుంటాడో, ఆయన, అతనిని దానిలో వదలుతాడు. అల్లాహ్ (సు.తా.) దృష్టిలో, ఆయనకు విధేయత (ఇస్లాం) మాత్రమే నిజమైన ధర్మం. చూడండి, 3:19, 3:85, 21:92 మరియు 23:52.

وَمَا تَفَرَّقُوٓاْ إِلَّا مِنۢ بَعۡدِ مَا جَآءَهُمُ ٱلۡعِلۡمُ بَغۡيَۢا بَيۡنَهُمۡۚ وَلَوۡلَا كَلِمَةٞ سَبَقَتۡ مِن رَّبِّكَ إِلَىٰٓ أَجَلٖ مُّسَمّٗى لَّقُضِيَ بَيۡنَهُمۡۚ وَإِنَّ ٱلَّذِينَ أُورِثُواْ ٱلۡكِتَٰبَ مِنۢ بَعۡدِهِمۡ لَفِي شَكّٖ مِّنۡهُ مُرِيبٖ ﴿١٤﴾

**14**. మరియు వారి వద్దకు (సత్య) జ్ఞానం వచ్చిన తరువాతనే - వారి పరస్పర ద్వేషంవల్ల - వారి మధ్య భేదాభిప్రాయాలు వచ్చాయి. మరియు ఒక నిర్ణీతకాలపు వాగ్దానం నీ ప్రభువు తరఫునుండి చేయబడి ఉండకపోతే, వారి మధ్య తీర్పు ఎప్పుడో జరిగిఉండేది.[1] మరియు నిశ్చయంగా, వారి తర్వాత గ్రంథాన్ని వారసత్వంలో పొందిన వారు దానిని (ఇస్లాంను) గురించి గొప్ప సంశయంలో పడివున్నారు.

فَلِذَٰلِكَ فَٱدۡعُۖ وَٱسۡتَقِمۡ كَمَآ أُمِرۡتَۖ وَلَا تَتَّبِعۡ أَهۡوَآءَهُمۡۖ وَقُلۡ ءَامَنتُ بِمَآ أَنزَلَ ٱللَّهُ مِن كِتَٰبٖۖ وَأُمِرۡتُ لِأَعۡدِلَ بَيۡنَكُمُۖ ٱللَّهُ رَبُّنَا وَرَبُّكُمۡۖ لَنَآ أَعۡمَٰلُنَا وَلَكُمۡ أَعۡمَٰلُكُمۡۖ لَا حُجَّةَ بَيۡنَنَا وَبَيۡنَكُمُۖ ٱللَّهُ يَجۡمَعُ بَيۡنَنَاۖ وَإِلَيۡهِ ٱلۡمَصِيرُ ﴿١٥﴾

**15**. కావున నీవు (ఓ ము'హమ్మద్!) దీని (ఈ సత్యధర్మం) వైపునకే వారిని పిలువు. మరియు నీకు ఆజ్ఞాపించబడిన విధంగా దానిపై స్థిరంగా ఉండు. మరియు వారి కోరికలను అనుసరించకు. మరియు వారితో ఇలా అను: "అల్లాహ్ అవతరింపజేసిన గ్రంథాన్నే నేను విశ్వసించాను. మరియు మీ మధ్య న్యాయం చేయుమని నేను ఆజ్ఞాపించబడ్డాను. అల్లాహ్ యే మా ప్రభువు! మరియు మీ ప్రభువు కూడాను, మా కర్మలు మాకూ మరియు మీ కర్మలు మీకూ. మా మధ్య మరియు మీ మధ్య ఎలాంటి వివాదం ఉండనవసరం లేదు. అల్లాహ్ మనందరినీ సమావేశపరుస్తాడు. మరియు ఆయనవైపే (మనందరి) గమ్యస్థానముంది."

---

1. చూడండి, 10:19.

16. మరియు అల్లాహ్ సందేశం స్వీకరించిన తర్వాత, (స్వీకరించిన వారితో) ఆయనను గురించి ఎవరు వాదిస్తారో, వారి వాదం వారి ప్రభువు సన్నిధిలో నిరర్థకమైనది మరియు వారిపై ఆయన (అల్లాహ్) ఆగ్రహం విరుచుకుపడుతుంది మరియు వారికి కఠినశిక్ష పడుతుంది.

وَٱلَّذِينَ يُحَآجُّونَ فِي ٱللَّهِ مِنۢ بَعۡدِ مَا ٱسۡتُجِيبَ لَهُۥ حُجَّتُهُمۡ دَاحِضَةٌ عِندَ رَبِّهِمۡ وَعَلَيۡهِمۡ غَضَبٞ وَلَهُمۡ عَذَابٞ شَدِيدٌ ١٦

17. అల్లాహ్‌యే సత్యంతో గ్రంథాన్ని[1] మరియు (న్యాయానికి) త్రాసును[2] అవతరింపజేశాడు. మరి నీవు ఏవిధంగా గ్రహించగలవు. బహుశా తీర్పుగడియ సమీపంలోనే ఉండవచ్చు!

ٱللَّهُ ٱلَّذِيٓ أَنزَلَ ٱلۡكِتَٰبَ بِٱلۡحَقِّ وَٱلۡمِيزَانَۗ وَمَا يُدۡرِيكَ لَعَلَّ ٱلسَّاعَةَ قَرِيبٞ ١٧

18. దానిని నమ్మని వారే దానికొరకు తొందరపెడతారు. మరియు విశ్వసించిన వారు, దానిని గురించి భయపడతారు మరియు అది రావటం నిశ్చయంగా, సత్యమేనని తెలుసుకుంటారు. వినండి నిశ్చయంగా, ఎవరైతే తీర్పుఘడియను గురించి వాదులాడుతారో, వారు మార్గభ్రష్టత్వంలో చాలా దూరం పోయిన వారే!

يَسۡتَعۡجِلُ بِهَا ٱلَّذِينَ لَا يُؤۡمِنُونَ بِهَاۖ وَٱلَّذِينَ ءَامَنُواْ مُشۡفِقُونَ مِنۡهَا وَيَعۡلَمُونَ أَنَّهَا ٱلۡحَقُّۗ أَلَآ إِنَّ ٱلَّذِينَ يُمَارُونَ فِي ٱلسَّاعَةِ لَفِي ضَلَٰلِۭ بَعِيدٍ ١٨

19. అల్లాహ్ తన దాసులపట్ల ఎంతో మృదుహృదయుడు; ఆయన తానుకోరిన వారికి జీవనోపాధిని ప్రసాదిస్తాడు. మరియు ఆయన మహాబలవంతుడు, సర్వశక్తి సంపన్నుడు.

ٱللَّهُ لَطِيفُۢ بِعِبَادِهِۦ يَرۡزُقُ مَن يَشَآءُۖ وَهُوَ ٱلۡقَوِيُّ ٱلۡعَزِيزُ ١٩

---

1. గ్రంథం అంటే ఇక్కడ అన్నీ దివ్యగ్రంథాలు.
2. త్రాసు ఎందుకు పేర్కొనబడిందంటే, న్యాయంగా తూచటానికి త్రాసు మాత్రమే ఉపయోగపడుతుంది. దీనికై చూడండి, 57:25 మరియు 55:7-9.

مَن كَانَ يُرِيدُ حَرْثَ ٱلْأَخِرَةِ نَزِدْ لَهُۥ فِى حَرْثِهِۦ ۖ وَمَن كَانَ يُرِيدُ حَرْثَ ٱلدُّنْيَا نُؤْتِهِۦ مِنْهَا وَمَا لَهُۥ فِى ٱلْأَخِرَةِ مِن نَّصِيبٍ ﴿٢٠﴾

**20**. ఎవడు పరలోక ఫలాన్ని కోరుకుంటాడో, మేము అతనికి అతని ఫలంలో వృద్ధి కలిగిస్తాము.[1] మరియు ఎవడైతే ఇహలోక ఫలాన్ని కోరుకుంటాడో, మేము అతనికి దాని నొసంగుతాము మరియు అతనికి పరలోక (ప్రతిఫలంలో) ఎలాంటి భాగముండదు.[2]

أَمْ لَهُمْ شُرَكَٰٓؤُاْ شَرَعُواْ لَهُم مِّنَ ٱلدِّينِ مَا لَمْ يَأْذَنۢ بِهِ ٱللَّهُ ۚ وَلَوْلَا كَلِمَةُ ٱلْفَصْلِ لَقُضِىَ بَيْنَهُمْ ۗ وَإِنَّ ٱلظَّٰلِمِينَ لَهُمْ عَذَابٌ أَلِيمٌ ﴿٢١﴾

**21**. ఏమీ? అల్లాహ్ అనుమతించని ధర్మాన్ని వారికొరకు విధించగల, ఆయన భాగస్వాములు ఎవరైనా వారిదగ్గర ఉన్నారా? ఒకవేళ తీర్పుదినపు వాగ్దానం ముందే చేయబడి ఉండకపోతే, వారి మధ్య తీర్పు ఎప్పుడో జరిగివుండేదే. మరియు నిశ్చయంగా, ఈ దుర్మార్గులకు బాధాకరమైన శిక్ష పడుతుంది.

تَرَى ٱلظَّٰلِمِينَ مُشْفِقِينَ مِمَّا كَسَبُواْ وَهُوَ وَاقِعٌۢ بِهِمْ ۗ وَٱلَّذِينَ ءَامَنُواْ وَعَمِلُواْ ٱلصَّٰلِحَٰتِ فِى رَوْضَاتِ ٱلْجَنَّاتِ ۖ لَهُم مَّا يَشَآءُونَ عِندَ رَبِّهِمْ ۚ ذَٰلِكَ هُوَ ٱلْفَضْلُ ٱلْكَبِيرُ ﴿٢٢﴾

**22**. ఈ దుర్మార్గులు (పునరుత్థాన దినాన) తాము చేసిన కర్మల ఫలితాన్ని చూసి భయపడటాన్ని, నీవు చూస్తావు మరియు అది వారిపై తప్పక పడుతుంది. మరియు ఎవరైతే విశ్వసించి, సత్కార్యాలు చేస్తారో, వారు స్వర్గపు పచ్చిక మైదానాలలో ఉంటారు. వారికి తాము కోరేదంతా తమ ప్రభువు తరఫునుండి లభిస్తుంది. అదే ఆ గొప్ప అనుగ్రహం.

ذَٰلِكَ ٱلَّذِى يُبَشِّرُ ٱللَّهُ عِبَادَهُ ٱلَّذِينَ ءَامَنُواْ وَعَمِلُواْ ٱلصَّٰلِحَٰتِ ۗ

**23**. ఆ (స్వర్గపు) శుభవార్తనే, అల్లాహ్ విశ్వసించి సత్కార్యాలు చేసే తన దాసులకు తెలియజేస్తున్నాడు. (ఓ ప్రవక్తా!) వారితో ఇలా అను: "నేను దీనికి

---

**1**. పుణ్యఫలితంలో ఈ అధికం, అల్లాహ్ (సు.తా.) కోరితే పదిరెట్లు లేక ఏడు వందల రెట్లు లేక ఇంకా ఎక్కువ రెట్లు కావచ్చు.
**2**. ఇటువంటి ఆయత్‌కు చూడండి, 17:18.

قُل لَّآ أَسۡـَٔلُكُمۡ عَلَيۡهِ أَجۡرًا إِلَّا ٱلۡمَوَدَّةَ فِي ٱلۡقُرۡبَىٰۗ وَمَن يَقۡتَرِفۡ حَسَنَةً نَّزِدۡ لَهُۥ فِيهَا حُسۡنًاۚ إِنَّ ٱللَّهَ غَفُورٞ شَكُورٌ ﴿٢٣﴾

బదులుగా మీ నుండి బంధుత్వ ప్రేమ తప్ప వేరే ప్రతిఫలాన్ని కోరడం లేదు!"[1] మరియు ఎవడు మంచిని సంపాదించుకుంటాడో, అతనికి దానిలో మేము మరింత మంచిని పెంచుతాము. నిశ్చయంగా, అల్లాహ్ క్షమాశీలుడు, కృతజ్ఞతలను ఆమోదించేవాడు.

أَمۡ يَقُولُونَ ٱفۡتَرَىٰ عَلَى ٱللَّهِ كَذِبٗاۖ فَإِن يَشَإِ ٱللَّهُ يَخۡتِمۡ عَلَىٰ قَلۡبِكَۗ وَيَمۡحُ ٱللَّهُ ٱلۡبَٰطِلَ وَيُحِقُّ ٱلۡحَقَّ بِكَلِمَٰتِهِۦٓۚ إِنَّهُۥ عَلِيمُۢ بِذَاتِ ٱلصُّدُورِ ﴿٢٤﴾

**24.** ఏమీ? వారు: "అతను (ముహమ్మద్!) అల్లాహ్ పేరుతో అసత్యాలు కల్పిస్తున్నాడు." అని అంటున్నారా? కాని ఒకవేళ అల్లాహ్ తలచుకుంటే, నీ హృదయం మీద ముద్ర వేసేవాడు. మరియు అల్లాహ్ అసత్యాన్ని రూపుమాపి, తన ఆజ్ఞతో సత్యాన్ని స్థాపిస్తాడు.[2] నిశ్చయంగా, ఆయనకు హృదయాలలో ఉన్నదంతా బాగా తెలుసు.

---

**1.** మక్కా ముష్రిక్ ఖురైషులు చాలామంది దైవప్రవక్త ('స'అస) దగ్గరి సంబంధీకులే. ఇక్కడ దైవప్రవక్త ('స'అస) వారితో: 'స్నేహ, ప్రేమభావాలు చూపకున్నా - తాను, అల్లాహ్ (సు.తా.) ధర్మం ఇస్లాంను ప్రచారం చేస్తున్నందుకు - కనీసం శత్రుత్వమైనా వహించకండి.' అని చెప్పమని అల్లాహ్ (సు.తా.) ఆదేశిస్తున్నాడు.
మరొక ముఖ్య విషయం ఇక్కడ షియా తెగవారు భిన్నంగా అర్థంచేసుకొని దానిని ప్రచారం చేస్తున్నది: ఇక్కడ బంధుత్వ ప్రేమను వారు, 'అలీ, ఫాతిమా, 'హసన్ మరియు 'హుసైన్ ర'ది.'అన్హుమ్‌లతో మాత్రమే, ప్రేమతో వ్యవహరించడం, అని అర్థం తీశారు. ఈ సూరహ్ మక్కాలో అవతరింపజేయబడింది. అప్పుడు 'అలీ మరియు ఫాతిమా (ర'ది.'అన్హుమ్)ల, వివాహం కూడా కాలేదు. మరొక విషయమేమిటంటే దైవప్రవక్త ('స'అస)కు నలుగురు కుమార్తెలు, 'జైనబ్, రుఖయ్యా, ఉమ్మె కుల్సూ'మ్, ఫాతిమ మరియు ముగ్గురు కుమారులు, ఖాసిమ్, 'అబ్దుల్లాహ్ మరియు ఇబ్రాహీమ్ (రజి.అన్హుమ్). కుమారులందరూ చిన్న వయస్సులలోనే చనిపోయారు. కాని ఇతర ముగ్గురు కుమార్తెలు (ర'ది.'అన్హుమ్) భర్తా, పిల్లలు గలవారు. వారు కూడా దైవప్రవక్త ('స'అస) యొక్క దగ్గరి సంబంధీకు(ఖురబా)లలోని వారే కదా! వారిలో ఇద్దరు మూడవ 'ఖలీఫా 'ఉస్మాన్ (ర'ది.'అ.) భార్యలు కూడాను. కాని ఈ షియా తెగవారు, వారిని దైవప్రవక్త ('స'అస) దగ్గరి సంబంధీకులలో పరిగణించకపోవడం అతిశయం కాదా!

**2.** చూడండి, 10:82.

وَهُوَ ٱلَّذِى يَقْبَلُ ٱلتَّوْبَةَ عَنْ عِبَادِهِۦ وَيَعْفُوا۟ عَنِ ٱلسَّيِّـَٔاتِ وَيَعْلَمُ مَا تَفْعَلُونَ ﴿٢٥﴾

وَيَسْتَجِيبُ ٱلَّذِينَ ءَامَنُوا۟ وَعَمِلُوا۟ ٱلصَّٰلِحَٰتِ وَيَزِيدُهُم مِّن فَضْلِهِۦ ۚ وَٱلْكَٰفِرُونَ لَهُمْ عَذَابٌ شَدِيدٌ ﴿٢٦﴾

۞ وَلَوْ بَسَطَ ٱللَّهُ ٱلرِّزْقَ لِعِبَادِهِۦ لَبَغَوْا۟ فِى ٱلْأَرْضِ وَلَٰكِن يُنَزِّلُ بِقَدَرٍ مَّا يَشَآءُ ۚ إِنَّهُۥ بِعِبَادِهِۦ خَبِيرٌۢ بَصِيرٌ ﴿٢٧﴾

وَهُوَ ٱلَّذِى يُنَزِّلُ ٱلْغَيْثَ مِنۢ بَعْدِ مَا قَنَطُوا۟ وَيَنشُرُ رَحْمَتَهُۥ ۚ وَهُوَ ٱلْوَلِىُّ ٱلْحَمِيدُ ﴿٢٨﴾

وَمِنْ ءَايَٰتِهِۦ خَلْقُ ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضِ وَمَا بَثَّ فِيهِمَا مِن دَآبَّةٍ ۚ وَهُوَ عَلَىٰ جَمْعِهِمْ إِذَا يَشَآءُ قَدِيرٌ ﴿٢٩﴾

**25.** ఆయనే తనదాసుల పశ్చాత్తాపాన్ని స్వీకరించేవాడు. మరియు పాపాలను మన్నించేవాడు. మరియు మీరు చేసేదంతా ఆయనకు బాగా తెలుసు.

**26.** మరియు ఆయన విశ్వసించి, సత్కార్యాలు చేసేవారి ప్రార్థనలను అంగీకరిస్తాడు మరియు వారిపై తన అనుగ్రహాన్ని మరింత అధికంచేస్తాడు. ఇక సత్యతిరస్కారులు! వారికి కఠినశిక్ష పడుతుంది. (1/4)

**27.** * మరియు ఒకవేళ అల్లాహ్ తన దాసులందరికీ పుష్కలంగా జీవనోపాధిని ప్రసాదించి ఉంటే, వారు భూమిలో తిరుగుబాటుకు పాల్పడేవారు. కావున ఆయన తన ఇష్టప్రకారం, మితంగా ఇస్తాడు. నిశ్చయంగా ఆయన తన దాసులను గురించి బాగా ఎరుగును, ఆయన అంతా చూస్తున్నాడు!

**28.** మరియు ఆయనే, వారు నిరాశకులోనై ఉన్నప్పుడు వర్షాన్ని కురిపిస్తాడు మరియు తన కారుణ్యాన్ని వ్యాపింపజేస్తాడు. మరియు ఆయనే సంరక్షకుడు, ప్రశంసనీయుడు.

**29.** మరియు ఆయన సూచన (ఆయాత్)లలో, ఆకాశాలను మరియు భూమిని మరియు వాటిలో వ్యాపింపజేసిన జీవరాసులను సృష్టించటం కూడా ఉంది. మరియు ఆయన తాను కోరినప్పుడు వాటి నన్నింటినీ సమీకరించగల సమర్థుడు.

وَمَآ أَصَٰبَكُم مِّن مُّصِيبَةٖ فَبِمَا كَسَبَتۡ أَيۡدِيكُمۡ وَيَعۡفُواْ عَن كَثِيرٖ ﴿٣٠﴾

**30**. మీ పై ఏ ఆపద వచ్చినా, అది మీ చేతులారా మీరు సంపాదించుకున్నదే! మరియు ఆయన (మీ తప్పులను) ఎన్నింటినో క్షమిస్తాడు.[1]

وَمَآ أَنتُم بِمُعۡجِزِينَ فِي ٱلۡأَرۡضِۖ وَمَا لَكُم مِّن دُونِ ٱللَّهِ مِن وَلِيّٖ وَلَا نَصِيرٖ ﴿٣١﴾

**31**. మరియు మీరు భూమిలో ఆయన నుంచి తప్పించుకోలేరు. మరియు మీకు అల్లాహ్ తప్ప మరొక సంరక్షకుడు గానీ, సహాయకుడు గానీ లేడు!

وَمِنۡ ءَايَٰتِهِ ٱلۡجَوَارِ فِي ٱلۡبَحۡرِ كَٱلۡأَعۡلَٰمِ ﴿٣٢﴾

**32**. మరియు ఆయన సూచన (ఆయాత్)లలో సముద్రంలో కొండల మాదిరిగా పయనించే ఓడలు కూడా వున్నాయి.

إِن يَشَأۡ يُسۡكِنِ ٱلرِّيحَ فَيَظۡلَلۡنَ رَوَاكِدَ عَلَىٰ ظَهۡرِهِۦٓۚ إِنَّ فِي ذَٰلِكَ لَأٓيَٰتٖ لِّكُلِّ صَبَّارٖ شَكُورٍ ﴿٣٣﴾

**33**. ఒకవేళ ఆయన కోరితే గాలిని ఆపగలడు అప్పుడవి దాని (సముద్రపు) వీపు మీద నిలిచిపోతాయి. నిశ్చయంగా, ఇందులో సహనం గలవానికి, కృతజ్ఞునికి ఎన్నో సూచనలున్నాయి.

أَوۡ يُوبِقۡهُنَّ بِمَا كَسَبُواْ وَيَعۡفُ عَن كَثِيرٖ ﴿٣٤﴾

**34**. లేదా ఆయన వారి కర్మల ఫలితంగా వారిని (ముంచి) నాశనం చేయవచ్చు, కాని ఆయన ఎన్నింటినో క్షమిస్తాడు కూడాను.

وَيَعۡلَمَ ٱلَّذِينَ يُجَٰدِلُونَ فِيٓ ءَايَٰتِنَا مَا لَهُم مِّن مَّحِيصٖ ﴿٣٥﴾

**35**. మరియు మా సూచనలను (ఆయత్‌లను) గురించి వాదులాడేవారు, తమకు తప్పించుకునే చోటు లేదని తెలుసుకుంటారు.[2]

---

**1**. చూడండి, 51:52-53. వ్యాఖ్యాతలు దీనిని రెండు విధాలుగా అర్థం చేసుకున్నారు.
**ఒకటి:** పూర్వప్రజలు తమ ప్రవక్త('అలైహిమ్ స.)లతో ఇతను పిచ్చివాడు, మాంత్రికుడు, అసత్యవాదుడు, వగైరా అన్న మాటలనే ఈ మక్కా ముష్రికులు కూడా నీతో అంటున్నారు. ఈ విధంగా దైవప్రవక్త ('స'అస) ఓదార్చబడుతున్నారు.
**రెండో అర్థం:** దైవప్రవక్త('స'అస)తో ఏకాగ్రచిత్తం, ఏక దైవారాధన, (ఇస్లాం) గురించి చెప్పబడిన మాటలు, ఇంతకు ముందు ప్రవక్తలందరితో చెప్పబడిన మాటలే! (ఫ'త్హ్ అల్-ఖదీర్).

**2**. చూడండి, 40:35.

فَمَآ أُوتِيتُم مِّن شَيۡءٖ فَمَتَٰعُ ٱلۡحَيَوٰةِ ٱلدُّنۡيَاۖ وَمَا عِندَ ٱللَّهِ خَيۡرٞ وَأَبۡقَىٰ لِلَّذِينَ ءَامَنُواْ وَعَلَىٰ رَبِّهِمۡ يَتَوَكَّلُونَ ٣٦

**36**. కావున మీకు ఇవ్వబడిందంతా ప్రాపంచిక జీవితపు సుఖసంతోషమే. కనుక అల్లాహ్ వద్దనున్నదే - విశ్వసించి తమ ప్రభువునే నమ్ముకున్న వారికొరకు - ఉత్తమమైనదీ మరియు శాశ్వతమైనదీను.[1]

وَٱلَّذِينَ يَجۡتَنِبُونَ كَبَٰٓئِرَ ٱلۡإِثۡمِ وَٱلۡفَوَٰحِشَ وَإِذَا مَا غَضِبُواْ هُمۡ يَغۡفِرُونَ ٣٧

**37**. మరియు అలాంటి వారు పెద్ద పాపాలు మరియు అశ్లీలమైన పనులకు దూరంగా ఉంటారు మరియు కోపం వచ్చినా క్షమిస్తారు;[2]

وَٱلَّذِينَ ٱسۡتَجَابُواْ لِرَبِّهِمۡ وَأَقَامُواْ ٱلصَّلَوٰةَ وَأَمۡرُهُمۡ شُورَىٰ بَيۡنَهُمۡ وَمِمَّا رَزَقۡنَٰهُمۡ يُنفِقُونَ ٣٨

**38**. మరియు అలాంటి వారు తమ ప్రభువు ఆజ్ఞాపాలన చేస్తారు మరియు నమా'జ్ను స్థాపిస్తారు[3] మరియు తమ వ్యవహారాలను పరస్పర సంప్రదింపుల ద్వారా పరిష్కరించుకుంటారు[4] మరియు మేము వారికి ప్రసాదించిన జీవనోపాధి నుండి ఇతరుల మీద ఖర్చుచేస్తారు;

وَٱلَّذِينَ إِذَآ أَصَابَهُمُ ٱلۡبَغۡيُ هُمۡ يَنتَصِرُونَ ٣٩

**39**. మరియు అలాంటి వారు తమపై దౌర్జన్యం జరిగినపుడు దానికి న్యాయప్రతీకారం మాత్రమే చేస్తారు.[5]

---

**1**. కావున ఇహలోక జీవిత సుఖసంతోషాలకు ఎక్కువ ప్రాధాన్యత నివ్వకుండా, విశ్వసించి సత్కార్యాలు చేయటంలో పోటీపడండి.

**2**. దైవప్రవక్త ('స'అస) తన స్వంతానికి జరిగిన కష్ట నష్టాలకూ, హానికీ ఎన్నడూ ప్రతీకారం తీసుకోలేదు. కాని అల్లహ్ (సు.తా.) యొక్క హద్దులను అతిక్రమించటం అతనికి సహించరాని విషయం, (బు'ఖారీ, ముస్లిం).

**3**. నమా'జ్ను సరిగ్గా, దాని సమయంలో చేయటం విశ్వాసానికి ప్రధాన ఆనవాలు.

**4**. 'స'హాబా (ర'ది.'అన్హుమ్)లు తమ విషయాలలో పరస్పరం సంప్రదింపులు, సలహాలు చేసుకునేవారు. దైవప్రవక్త ('స'అస) కూడా ముఖ్యమైన విషయాలలో, యుద్ధ సన్నాహాలలో తమ అనుచరు(ర'ది.'అన్హుమ్)లతో సంప్రదింపులు చేసేవారు. ఒక పాలకుడు కూడా తనకు సలహాలివ్వటానికి నిపుణులను నియమించుకోవడం ఎంతో ముఖ్యం. చూడండి, 3:159.

**5**. దైవప్రవక్త ('స'అస) ఎన్నడూ, తనకు హాని చేసిన వారితో కూడా ప్రతీకారం తీర్చుకోలేదు. ఉదాహరణకు అతనికి ఆహారంలో విషమిచ్చిన యూద స్త్రీతో మరియు అతనిపై మంత్రజాలం (చేతబడి) చేసిన లుబైద్ బిన్ 'ఆసిమ్తో లేక అతనిని చంపగోరిన వారితో గాని ప్రతీకారం తీర్చుకోలేదు.

وَجَزَٰٓؤُاْ سَيِّئَةٖ سَيِّئَةٞ مِّثۡلُهَاۖ فَمَنۡ عَفَا وَأَصۡلَحَ فَأَجۡرُهُۥ عَلَى ٱللَّهِۚ إِنَّهُۥ لَا يُحِبُّ ٱلظَّٰلِمِينَ ٤٠

**40**. మరియు కీడుకు ప్రతీకారం దానంతటి కీడు మాత్రమే. కాని ఎవడైనా క్షమించి సంధి చేసుకుంటే అతని ప్రతిఫలం అల్లాహ్ దగ్గర ఉంది. నిశ్చయంగా, ఆయన దుర్మార్గులంటే ఇష్టపడడు.[1]

وَلَمَنِ ٱنتَصَرَ بَعۡدَ ظُلۡمِهِۦ فَأُوْلَٰٓئِكَ مَا عَلَيۡهِم مِّن سَبِيلٍ ٤١

**41**. కాని ఎవరైనా తమకు అన్యాయం జరిగినప్పుడు దానికి తగినంత న్యాయప్రతీకారం మాత్రమే తీసుకుంటే అలాంటి వారు నిందార్హులు కారు.

إِنَّمَا ٱلسَّبِيلُ عَلَى ٱلَّذِينَ يَظۡلِمُونَ ٱلنَّاسَ وَيَبۡغُونَ فِي ٱلۡأَرۡضِ بِغَيۡرِ ٱلۡحَقِّۚ أُوْلَٰٓئِكَ لَهُمۡ عَذَابٌ أَلِيمٞ ٤٢

**42**. కాని, వాస్తవానికి ఎవరైతే ప్రజలపై దౌర్జన్యాలు చేస్తారో మరియు భూమిలో అన్యాయంగా ఉపద్రవాలు రేకెత్తిస్తారో అలాంటి వారు నిందార్హులు. అలాంటి వారు, వారికే! బాధాకరమైన శిక్ష గలదు.

وَلَمَن صَبَرَ وَغَفَرَ إِنَّ ذَٰلِكَ لَمِنۡ عَزۡمِ ٱلۡأُمُورِ ٤٣

**43**. మరియు ఎవడైతే సహనం వహించి క్షమిస్తాడో! నిశ్చయంగా, అది (అల్లాహ్ దృష్టిలో) ఎంతో సహృదయంతో (సాహసంతో) కూడిన పని![2]

وَمَن يُضۡلِلِ ٱللَّهُ فَمَا لَهُۥ مِن وَلِيّٖ مِّنۢ بَعۡدِهِۦۗ وَتَرَى ٱلظَّٰلِمِينَ لَمَّا رَأَوُاْ ٱلۡعَذَابَ يَقُولُونَ هَلۡ إِلَىٰ مَرَدّٖ مِّن سَبِيلٖ ٤٤

**44**. మరియు, ఎవడినైతే అల్లాహ్ మార్గభ్రష్టత్వంలో పడనిస్తాడో! దాని తరువాత వాడికి సంరక్షకుడు, ఎవ్వడూ ఉండడు.[3] మరియు ఈ దుర్మార్గులు శిక్షను చూసినపుడు: "మేము తిరిగి (భూలోకంలోకి) పోయే మార్గమేదైనా ఉందా?" అని అడగటం నీవు చూస్తావు.[4]

---

**1**. చూడండి, 2:190.
**2**. చూడండి, 41:34-35 మరియు 13:22.
**3**. చూడండి, 14:4 చివరి వాక్యం.
**4**. చూడండి, 6:27-28.

وَتَرَىٰهُمْ يُعْرَضُونَ عَلَيْهَا خَٰشِعِينَ مِنَ ٱلذُّلِّ يَنظُرُونَ مِن طَرْفٍ خَفِيٍّۗ وَقَالَ ٱلَّذِينَ ءَامَنُوٓاْ إِنَّ ٱلْخَٰسِرِينَ ٱلَّذِينَ خَسِرُوٓاْ أَنفُسَهُمْ وَأَهْلِيهِمْ يَوْمَ ٱلْقِيَٰمَةِۗ أَلَآ إِنَّ ٱلظَّٰلِمِينَ فِي عَذَابٍ مُّقِيمٍ ﴿٤٥﴾

**45**. మరియు వారిని, దాని (నరకం) ముందుకు తీసుకొని వచ్చినప్పుడు, వారు అవమానంతో కృంగిపోతూ, దొంగ చూపులతో దానిని చూడటం నీవు గమనిస్తావు. మరియు విశ్వసించిన వారు ఇలా అంటారు: "నిశ్చయంగా, తమను తాము మరియు తమ సంబంధీకులను (అనుచరులను) నష్టానికి గురిచేసుకున్న వారే, ఈ పునరుత్థాన దినమున నష్టపోయే వారు. జాగ్రత్త! నిశ్చయంగా, దుర్మార్గులే శాశ్వతమైన శిక్షకు గురిఅవుతారు."

وَمَا كَانَ لَهُم مِّنْ أَوْلِيَآءَ يَنصُرُونَهُم مِّن دُونِ ٱللَّهِۗ وَمَن يُضْلِلِ ٱللَّهُ فَمَا لَهُۥ مِن سَبِيلٍ ﴿٤٦﴾

**46**. మరియు అల్లాహ్ తప్ప, ఇతరులెవ్వరూ వారికి రక్షకులుగాగానీ, సహాయకులుగాగానీ ఉండరు. మరియు అల్లాహ్ మార్గభ్రష్టత్వంలో వదిలిన వారికి (దాని నుండి బయటపడే) మార్గమేదీ వుండదు.

ٱسْتَجِيبُواْ لِرَبِّكُم مِّن قَبْلِ أَن يَأْتِيَ يَوْمٌ لَّا مَرَدَّ لَهُۥ مِنَ ٱللَّهِۚ مَا لَكُم مِّن مَّلْجَإٍ يَوْمَئِذٍ وَمَا لَكُم مِّن نَّكِيرٍ ﴿٤٧﴾

**47**. (కావున ఓ మానవులారా మరియు జిన్నాతులారా!) మీరు, తొలగింపబడే అవకాశం లేనటువంటి ఆ దినం, అల్లాహ్ తరఫునుండి రాకముందే, మీ ప్రభువు ఆజ్ఞను శిరసావహించండి. ఆ రోజున మీకు ఎక్కడా ఆశ్రయం లభించదు. మరియు మీకు (మీ పాపాలను) నిరాకరించటానికి కూడా వీలుండదు.[1]

فَإِنْ أَعْرَضُواْ فَمَآ أَرْسَلْنَٰكَ عَلَيْهِمْ حَفِيظًاۖ إِنْ عَلَيْكَ إِلَّا ٱلْبَلَٰغُۗ

**48**. (ఓ ప్రవక్తా!) ఒకవేళ వారు విముఖులైతే, మేము నిన్ను వారిపై రక్షకునిగా చేసి పంపలేదు. నీ పని కేవలం (సందేశాన్ని) అందజేయటం మాత్రమే.[2]

---

**1**. చూడండి, 75:10-12.

**2**. చూడండి, 2:272, 13:40 మరియు 88:21-22.

وَإِنَّآ إِذَآ أَذَقْنَا ٱلْإِنسَٰنَ مِنَّا رَحْمَةً فَرِحَ بِهَا ۖ وَإِن تُصِبْهُمْ سَيِّئَةٌۢ بِمَا قَدَّمَتْ أَيْدِيهِمْ فَإِنَّ ٱلْإِنسَٰنَ كَفُورٌ ﴿٤٨﴾

మరియు మేము మానవునికి మా కారుణ్యాన్ని రుచి చూపిస్తే, దానికి అతడు సంతోషంతో పొంగిపోతాడు. కాని ఒకవేళ వారికి తమ చేతులారా చేసుకున్నదానికి ఫలితంగా, కీడు కలిగినట్లయితే! నిశ్చయంగా, అప్పుడు మానవుడు కృతఘ్నుడవుతాడు!

لِّلَّهِ مُلْكُ ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضِ ۚ يَخْلُقُ مَا يَشَآءُ ۚ يَهَبُ لِمَن يَشَآءُ إِنَٰثًا وَيَهَبُ لِمَن يَشَآءُ ٱلذُّكُورَ ﴿٤٩﴾

**49**. భూమ్యాకాశాల సామ్రాజ్యాధికారం అల్లాహ్‌దే! ఆయన తాను కోరింది సృష్టిస్తాడు. ఆయన తాను కోరిన వారికి కుమార్తెలను ప్రసాదిస్తాడు మరియు తాను కోరినవారికి కుమారులను ప్రసాదిస్తాడు.

أَوْ يُزَوِّجُهُمْ ذُكْرَانًا وَإِنَٰثًا ۖ وَيَجْعَلُ مَن يَشَآءُ عَقِيمًا ۚ إِنَّهُۥ عَلِيمٌ قَدِيرٌ ﴿٥٠﴾

**50**. లేదా! వారికి కుమారులను మరియు కుమార్తెలను కలిపి ప్రసాదిస్తాడు. మరియు తాను కోరిన వారికి అసలు సంతానమే ఇవ్వడు. నిశ్చయంగా, ఆయన సర్వజ్ఞుడు, అంతా చేయగల సమర్థుడు. (3/8)

۞ وَمَا كَانَ لِبَشَرٍ أَن يُكَلِّمَهُ ٱللَّهُ إِلَّا وَحْيًا أَوْ مِن وَرَآئِ حِجَابٍ أَوْ يُرْسِلَ رَسُولًا فَيُوحِىَ بِإِذْنِهِۦ مَا يَشَآءُ ۚ إِنَّهُۥ عَلِىٌّ حَكِيمٌ ﴿٥١﴾

**51**. * మరియు అల్లాహ్‌తో మాట్లాడ గలిగే శక్తి ఏ మానవునికీ లేదు; కేవలం దివ్యజ్ఞానం (వ'హీ) ద్వారా లేదా తెర వెనుక నుండి, లేదా ఆయన పంపిన సందేశహరుని ద్వారా, ఆయన అనుమతితో, ఆయన కోరిన (వ'హీ) అవతరింపజేయబడటం తప్ప![1] నిశ్చయంగా ఆయన మహోన్నతుడు, మహా వివేకవంతుడు.

---

**1**. ఈ ఆయత్‌లో దివ్యజ్ఞానం (వ'హీ) అవతరింపజేయబడే మూడు విధానాలు పేర్కొనబడ్డాయి: 1) హృదయంలో ఒక విషయం వేయబడటం, లేక స్వప్నంలో వినిపింపజేయబడటం - ఇది అల్లాహ్ (సు.తా.) తరఫు నుండియే ఉందనే దృఢనమ్మకంతో! 2) తెర వెనక నుండి వినిపింపజేయబడటం - ఏవిధంగానైతే మూసా ('అ.స.)కు 'తూర్ పర్వతం మీద వినిపించబడిందో! 3) దైవదూత ('అలైహిమ్ స.)ల ద్వారా అల్లాహ్ (సు.తా.) తన వ'హీని పంపటం. ఏ విధంగానైతే దైవప్రవక్త ('స'అస) దగ్గరకు జిబ్రీల్ ('అ.స.) వ'హీని తీసుకొని వచ్చేవారో! చూడండి, 53:10.

وَكَذَٰلِكَ أَوْحَيْنَآ إِلَيْكَ رُوحًا مِّنْ أَمْرِنَا ۚ مَا كُنتَ تَدْرِى مَا ٱلْكِتَٰبُ وَلَا ٱلْإِيمَٰنُ وَلَٰكِن جَعَلْنَٰهُ نُورًا نَّهْدِى بِهِۦ مَن نَّشَآءُ مِنْ عِبَادِنَا ۚ وَإِنَّكَ لَتَهْدِىٓ إِلَىٰ صِرَٰطٍ مُّسْتَقِيمٍ ﴿٥٢﴾

**52**. మరియు ఇదేవిధంగా (ఓ ముహమ్మద్!) మేము మా ఆజ్ఞతో నీ వద్దకు దివ్యజ్ఞానం (రూహ్) అవతరింపజేశాము.[1] (దీనికి ముందు) నీకు గ్రంథమేమిటో మరియు విశ్వాసమేమిటో తెలియదు. కాని మేము దీనిని (ఈ ఖుర్ఆన్‌ను) జ్యోతిగా జేసి, దీని ద్వారా మా దాసులలో మేము కోరినవారికి, మార్గదర్శకత్వం చేస్తాము.[2] మరియు నిశ్చయంగా, నీవు (ప్రజలకు) ఋజుమార్గం వైపునకు దారి చూపుతున్నావు -

صِرَٰطِ ٱللَّهِ ٱلَّذِى لَهُۥ مَا فِى ٱلسَّمَٰوَٰتِ وَمَا فِى ٱلْأَرْضِ ۗ أَلَآ إِلَى ٱللَّهِ تَصِيرُ ٱلْأُمُورُ ﴿٥٣﴾

**53**. అల్లాహ్ మార్గం![3] భూమ్యాకాశాలలో నున్న ప్రతిదీ ఆయనకే చెందుతుంది. వాస్తవానికి, వ్యవహారాలన్నీ చివరకు (తీర్పు కొరకు) అల్లాహ్ వద్దకే చేరుతాయి.

*****

---

**1**. రూహున్: ఇక్కడ దివ్య జ్ఞానం (ఖుర్ఆన్) అనే అర్థమిస్తోంది. ఎందుకంటే ఖుర్ఆన్ వల్ల హృదయాలకు 'జీవం' లభిస్తుంది. ఏ విధంగానైతే రూహ్‌తో మానవునికి జీవం లభిస్తుందో! చూడండి, 16:2, 40:15.

**2**. చూడండి, 41:44.

**3**. అంటే ఇస్లాం.

## 43. సూరహ్ అజ్-'జు'ఖ్రుఫ్ سُورَةُ الزُّخْرُفِ

'జు'ఖ్రుఫ్: అంటే **బంగారం**, ఆభరణాలు లేక అలంకరణ. 'హా-మీమ్ వరుసలో ఈ సూరహ్ నాలుగవది. దీని పేరు **35**వ **ఆయత్** నుండి తీసుకోబడింది. ప్రజలు తమ తండ్రితాతలు అనుసరించే ధర్మాలను అంధ విశ్వాసంతో అనుసరిస్తూ, అల్లాహ్ (సు.తా.) ప్రసాదించిన విచక్షణాజ్ఞానాన్ని ఉపయోగించకపోవటం వల్లనే మార్గభ్రష్టత్వంలో పడిపోతున్నారు. మక్కాలో అవతరింపజేయబడిన ఈ సూరహ్‌లో **89 ఆయతులు** ఉన్నాయి.

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

C B A

حمٓ ﴿١﴾ وَٱلْكِتَٰبِ ٱلْمُبِينِ ﴿٢﴾ إِنَّا جَعَلْنَٰهُ قُرْءَٰنًا عَرَبِيًّا لَّعَلَّكُمْ تَعْقِلُونَ ﴿٣﴾ وَإِنَّهُۥ فِىٓ أُمِّ ٱلْكِتَٰبِ لَدَيْنَا لَعَلِىٌّ حَكِيمٌ ﴿٤﴾ أَفَنَضْرِبُ عَنكُمُ ٱلذِّكْرَ صَفْحًا أَن كُنتُمْ قَوْمًا مُّسْرِفِينَ ﴿٥﴾

**1**. 'హా-మీమ్.

**2**. స్పష్టమైన ఈ గ్రంథం (ఖుర్ఆన్) సాక్షిగా![1]

**3**. నిశ్చయంగా, మీరు అర్థం చేసుకోగలగటానికి, మేము దీనిని 'అరబ్బీ భాషలో ఖుర్ఆన్‌గా [2] అవతరింపజేశాము.

**4**. మరియు నిశ్చయంగా, ఇది మా వద్దనున్న మాతృ గ్రంథంలోనిదే![3] అది మహోన్నతమైనది, వివేకంతో నిండివున్నది.

**5**. ఏమిటి? మీరు మితిమీరి ప్రవర్తిస్తున్నారని, మేము ఈ హితోపదేశాన్ని (ఖుర్ఆన్‌ను) మీ నుండి తొలగించాలా?[4]

---

**1**. చూడండి, 12:1.

**2**. ఖుర్ఆనున్ / ఖుర్ఆనన్: దీని పదార్థాలు సంభాషణ, ప్రసంగం, ఉపన్యాసం, పఠనగ్రంథం, Recitation, Talk, Lecture, Discourse, Sermon, అని ఉన్నాయి. అల్-ఖుర్ఆను అంటే ఈ ఖుర్ఆన్ గ్రంథం. అల్ ఖుర్ఆనుల్-కరీమ్ అంటే The Glorious Quran, ఈ దివ్యఖుర్ఆన్.

**3**. ఉమ్ముల్ కితాబ్: చూడండి, 13:39, 85:22. అంటే లౌ'హె మ'హ్ఫూ''జ్. మాతృ గ్రంథం, సురక్షితమైన ఫలకం, మూలగ్రంథం. అంటే యథాస్థితిలో, భద్రంగా ఉంచబడిన గ్రంథం.

**4**. మీరు మితిమీరి ప్రవర్తిస్తున్నారని మేము మీకు హితబోధ చేయటం మానుకుంటామని భావిస్తున్నారా? (ఇబ్నె-కసీ'ర్).

وَكَمۡ أَرۡسَلۡنَا مِن نَّبِيّٖ فِي ٱلۡأَوَّلِينَ ٦

**6**. మరియు మేము పూర్వం గతించిన వారివద్దకు ఎంతోమంది ప్రవక్తలను పంపాము.

وَمَا يَأۡتِيهِم مِّن نَّبِيٍّ إِلَّا كَانُواْ بِهِۦ يَسۡتَهۡزِءُونَ ٧

**7**. మరియు వారు, తమవద్దకు వచ్చిన ప్రవక్తలలో ఏ ఒక్కరిని కూడా ఎగతాళి చేయకుండా వదలలేదు.

فَأَهۡلَكۡنَآ أَشَدَّ مِنۡهُم بَطۡشٗا وَمَضَىٰ مَثَلُ ٱلۡأَوَّلِينَ ٨

**8**. కావున వీరికంటే ఎంతో బలిష్ఠులైన వారిని మేము పట్టుకొని నాశనం చేశాము.[1] మరియు పూర్వజాతుల వారి దృష్టాంతాలు ఈ విధంగా గడిచాయి.

وَلَئِن سَأَلۡتَهُم مَّنۡ خَلَقَ ٱلسَّمَٰوَٰتِ وَٱلۡأَرۡضَ لَيَقُولُنَّ خَلَقَهُنَّ ٱلۡعَزِيزُ ٱلۡعَلِيمُ ٩

**9**. ఒకవేళ, నీవు వారితో: ''భూమ్యాకాశాలను ఎవరు సృష్టించారు?'' అని అడిగితే! వారు తప్పక: ''వాటిని సర్వశక్తిమంతుడు, సర్వజ్ఞుడు సృష్టించాడు.'' అని అంటారు.

ٱلَّذِي جَعَلَ لَكُمُ ٱلۡأَرۡضَ مَهۡدٗا وَجَعَلَ لَكُمۡ فِيهَا سُبُلٗا لَّعَلَّكُمۡ تَهۡتَدُونَ ١٠

**10**. ఆయనే మీ కొరకు ఈ భూమిని పరుపుగా చేశాడు మరియు మీరు మీ గమ్యస్థానాలకు చేరుకోవడానికి, అందులో మీ కొరకు త్రోవలు ఏర్పరచాడు.[2]

وَٱلَّذِي نَزَّلَ مِنَ ٱلسَّمَآءِ مَآءَۢ بِقَدَرٖ فَأَنشَرۡنَا بِهِۦ بَلۡدَةٗ مَّيۡتٗاۚ كَذَٰلِكَ تُخۡرَجُونَ ١١

**11**. మరియు ఆయనే ఆకాశంనుండి తగినంత నీటిని (వర్షాన్ని) కురిపించాడు. తరువాత దానిద్వారా మేము చచ్చిన నేలను బ్రతికించాము. ఇదేవిధంగా మీరు కూడా (బ్రతికింపబడి) బయటికి తీయబడతారు.

وَٱلَّذِي خَلَقَ ٱلۡأَزۡوَٰجَ كُلَّهَا وَجَعَلَ لَكُم مِّنَ ٱلۡفُلۡكِ وَٱلۡأَنۡعَٰمِ مَا تَرۡكَبُونَ ١٢

**12**. మరియు ఆయనే అన్నిరకాల జతలను పుట్టించాడు! మరియు ఓడలను మరియు పశువులను మీకు వాహనాలుగా చేశాడు;

---

**1**. అంటే వారు మక్కాముష్రికుల కంటే ఎక్కువ బలవంతులు. ఇంకా చూడండి, 40:82.
**2**. చూడండి, 20:53.

13. మీరు వాటి వీపుల మీద ఎక్కటానికి; తరువాత మీరు వాటిమీద కూర్చున్నప్పుడు, మీ ప్రభువు అనుగ్రహాన్ని తలచుకొని ఇలా ప్రార్థించటానికి: "ఆ సర్వలోపాలకు అతీతుడైన ఆయన (అల్లాహ్) వీటిని మాకు వశపరచాడు, లేకపోతే ఆ (వాటిని వశపరచుకునే) సామర్థ్యం మాకు లేదు.

لِتَسْتَوُۥا۟ عَلَىٰ ظُهُورِهِۦ ثُمَّ تَذْكُرُوا۟ نِعْمَةَ رَبِّكُمْ إِذَا ٱسْتَوَيْتُمْ عَلَيْهِ وَتَقُولُوا۟ سُبْحَـٰنَ ٱلَّذِى سَخَّرَ لَنَا هَـٰذَا وَمَا كُنَّا لَهُۥ مُقْرِنِينَ ﴿١٣﴾

14. "మరియు నిశ్చయంగా, మేము మా ప్రభువు వైపునకే మరలిపోవలసి ఉన్నది!"[1]

وَإِنَّآ إِلَىٰ رَبِّنَا لَمُنقَلِبُونَ ﴿١٤﴾

15. మరియు వారు ఆయన దాసులలో కొందరిని ఆయనలో భాగంగా (భాగ స్వాములుగా / సంతానంగా) చేశారు.[2] నిశ్చయంగా మానవుడు పరమ కృతఘ్నుడు!

وَجَعَلُوا۟ لَهُۥ مِنْ عِبَادِهِۦ جُزْءًا ۚ إِنَّ ٱلْإِنسَـٰنَ لَكَفُورٌ مُّبِينٌ ﴿١٥﴾

16. ఏమిటి? ఆయన తాను సృష్టించిన వాటిలో నుండి తనకొరకు కుమార్తెలను తీసుకొని మీ కొరకు ప్రత్యేకంగా కుమారులను ఉంచాడా?[3]

أَمِ ٱتَّخَذَ مِمَّا يَخْلُقُ بَنَاتٍ وَأَصْفَـٰكُم بِٱلْبَنِينَ ﴿١٦﴾

17. మరియు వారు, కరుణామయునికి అంటగట్టేది (ఆడ సంతానమే గనక) వారిలో ఎవడికైనా కలిగిందనే వార్త అందజేయబడినప్పుడు, అతని ముఖం నల్లబడిపోతుంది మరియు అతడు దుఃఖంలో మునిగిపోతాడు!

وَإِذَا بُشِّرَ أَحَدُهُم بِمَا ضَرَبَ لِلرَّحْمَـٰنِ مَثَلًا ظَلَّ وَجْهُهُۥ مُسْوَدًّا وَهُوَ كَظِيمٌ ﴿١٧﴾

---

1. దైవప్రవక్త ('స'అస) తమ వాహనం ఎక్కినప్పుడు: మూడు సార్లు అల్లాహు అక్బర్ తరువాత "సుబ'హానల్లజీ' స'ఖ్ఖరలనా హాజా' వ మా కున్నా లహూ ముఖ్రినీన్. వ ఇన్నా ఇలా రబ్బినా లమున్ఖలిబూన్!" వరకు ఈ ఆయత్లు (43:13-14) చదివే వారు. ('స. ముస్లిం).
2. వారు (ముష్రికులు) దైవదూత ('అలైహిమ్ స.)లను అల్లాహ్ (సు.తా.) కుమార్తెలుగా భావించే వారు. ఇక్కడ 'ఇబాదున్ - దాసులు, అంటే దైవదూతలు మరియు జు'జ్అన్ - అంటే కుమార్తెలు. ఇంకా చూడండి, 6:100.
3. చూడండి, 16:57-59.

**18**. ఏమీ? ఆభరణాల అలంకారంలో పెంచబడి మరియు వివాదంలో తన అభిప్రాయాన్ని స్పష్టంగా వివరించలేని (స్త్రీ) సంతానాన్ని అల్లాహ్‌కు అంటగట్టుతున్నారా)?

**19**. మరియు వీరు కరుణామయునికి దాసులైన దేవదూతలను స్త్రీలుగా పరిగణిస్తున్నారా? వీరు! వారు (దేవదూతలు) సృష్టించబడినప్పుడు చూశారా ఏమిటి? వీరి ఆరోపణలు వ్రాసిపుంచబడతాయి. మరియు వీరు దానిని గురించి ప్రశ్నించబడతారు.

**20**. మరియు వారు ఇలా అంటారు: "ఒకవేళ ఆ కరుణామయుడు తలచుకుంటే మేము వారిని ఆరాధించేవారం కాదు." దాని వాస్తవజ్ఞానం వారికి లేదు. వారు కేవలం ఊహాగానాలే చేస్తున్నారు!

**21**. మేము వారికి ఇంతకుముందు ఏదైనా గ్రంథాన్ని ఇచ్చి ఉన్నామా ఏమిటి? వారు దానిని ఖచ్చితంగా అనుసరించటానికి?

**22**. అలాకాదు! వారిలా అంటారు: "వాస్తవానికి మేము, మా తండ్రితాతలను ఇలాంటి సమాజాన్నే (మతాన్నే) అనుసరిస్తుండగా చూశాము. మరియు నిశ్చయంగా, మేము కూడా వారి అడుగుజాడల్లోనే వారి మార్గదర్శకత్వంపై ఉన్నాము."

أَوَمَن يُنَشَّؤُاْ فِي ٱلۡحِلۡيَةِ وَهُوَ فِي ٱلۡخِصَامِ غَيۡرُ مُبِينٖ ١٨

وَجَعَلُواْ ٱلۡمَلَٰٓئِكَةَ ٱلَّذِينَ هُمۡ عِبَٰدُ ٱلرَّحۡمَٰنِ إِنَٰثًاۚ أَشَهِدُواْ خَلۡقَهُمۡۚ سَتُكۡتَبُ شَهَٰدَتُهُمۡ وَيُسۡـَٔلُونَ ١٩

وَقَالُواْ لَوۡ شَآءَ ٱلرَّحۡمَٰنُ مَا عَبَدۡنَٰهُمۗ مَّا لَهُم بِذَٰلِكَ مِنۡ عِلۡمٍۖ إِنۡ هُمۡ إِلَّا يَخۡرُصُونَ ٢٠

أَمۡ ءَاتَيۡنَٰهُمۡ كِتَٰبٗا مِّن قَبۡلِهِۦ فَهُم بِهِۦ مُسۡتَمۡسِكُونَ ٢١

بَلۡ قَالُوٓاْ إِنَّا وَجَدۡنَآ ءَابَآءَنَا عَلَىٰٓ أُمَّةٖ وَإِنَّا عَلَىٰٓ ءَاثَٰرِهِم مُّهۡتَدُونَ ٢٢

وَكَذَٰلِكَ مَآ أَرۡسَلۡنَا مِن قَبۡلِكَ فِي قَرۡيَةٖ مِّن نَّذِيرٍ إِلَّا قَالَ مُتۡرَفُوهَآ إِنَّا وَجَدۡنَآ ءَابَآءَنَا عَلَىٰٓ أُمَّةٖ وَإِنَّا عَلَىٰٓ ءَاثَٰرِهِم مُّقۡتَدُونَ ٢٣

23. మరియు ఇదే విధంగా, నీకు ముందు (ఓ ము'హమ్మద్!) మేము హెచ్చరించేవాడిని ఏ పట్టణానికి పంపినా దానిలోని ఐశ్వర్యవంతులు అనేవారు:[1] "వాస్తవానికి మేము మా తండ్రితాతలను ఇలాంటి సమాజాన్నే (మతాన్నే) అనుసరిస్తూ ఉండగా చూశాము. మరియు నిశ్చయంగా, మేము కూడా వారి అడుగుజాడలనే అనుసరిస్తాము."(1/2)

۞ قَٰلَ أَوَلَوۡ جِئۡتُكُم بِأَهۡدَىٰ مِمَّا وَجَدتُّمۡ عَلَيۡهِ ءَابَآءَكُمۡۖ قَالُوٓاْ إِنَّا بِمَآ أُرۡسِلۡتُم بِهِۦ كَٰفِرُونَ ٢٤

24. * (వారి ప్రవక్త) ఇలా అనేవాడు: "ఒకవేళ నేను మీ తండ్రితాతలు అనుసరిస్తూ వచ్చిన దానికంటే ఉత్తమమైన మార్గదర్శకత్వాన్ని మీ కోసం తెచ్చినా (మీరు వారినే అనుసరిస్తారా)?" వారిలా జవాబిచ్చే వారు: "నిశ్చయంగా, మీరు దేనితో పంపబడ్డారో దానిని మేము తిరస్కరిస్తున్నాము."

فَٱنتَقَمۡنَا مِنۡهُمۡۖ فَٱنظُرۡ كَيۡفَ كَانَ عَٰقِبَةُ ٱلۡمُكَذِّبِينَ ٢٥

25. కావున మేము వారిపై మా ప్రతీకారాన్ని (శిక్షను) పంపాము. చూశారా! సత్యాన్ని తిరస్కరించిన వారిగతి ఏమయిందో!

وَإِذۡ قَالَ إِبۡرَٰهِيمُ لِأَبِيهِ وَقَوۡمِهِۦٓ إِنَّنِي بَرَآءٞ مِّمَّا تَعۡبُدُونَ ٢٦

26. మరియు (జ్ఞాపకం చేసుకోండి) ఇబ్రాహీమ్ తన తండ్రి మరియు తన జాతి వారితో ఇలా అన్నప్పుడు: "నిశ్చయంగా, మీరు పూజించేవారితో నాకు ఎలాంటి సంబంధం లేదు.[2]

---

1. చూడండి, 11:116.
2. ఇబ్రాహీమ్ ('అ.స.) గాథకు చూడండి, 6:74 మరియు 21:51.

إِلَّا ٱلَّذِى فَطَرَنِى فَإِنَّهُۥ سَيَهۡدِينِ ﴿٢٧﴾

**27**. "(నేనైతే) నన్ను సృజించిన ఆయన (అల్లాహ్‌నే ఆరాధిస్తాను). ఎందుకంటే! నిశ్చయంగా, ఆయనే నాకు మార్గదర్శకత్వం చేయగలడు."

وَجَعَلَهَا كَلِمَةَۢ بَاقِيَةً فِى عَقِبِهِۦ لَعَلَّهُمۡ يَرۡجِعُونَ ﴿٢٨﴾

**28**. మరియు అతను (ఇబ్రాహీమ్) ఈ వచనాన్నే తన తర్వాత తన సంతానం కొరకు విడిచి వెళ్ళాడు.[1] బహుశా వారు దానివైపుకు మరలుతారని!

بَلۡ مَتَّعۡتُ هَٰٓؤُلَآءِ وَءَابَآءَهُمۡ حَتَّىٰ جَآءَهُمُ ٱلۡحَقُّ وَرَسُولٌ مُّبِينٌ ﴿٢٩﴾

**29**. వాస్తవానికి, నేను వారికి మరియు వారి తండ్రితాతలకు ప్రాపంచిక సుఖసంతోషాలను ఇస్తూనే వచ్చాను. చివరకు వారి వద్దకు సత్యం మరియు (దానిని) స్పష్టంగా వివరించే దైవప్రవక్త కూడా వచ్చాడు.[2]

وَلَمَّا جَآءَهُمُ ٱلۡحَقُّ قَالُواْ هَٰذَا سِحۡرٌ وَإِنَّا بِهِۦ كَٰفِرُونَ ﴿٣٠﴾

**30**. కాని వారి వద్దకు సత్యం (ఈ ఖుర్ఆన్) వచ్చినపుడు వారన్నారు: "ఇది కేవలం మంత్రజాలమే.[3] మరియు నిశ్చయంగా, మేము దీనిని తిరస్కరిస్తున్నాము."

وَقَالُواْ لَوۡلَا نُزِّلَ هَٰذَا ٱلۡقُرۡءَانُ عَلَىٰ رَجُلٍ مِّنَ ٱلۡقَرۡيَتَيۡنِ عَظِيمٍ ﴿٣١﴾

**31**. వారు ఇంకా ఇలా అన్నారు: "ఈ ఖుర్ఆన్ ఈ రెండు నగరాలలోని ఒక గొప్ప వ్యక్తిపై ఎందుకు అవతరింపజేయ బడలేదు?"[4]

---

**1**. చూడండి, 2:132.
**2**. చూడండి, 21:44.
**3**. చూడండి, 74:24.
**4**. ఈ రెండు నగరవాసులలో పేరు ప్రఖ్యాతులున్న మక్కాకు చెందిన వలీద్ బిన్-ము'గైరా మరియు 'తాయఫ్‌కు చెందిన 'ఉర్వా బిన్-మస'వూద్ స'ఖఫీ కావచ్చని వ్యాఖ్యాతలంటారు.

أَمۡ يَقۡسِمُونَ رَحۡمَتَ رَبِّكَۚ نَحۡنُ قَسَمۡنَا بَيۡنَهُم مَّعِيشَتَهُمۡ فِي ٱلۡحَيَوٰةِ ٱلدُّنۡيَاۚ وَرَفَعۡنَا بَعۡضَهُمۡ فَوۡقَ بَعۡضٖ دَرَجَٰتٖ لِّيَتَّخِذَ بَعۡضُهُم بَعۡضٗا سُخۡرِيّٗاۗ وَرَحۡمَتُ رَبِّكَ خَيۡرٞ مِّمَّا يَجۡمَعُونَ ٣٢

وَلَوۡلَآ أَن يَكُونَ ٱلنَّاسُ أُمَّةٗ وَٰحِدَةٗ لَّجَعَلۡنَا لِمَن يَكۡفُرُ بِٱلرَّحۡمَٰنِ لِبُيُوتِهِمۡ سُقُفٗا مِّن فِضَّةٖ وَمَعَارِجَ عَلَيۡهَا يَظۡهَرُونَ ٣٣

وَلِبُيُوتِهِمۡ أَبۡوَٰبٗا وَسُرُرًا عَلَيۡهَا يَتَّكِـُٔونَ ٣٤

وَزُخۡرُفٗاۚ وَإِن كُلُّ ذَٰلِكَ لَمَّا مَتَٰعُ ٱلۡحَيَوٰةِ ٱلدُّنۡيَاۚ وَٱلۡأٓخِرَةُ عِندَ رَبِّكَ لِلۡمُتَّقِينَ ٣٥

**32**. నీ ప్రభువు కారుణ్యాన్ని పంచిపెట్టే వారు వారేనా ఏమిటి? మేమే వారి జీవనోపాయాలను, ఈ ప్రాపంచిక జీవితంలో వారి మధ్య పంచిపెట్టాము. వారు ఒకరితో నొకరు పని తీసుకోవటానికి,[1] వారిలో కొందరికి మరికొందరిపై స్థానాలను పెంచాము. మరియు వారు కూడబెట్టే దాని (సంపద) కంటే నీ ప్రభువు కారుణ్యమే[2] ఎంతో ఉత్తమమైనది.

**33**. మరియు మానవులందరూ ఒక (దుష్ట) సమాజంగా మారిపోతారన్న భయమే గనక మాకు లేకున్నట్లయితే, మేము ఆ కరుణామయుణ్ణి తిరస్కరించే వారి ఇళ్ళ కప్పులనూ మరియు వాటిపైకి ఎక్కే మెట్లను వెండితో నిర్మించేవారము.

**34**. మరియు వారి ఇండ్ల తలుపులను మరియు వారు ఆనుకొని కూర్చునే పీఠాలను కూడా;

**35**. మరియు **బంగారంతో** కూడా![3] మరియు ఇవన్నీ ప్రాపంచిక జీవిత సుఖసంతోషాలు మాత్రమే. మరియు దైవభీతి గలవారికి నీ ప్రభువువద్ద పరలోకజీవిత (సుఖం) ఉంటుంది.

---

**1**. అల్లాహ్ (సు.తా.) వ్యవహారాలను సరళంగా నడపటానికి, ప్రజలలో ధనసంపత్తులను, తెలివి జ్ఞానాలను, ఎక్కువ తక్కువగా పంచాడు. దీనివల్ల ప్రతి మానవుడు మరొకని సహాయం మీద ఆధారపడి ఉన్నాడు. ధనవంతుడు పేదవాని మీద పేదవాడు ధనవంతుని మీద.

**2**. ఈ కారుణ్యం అంటే పరలోక జీవితసుఖం.

**3**. 'జు`ఖ్రుఫున్: బంగారం. దీని అర్థం ఆభరణాలు లేక అలంకరణ కూడా అవుతుంది. చూడండి, 10:24. దైవప్రవక్త ('స'అస) ప్రవచనం: "అల్లాహ్ (సు.తా.) దగ్గర ఈ ప్రపంచపు విలువ దోమరెక్కకు సమానంగా ఉండి ఉన్నా, అల్లాహ్ (సు.తా.) ఏ సత్యతిరస్కారిని గుటికెడు నీళ్ళుకూడా త్రాగనిచ్చేవాడు కాదు." (తిర్మిజీ', ఇబ్నె-మాజహ్).

وَمَن يَعْشُ عَن ذِكْرِ ٱلرَّحْمَٰنِ نُقَيِّضْ لَهُۥ شَيْطَٰنًا فَهُوَ لَهُۥ قَرِينٌ ﴿٣٦﴾

**36**. మరియు ఎవడైతే కరుణామయుని స్మరణ విషయంలో అంధుడిగా ప్రవర్తిస్తాడో అతనిపై మేము ఒక షై'తాన్‌ను నియమిస్తాము. ఇక వాడు (ఆ షై'తాన్) వాని సహచరుడు (ఖరీనున్) అవుతాడు.[1]

وَإِنَّهُمْ لَيَصُدُّونَهُمْ عَنِ ٱلسَّبِيلِ وَيَحْسَبُونَ أَنَّهُم مُّهْتَدُونَ ﴿٣٧﴾

**37**. మరియు నిశ్చయంగా, వారు (షై'తాన్‌లు) వారిని (అల్లాహ్) మార్గం నుండి ఆటంకపరుస్తారు మరియు వారేమో నిశ్చయంగా, తాము సరైన మార్గదర్శకత్వంలోనే ఉన్నామని భావిస్తారు!

حَتَّىٰٓ إِذَا جَآءَنَا قَالَ يَٰلَيْتَ بَيْنِى وَبَيْنَكَ بُعْدَ ٱلْمَشْرِقَيْنِ فَبِئْسَ ٱلْقَرِينُ ﴿٣٨﴾

**38**. చివరకు అతడు మా వద్దకు వచ్చినపుడు (తన వెంట ఉన్న షై'తాన్‌తో) ఇలా అంటాడు: "అయ్యో, నా దౌర్భాగ్యం! నీకూ-నాకూ మధ్య తూర్పు పడమరల[2] మధ్య ఉన్నంత దూరం ఉండి వుంటే ఎంత బాగుండేది! ఎందుకంటే నీవు అతిచెడ్డ సహచరు (ఖరీను)డివి!"

وَلَن يَنفَعَكُمُ ٱلْيَوْمَ إِذ ظَّلَمْتُمْ أَنَّكُمْ فِى ٱلْعَذَابِ مُشْتَرِكُونَ ﴿٣٩﴾

**39**. మరియు మీరు దుర్మార్గం చేశారు! కావున, ఈ రోజు మీరంతా ఈ శిక్షలో కలిసి ఉండటం మీకు ఏ మాత్రం లాభదాయకం కాదు.[3]

---

1. చూడండి, 41:25.
2. అల్-మష్‌రిఖైన్: ప్రాచీన అరబ్బీభాషా సంప్రదాయం ప్రకారం కొన్నిసార్లు ఒక శబ్దానికి ద్వివచనం ఇవ్వటం వల్ల దాని అర్థం రెండు విభిన్న వస్తువులను సూచిస్తుంది. ఉదా: ఇక్కడ వ్రాసినట్లు అల్-మష్‌రిఖైన్, అంటే తూర్పుపడమరలు; ఖమరైన్, అంటే సూర్యచంద్రులు.
3. ఈ ఆయత్‌కు ఈ విధంగా కూడా తాత్పర్యం ఇవ్వబడింది: *'మరియు మీరు దుర్మార్గం చేశారు, అది ఈ రోజు మీకు ఏ మాత్రం లాభదాయకం కాదు; నిశ్చయంగా, మీరందరు ఈ శిక్షను పంచుకుంటారు.'* ఇంకా చూడండి, 14:49.

أَفَأَنتَ تُسْمِعُ ٱلصُّمَّ أَوْ تَهْدِى ٱلْعُمْىَ وَمَن كَانَ فِى ضَلَٰلٍ مُّبِينٍ ﴿٤٠﴾

**40**. (ఓ ము'హమ్మద్!) నీవు చెవిటి వాడికి వినిపింపజేయగలవా? లేదా గ్రుడ్డివాడికి మార్గం చూపించగలవా? లేక, స్పష్టంగా మార్గభ్రష్టత్వంలో ఉన్నవాడికి (మార్గదర్శకత్వం చేయగలవా)?[1]

فَإِمَّا نَذْهَبَنَّ بِكَ فَإِنَّا مِنْهُم مُّنتَقِمُونَ ﴿٤١﴾

**41**. ఒకవేళ వాస్తవానికి మేము నిన్ను తీసుకొనిపోయినా, వారికి మాత్రం తప్పకుండా ప్రతీకారం చేస్తాము.

أَوْ نُرِيَنَّكَ ٱلَّذِى وَعَدْنَٰهُمْ فَإِنَّا عَلَيْهِم مُّقْتَدِرُونَ ﴿٤٢﴾

**42**. లేదా మేము వారికి వాగ్దానం చేసిన దానిని (శిక్షను) నీకు తప్పక చూపగలము. ఎందుకంటే మాకు వారిపై పూర్తి అధికారముంది.

فَٱسْتَمْسِكْ بِٱلَّذِىٓ أُوحِىَ إِلَيْكَ ۖ إِنَّكَ عَلَىٰ صِرَٰطٍ مُّسْتَقِيمٍ ﴿٤٣﴾

**43**. కావున నీవు దివ్యజ్ఞానం (వ'హీ) ద్వారా వచ్చిన సందేశం మీద స్థిరంగా ఉండు. నిశ్చయంగా, నీవు ఋజుమార్గం మీద ఉన్నావు.

وَإِنَّهُۥ لَذِكْرٌ لَّكَ وَلِقَوْمِكَ ۖ وَسَوْفَ تُسْـَٔلُونَ ﴿٤٤﴾

**44**. మరియు నిశ్చయంగా, ఇది (ఈ ఖుర్ఆన్) నీకు మరియు నీ జాతివారికి ఒక హితబోధ. మరియు (దీనిని గురించి) మీరు ప్రశ్నింపబడగలరు.[2]

وَسْـَٔلْ مَنْ أَرْسَلْنَا مِن قَبْلِكَ مِن رُّسُلِنَآ أَجَعَلْنَا مِن دُونِ ٱلرَّحْمَٰنِ ءَالِهَةً يُعْبَدُونَ ﴿٤٥﴾

**45**. మరియు (ఓ ము'హమ్మద్!) నీకు పూర్వం మేము పంపిన మా ప్రవక్తలను అడుగు: "మేము, ఆ కరుణామయుడు తప్ప ఇతర దైవాలను ఆరాధింపబడటానికి నియమించామేమో?"

---

**1**. చూడండి, 35:22.
**2**. ప్రవక్త('అలైహిమ్ స.)లందరూ ప్రశ్నింపబడతారు. చూడండి, 5:109.

46. మరియు వాస్తవంగా, మేము మూసాను, మా సూచనలతో (ఆయత్‌లతో) ఫిర్'ఔన్ మరియు అతని నాయకుల వద్దకు పంపాము. అతను వారితో ఇలా అన్నాడు: "నిశ్చయంగా, నేను సర్వలోకాల ప్రభువు యొక్క సందేశహరుణ్ణి."

وَلَقَدْ أَرْسَلْنَا مُوسَىٰ بِـَٔايَـٰتِنَآ إِلَىٰ فِرْعَوْنَ وَمَلَإِي۟هِۦ فَقَالَ إِنِّى رَسُولُ رَبِّ ٱلْعَـٰلَمِينَ ﴿٤٦﴾

47. కాని, అతను వారి వద్దకు మా సూచనలను (ఆయత్‌లను) తీసుకొని వచ్చినప్పుడు, వారు వాటిని గురించి పరిహాసలాడేవారు.[1]

فَلَمَّا جَآءَهُم بِـَٔايَـٰتِنَآ إِذَا هُم مِّنْهَا يَضْحَكُونَ ﴿٤٧﴾

48. మరియు మేము వారికి చూపిన ప్రతి అద్భుత సూచన (ఆయత్), దానికి ముందు చూపినటువంటి దాని (అద్భుత సూచన) కంటే మించినదిగా ఉండేది.[2] మరియు మేము వారిని శిక్షకు గురిచేశాము. బహుశా, ఇలాగైనా వారు మరలి వస్తారేమోనని![3]

وَمَا نُرِيهِم مِّنْ ءَايَةٍ إِلَّا هِىَ أَكْبَرُ مِنْ أُخْتِهَا ۖ وَأَخَذْنَـٰهُم بِٱلْعَذَابِ لَعَلَّهُمْ يَرْجِعُونَ ﴿٤٨﴾

49. మరియు వారు (మూసాతో) ఇలా అన్నారు: "ఓ మాంత్రికుడా! (నీ ప్రభువు) నీతో చేసిన ఒప్పందం ప్రకారం నీ ప్రభువును ప్రార్థించు, మేము తప్పక సన్మార్గుల మవుతాము."

وَقَالُوا۟ يَـٰٓأَيُّهَ ٱلسَّاحِرُ ٱدْعُ لَنَا رَبَّكَ بِمَا عَهِدَ عِندَكَ إِنَّنَا لَمُهْتَدُونَ ﴿٤٩﴾

50. కాని మేము వారి పైనుండి ఆ శిక్షను తొలగించిన వెంటనే వారు తమ వాగ్దానాన్ని భంగపరచేవారు.

فَلَمَّا كَشَفْنَا عَنْهُمُ ٱلْعَذَابَ إِذَا هُمْ يَنكُثُونَ ﴿٥٠﴾

---

1. చూడండి, 6:109.
2. అద్భుత సూచనల కోసం చూడండి, 7:133-135.
3. అల్లాహ్ (సు.తా.) వైపునకు మరలటం మానవుడు అల్లాహ్ (సు.తా.) ఉనికిని గ్రహించే స్వాభావిక లక్షణం. కాని మానవుడు అల్లాహ్ (సు.తా.) నుండి మరలిపోవటం అతని మానసిక పతనం, ఆధ్యాత్మిక భ్రష్టత్వం. చూడండి, 7:172-173.

وَنَادَىٰ فِرْعَوْنُ فِي قَوْمِهِۦ قَالَ يَٰقَوْمِ أَلَيْسَ لِي مُلْكُ مِصْرَ وَهَٰذِهِ ٱلْأَنْهَٰرُ تَجْرِي مِن تَحْتِيٓ ۖ أَفَلَا تُبْصِرُونَ ﴿٥١﴾

**51**. మరియు, ఫిర్'ఔన్ తన జాతి ప్రజలలో ప్రకటిస్తూ ఇలా అన్నాడు: "ఓ నా జాతి ప్రజలారా! ఈజిప్టు (మి'స్ర్) యొక్క సామ్రాజ్యాధిపత్యం నాది కాదా? మరియు ఈ సెలయేళ్ళు నా క్రింద ప్రవహించటం లేదా? ఇది మీకు కనిపించటంలేదా?

أَمْ أَنَا۠ خَيْرٌ مِّنْ هَٰذَا ٱلَّذِي هُوَ مَهِينٌ وَلَا يَكَادُ يُبِينُ ﴿٥٢﴾

**52**. "ఈ తుచ్ఛమైన వాడు మరియు (తన మాటను) స్పష్టంగా వివరించలేని వాడి (మూసా) కంటే నేను శ్రేష్ఠుణ్ణి కానా?[1]

فَلَوْلَآ أُلْقِيَ عَلَيْهِ أَسْوِرَةٌ مِّن ذَهَبٍ أَوْ جَآءَ مَعَهُ ٱلْمَلَٰٓئِكَةُ مُقْتَرِنِينَ ﴿٥٣﴾

**53**. "అయితే ఇతనికి బంగారు కంకణాలు ఎందుకు వేయబడలేదు. లేదా, ఇతనికి తోడుగా ఇతనితోపాటు దేవదూతలు ఎందుకు రాలేదు?"[2]

فَٱسْتَخَفَّ قَوْمَهُۥ فَأَطَاعُوهُ ۚ إِنَّهُمْ كَانُوا۟ قَوْمًا فَٰسِقِينَ ﴿٥٤﴾

**54**. ఈ విధంగా, అతడు (ఫిర్'ఔన్) తన జాతివారిని ప్రేరేపింపజేయటం వలన వారు అతనిని అనుసరించారు. నిశ్చయంగా వారు దుర్జనులు (ఫాసిఖీన్).

فَلَمَّآ ءَاسَفُونَا ٱنتَقَمْنَا مِنْهُمْ فَأَغْرَقْنَٰهُمْ أَجْمَعِينَ ﴿٥٥﴾

**55**. ఈ విధంగా వారు మమ్మల్ని కోపానికి గురిచేయటం వల్ల, మేము వారికి ప్రతీకారం చేశాము. మరియు వారందరినీ ముంచివేశాము.

---

**1**. మూసా ('అ.స.) సరిగ్గా మాట్లాడలేక పోయేవారు. నత్తినత్తిగా మాట్లాడే వారు (Stammer). దానికి చూడండి 20:27-28.

**2**. ప్రాచీన కాలంలో ఈజిప్టులో బంగారు కంకణాలు, మెడలలో బంగారు ఆభరణాలు పెద్దరికాన్ని సూచించేవి. (ఆదికాండము-Genesis, 12:42) అంటే మూసా ('అ.స.) అల్లాహ్ (సు.తా.) సందేశహరుడైతే అల్లాహ్ (సు.తా.), అతనికి, అతని గొప్పతనానికి తగినట్లు బంగారు ఆభరణాలు, కంకణాలు, ఎందుకు ప్రసాదించలేదు? ఇదే విధమైన ప్రశ్నలు ముష్రిక్ ఖురైషులు దైవప్రవక్త ('స'అస)ను కూడా అడిగారు.

**56**. ఇక మేము, వారిని తర్వాత వచ్చేవారి కొరకు ఒక గడిచిన నిదర్శనంగా మరియు ఒక ఉదాహరణగా చేశాము. (5/8)

**57**. * మరియు మర్యమ్ కుమారుడు ఒక ఉదాహరణగా పేర్కొనబడినప్పుడు (ఓ ము'హమ్మద్!) నీ జాతి ప్రజలు అతనిని గురించి కేకలు వేస్తారు.

**58**. మరియు అంటారు: "మా దేవుళ్ళు మంచివా లేక అతడా ('ఈసానా)?" వారు ఈ విషయం నీ ముందు పెట్టేది కేవలం జగడమాడటానికే. వాస్తవానికి వారు కలహప్రియులైన జనులు.

**59**. అతను (మర్యమ్ కుమారుడు) కేవలం ఒక దాసుడు మాత్రమే. మేము అతనిని అనుగ్రహించాము. మరియు మేము అతనిని ఇస్రాయీ'ల్ సంతతి వారికి ఒక నిదర్శనంగా చేశాము.

**60**. మరియు మేము కోరితే మీకు బదులుగా, దేవదూతలను భూమిపై ఉత్తరాధికారులుగా చేసేవారము.

**61**. మరియు నిశ్చయంగా, అతని ('ఈసా పునరాగమనం) అంతిమ ఘడియ రావటానికి సూచన.[1] కావున మీరు దానిని (ఆ ఘడియను) గురించి సంశయంలో పడకండి. మరియు నన్నే (అల్లాహ్ నే) అనుసరించండి, ఇదే ఋజుమార్గం.

فَجَعَلْنَٰهُمْ سَلَفًا وَمَثَلًا لِّلْءَاخِرِينَ ٥٦

۞ وَلَمَّا ضُرِبَ ٱبْنُ مَرْيَمَ مَثَلًا إِذَا قَوْمُكَ مِنْهُ يَصِدُّونَ ٥٧

وَقَالُوٓا۟ ءَأَٰلِهَتُنَا خَيْرٌ أَمْ هُوَ ۚ مَا ضَرَبُوهُ لَكَ إِلَّا جَدَلًۢا ۚ بَلْ هُمْ قَوْمٌ خَصِمُونَ ٥٨

إِنْ هُوَ إِلَّا عَبْدٌ أَنْعَمْنَا عَلَيْهِ وَجَعَلْنَٰهُ مَثَلًا لِّبَنِىٓ إِسْرَٰٓءِيلَ ٥٩

وَلَوْ نَشَآءُ لَجَعَلْنَا مِنكُم مَّلَٰٓئِكَةً فِى ٱلْأَرْضِ يَخْلُفُونَ ٦٠

وَإِنَّهُۥ لَعِلْمٌ لِّلسَّاعَةِ فَلَا تَمْتَرُنَّ بِهَا وَٱتَّبِعُونِ ۚ هَٰذَا صِرَٰطٌ مُّسْتَقِيمٌ ٦١

---

**1**. చాలా మంది వ్యాఖ్యాతల ప్రకారం 'ఈసా ('అ.స.) మరల వచ్చారంటే, పునరుత్థానదినం దగ్గరున్నట్లే! ఇది ఎన్నో 'స'హీ'హ్ 'హదీస్'లలో పేర్కొనబడింది.

62. మరియు షై'తాన్‌ను, మిమ్మల్ని ఆటంకపరచనివ్వకండి. నిశ్చయంగా అతడు మీకు బహిరంగ శత్రువు.

وَلَا يَصُدَّنَّكُمُ ٱلشَّيْطَٰنُ ۖ إِنَّهُۥ لَكُمْ عَدُوٌّ مُّبِينٌ ﴿٦٢﴾

63. మరియు, 'ఈసా స్పష్టమైన (మా) సూచనలు తీసుకొని వచ్చినప్పుడు ఇలా అన్నాడు: "వాస్తవంగా, నేను మీ వద్దకు వివేకాన్ని తీసుకొని వచ్చాను[1] మరియు మీరు విభేదాలకులోనైన కొన్ని విషయాల వాస్తవాన్ని మీకు స్పష్టంగా వివరించటానికి వచ్చాను. కావున మీరు అల్లాహ్ పట్ల భయభక్తులు కలిగి ఉండండి. మరియు నన్ను అనుసరించండి.

وَلَمَّا جَآءَ عِيسَىٰ بِٱلْبَيِّنَٰتِ قَالَ قَدْ جِئْتُكُم بِٱلْحِكْمَةِ وَلِأُبَيِّنَ لَكُم بَعْضَ ٱلَّذِى تَخْتَلِفُونَ فِيهِ ۖ فَٱتَّقُوا۟ ٱللَّهَ وَأَطِيعُونِ ﴿٦٣﴾

64. "నిశ్చయంగా, అల్లాహ్‌యే నా ప్రభువు మరియు మీ ప్రభువు కూడాను. కావున మీరు ఆయననే ఆరాధించండి. ఇదే ఋజుమార్గం."

إِنَّ ٱللَّهَ هُوَ رَبِّى وَرَبُّكُمْ فَٱعْبُدُوهُ ۚ هَٰذَا صِرَٰطٌ مُّسْتَقِيمٌ ﴿٦٤﴾

65. అయినా, తరువాత వచ్చిన వర్గాల వారు పరస్పర వర్గవిభేదాలకు లోనయ్యారు. కావున దుర్మార్గానికి పాల్పడిన వారికి బాధాకరమైన ఆ దినమున శిక్ష పడుతుంది!

فَٱخْتَلَفَ ٱلْأَحْزَابُ مِنۢ بَيْنِهِمْ ۖ فَوَيْلٌ لِّلَّذِينَ ظَلَمُوا۟ مِنْ عَذَابِ يَوْمٍ أَلِيمٍ ﴿٦٥﴾

66. వారు కేవలం ఆ అంతిమ ఘడియ అకస్మాత్తుగా - తమకు తెలియకుండానే - తమపై వచ్చిపడాలని నిరీక్షిస్తున్నారా ఏమిటి?

هَلْ يَنظُرُونَ إِلَّا ٱلسَّاعَةَ أَن تَأْتِيَهُم بَغْتَةً وَهُمْ لَا يَشْعُرُونَ ﴿٦٦﴾

67. ఆ దినమున దైవభీతి గలవారు తప్ప ఇతర స్నేహితులంతా ఒకరికొకరు శత్రువులవుతారు.

ٱلْأَخِلَّآءُ يَوْمَئِذٍۭ بَعْضُهُمْ لِبَعْضٍ عَدُوٌّ إِلَّا ٱلْمُتَّقِينَ ﴿٦٧﴾

---

1. వివేకం, అంటే దివ్యజ్ఞానం (వ'హీ).

**68**. (విశ్వాసులతో ఇలా అనబడు తుంది): "ఓ నా దాసులారా! ఈ నాడు మీకు ఏ భయమూ లేదు మరియు మీరు దుఃఖపడరు కూడా!

**69**. "అలాంటి వారు, ఎవరైతే మా సూచనలను విశ్వసించారో మరియు ముస్లింలు అయిఉన్నారో!

**70**. "మీరు మరియు మీ సహవాసులు (అ'జ్వాజ్) సంతోషంగా స్వర్గంలో ప్రవేశించండి."

**71**. వారి మధ్య, బంగారు పళ్ళాలు[1] మరియు కప్పులు త్రిప్పబడతాయి. మరియు అందులో, మనస్సులు కోరేవి మరియు కళ్ళకు ఇంపుగా ఉండేవి, అన్నీ ఉంటాయి. మరియు మీరందులో శాశ్వతంగా ఉంటారు.

**72**. మరియు మీరు చేస్తూవున్న కర్మల ఫలితానికి బదులుగా, మీరు ఈ స్వర్గానికి వారసులయ్యారు.

**73**. మీకు అందులో పండ్లూ ఫలాలు పుష్కలంగా ఉంటాయి, వాటిని మీరు తింటారు.

**74**. నిశ్చయంగా అపరాధులు నరకశిక్షలో శాశ్వతంగా ఉంటారు.[2]

**75**. వారి (శిక్ష) ఏ మాత్రం తగ్గించబడదు మరియు వారందులో హతాశులై పడిఉంటారు.

---

1. 'సి'హాఫున్, 'స'హ్ఫతున్ (ఏ.వ.): Plate, అన్నం తినే పళ్ళెం. అన్నిటి కంటే పెద్ద పళ్ళాన్ని జఫ్నతున్ అంటారు. దాని తరువాత ఖ'స్'అతున్ దీనిలో పదిమంది తినగలుగుతారు. దానిలో సగం ఉండేది 'సహ్ఫతున్, దాని కంటే చిన్నది మికీలతున్. (ఫ'త్హ్ అల్-ఖదీర్).
2. చూడండి, 6:128 చివరి వాక్యం మరియు 40:12/3 వ్యాఖ్యానంలో సూచించిన 'హదీస్'.

يَٰعِبَادِ لَا خَوۡفٌ عَلَيۡكُمُ ٱلۡيَوۡمَ وَلَآ أَنتُمۡ تَحۡزَنُونَ ٦٨

ٱلَّذِينَ ءَامَنُواْ بِـَٔايَٰتِنَا وَكَانُواْ مُسۡلِمِينَ ٦٩

ٱدۡخُلُواْ ٱلۡجَنَّةَ أَنتُمۡ وَأَزۡوَٰجُكُمۡ تُحۡبَرُونَ ٧٠

يُطَافُ عَلَيۡهِم بِصِحَافٖ مِّن ذَهَبٖ وَأَكۡوَابٖۖ وَفِيهَا مَا تَشۡتَهِيهِ ٱلۡأَنفُسُ وَتَلَذُّ ٱلۡأَعۡيُنُۖ وَأَنتُمۡ فِيهَا خَٰلِدُونَ ٧١

وَتِلۡكَ ٱلۡجَنَّةُ ٱلَّتِيٓ أُورِثۡتُمُوهَا بِمَا كُنتُمۡ تَعۡمَلُونَ ٧٢

لَكُمۡ فِيهَا فَٰكِهَةٞ كَثِيرَةٞ مِّنۡهَا تَأۡكُلُونَ ٧٣

إِنَّ ٱلۡمُجۡرِمِينَ فِي عَذَابِ جَهَنَّمَ خَٰلِدُونَ ٧٤

لَا يُفَتَّرُ عَنۡهُمۡ وَهُمۡ فِيهِ مُبۡلِسُونَ ٧٥

وَمَا ظَلَمْنَٰهُمْ وَلَٰكِن كَانُوا۟ هُمُ ٱلظَّٰلِمِينَ ﴿٧٦﴾

**76**. మేము వారికి ఎలాంటి అన్యాయం చేయలేదు, కాని వారే దుర్మార్గులై ఉండిరి.[1]

وَنَادَوْا۟ يَٰمَٰلِكُ لِيَقْضِ عَلَيْنَا رَبُّكَ ۖ قَالَ إِنَّكُم مَّٰكِثُونَ ﴿٧٧﴾

**77**. మరియు వారిలా మొర పెట్టుకుంటారు: ''ఓ నరక పాలకుడా (మాలిక్)! నీ ప్రభువును మమ్మల్ని అంతంచేయమను.'' అతను అంటాడు: ''నిశ్చయంగా మీరిక్కడే (ఇదే విధంగా) పడిఉంటారు.''

لَقَدْ جِئْنَٰكُم بِٱلْحَقِّ وَلَٰكِنَّ أَكْثَرَكُمْ لِلْحَقِّ كَٰرِهُونَ ﴿٧٨﴾

**78**. వాస్తవానికి మేము మీ వద్దకు సత్యాన్ని తీసుకొనివచ్చాము, కాని మీలో చాలామంది సత్యమంటేనే అసహ్యించుకునే వారు.

أَمْ أَبْرَمُوٓا۟ أَمْرًا فَإِنَّا مُبْرِمُونَ ﴿٧٩﴾

**79**. వారు ఏదైనా నిర్ణయం (పన్నాగం) చేస్తున్నారా ఏమిటి? అయితే నిశ్చయంగా, మేము కూడా ఒక గట్టి నిర్ణయం (పన్నాగం) చేస్తున్నాము.[2]

أَمْ يَحْسَبُونَ أَنَّا لَا نَسْمَعُ سِرَّهُمْ وَنَجْوَىٰهُم ۚ بَلَىٰ وَرُسُلُنَا لَدَيْهِمْ يَكْتُبُونَ ﴿٨٠﴾

**80**. లేదా! మేము వారి రహస్య విషయాలను మరియు వారి గుసగుసలను వినటంలేదని వారనుకుంటున్నారా? అలా కాదు, (వాస్తవానికి) మా దూతలు వారి దగ్గర ఉండి, అంతా వ్రాస్తున్నారు.

قُلْ إِن كَانَ لِلرَّحْمَٰنِ وَلَدٌ فَأَنَا۠ أَوَّلُ ٱلْعَٰبِدِينَ ﴿٨١﴾

**81**. వారితో ఇలా అను: ''ఒకవేళ ఆ కరుణామయునికి కుమారుడే ఉంటే, అందరికంటే ముందు నేనే అతనిని ఆరాధించేవాడిని.''

---

**1**. అంటే వారే తమకు తాము అన్యాయం చేసుకున్నారు.
**2**. చూడండి, 52:42.

سُبْحَٰنَ رَبِّ ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضِ رَبِّ ٱلْعَرْشِ عَمَّا يَصِفُونَ ﴿٨٢﴾

**82**. భూమ్యాకాశాలకు ప్రభువు మరియు సింహాసనానికి ('అర్ష్‌కు) ప్రభువు అయిన ఆయన (అల్లాహ్), వారి కల్పనలకు అతీతుడు.[1]

فَذَرْهُمْ يَخُوضُوا۟ وَيَلْعَبُوا۟ حَتَّىٰ يُلَٰقُوا۟ يَوْمَهُمُ ٱلَّذِى يُوعَدُونَ ﴿٨٣﴾

**83**. వారికి వాగ్దానం చేయబడిన ఆ దినాన్ని వారు దర్శించేవరకు, వారిని వారి వాదోపవాదాలలో మరియు వారి క్రీడలలో మునిగిఉండనీ!

وَهُوَ ٱلَّذِى فِى ٱلسَّمَآءِ إِلَٰهٌ وَفِى ٱلْأَرْضِ إِلَٰهٌ ۚ وَهُوَ ٱلْحَكِيمُ ٱلْعَلِيمُ ﴿٨٤﴾

**84**. మరియు ఆయన (అల్లాహ్) మాత్రమే ఆకాశాలలో ఆరాధ్యుడు మరియు భూమిలో కూడా ఆరాధ్యుడు. మరియు ఆయన మహా వివేకవంతుడు, సర్వజ్ఞుడు.[2]

وَتَبَارَكَ ٱلَّذِى لَهُۥ مُلْكُ ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضِ وَمَا بَيْنَهُمَا وَعِندَهُۥ عِلْمُ ٱلسَّاعَةِ وَإِلَيْهِ تُرْجَعُونَ ﴿٨٥﴾

**85**. మరియు ఆకాశాలలోను మరియు భూమిలోను మరియు ఆ రెండింటి మధ్యను ఉన్న సమస్తానికీ సామ్రాజ్యాధికారి అయిన ఆయన (అల్లాహ్) శుభదాయకుడు మరియు అంతిమ ఘడియ జ్ఞానం కేవలం ఆయనకే ఉంది మరియు ఆయన వైపునకే మీరంతా మరలింపబడతారు.

وَلَا يَمْلِكُ ٱلَّذِينَ يَدْعُونَ مِن دُونِهِ ٱلشَّفَٰعَةَ إِلَّا مَن شَهِدَ بِٱلْحَقِّ وَهُمْ يَعْلَمُونَ ﴿٨٦﴾

**86**. మరియు వారు ఆయనను వదలి, ఎవరినైతే ప్రార్థిస్తున్నారో, వారికి సిఫారసు చేసే అధికారం లేదు.[3] కేవలం సత్యానికి సాక్ష్యమిచ్చేవారు మరియు (అల్లాహ్ ఒక్కడే! అని) తెలిసి ఉన్నవారు తప్ప!

---

**1**. చూడండి, 6:100.
**2**. చూడండి, 6:3.
**3**. చూడండి, 10:3.

وَلَئِن سَأَلْتَهُم مَّنْ خَلَقَهُمْ لَيَقُولُنَّ ٱللَّهُ ۖ فَأَنَّىٰ يُؤْفَكُونَ ﴿٨٧﴾

**87**. మరియు నీవు: "మిమ్మల్ని ఎవరు సృష్టించారు?" అని వారితో అడిగినప్పుడు, వారు నిశ్చయంగా: "అల్లాహ్!" అని అంటారు. అయితే వారు ఎందుకు మోసగింప (సత్యం నుండి మరలింప) బడుతున్నారు?

وَقِيلِهِۦ يَـٰرَبِّ إِنَّ هَـٰٓؤُلَآءِ قَوْمٌ لَّا يُؤْمِنُونَ ﴿٨٨﴾

**88**. మరియు "ఓ నా ప్రభూ! నిశ్చయంగా, ఈ ప్రజలు విశ్వసించరు!" అని పలికే (ప్రవక్త యొక్క) మాట (అల్లాహ్‌కు బాగా తెలుసు).

فَٱصْفَحْ عَنْهُمْ وَقُلْ سَلَـٰمٌ ۚ فَسَوْفَ يَعْلَمُونَ ﴿٨٩﴾

**89**. కావున నీవు (ఓ ము'హమ్మద్!) వారిని ఉపేక్షించు మరియు ఇలా అను: "మీకు సలాం!"[1] ముందు వారు తెలుసుకుంటారు.

*****

---

**1**. ఇక్కడ కేవలం సలామున్ ఉంది; అస్సలాము అని లేదు. అంటే - మీదారి మీది మరియు మాదారి మాది, అని అర్థం. మీరు ముమ్మందు తెలుసుకుంటారు. ఎవరు సన్మార్గం మీద ఉన్నారో! మరియు ఎవరు దుర్మార్గం మీద ఉన్నారో! ఇంకా చూడండి, 25:63, 28:55.

## 44. సూరహ్ అద్-దు'ఖాన్ سُورَةُ الدُّخَانِ

దు'ఖానున్: **పొగ**. ఈ సూరహ్ కూడా ఇతర 'హా-మీమ్ సూరాహ్‌లవలే మక్కా మధ్య కాలపు చివరి భాగంలో అవతరింపజేయబడింది. ఈ సూరాహ్‌లలో ఇది ఐదవది. దీని పేరు **10**వ **ఆయత్** నుండి తీసుకోబడింది. ఈ సూరహ్ పునరుత్థానదినం సత్యమనీ, అది తప్పక వస్తుందని తెలుపుతోంది మరియు అప్పుడు సంభవించే విషయాలను కూడా వివరిస్తోంది. ఇందులో **59 ఆయతులు** ఉన్నాయి.

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

C B A

**1**. 'హా-మీమ్.

حمٓ ﴿١﴾

**2**. స్పష్టమైన ఈ గ్రంథం సాక్షిగా![1]

وَٱلْكِتَٰبِ ٱلْمُبِينِ ﴿٢﴾

**3**. నిశ్చయంగా, మేము దీనిని (ఈ ఖుర్ఆన్‌ను) శుభవంతమైన రాత్రిలో అవతరింపజేశాము.[2] నిశ్చయంగా, మేము (ప్రజలను) ఎల్లప్పుడూ హెచ్చరిస్తూ వచ్చాము.[3]

إِنَّآ أَنزَلْنَٰهُ فِى لَيْلَةٍ مُّبَٰرَكَةٍ ۚ إِنَّا كُنَّا مُنذِرِينَ ﴿٣﴾

**4**. దానిలో (ఆ రాత్రిలో), ప్రతి విషయం వివేకంతో విశదీకరించబడింది,

فِيهَا يُفْرَقُ كُلُّ أَمْرٍ حَكِيمٍ ﴿٤﴾

---

**1**. చూడండి, 12:1.

**2**. ఖుర్ఆన్ అవతరింపజేయబడిన రాత్రి లైలతుల్ ఖద్ర్ శుభవంతమైన రాత్రి. చూడండి, సూరహ్ అల్-ఖద్ర్ (97). ఇంకా చూడండి, 2:185 ఈ రాత్రి రమ'దాన్ నెల చివరి 10 రోజులలోని బేసి రాత్రులలో ఒకటి అని చాలామంది వ్యాఖ్యాతల అభిప్రాయం. 1) ఈ రాత్రిలో ఖుర్ఆన్ అవతరింపజేయబడింది. 2) ఈ రాత్రిలోనే దైవదూత ('అలైహిమ్ స.)లు మరియు పవిత్ర ఆత్మ (జిబ్రీల్ 'అ.స.) దిగివస్తారు. 3) ఈ రాత్రిలో, రాబోయే సంవత్సరంలో జరుగబోయే విషయాల నిర్ణయం జరుగుతుంది. 4) ఈ రాత్రిలో చేసే ఆరాధన ('ఇబాదహ్) వేయి నెలల (83 సంవత్సరాల 4 నెలల) ఆరాధన కంటే ఉత్తమమైనది. ఈ రాత్రిలోనే ఖుర్ఆన్ ఏడవ ఆకాశంపై ఉన్న లౌ'హె మ'హ్ఫూ''జ్ నుండి భూలోకపు ఆకాశంపై ఉన్న బైతుల్ 'ఇజ్జహ్‌లోకి మొత్తం ఒకేసారి దింపబడింది. ఆ తరువాత 23 సంవత్సరాలలో క్రమక్రమంగా దైవప్రవక్త ('స'అస) మీద అవతరింపజేయబడింది.

**3**. ఖుర్ఆన్ అవతరణ ప్రజలకు మంచి చెడును బోధించటానికి జరిగింది.

أَمْرًا مِّنْ عِندِنَآ ۚ إِنَّا كُنَّا مُرْسِلِينَ ﴿٥﴾

**5**. మా ఆజ్ఞానుసారంగా. నిశ్చయంగా, మేము (సందేశహరులను) పంపుతూ వచ్చాము.

رَحْمَةً مِّن رَّبِّكَ ۚ إِنَّهُۥ هُوَ ٱلسَّمِيعُ ٱلْعَلِيمُ ﴿٦﴾

**6**. నీ ప్రభువు తరఫునుండి కారుణ్యంగా! నిశ్చయంగా, ఆయనే అంతా వినేవాడు, సర్వజ్ఞుడు.

رَبِّ ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضِ وَمَا بَيْنَهُمَآ ۖ إِن كُنتُم مُّوقِنِينَ ﴿٧﴾

**7**. భూమ్యాకాశాలకు మరియు వాటి మధ్య ఉన్న సమస్తానికీ ప్రభువు. మీకు వాస్తవంగా నమ్మకమే ఉంటే!

لَآ إِلَٰهَ إِلَّا هُوَ يُحْيِۦ وَيُمِيتُ ۖ رَبُّكُمْ وَرَبُّ ءَابَآئِكُمُ ٱلْأَوَّلِينَ ﴿٨﴾

**8**. ఆయన తప్ప మరొక ఆరాధ్య దేవుడు లేడు. ఆయనే జీవితాన్ని ప్రసాదించేవాడు మరియు ఆయనే మరణాన్ని ఇచ్చేవాడు. ఆయనే మీ ప్రభువు మరియు పూర్వీకులైన మీ తాతముత్తాతల ప్రభువు.[1]

بَلْ هُمْ فِى شَكٍّ يَلْعَبُونَ ﴿٩﴾

**9**. అసలు! వారు సందేహంలో పడి ఆటల్లో మునిగిఉన్నారు (పరిహసిస్తున్నారు).

فَٱرْتَقِبْ يَوْمَ تَأْتِى ٱلسَّمَآءُ بِدُخَانٍ مُّبِينٍ ﴿١٠﴾

**10**. కావున నీవు ఆకాశంనుండి స్పష్టమైన పొగవచ్చే దినం కొరకు నిరీక్షించు!

يَغْشَى ٱلنَّاسَ ۖ هَٰذَا عَذَابٌ أَلِيمٌ ﴿١١﴾

**11**. అది మానవులందరినీ క్రమ్ముకుంటుంది. అదొక బాధాకరమైన శిక్ష.

رَّبَّنَا ٱكْشِفْ عَنَّا ٱلْعَذَابَ إِنَّا مُؤْمِنُونَ ﴿١٢﴾

**12**. (అప్పుడు వారు ఇలా వేడుకుంటారు): ''ఓ మా ప్రభూ! ఈ శిక్షను మా నుండి తొలగించు; నిశ్చయంగా, మేము విశ్వాసుల మవుతాము.''

---

**1**. చూడండి, 7:158. ఈ ఆయత్‌ను పోలిన ఆయత్.

أَنَّىٰ لَهُمُ ٱلذِّكْرَىٰ وَقَدْ جَآءَهُمْ رَسُولٌ مُّبِينٌ ﴿١٣﴾

13. ఇక (అంతిమ ఘడియలో) హితబోధ స్వీకరించటం వారికి ఎలా పనికిరాగలదు? వాస్తవానికి వారివద్దకు (సత్యాన్ని) స్పష్టంగా తెలియజేసే ప్రవక్త వచ్చి ఉన్నాడు;

ثُمَّ تَوَلَّوْا۟ عَنْهُ وَقَالُوا۟ مُعَلَّمٌ مَّجْنُونٌ ﴿١٤﴾

14. అప్పుడు వారు అతని నుండి మరలి పోయారు మరియు ఇలా అన్నారు: "ఇతను ఇతరుల నుండి నేర్చుకున్నాడు, ఇతనొక పిచ్చివాడు!"[1]

إِنَّا كَاشِفُوا۟ ٱلْعَذَابِ قَلِيلًا ۚ إِنَّكُمْ عَآئِدُونَ ﴿١٥﴾

15. వాస్తవానికి మేము కొంతకాలం వరకు ఈ శిక్షను తొలగిస్తే! నిశ్చయంగా, మీరు చేస్తూవచ్చిందే మళ్ళీచేస్తారు.

يَوْمَ نَبْطِشُ ٱلْبَطْشَةَ ٱلْكُبْرَىٰٓ إِنَّا مُنتَقِمُونَ ﴿١٦﴾

16. మేము శిక్షించటం కోసం గట్టిగా పట్టుకున్న రోజు, మేము నిశ్చయంగా, ప్రతీకారం చేస్తాము. (3/4)

۞ وَلَقَدْ فَتَنَّا قَبْلَهُمْ قَوْمَ فِرْعَوْنَ وَجَآءَهُمْ رَسُولٌ كَرِيمٌ ﴿١٧﴾

17.* మరియు వాస్తవంగా, వారికి పూర్వం మేము ఫిర్'ఔన్ జాతివారిని పరీక్షకు గురిచేశాము. మరియు వారివద్దకు గౌరవనీయుడైన ప్రవక్త వచ్చి ఉన్నాడు.

أَنْ أَدُّوٓا۟ إِلَىَّ عِبَادَ ٱللَّهِ ۖ إِنِّى لَكُمْ رَسُولٌ أَمِينٌ ﴿١٨﴾

18. (అతను ఇలా అన్నాడు): "అల్లాహ్ దాసులను నాకు అప్పగించు.[2] నేను మీ వద్దకు పంపబడిన నమ్మకస్తుణ్ణయిన సందేశహరుణ్ణి.

وَأَن لَّا تَعْلُوا۟ عَلَى ٱللَّهِ ۖ إِنِّىٓ ءَاتِيكُم بِسُلْطَٰنٍ مُّبِينٍ ﴿١٩﴾

19. "మరియు మీరు అల్లాహ్ ముందు అహంభావాన్ని (ఔన్నత్యాన్ని) చూపకండి. నిశ్చయంగా, నేను మీ వద్దకు స్పష్టమైన ప్రమాణం తీసుకొనివచ్చాను.

---

1. చూడండి, 16:103 మరియు 25:4.
2. 'ఇబాదల్లాహ్: అంటే ఇక్కడ మూసా ('అ.స.) జాతివారైన బనీ ఇస్రాయీ'ల్ తెగవారు.

وَإِنِّي عُذْتُ بِرَبِّي وَرَبِّكُمْ أَن تَرْجُمُونِ ﴿٢٠﴾

**20**. ''మరియు నిశ్చయంగా, నేను నా ప్రభువు మరియు మీ ప్రభువు (అయిన అల్లాహ్) యొక్క శరణు పొందాను - మీరు నన్ను రాళ్ళురువ్వి చంపకుండా ఉండటానికి!

وَإِن لَّمْ تُؤْمِنُوا لِي فَاعْتَزِلُونِ ﴿٢١﴾

**21**. ''ఒకవేళ మీరు నా మాట నమ్మకపోయినా సరే! నాజోలికి మాత్రం రాకండి!''

فَدَعَا رَبَّهُ أَنَّ هَٰؤُلَاءِ قَوْمٌ مُّجْرِمُونَ ﴿٢٢﴾

**22**. చివరకు అతను తన ప్రభువును ఇలా ప్రార్థించాడు: ''నిశ్చయంగా, ఈ జనులు చాలా అపరాధులు!''

فَأَسْرِ بِعِبَادِي لَيْلًا إِنَّكُم مُّتَّبَعُونَ ﴿٢٣﴾

**23**. (అల్లాహ్ ఇలా సెలవిచ్చాడు): ''నీవు నా దాసులను తీసుకొని రాత్రివేళ బయలుదేరు, నిశ్చయంగా మీరు వెంబడించబడతారు.

وَاتْرُكِ الْبَحْرَ رَهْوًا ۖ إِنَّهُمْ جُندٌ مُّغْرَقُونَ ﴿٢٤﴾

**24**. ''మరియు సముద్రాన్ని చీల్చి నెమ్మదిగా వెళ్ళిపో.[1] నిశ్చయంగా, ఆ సైనికులు అందులో మునిగిపోతారు!''

كَمْ تَرَكُوا مِن جَنَّاتٍ وَعُيُونٍ ﴿٢٥﴾

**25**. వారు ఎన్నో తోటలను మరియు చెలమలను వెనుక విడిచిపోయారు;

وَزُرُوعٍ وَمَقَامٍ كَرِيمٍ ﴿٢٦﴾

**26**. మరియు ఎన్నో పంటపొలాలను మరియు గొప్ప భవనాలను;

وَنَعْمَةٍ كَانُوا فِيهَا فَاكِهِينَ ﴿٢٧﴾

**27**. మరియు వారు అనుభవిస్తూ ఉన్న ఎన్నో సుఖసంతోషాలను కూడా!

كَذَٰلِكَ ۖ وَأَوْرَثْنَاهَا قَوْمًا آخَرِينَ ﴿٢٨﴾

**28**. ఈ విధంగా, (వారి ముగింపు జరిగింది). మరియు మేము వాటికి ఇతర జాతివారిని వారసులుగా చేశాము.

---

**1**. చూడండి, 26:63-66. రహ్వన్: అంటే ప్రశాంతమైనది లేక తడిలేనిది. జౌహరీ (ర'హ్మ) దీనిని ప్రశాంతంగా చీలిపోయి ఉన్నది, అని వివరించారు.

فَمَا بَكَتۡ عَلَيۡهِمُ ٱلسَّمَآءُ وَٱلۡأَرۡضُ وَمَا كَانُواْ مُنظَرِينَ ﴿٢٩﴾

**29**. కాని, వారికొరకు ఆకాశం గానీ, భూమి గానీ విలపించలేదు మరియు వారికి ఎలాంటి వ్యవధి కూడా ఇవ్వబడలేదు.

وَلَقَدۡ نَجَّيۡنَا بَنِيٓ إِسۡرَٰٓءِيلَ مِنَ ٱلۡعَذَابِ ٱلۡمُهِينِ ﴿٣٠﴾

**30**. మరియు వాస్తవంగా! మేము ఇస్రాయీల్ సంతతివారిని అవమానకరమైన శిక్షనుండి విముక్తి కలిగించాము -

مِن فِرۡعَوۡنَۚ إِنَّهُۥ كَانَ عَالِيٗا مِّنَ ٱلۡمُسۡرِفِينَ ﴿٣١﴾

**31**. ఫిర్'ఔన్ నుండి. నిశ్చయంగా అతడు మితిమీరి ప్రవర్తించేవారిలో, అగ్రగణ్యుడు.

وَلَقَدِ ٱخۡتَرۡنَٰهُمۡ عَلَىٰ عِلۡمٍ عَلَى ٱلۡعَٰلَمِينَ ﴿٣٢﴾

**32**. మరియు వాస్తవానికి మాకు తెలిసి ఉండి కూడా మేము వారిని లోకంలో (ఆ కాలపు) సర్వజనులపై ఎన్నుకున్నాము.[1]

وَءَاتَيۡنَٰهُم مِّنَ ٱلۡأٓيَٰتِ مَا فِيهِ بَلَٰٓؤٞاْ مُّبِينٌ ﴿٣٣﴾

**33**. మరియు మేము వారికి అద్భుత సూచన(ఆయాత్)లను ఒసంగి ఉంటిమి. అందులో వారికి స్పష్టమైన పరీక్ష ఉండింది.

إِنَّ هَٰٓؤُلَآءِ لَيَقُولُونَ ﴿٣٤﴾

**34**. నిశ్చయంగా, వీరు (ఖురైషులు) ఇలా అంటున్నారు:

إِنۡ هِيَ إِلَّا مَوۡتَتُنَا ٱلۡأُولَىٰ وَمَا نَحۡنُ بِمُنشَرِينَ ﴿٣٥﴾

**35**. ''వాస్తవానికి, మాకు ఈ మొదటి మరణం మాత్రమే ఉంది, ఆ తరువాత మేము తిరిగి బ్రతికించబడము.

فَأۡتُواْ بِـَٔابَآئِنَآ إِن كُنتُمۡ صَٰدِقِينَ ﴿٣٦﴾

**36**. ''మీరు సత్యవంతులే అయితే, మా తాతముత్తాతలను లేపి తీసుకురండి!''[2]

---

**1**. ఎందుకంటే ఆ కాలంలో కేవలం బనీ-ఇస్రాయీ'ల్ వారు మాత్రమే ఏకైక ఆరాధ్యుడు అల్లాహ్ (సు.తా.)ను ప్రార్థించేవారు. మిగతా వారంతా బహుదైవారాధకులుగా ఉన్నారు.

**2**. చూడండి, 43:22-23.

أَهُمْ خَيْرٌ أَمْ قَوْمُ تُبَّعٍ وَالَّذِينَ مِن قَبْلِهِمْ أَهْلَكْنَاهُمْ إِنَّهُمْ كَانُوا مُجْرِمِينَ ﴿٣٧﴾

**37**. వారు మేలైన వారా? లేక తుబ్బ'అ జాతివారు[1] మరియు వారికంటే పూర్వం వారా? మేము వారందరినీ నాశనంచేశాము. నిశ్చయంగా, వారూ అపరాధులే!

وَمَا خَلَقْنَا السَّمَاوَاتِ وَالْأَرْضَ وَمَا بَيْنَهُمَا لَاعِبِينَ ﴿٣٨﴾

**38**. మేము ఈ ఆకాశాలను మరియు భూమిని మరియు వాటి మధ్య నున్న సమస్తాన్నీ ఆట (కాలక్షేపం) కొరకు సృష్టించలేదు.[2]

مَا خَلَقْنَاهُمَا إِلَّا بِالْحَقِّ وَلَٰكِنَّ أَكْثَرَهُمْ لَا يَعْلَمُونَ ﴿٣٩﴾

**39**. మేము వాటిని ఒక లక్ష్యంతోనే సృష్టించాము, కాని చాలా మందికి ఇది తెలియదు.[3]

إِنَّ يَوْمَ الْفَصْلِ مِيقَاتُهُمْ أَجْمَعِينَ ﴿٤٠﴾

**40**. నిశ్చయంగా, తీర్పుదినం వారందరి కొరకు ఒక నిర్ణీతదినం.[4]

يَوْمَ لَا يُغْنِي مَوْلًى عَن مَّوْلًى شَيْئًا وَلَا هُمْ يُنصَرُونَ ﴿٤١﴾

**41**. ఆ దినమున ఏ స్నేహితుడు కూడా మరొక స్నేహితునికి ఏ మాత్రం ఉపయోగపడడు మరియు వారికెలాంటి సహాయమూ లభించదు[5] -

إِلَّا مَن رَّحِمَ اللَّهُ ۚ إِنَّهُ هُوَ الْعَزِيزُ الرَّحِيمُ ﴿٤٢﴾

**42**. అల్లాహ్ కరుణించిన వానికి తప్ప. నిశ్చయంగా, ఆయనే సర్వశక్తిమంతుడు, అపార కరుణాప్రదాత.

---

**1**. తుబ్బ'అ అంటే సబా' ప్రాంతంలో నివసించే 'హిమ్యార్ తెగకు చెందినవారు. వారి రాజుల బిరుదు తుబ్బ'అ. ఏవిధంగానైతే రోమన్ రాజులు సీజర్ అనబడేవారో! వారు చాలా కాలం దక్షిణ 'అరేబియా మీద రాజరికం చేశారు. వారిని, అబిసీనియా వారు (Abyssinians) 4వ క్రీ.శ.లో అంతమొందించారు. చూడండి, 50:14 వారు సత్యతిరస్కారులు.

**2**. ఇటువంటి ఆయత్ కోసం చూడండి, 38:27, 23:115-116, 15:85 మరియు 21:16.

**3**. చూడండి, 10:5.

**4**. చూడండి, 77:13.

**5**. చూడండి, 23:101, 70:10. మౌలా: అంటే కొందరు, ''దగ్గరి బంధువు,'' అని కూడా తాత్పర్యమిచ్చారు.

| | |
|---|---|
| **43**. నిశ్చయంగా 'జఖ్ఖూమ్ వృక్షఫలం, | إِنَّ شَجَرَتَ ٱلزَّقُّومِ ﴿٤٣﴾ |
| **44**. పాపులకు అహారంగా ఇవ్వబడు తుంది; | طَعَامُ ٱلْأَثِيمِ ﴿٤٤﴾ |
| **45**. మరిగే నూనె (సీసం) వలే,[1] అది వారి కడుపులో మరుగుతుంది, | كَٱلْمُهْلِ يَغْلِى فِى ٱلْبُطُونِ ﴿٤٥﴾ |
| **46**. సలసల కాగే నీటిలాగా! | كَغَلْيِ ٱلْحَمِيمِ ﴿٤٦﴾ |
| **47**. (ఇలా అనబడుతుంది): ''ఇతనిని పట్టుకొని భగభగ మండే నరకాగ్ని మధ్యలోకి ఈడ్వండి, | خُذُوهُ فَٱعْتِلُوهُ إِلَىٰ سَوَآءِ ٱلْجَحِيمِ ﴿٤٧﴾ |
| **48**. ''ఆ తరువాత అతని నెత్తిమీద సలసల కాగే నీటి శిక్షను పోయండి. | ثُمَّ صُبُّوا۟ فَوْقَ رَأْسِهِۦ مِنْ عَذَابِ ٱلْحَمِيمِ ﴿٤٨﴾ |
| **49**. '' 'దీనిని రుచిచూడు; నిశ్చయంగా, నీవు శక్తిమంతుడివిగా, గౌరవనీయుడివిగా ఉండేవాడివి కదా!' | ذُقْ إِنَّكَ أَنتَ ٱلْعَزِيزُ ٱلْكَرِيمُ ﴿٤٩﴾ |
| **50**. ''నిశ్చయంగా, ఇదే మీరు సందేహంలో పడివున్న విషయం!'' | إِنَّ هَٰذَا مَا كُنتُم بِهِۦ تَمْتَرُونَ ﴿٥٠﴾ |
| **51**. నిశ్చయంగా, దైవభీతి గలవారు శాంతి భద్రతలుగల స్థలంలో ఉంటారు. | إِنَّ ٱلْمُتَّقِينَ فِى مَقَامٍ أَمِينٍ ﴿٥١﴾ |
| **52**. ఉద్యానవనాలలో మరియు చెలమల మధ్య. | فِى جَنَّٰتٍ وَعُيُونٍ ﴿٥٢﴾ |
| **53**. వారు, మృదువైన పట్టువస్త్రాలు మరియు బంగారు (జరీ) పట్టు వస్త్రాలు ధరించి, ఒకరికొకరు ఎదురెదురుగా కూర్చొని ఉంటారు.[2] | يَلْبَسُونَ مِن سُندُسٍ وَإِسْتَبْرَقٍ مُّتَقَٰبِلِينَ ﴿٥٣﴾ |

**1**. అల్-ముహ్లు: కరిగిన రాగి అని కూడా కొందరు వ్యాఖ్యానించారు.
**2**. చూడండి, 18:31 మరియు 35:33.

**54**. ఇలా ఉంటుంది వారిస్థితి! మరియు మేము వారిని అందమైన, ప్రకాశవంతమైన కళ్ళుగల వారి ('హూర్‌ల)తో వివాహం చేయిస్తాము.[1]

كَذَٰلِكَ وَزَوَّجۡنَٰهُم بِحُورٍ عِينٖ ٥٤

**55**. వారక్కడ శాంతియుతంగా ఉంటూ అనేకరకాలైన ఫలాలను అడుగుతుంటారు.[2]

يَدۡعُونَ فِيهَا بِكُلِّ فَٰكِهَةٍ ءَامِنِينَ ٥٥

**56**. వారక్కడ మరణాన్ని[3] ఎన్నడూ రుచిచూడరు; వారి మొదటి (ఇహలోక) మరణం తప్ప! మరియు ఆయన వారిని భగభగ మండే అగ్నిశిక్ష నుండి కాపాడాడు;

لَا يَذُوقُونَ فِيهَا ٱلۡمَوۡتَ إِلَّا ٱلۡمَوۡتَةَ ٱلۡأُولَىٰۖ وَوَقَىٰهُمۡ عَذَابَ ٱلۡجَحِيمِ ٥٦

**57**. నీ ప్రభువు అనుగ్రహం వల్ల. ఇదే, ఆ గొప్ప సాఫల్యం!

فَضۡلٗا مِّن رَّبِّكَۚ ذَٰلِكَ هُوَ ٱلۡفَوۡزُ ٱلۡعَظِيمُ ٥٧

**58**. అందుకే నిశ్చయంగా, మేము (ఈ ఖుర్ఆన్‌ను) నీ భాషలో సులభం చేశాము; ఇలాగైనా వారు అర్థం చేసుకుంటారని (హితబోధ గ్రహిస్తారని).[4]

فَإِنَّمَا يَسَّرۡنَٰهُ بِلِسَانِكَ لَعَلَّهُمۡ يَتَذَكَّرُونَ ٥٨

**59**. కావున, నీవు నిరీక్షించు! నిశ్చయంగా, వారు కూడా నిరీక్షిస్తున్నారు.

فَٱرۡتَقِبۡ إِنَّهُم مُّرۡتَقِبُونَ ٥٩

*****

---

**1**. 'హూరున్: చూడండి, 56:22, 52:20, 55:56, 37:48,38:52. వారి కళ్ళనలుపు మరియు తెలుపు ఎంతో అందంగా ఉంటాయి. వారిని చూసినవారు వారి అందానికి ముగ్ధులైపోతారు.

**2**. చూడండి, 43:73.

**3**. 'స'హీ'హ్ 'హదీస్'లో ఉంది: మృత్యువును ఒక గొర్రె ఆకారంలో తెచ్చి స్వర్గనరకాల మధ్య జిబ్'హ్ చేస్తారు. మరియు ఈ విధంగా ప్రకటిస్తారు: 'ఓ స్వర్గ వాసులారా! ఇక మీకు మృత్యువు లేదు; మీరు కలకాలం స్వర్గంలో ఉంటారు. ఓ నరక వాసులారా! మీకు సదా నరకవాసమే. మీకు మృత్యువు లేదు.' ('స.బు'ఖారీ, ముస్లిం) ఇంకా చూడండి, 19:39, 37:58-59.

**4**. చూడండి, 19:97.

## 45. సూరహ్ అల్-జాసి'యహ్

## سُورَةُ الجَاثِيَةِ

జాసి'యతున్: భక్తితో **మోకరిల్లటం, కూలబడటం** ఇది సూరహ్ అద్-'దుఖాన్ (44) తరువాత అవతరింపజేయబడింది. దీని పేరు **28**వ **ఆయత్**లో వచ్చింది. మానవులంతా పునరుత్థానదినమున నమ్రతతో అల్లాహ్ ముందు మోకరిల్లుతారు. 'హా-మీమ్, సూరాహ్‌లలో ఇది ఆరవది. **మక్కా**లో అవతరింపజేయబడిన ఈ సూరహ్‌లో **37 ఆయతులు** ఉన్నాయి.

C B A

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

حمٓ ﴿١﴾

**1.** 'హా-మీమ్.

تَنزِيلُ ٱلۡكِتَٰبِ مِنَ ٱللَّهِ ٱلۡعَزِيزِ ٱلۡحَكِيمِ ﴿٢﴾

**2.** ఈ గ్రంథ (ఖుర్ఆన్) అవతరణ సర్వశక్తిమంతుడు, మహా వివేకవంతుడైన అల్లాహ్ తరఫునుండి జరిగింది.

إِنَّ فِي ٱلسَّمَٰوَٰتِ وَٱلۡأَرۡضِ لَأٓيَٰتٖ لِّلۡمُؤۡمِنِينَ ﴿٣﴾

**3.** నిశ్చయంగా, విశ్వసించే వారి కొరకు, ఆకాశాలలో మరియు భూమిలో అనేక సూచనలు (ఆయాత్) ఉన్నాయి.[1]

وَفِي خَلۡقِكُمۡ وَمَا يَبُثُّ مِن دَآبَّةٍ ءَايَٰتٞ لِّقَوۡمٖ يُوقِنُونَ ﴿٤﴾

**4.** మరియు మీ సృష్టిలోనూ మరియు (భూమిలో) ఆయన వ్యాపింపజేసిన జీవరాసులలోనూ, దృఢవిశ్వాసమున్న వారి కొరకు ఎన్నో సూచనలు (ఆయాత్) ఉన్నాయి.[2]

وَٱخۡتِلَٰفِ ٱلَّيۡلِ وَٱلنَّهَارِ وَمَآ أَنزَلَ ٱللَّهُ مِنَ ٱلسَّمَآءِ مِن رِّزۡقٖ فَأَحۡيَا بِهِ ٱلۡأَرۡضَ بَعۡدَ مَوۡتِهَا وَتَصۡرِيفِ ٱلرِّيَٰحِ ءَايَٰتٞ لِّقَوۡمٖ يَعۡقِلُونَ ﴿٥﴾

**5.** మరియు రేయింబవళ్ళ అనుక్రమంలో మరియు అల్లాహ్ ఆకాశం నుండి జీవనోపాధిని (వర్షాన్ని) పంపి, దాని ద్వారా భూమికి దాని మరణం తర్వాత తిరిగి జీవం పోయటంలో మరియు వాయువుల మారటంలోనూ బుద్ధిమంతులకు ఎన్నో సూచనలు ఉన్నాయి.

---

**1**. చూడండి, 2:164.

**2**. చూడండి, 7:185 మరియు 10:5.

تِلْكَ ءَايَٰتُ ٱللَّهِ نَتْلُوهَا عَلَيْكَ بِٱلْحَقِّ ۖ فَبِأَىِّ حَدِيثٍۭ بَعْدَ ٱللَّهِ وَءَايَٰتِهِۦ يُؤْمِنُونَ ﴿٦﴾

6. ఇవి అల్లాహ్ సూచనలు (ఆయాత్), మేము వీటిని నీకు యథాతథంగా వినిపిస్తున్నాము. ఇక వారు అల్లాహ్‌ను మరియు ఆయన సూచన(ఆయాత్)లను కాక మరే సమాచారాన్ని విశ్వసిస్తారు?[1]

وَيْلٌ لِّكُلِّ أَفَّاكٍ أَثِيمٍ ﴿٧﴾

7. అపవాదుడు, పాపిష్ఠుడు అయిన ప్రతివ్యక్తికి తీవ్రమైన వ్యథ గలదు.

يَسْمَعُ ءَايَٰتِ ٱللَّهِ تُتْلَىٰ عَلَيْهِ ثُمَّ يُصِرُّ مُسْتَكْبِرًا كَأَن لَّمْ يَسْمَعْهَا ۖ فَبَشِّرْهُ بِعَذَابٍ أَلِيمٍ ﴿٨﴾

8. అతడు తన ముందు పఠించబడే అల్లాహ్ సూచన(ఆయాత్)లను వింటున్నాడు ఆ తరువాత మూర్ఖపు పట్టుతో దురహంకారంతో వాటిని విననట్లు వ్యవహరిస్తున్నాడు. కావున అతనికి బాధాకరమైన శిక్ష పడనున్నదనే వార్తను వినిపించు.

وَإِذَا عَلِمَ مِنْ ءَايَٰتِنَا شَيْـًٔا ٱتَّخَذَهَا هُزُوًا ۚ أُو۟لَٰٓئِكَ لَهُمْ عَذَابٌ مُّهِينٌ ﴿٩﴾

9. మరియు మా సూచన(ఆయాత్)లకు సంబంధించిన విషయం అతనికి తెలిసినప్పుడు, వాటిని గురించి ఎగతాళి చేస్తాడు. అటువంటి వారందరికీ అవమానకరమైన శిక్ష ఉంది.

مِّن وَرَآئِهِمْ جَهَنَّمُ ۖ وَلَا يُغْنِى عَنْهُم مَّا كَسَبُوا۟ شَيْـًٔا وَلَا مَا ٱتَّخَذُوا۟ مِن دُونِ ٱللَّهِ أَوْلِيَآءَ ۖ وَلَهُمْ عَذَابٌ عَظِيمٌ ﴿١٠﴾

10. వారి ముందు నరకముంటుంది. మరియు వారి సంపాదన వారికి ఏమాత్రం పనికిరాదు మరియు అల్లాహ్‌ను వదలి వారు సంరక్షకులుగా చేసుకున్న వారుకూడా వారికి ఏవిధంగానూ ఉపయోగపడరు. మరియు వారికి ఘోరమైన శిక్ష ఉంటుంది.

هَٰذَا هُدًى ۖ وَٱلَّذِينَ كَفَرُوا۟ بِـَٔايَٰتِ رَبِّهِمْ لَهُمْ عَذَابٌ مِّن رِّجْزٍ أَلِيمٌ ﴿١١﴾

11. ఇది (ఈ ఖుర్ఆన్) మార్గదర్శకత్వం. మరియు ఎవరైతే తమ ప్రభువు సూచన(ఆయాత్)లను తిరస్కరిస్తారో, వారికి అధమమైన, బాధాకరమైన శిక్ష ఉంది.[2] (7/8)

---

1. చూడండి, 39:23.
2. చూడండి, 34:5.

12. * అల్లాహ్! ఆయనే, సముద్రాన్ని మీకు ఉపయుక్తంగా చేశాడు; దానిలో తన ఆజ్ఞతో ఓడలు పయనించటానికి మరియు మీరు ఆయన అనుగ్రహాన్ని అన్వేషించటానికి మరియు బహుశా మీరు కృతజ్ఞులవుతారని.

۞ ٱللَّهُ ٱلَّذِي سَخَّرَ لَكُمُ ٱلۡبَحۡرَ لِتَجۡرِيَ ٱلۡفُلۡكُ فِيهِ بِأَمۡرِهِۦ وَلِتَبۡتَغُواْ مِن فَضۡلِهِۦ وَلَعَلَّكُمۡ تَشۡكُرُونَ ١٢

13. మరియు ఆయన ఆకాశాలలో మరియు భూమిలో నున్న సమస్తాన్ని, తన అనుగ్రహంతో మీకు ఉపయుక్తంగా చేశాడు. నిశ్చయంగా, ఇందులో ఆలోచించే వారికి ఎన్నో సూచనలు (ఆయాత్) ఉన్నాయి.

وَسَخَّرَ لَكُم مَّا فِي ٱلسَّمَٰوَٰتِ وَمَا فِي ٱلۡأَرۡضِ جَمِيعٗا مِّنۡهُۚ إِنَّ فِي ذَٰلِكَ لَأٓيَٰتٖ لِّقَوۡمٖ يَتَفَكَّرُونَ ١٣

14. (ఓ ప్రవక్తా!) విశ్వసించిన వారితో: " 'ఒక జాతి వారికి తమ కర్మలకు తగిన ప్రతిఫలమిచ్చే అల్లాహ్ దినాలు[1] వస్తాయని' నమ్మని వారిని క్షమించండి." అని చెప్పు.[2]

قُل لِّلَّذِينَ ءَامَنُواْ يَغۡفِرُواْ لِلَّذِينَ لَا يَرۡجُونَ أَيَّامَ ٱللَّهِ لِيَجۡزِيَ قَوۡمَۢا بِمَا كَانُواْ يَكۡسِبُونَ ١٤

15. సత్కార్యం చేసేవాడు తన మేలుకే చేస్తాడు. మరియు దుష్కార్యం చేసేవాడు దాని (ఫలితాన్ని) అనుభవిస్తాడు. చివరకు మీరంతా మీ ప్రభువు వైపునకే మరలింపబడతారు.

مَنۡ عَمِلَ صَٰلِحٗا فَلِنَفۡسِهِۦۖ وَمَنۡ أَسَآءَ فَعَلَيۡهَاۖ ثُمَّ إِلَىٰ رَبِّكُمۡ تُرۡجَعُونَ ١٥

16. మరియు వాస్తవంగా, మేము ఇస్రాయీ'ల్ సంతతి వారికి గ్రంథాన్ని (తౌరాత్‌ను), వివేకాన్ని మరియు ప్రవక్త పదవులను ప్రసాదించి ఉన్నాము మరియు

وَلَقَدۡ ءَاتَيۡنَا بَنِيٓ إِسۡرَٰٓءِيلَ ٱلۡكِتَٰبَ وَٱلۡحُكۡمَ وَٱلنُّبُوَّةَ وَرَزَقۡنَٰهُم

---

1. అయ్యామల్లాహ్: అల్లాహ్ దినాలు, అంటే పునరుత్థానదినం. చూడండి, 14:5.
2. ఈ ఆజ్ఞ ప్రవక్తృత్వం ప్రసాదించబడిన మొదటి రోజులలో ఉండేది. అప్పుడు ముస్లింలు, కొంతమంది మాత్రమే ఉండేవారు. మరియు వారిలో చాలామంది సమాజంలో బలహీన వర్గాలకు చెందినవారు. ఎప్పుడైతే ముస్లింలు తమ శత్రువులను ఎదుర్కొనే స్థితికి వచ్చారో వారికి జిహాద్ ఆజ్ఞ ఇవ్వబడింది.

مِّنَ ٱلطَّيِّبَٰتِ وَفَضَّلْنَٰهُمْ عَلَى ٱلْعَٰلَمِينَ ﴿١٦﴾

వారికి మంచి జీవనోపాధిని ప్రసాదించి ఉన్నాము మరియు వారిని (వారి కాలపు) ప్రజలపై ప్రత్యేకంగా ఆదరించి ఉన్నాము.[1]

وَءَاتَيْنَٰهُم بَيِّنَٰتٍ مِّنَ ٱلْأَمْرِ ۖ فَمَا ٱخْتَلَفُوٓا۟ إِلَّا مِنۢ بَعْدِ مَا جَآءَهُمُ ٱلْعِلْمُ بَغْيًۢا بَيْنَهُمْ ۚ إِنَّ رَبَّكَ يَقْضِى بَيْنَهُمْ يَوْمَ ٱلْقِيَٰمَةِ فِيمَا كَانُوا۟ فِيهِ يَخْتَلِفُونَ ﴿١٧﴾

**17**. మరియు వారికి ధర్మ విషయంలో స్పష్టమైన నిదర్శనాలు ఇచ్చి ఉన్నాము.[2] వారు తమ పరస్పర ద్వేషాల వల్ల వారికి జ్ఞానం వచ్చిన పిదపనే విభేదాలకు లోనయ్యారు.[3] నిశ్చయంగా, నీ ప్రభువు వారిమధ్య ఉన్న విభేదాలను గురించి పునరుత్థానదినమున, వారిమధ్య తీర్పు చేస్తాడు.

ثُمَّ جَعَلْنَٰكَ عَلَىٰ شَرِيعَةٍ مِّنَ ٱلْأَمْرِ فَٱتَّبِعْهَا وَلَا تَتَّبِعْ أَهْوَآءَ ٱلَّذِينَ لَا يَعْلَمُونَ ﴿١٨﴾

**18**. తరువాత (ఓ ము'హమ్మద్!) మేము, నిన్ను, (మేము) నియమించిన ధర్మవిధానం మీద ఉంచాము; కావున నీవు దానినే అనుసరించు మరియు నీవు జ్ఞానంలేని వారి కోరికలను అనుసరించకు.

إِنَّهُمْ لَن يُغْنُوا۟ عَنكَ مِنَ ٱللَّهِ شَيْـًٔا ۚ وَإِنَّ ٱلظَّٰلِمِينَ بَعْضُهُمْ أَوْلِيَآءُ بَعْضٍ ۖ وَٱللَّهُ وَلِىُّ ٱلْمُتَّقِينَ ﴿١٩﴾

**19**. నిశ్చయంగా వారు, నీకు - అల్లాహ్‌కు ప్రతిగా - ఏ మాత్రం ఉపయోగపడలేరు. మరియు నిశ్చయంగా దుర్మార్గులు ఒకరికొకరు రక్షకులు. మరియు అల్లాహ్‌యే దైవభీతి గలవారి సంరక్షకుడు.

هَٰذَا بَصَٰٓئِرُ لِلنَّاسِ وَهُدًى وَرَحْمَةٌ لِّقَوْمٍ يُوقِنُونَ ﴿٢٠﴾

**20**. ఇది (ఈ ఖుర్ఆన్) మానవులకు అంతర్దృష్టి (పరిజ్ఞానం) ఇచ్చేది గానూ మరియు విశ్వసించే జనులకు మార్గదర్శకత్వం గానూ మరియు కారుణ్యం గానూ ఉంది.

---

**1**. ఆ కాలంలో బనీ-ఇస్రాయీ'ల్ వారు మాత్రమే, ఏకదైవారాధకులుగా ఉండిరి. చూడండి, 2:47.

**2**. అల్-అమ్ర్: ఇక్కడ చాలా వ్యాఖ్యాతల దృష్టిలో 'ధర్మం' కొరకు వాడబడింది.

**3**. చూడండి, 23:53.

21. దుష్కార్యాలకు పాల్పడినవారు: వారి ఇహలోక జీవితంలోనూ మరియు వారి మరణాంతర జీవితంలోనూ - వారినీ మరియు విశ్వసించి సత్కార్యాలు చేసేవారినీ - మేము ఒకే విధంగా పరిగణిస్తామని భావిస్తున్నారా ఏమిటి? వారి నిర్ణయాలు ఎంత చెడ్డవి!

أَمۡ حَسِبَ ٱلَّذِينَ ٱجۡتَرَحُواْ ٱلسَّيِّـَٔاتِ أَن نَّجۡعَلَهُمۡ كَٱلَّذِينَ ءَامَنُواْ وَعَمِلُواْ ٱلصَّٰلِحَٰتِ سَوَآءٗ مَّحۡيَاهُمۡ وَمَمَاتُهُمۡۚ سَآءَ مَا يَحۡكُمُونَ ﴿٢١﴾

22. మరియు అల్లాహ్ ఆకాశాలనూ మరియు భూమినీ సత్యంతో సృష్టించాడు మరియు ప్రతివ్యక్తికి తన కర్మలకు తగిన ప్రతిఫలమివ్వటానికి మరియు వారికి ఎలాంటి అన్యాయం జరుగదు.

وَخَلَقَ ٱللَّهُ ٱلسَّمَٰوَٰتِ وَٱلۡأَرۡضَ بِٱلۡحَقِّ وَلِتُجۡزَىٰ كُلُّ نَفۡسِۭ بِمَا كَسَبَتۡ وَهُمۡ لَا يُظۡلَمُونَ ﴿٢٢﴾

23. తన మనోవాంఛలను తన దైవంగా చేసుకున్న వానిని నీవు చూశావా? మరియు అతడు జ్ఞానవంతుడు అయినప్పటికీ, అల్లాహ్! అతనిని మార్గభ్రష్టత్వంలో వదిలాడు[1] మరియు అతని చెవులమీద మరియు అతని హృదయం మీద ముద్రవేశాడు మరియు అతని కళ్ళమీద తెరవేశాడు;[2] ఇక అల్లాహ్ తప్ప అతనికి మార్గదర్శకత్వం చేసేవాడెవడున్నాడు? ఇది మీరు గ్రహించలేరా?

أَفَرَءَيۡتَ مَنِ ٱتَّخَذَ إِلَٰهَهُۥ هَوَىٰهُ وَأَضَلَّهُ ٱللَّهُ عَلَىٰ عِلۡمٖ وَخَتَمَ عَلَىٰ سَمۡعِهِۦ وَقَلۡبِهِۦ وَجَعَلَ عَلَىٰ بَصَرِهِۦ غِشَٰوَةٗ فَمَن يَهۡدِيهِ مِنۢ بَعۡدِ ٱللَّهِۚ أَفَلَا تَذَكَّرُونَ ﴿٢٣﴾

24. మరియు వారిలా అంటారు: "మా (జీవితం) కేవలం ఈ ప్రాపంచిక జీవితం మాత్రమే! మేము మరణించేది మరియు జీవించేది ఇక్కడే మరియు మమ్మల్ని నశింపజేసేది ఈ కాలచక్రం మాత్రమే!"[3]

وَقَالُواْ مَا هِيَ إِلَّا حَيَاتُنَا ٱلدُّنۡيَا نَمُوتُ وَنَحۡيَا وَمَا يُهۡلِكُنَآ إِلَّا ٱلدَّهۡرُۚ وَمَا لَهُم بِذَٰلِكَ مِنۡ عِلۡمٍۖ إِنۡ هُمۡ إِلَّا يَظُنُّونَ ﴿٢٤﴾

---

1. చూడండి, 14:4.
2. చూడండి, 2:7 మరియు 7:186.
3. 'హదీస్' ఖుద్సీ, అల్లాహ్ (సు.తా.) అంటాడు: "ఆదమ్ కుమారుడు నాకు

మరియు వాస్తవానికి, దానిని గురించి వారికి ఎలాంటి జ్ఞానం లేదు. వారు కేవలం ఊహాగానాలే చేస్తున్నారు.

**25**. మరియు వారి ముందు స్పష్టమైన మా సూచన(ఆయత్)లు వినిపించబడి నప్పుడు: "మీరు సత్యవంతులే అయితే మా తాతముత్తాతలను (బ్రతికించి) తీసుకురండి!" అని మాత్రమే వాదిస్తారు.[1]

**26**. వారితో ఇలా అను: "అల్లాహ్‌యే మీకు జీవితం ఇచ్చేవాడు తరువాత మరణింపజేసేవాడు, ఆ పిదప పునరుత్థాన దినమున సమావేశపరచే వాడూను! ఇందులో ఎలాంటి సందేహం లేదు. అయినా చాలామంది జనులకు ఇది తెలియదు."

**27**. మరియు ఆకాశాల మరియు భూమి యొక్క సామ్రాజ్యాధిపత్యం కేవలం అల్లాహ్‌కే చెందినది. మరియు ఆ ఘడియ ఆసన్నమైన నాడు; ఆ దినమున అసత్యవాదులు నష్టానికి గురి అవుతారు.

**28**. మరియు ప్రతి సమాజం వారిని నీవు **మోకరిల్లి**[2] ఉండటాన్ని చూస్తావు. ప్రతిజాతి వారిని తమ కర్మపత్రం వైపునకు పిలవడం జరుగుతుంది. (వారితో ఇలా అనబడుతుంది): "ఈ రోజు మీరు చేస్తూ ఉండిన కర్మలకు తగిన ప్రతిఫలం మీకు ఇవ్వబడుతుంది.

وَإِذَا تُتۡلَىٰ عَلَيۡهِمۡ ءَايَٰتُنَا بَيِّنَٰتٖ مَّا كَانَ حُجَّتَهُمۡ إِلَّآ أَن قَالُواْ ٱئۡتُواْ بِـَٔابَآئِنَآ إِن كُنتُمۡ صَٰدِقِينَ ٢٥

قُلِ ٱللَّهُ يُحۡيِيكُمۡ ثُمَّ يُمِيتُكُمۡ ثُمَّ يَجۡمَعُكُمۡ إِلَىٰ يَوۡمِ ٱلۡقِيَٰمَةِ لَا رَيۡبَ فِيهِ وَلَٰكِنَّ أَكۡثَرَ ٱلنَّاسِ لَا يَعۡلَمُونَ ٢٦

وَلِلَّهِ مُلۡكُ ٱلسَّمَٰوَٰتِ وَٱلۡأَرۡضِۚ وَيَوۡمَ تَقُومُ ٱلسَّاعَةُ يَوۡمَئِذٖ يَخۡسَرُ ٱلۡمُبۡطِلُونَ ٢٧

وَتَرَىٰ كُلَّ أُمَّةٖ جَاثِيَةٗۚ كُلُّ أُمَّةٖ تُدۡعَىٰٓ إِلَىٰ كِتَٰبِهَا ٱلۡيَوۡمَ تُجۡزَوۡنَ مَا كُنتُمۡ تَعۡمَلُونَ ٢٨

---

బాధకలిగిస్తాడు - కాలాన్ని దూషిస్తాడు - (అంటే కాలం వల్ల తనకు దురవస్థ వచ్చిందంటాడు). వాస్తవానికి కాలం అనేది ఏమీ లేదు. నేనే కాలాన్ని! సర్వాధికారాలు నా చేతిలోనే ఉన్నాయి. రాత్రింబవళ్ళనూ మార్చేవాడను నేనే."(`స.బు`ఖారీ, ముస్లిం).

**1**. చూడండి, 44:36.

**2**. జాసి'యతున్: Kneeling down, మోకరిల్లటం, మోకాళ్ళు భూమికి ఆనించి కూర్చోవడం.

**29**. "ఇది మేము వ్రాసిపెట్టిన (మీ కర్మ) పత్రం, ఇది మీ గురించి సత్యమే పలుకుతుంది.[1] నిశ్చయంగా, మేము మీరుచేస్తున్న కర్మలన్నింటినీ వ్రాయిస్తూ ఉండేవారం."

**30**. కావున విశ్వసించి సత్కార్యాలు చేస్తూ ఉండిన వారిని, వారి ప్రభువు తన కారుణ్యంలోకి ప్రవేశింపజేసుకుంటాడు.[2] ఇదే ఆ స్పష్టమైన విజయం.

**31**. మరియు సత్యాన్ని తిరస్కరించిన వారితో (ఇలా అనబడుతుంది): "మీకు మా సూచనలు వినిపించబడలేదా? కాని మీరు దురహంకారంలో పడిపోయారు మరియు అపరాధులైపోయారు."

**32**. మరియు: "నిశ్చయంగా, అల్లాహ్ వాగ్దానం సత్యం మరియు అంతిమ ఘడియను గురించి ఎలాంటి సందేహం లేదు." అని అన్నప్పుడు మీరన్నారు: "ఆ అంతిమఘడియ ఏమిటో మాకుతెలియదు. అది కేవలం ఒక ఊహాగానం తప్ప మరేమీ కాదని మేము భావిస్తున్నాము. మేము దానిని ఏ మాత్రం నమ్మేవారంకాము."[3]

**33**. అప్పుడు వారిముందు వారు చేస్తూ ఉండిన దుష్కార్యాలు ప్రత్యక్షమవుతాయి. మరియు వారు దేనిని గురించి పరిహాసమాడుతూ ఉన్నారో, అదే వారిని క్రమ్ముకుంటుంది.

هَٰذَا كِتَٰبُنَا يَنطِقُ عَلَيۡكُم بِٱلۡحَقِّۚ إِنَّا كُنَّا نَسۡتَنسِخُ مَا كُنتُمۡ تَعۡمَلُونَ ٢٩

فَأَمَّا ٱلَّذِينَ ءَامَنُواْ وَعَمِلُواْ ٱلصَّٰلِحَٰتِ فَيُدۡخِلُهُمۡ رَبُّهُمۡ فِي رَحۡمَتِهِۦۚ ذَٰلِكَ هُوَ ٱلۡفَوۡزُ ٱلۡمُبِينُ ٣٠

وَأَمَّا ٱلَّذِينَ كَفَرُوٓاْ أَفَلَمۡ تَكُنۡ ءَايَٰتِي تُتۡلَىٰ عَلَيۡكُمۡ فَٱسۡتَكۡبَرۡتُمۡ وَكُنتُمۡ قَوۡمٗا مُّجۡرِمِينَ ٣١

وَإِذَا قِيلَ إِنَّ وَعۡدَ ٱللَّهِ حَقّٞ وَٱلسَّاعَةُ لَا رَيۡبَ فِيهَا قُلۡتُم مَّا نَدۡرِي مَا ٱلسَّاعَةُ إِن نَّظُنُّ إِلَّا ظَنّٗا وَمَا نَحۡنُ بِمُسۡتَيۡقِنِينَ ٣٢

وَبَدَا لَهُمۡ سَيِّـَٔاتُ مَا عَمِلُواْ وَحَاقَ بِهِم مَّا كَانُواْ بِهِۦ يَسۡتَهۡزِءُونَ ٣٣

---

**1**. చూడండి, 39:69 మరియు 18:49.
**2**. అంటే స్వర్గం.
**3**. అంటే పునరుత్థాన దినం, సత్యం.

وَقِيلَ ٱلْيَوْمَ نَنسَىٰكُمْ كَمَا نَسِيتُمْ لِقَآءَ يَوْمِكُمْ هَٰذَا وَمَأْوَىٰكُمُ ٱلنَّارُ وَمَا لَكُم مِّن نَّٰصِرِينَ ﴿٣٤﴾

**34**. మరియు వారితో ఇలా అనబడుతుంది: "ఈ రోజు మేము మిమ్మల్ని మరచిపోతాము, ఏ విధంగానైతే మీరు, మీ సమావేశపు ఈ దినాన్ని మరచిపోయారో! మరియు మీ నివాసం నరకాగ్నియే మరియు మీకు సహాయపడేవారు ఎవ్వరూ ఉండరు."

ذَٰلِكُم بِأَنَّكُمُ ٱتَّخَذْتُمْ ءَايَٰتِ ٱللَّهِ هُزُوًا وَغَرَّتْكُمُ ٱلْحَيَوٰةُ ٱلدُّنْيَا ۚ فَٱلْيَوْمَ لَا يُخْرَجُونَ مِنْهَا وَلَا هُمْ يُسْتَعْتَبُونَ ﴿٣٥﴾

**35**. ఇది ఎందుకంటే, వాస్తవానికి మీరు అల్లాహ్ సూచన(ఆయాత్)లను పరిహాసంగా తీసుకున్నారు మరియు ఇహలోక జీవితం మిమ్మల్ని మోసపుచ్చింది. కావున ఈ రోజు వారిని దాని (నరకం) నుండి బయటికి తీయడం జరగదు[1] మరియు వారికి తమ తప్పులను సరిదిద్దుకునే అవకాశమూ దొరకదు.

فَلِلَّهِ ٱلْحَمْدُ رَبِّ ٱلسَّمَٰوَٰتِ وَرَبِّ ٱلْأَرْضِ رَبِّ ٱلْعَٰلَمِينَ ﴿٣٦﴾

**36**. ఇక సర్వస్తోత్రాలకు అర్హుడు అల్లాహ్ మాత్రమే! ఆయనే ఆకాశాలకూ ప్రభువు మరియు భూమికీ ప్రభువు; ఆయనే సర్వలోకాలకు కూడా ప్రభువు!

وَلَهُ ٱلْكِبْرِيَآءُ فِى ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضِ ۖ وَهُوَ ٱلْعَزِيزُ ٱلْحَكِيمُ ﴿٣٧﴾

**37**. ఆకాశాలలో మరియు భూమిలో ఘనత (మహనీయత) ఆయనకే చెందుతుంది. మరియు ఆయనే సర్వశక్తిమంతుడు, మహా వివేకవంతుడు.

*****

1. చూడండి, 6:128 మరియు 43:74.

## 46. సూరహ్ అల్-అ'హ్ఖాఫ్

## سُورَةُ الأَحْقَافِ

అ'హ్ఖాఫ్: **ఒరిగిన ఇసుక దిబ్బలు.** 'హా-మీమ్, సూరాహ్‌లలో ఇది ఏడవది మరియు చివరిది. దీని పేరు **21**వ **ఆయత్** నుండి తీసుకోబడింది. ఈ ఒరిగిన ఇసుక దిబ్బలు 'ఆద్ జాతివారి దేశపు చిహ్నాలు. ఇవి హ'దర్‌మౌత్ మరియు యమన్ పరిసరాలలో ఉన్నాయి. చూడండి, 7:65. వారి దేశంలో అప్పుడు పుష్కలంగా ధన ధాన్యాలుండేవి. వారి సత్యతిరస్కారం వల్ల వారి మీద అల్లాహ్ (సు.తా.) శిక్ష అవతరించింది. చూడండి, 46:24-25. 'ఎల్లప్పుడు సత్యమే వర్ధిల్లుతుంది.' అనేది ఈ సూరహ్ ఉపదేశం. ప్రతిదాని సృష్టికి ఒక కారణముంది. **మక్కాలో** అవతరింపజేయబడిన ఈ సూరహ్‌లో **35 ఆయతులు** ఉన్నాయి.

C B A

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

حمٓ ﴿١﴾

**1.** (*) 'హా-మీమ్.[1]

تَنزِيلُ ٱلْكِتَٰبِ مِنَ ٱللَّهِ ٱلْعَزِيزِ ٱلْحَكِيمِ ﴿٢﴾

**2.** ఈ గ్రంథ (ఖుర్ఆన్) అవతరణ సర్వ శక్తిమంతుడు, మహా వివేకవంతుడైన అల్లాహ్ తరఫునుండి జరిగింది.

مَا خَلَقْنَا ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضَ وَمَا بَيْنَهُمَآ إِلَّا بِٱلْحَقِّ وَأَجَلٍ مُّسَمًّى ۚ وَٱلَّذِينَ كَفَرُوا۟ عَمَّآ أُنذِرُوا۟ مُعْرِضُونَ ﴿٣﴾

**3.** మేము ఆకాశాలను, భూమిని మరియు వాటి మధ్య ఉన్న సమస్తాన్ని, సత్యంతో ఒక నిర్ణీతకాలంకొరకు మాత్రమే సృష్టించాము.[2] మరియు సత్యాన్ని తిరస్కరించిన వారు తమకు చేయబడిన హెచ్చరికనుండి విముఖులవుతున్నారు.

قُلْ أَرَءَيْتُم مَّا تَدْعُونَ مِن دُونِ ٱللَّهِ أَرُونِى مَاذَا خَلَقُوا۟ مِنَ ٱلْأَرْضِ أَمْ لَهُمْ شِرْكٌ فِى ٱلسَّمَٰوَٰتِ ۖ ٱئْتُونِى بِكِتَٰبٍ مِّن

**4.** వారితో ఇలా అను: "అల్లాహ్‌ను వదలి, మీరు ప్రార్థిస్తున్నవాటిని గురించి ఆలోచించారా? అయితే నాకు చూపండి.[3] వారు భూమిలో ఏమి సృష్టించారో? లేదా, వారికి ఆకాశాలలో ఏదైనా భాగముందా?

**1.** ఈ అక్షరాలు ముఖ'త్త'ఆత్, అనబడతాయి. వీటి నిజ అర్థం కేవలం అల్లాహ్ (సు.తా.)కు మాత్రమే తెలుసు.

**2.** చూడండి, 14:48.

**3.** రఅ'య్‌తుమ్: అంటే చెప్పండి, చూపండి, లేక ఆలోచించారా.

قَبۡلِ هَٰذَآ أَوۡ أَثَٰرَةٖ مِّنۡ عِلۡمٍ إِن كُنتُمۡ صَٰدِقِينَ ٤

మీరు సత్యవంతులే అయితే, దీనికి (ఈ ఖుర్ఆన్‌కు) ముందు వచ్చిన ఏదైనా గ్రంథాన్ని, లేదా ఏదైనా మిగిలిఉన్న జ్ఞానాన్ని తెచ్చి చూపండి."[1]

وَمَنۡ أَضَلُّ مِمَّن يَدۡعُواْ مِن دُونِ ٱللَّهِ مَن لَّا يَسۡتَجِيبُ لَهُۥٓ إِلَىٰ يَوۡمِ ٱلۡقِيَٰمَةِ وَهُمۡ عَن دُعَآئِهِمۡ غَٰفِلُونَ ٥

**5**. మరియు అల్లాహ్‌ను వదలి పునరుత్థాన దినం వరకు తమ ప్రార్థనలను విని సమాధాన మివ్వలేనటువంటి వారిని ప్రార్థించే వారికంటే, ఎక్కువ మార్గభ్రష్టులెవరు? మరియు వారు, (తమను ప్రార్థించే) వారి ప్రార్థనలను ఎరుగకుండా ఉన్నారు.

وَإِذَا حُشِرَ ٱلنَّاسُ كَانُواْ لَهُمۡ أَعۡدَآءٗ وَكَانُواْ بِعِبَادَتِهِمۡ كَٰفِرِينَ ٦

**6**. మరియు మానవులను (పునరుత్థాన దినమున) సమావేశపరచినపుడు, (ఆరాధించబడిన) వారు తమను ఆరాధించిన) వారికి విరోధులై ఉంటారు మరియు వారి ఆరాధనను తిరస్కరిస్తారు.[2]

وَإِذَا تُتۡلَىٰ عَلَيۡهِمۡ ءَايَٰتُنَا بَيِّنَٰتٖ قَالَ ٱلَّذِينَ كَفَرُواْ لِلۡحَقِّ لَمَّا جَآءَهُمۡ هَٰذَا سِحۡرٞ مُّبِينٌ ٧

**7**. మరియు వారికి మా స్పష్టమైన సూచనలు (ఆయాత్) వినిపించ బడినప్పుడు, సత్యతిరస్కారులు - సత్యం (ఈ ఖుర్ఆన్) వారి ముందుకు వచ్చినప్పుడు - ఇలా అంటారు: "ఇది స్పష్టమైన మంత్రజాలమే!"[3]

---

**1**. అసా'రతిమ్ మిన్ 'ఇల్మిన్: అంటే తెలివితేటలు, బఖియ్యతిమ్-మిన్-'ఇల్మిన్: అంటే పూర్వప్రవక్తలమీద అవతరింపజేయబడిన దివ్యజ్ఞానం వహీ నుండి మిగిలిఉన్న నిజ దివ్యజ్ఞానం.

**2**. ఈ విధమైన ఆయత్‌లు ఖుర్ఆన్‌లో ఎన్నోసార్లు వచ్చాయి. చూడండి, 10:29, 19:81-82,29:25,18:52,16:86 మొదలైనవి అల్లాహ్(సు.తా.)కు సాటికల్పించి ఆరాధించే దైవాలు రెండురకాలు. 1) నిర్జీవులు: అవి విగ్రహాలు, చెట్లుచేమలూ, సూర్య చంద్రులూ, అగ్ని మొదలైనవి. పునరుత్థానదినమున అల్లాహ్(సు.తా.) వీటికి మాట్లాడే శక్తిని ప్రసాదిస్తాడు. అవి, వారి ఆరాధనను తిరస్కరిస్తాయి. 2) రెండవరకానికి చెందిన వారు, ప్రవక్తలు, ఉదాహరణ 'ఈసా, 'ఉజైర్, దైవదూతలు ('అలైహిమ్ స.) మరియు సద్పురుషులు వీరి సమాధానం అల్లాహ్(సు.తా.) సమక్షంలో - ఖుర్ఆన్‌లో పేర్కొనబడిన - 'ఈసా('అ.స.) యొక్క సమాధానంలాగానే ఉంటుంది. ఇంతేకాక షై'తానులుకూడా వీరిఆరాధనను నిరాకరిస్తారు. ఉదాహరణకు చూ. 28:63.

**3**. అవతరణాక్రమంలో,74:24లో సి'హ్రున్ అనే పదం మొదటిసారి వచ్చింది.

أَمْ يَقُولُونَ ٱفْتَرَىٰهُ ۖ قُلْ إِنِ ٱفْتَرَيْتُهُۥ فَلَا تَمْلِكُونَ لِى مِنَ ٱللَّهِ شَيْـًٔا ۖ هُوَ أَعْلَمُ بِمَا تُفِيضُونَ فِيهِ ۖ كَفَىٰ بِهِۦ شَهِيدًۢا بَيْنِى وَبَيْنَكُمْ ۖ وَهُوَ ٱلْغَفُورُ ٱلرَّحِيمُ ﴿٨﴾

8. లేదా ఇలా అంటారు: "ఇతనే (ముహమ్మదే) దీనిని కల్పించాడు." వారితో ఇలా అను: "ఒకవేళ నేను దీనిని కల్పించి ఉండినట్లైతే, మీరు నన్ను అల్లాహ్ (శిక్ష) నుండి ఏ మాత్రం కాపాడలేరు. మీరు కల్పించే మాటలు ఆయనకు బాగా తెలుసు. నాకూ, మీకూ మధ్య ఆయన (అల్లాహ్) సాక్ష్యమే చాలు! మరియు ఆయన క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత."

قُلْ مَا كُنتُ بِدْعًا مِّنَ ٱلرُّسُلِ وَمَآ أَدْرِى مَا يُفْعَلُ بِى وَلَا بِكُمْ ۖ إِنْ أَتَّبِعُ إِلَّا مَا يُوحَىٰٓ إِلَىَّ وَمَآ أَنَا۠ إِلَّا نَذِيرٌ مُّبِينٌ ﴿٩﴾

9. (ఓ ము'హమ్మద్!) వారితో ఇలా అను: "నేను మొట్టమొదటి ప్రవక్తనేమీ కాను. నాకూ మరియు మీకూ ఏమి కానున్నదో నాకు తెలియదు.[1] నేను అనుసరించేది, నాపై అవతరింప జేయబడిన దివ్యజ్ఞానం (వ'హీ) మాత్రమే. మరియు నేను కేవలం స్పష్టంగా హెచ్చరిక చేసేవాడను మాత్రమే."

قُلْ أَرَءَيْتُمْ إِن كَانَ مِنْ عِندِ ٱللَّهِ وَكَفَرْتُم بِهِۦ وَشَهِدَ شَاهِدٌ مِّنۢ بَنِىٓ إِسْرَٰٓءِيلَ عَلَىٰ مِثْلِهِۦ فَـَٔامَنَ وَٱسْتَكْبَرْتُمْ ۖ إِنَّ ٱللَّهَ لَا يَهْدِى ٱلْقَوْمَ ٱلظَّٰلِمِينَ ﴿١٠﴾

10. వారితో ఇలా అను: "ఇది (ఈ ఖుర్ఆన్) ఒకవేళ అల్లాహ్ తరఫునుండి వచ్చిఉండి, మీరు దీనిని తిరస్కరిస్తూ ఉండినట్లైతే (మీగతి ఏమవుతుందో) మీరు ఆలోచించారా? ఇస్రాయీ'ల్ సంతతికి చెందిన ఒక సాక్షి ఇది (ఈ ఖుర్ఆన్) దాని (తౌరాత్) లాంటి గ్రంథమేనని, సాక్ష్యం ఇచ్చాడు మరియు విశ్వసించాడు కూడా.[2] కాని మీరేమో అహంభావానికి గురిఅయ్యారు. నిశ్చయంగా అల్లాహ్ దుర్మార్గులకు మార్గదర్శకత్వం చేయడు."

---

1. "అల్లాహ్ (సు.తా.) సాక్షిగా నేను('స'అస) దైవప్రవక్తను అయినప్పటికీ, మీకూ మరియు నాకూ పునరుత్థానదినమున ఏమి సంభవించనున్నదో నాకుతెలియదు." ('స. బు'ఖారీ).
2. ఈ సాక్షి 'అబ్దుల్లాహ్ బిన్-సల్లామ్ (ర'ది.'అ.). తౌరాత్‌లో దైవప్రవక్త ము'హమ్మద్ ('స'అస) రాబోతున్నాడని పేర్కొనబడిన వాక్యాలకు చూడండి, 2:42.

وَقَالَ ٱلَّذِينَ كَفَرُواْ لِلَّذِينَ ءَامَنُواْ لَوْ كَانَ خَيْرًا مَّا سَبَقُونَآ إِلَيْهِ ۚ وَإِذْ لَمْ يَهْتَدُواْ بِهِۦ فَسَيَقُولُونَ هَٰذَآ إِفْكٌ قَدِيمٌ ﴿١١﴾

**11**. సత్యతిరస్కారులు, విశ్వాసులను గురించి ఇలా అంటారు: "ఒకవేళ ఇందులో (ఇస్లాంలో) మేలే ఉంటే, వీరు మా కంటే ముందుగా దాని వైపునకు పోయివుండే వారు కాదు!"[1] మరియు వారు దాని (ఖుర్ఆన్) నుండి మార్గదర్శకత్వం పొందలేదు! కాబట్టి వారు: "ఇదొక ప్రాచీన బూటక కల్పనయే!" అని అంటారు.

وَمِن قَبْلِهِۦ كِتَٰبُ مُوسَىٰٓ إِمَامًا وَرَحْمَةً ۚ وَهَٰذَا كِتَٰبٌ مُّصَدِّقٌ لِّسَانًا عَرَبِيًّا لِّيُنذِرَ ٱلَّذِينَ ظَلَمُواْ وَبُشْرَىٰ لِلْمُحْسِنِينَ ﴿١٢﴾

**12**. మరియు దీనికి (ఈ గ్రంథానికి) పూర్వం, మూసా గ్రంథం మార్గదర్శినిగా మరియు కారుణ్యంగా వచ్చింది. మరియు ఈ గ్రంథం (ఖుర్ఆన్) దానిని ధృవీకరిస్తూ 'అరబ్బీ భాషలో, దుర్మార్గులను హెచ్చరించటానికి మరియు సజ్జనులకు శుభవార్తలు ఇవ్వటానికి వచ్చింది.

إِنَّ ٱلَّذِينَ قَالُواْ رَبُّنَا ٱللَّهُ ثُمَّ ٱسْتَقَٰمُواْ فَلَا خَوْفٌ عَلَيْهِمْ وَلَا هُمْ يَحْزَنُونَ ﴿١٣﴾

**13**. నిశ్చయంగా, ఎవరైతే: "మా ప్రభువు అల్లాహ్ యే!" అని, తరువాత దానిపై స్థిరంగా ఉంటారో! అలాంటి వారికి ఎలాంటి భయమూ వుండదు మరియు వారు దుఃఖపడరు కూడా!

أُوْلَٰٓئِكَ أَصْحَٰبُ ٱلْجَنَّةِ خَٰلِدِينَ فِيهَا جَزَآءًۢ بِمَا كَانُواْ يَعْمَلُونَ ﴿١٤﴾

**14**. అలాంటి వారే స్వర్గవాసు లవుతారు. తాము చేస్తూ ఉండిన (మంచి) కర్మల ఫలితంగా, వారు అందులో శాశ్వతంగా ఉంటారు.

---

**1**. అంటే మొట్టమొదట ఇస్లాం స్వీకరించిన వారిలోని పేదవారూ మరియు బలహీనవర్గాలకు చెందిన వారూ అయిన బిలాల్, 'అమ్మార్, 'సుహైబ్ మరియు 'ఖబ్బాబ్ మొదలైన వారిని (ర'ది.'అన్హుమ్‌లను) గురించి, మక్కా ముష్రిక్ నాయకులు చెప్పిన మాటలివి.

وَوَصَّيۡنَا ٱلۡإِنسَٰنَ بِوَٰلِدَيۡهِ إِحۡسَٰنًاۖ حَمَلَتۡهُ أُمُّهُۥ كُرۡهٗا وَوَضَعَتۡهُ كُرۡهٗاۖ وَحَمۡلُهُۥ وَفِصَٰلُهُۥ ثَلَٰثُونَ شَهۡرًاۚ حَتَّىٰٓ إِذَا بَلَغَ أَشُدَّهُۥ وَبَلَغَ أَرۡبَعِينَ سَنَةٗ قَالَ رَبِّ أَوۡزِعۡنِيٓ أَنۡ أَشۡكُرَ نِعۡمَتَكَ ٱلَّتِيٓ أَنۡعَمۡتَ عَلَيَّ وَعَلَىٰ وَٰلِدَيَّ وَأَنۡ أَعۡمَلَ صَٰلِحٗا تَرۡضَىٰهُ وَأَصۡلِحۡ لِي فِي ذُرِّيَّتِيٓۖ إِنِّي تُبۡتُ إِلَيۡكَ وَإِنِّي مِنَ ٱلۡمُسۡلِمِينَ ١٥

**15**. మరియు మేము మానవునికి తన తల్లిదండ్రుల పట్ల మంచితనంతో మెలగాలని ఆదేశించాము.[1] అతని తల్లి అతనిని ఎంతో బాధతో తన గర్భంలో భరించింది మరియు ఎంతో బాధతో అతనిని కన్నది. మరియు అతనిని గర్భంలో భరించి అతనిని పాలు విడిపించే వరకు ముప్ఫై నెలలు అవుతాయి.[2] చివరకు అతడు పెరిగి పెద్దవాడవుతాడు మరియు అతడు నలభై సంవత్సరాల[3] వయస్సుకు చేరి ఇలా అంటాడు: "ఓ నా ప్రభూ! నీవు, నాకూ మరియు నా తల్లి దండ్రులకూ ప్రసాదించిన అనుగ్రహాలకు నేను నీకు కృతజ్ఞతలు తెలుపుకోవటానికి మరియు నీవు ఇష్టపడే సత్కార్యాలు చేయటానికి నాకు సద్బుద్ధిని ప్రసాదించు మరియు నా సంతానాన్ని కూడా సద్వర్తనులుగా చేయి. నిశ్చయంగా, నేను పశ్చాత్తాపంతో నీ వైపునకు మరలుతున్నాను. మరియు నిశ్చయంగా, నేను నీకు విధేయులు (ముస్లింలు) అయిన వారిలో ఒకడిని."[4]

---

**1**. చూడండి, 29:8, మరియు 31:14 ఒక 'స'హాబి దైవప్రవక్త('స'అస)తో ఇలా ప్రశ్నిస్తాడు: 'నా సద్వర్తనకు అందరికంటే ఎక్కువ హక్కుదారులు ఎవరు?' దానికి అతను ('స'అస) ఇలా సమాధానమిస్తారు: 'నీతల్లి!' అతడు మళ్ళీ అదేప్రశ్న అడుగుతాడు. దైవప్రవక్త ('స'అస) అంటారు: 'నీతల్లి!' అతడు మూడవసారి అదేప్రశ్న అడుగుతాడు. అప్పుడు కూడా: 'నీ తల్లి!' అని అంటారు. అతడు నాలుగవసారి అదే ప్రశ్న అడుగగా దైవప్రవక్త ('స'అస) అంటారు: 'నీ తండ్రి!' దీనితో మానవ జీవితంలో తల్లి అందరికంటే - తండ్రి కంటే కూడా మూడురెట్లు - అధికంగా ఆదరణకు, సద్వర్తనకు అర్హతగలది, అని తెలుస్తోంది! ('స. ముస్లిం).

**2**. పాలిచ్చే గడువు 2:233 మరియు 31:14 లలో రెండు సంవత్సరాలు, అని ఉంది. దీనితో వ్యక్తమయ్యేది ఏమిటంటే - సజీవ శిశువుకు జన్మం ఇవ్వటానికి కనీస గడువు 6 మాసాలు. ఈ విధంగా పాలు విడిపించే మొత్తం కాలం ముప్ఫై నెలలు.

**3**. నలభైసంవత్సరాల వయస్సుకు చేరినతరువాతనే మానవుడు సంపూర్ణ మానసిక వికాసం పొందుతాడు.

**4**. అవ్'జి'అనీ: అంటే నాకు దైవభీతి మరియు భయభక్తులను ప్రసాదించు. ఒక వయస్సు

أُوْلَٰٓئِكَ ٱلَّذِينَ نَتَقَبَّلُ عَنۡهُمۡ أَحۡسَنَ مَا عَمِلُواْ وَنَتَجَاوَزُ عَن سَيِّـَٔاتِهِمۡ فِيٓ أَصۡحَٰبِ ٱلۡجَنَّةِۖ وَعۡدَ ٱلصِّدۡقِ ٱلَّذِي كَانُواْ يُوعَدُونَ ١٦

**16**. ఇలాంటి వారి నుండి మేము వారి మంచి కర్మలను స్వీకరిస్తాము.[1] మరియు వారి చెడుకర్మలను ఉపేక్షిస్తాము; వారు స్వర్గవాసులలో చేరుతారు. ఇది వారికి చేయబడిన వాగ్దానం, ఒక సత్యవాగ్దానం.

وَٱلَّذِي قَالَ لِوَٰلِدَيۡهِ أُفّٖ لَّكُمَآ أَتَعِدَانِنِيٓ أَنۡ أُخۡرَجَ وَقَدۡ خَلَتِ ٱلۡقُرُونُ مِن قَبۡلِي وَهُمَا يَسۡتَغِيثَانِ ٱللَّهَ وَيۡلَكَ ءَامِنۡ إِنَّ وَعۡدَ ٱللَّهِ حَقّٞ فَيَقُولُ مَا هَٰذَآ إِلَّآ أَسَٰطِيرُ ٱلۡأَوَّلِينَ ١٧

**17**. మరియు ఎవడైనా తన తల్లి దండ్రులతో ఇలా అంటే: "ఛీ పొండి (ఉఫ్)![2] నేను (గోరీ నుండి సజీవిగా) లేపబడతానని మీరు నన్ను బెదిరిస్తున్నారా? మరియు వాస్తవానికి, నాకుముందు ఎన్నో తరాలు గతించాయి, (కాని తిరిగి లేపబడలేదు కదా)?" మరియు వారిద్దరూ అల్లాహ్ సహాయం కోరుతూ ఇలా అంటారు: "ఓ దౌర్భాగ్యుడా! విశ్వసించు! నిశ్చయంగా, అల్లాహ్ వాగ్దానం సత్యం!" అప్పుడు వాడు ఇలా అంటాడు: "ఇవన్నీ కేవలం పాతకాలపు కట్టుకథలు తప్ప మరేమీ కావు."

---

గడిచిన తర్వాత ఈ దు'ఆ (రబ్బి అవ్'జి'అనీ...(నుండి)...మినల్ ముస్లిమీన్.), అంటే ఆయత్ చివరి వరకు, అత్యధికంగా చేయాలి అని ధర్మవేత్తల అభిప్రాయం.

1. చూడండి, 29:7.

2. 'ఉఫిన్': ఛీ పొండి! ఇది అయిష్టతను, ఏవగింపును తెలిపే పదం.

أُوْلَٰٓئِكَ ٱلَّذِينَ حَقَّ عَلَيۡهِمُ ٱلۡقَوۡلُ فِيٓ أُمَمٖ قَدۡ خَلَتۡ مِن قَبۡلِهِم مِّنَ ٱلۡجِنِّ وَٱلۡإِنسِۖ إِنَّهُمۡ كَانُواْ خَٰسِرِينَ ١٨

**18**. వీరికి పూర్వం గతించిన జిన్నాతుల మరియు మానవ సమాజాలలో, ఇలాంటివారి మీదనే (అల్లాహ్) వాక్కు (శిక్ష) సత్యమయింది. నిశ్చయంగా, వారే నష్టపడిన వారయ్యారు.[1]

وَلِكُلّٖ دَرَجَٰتٞ مِّمَّا عَمِلُواْۖ وَلِيُوَفِّيَهُمۡ أَعۡمَٰلَهُمۡ وَهُمۡ لَا يُظۡلَمُونَ ١٩

**19**. ప్రతి ఒక్కరికీ వారి వారి కర్మలకు తగిన స్థానాలుంటాయి. మరియు ఇది వారి కర్మలకు తగినట్లుగా పూర్తి ప్రతిఫలమివ్వటానికి మరియు వారికి ఎలాంటి అన్యాయం జరుగదు.

وَيَوۡمَ يُعۡرَضُ ٱلَّذِينَ كَفَرُواْ عَلَى ٱلنَّارِ أَذۡهَبۡتُمۡ طَيِّبَٰتِكُمۡ فِي حَيَاتِكُمُ ٱلدُّنۡيَا وَٱسۡتَمۡتَعۡتُم بِهَا فَٱلۡيَوۡمَ تُجۡزَوۡنَ عَذَابَ ٱلۡهُونِ بِمَا كُنتُمۡ تَسۡتَكۡبِرُونَ فِي ٱلۡأَرۡضِ بِغَيۡرِ ٱلۡحَقِّ وَبِمَا كُنتُمۡ تَفۡسُقُونَ ٢٠

**20**. మరియు ఆ రోజు సత్యాన్ని తిరస్కరించిన వారిని నరకాగ్ని ముందుకు తెచ్చి, వారితో (ఇలా అనబడుతుంది): "మీరు, మీ ఇహలోక జీవితంలో మీ భోగభాగ్యాలను తరిగించుకున్నారు మరియు వాటిని బాగా అనుభవించారు; కావున మీరు ఏ హక్కూ లేకుండా భూమిలో ప్రదర్శించిన అహంకారానికి మరియు మీరు చేసిన అవిధేయతకు ప్రతిఫలంగా, ఈ రోజు మీకు అవమానకరమైన శిక్ష విధించబడుతుంది." (1/8)

---

**1**. అల్లాహ్ (సు.తా.) వాక్కుకు చూడండి, 38:85.

۞ وَٱذۡكُرۡ أَخَا عَادٍ إِذۡ أَنذَرَ قَوۡمَهُۥ بِٱلۡأَحۡقَافِ وَقَدۡ خَلَتِ ٱلنُّذُرُ مِنۢ بَيۡنِ يَدَيۡهِ وَمِنۡ خَلۡفِهِۦٓ أَلَّا تَعۡبُدُوٓاْ إِلَّا ٱللَّهَ إِنِّيٓ أَخَافُ عَلَيۡكُمۡ عَذَابَ يَوۡمٍ عَظِيمٖ ﴿٢١﴾

21. * మరియు జ్ఞాపకం చేసుకోండి, 'ఆద్ జాతి సోదరుడైన (హూద్) ఇసుక దిబ్బలలో[1] వున్న తన జాతివారిని హెచ్చరించింది. మరియు అలా హెచ్చరించే వారు అతనికి పూర్వం కూడా వచ్చారు మరియు అతని తరువాత కూడా వచ్చారు. (అతను ఇలా అన్నాడు): "మీరు అల్లాహ్‌ను తప్ప ఇతరులను ఆరాధించకండి. (అలా చేస్తే) నిశ్చయంగా, ఆ గొప్ప దినమున మీపై పడబోయే, ఆ శిక్షను గురించి నేను భయపడుతున్నాను."

قَالُوٓاْ أَجِئۡتَنَا لِتَأۡفِكَنَا عَنۡ ءَالِهَتِنَا فَأۡتِنَا بِمَا تَعِدُنَآ إِن كُنتَ مِنَ ٱلصَّٰدِقِينَ ﴿٢٢﴾

22. వారిలా అన్నారు: "మా దేవతల నుండి మమ్మల్ని దూరంచేయటానికా నీవు వచ్చింది? నీవు సత్యవంతుడవే అయితే నీవు బెదిరించే (ఆ శిక్షను) తీసుకురా!"

قَالَ إِنَّمَا ٱلۡعِلۡمُ عِندَ ٱللَّهِ وَأُبَلِّغُكُم مَّآ أُرۡسِلۡتُ بِهِۦ وَلَٰكِنِّيٓ أَرَىٰكُمۡ قَوۡمٗا تَجۡهَلُونَ ﴿٢٣﴾

23. (హూద్) అన్నాడు: "నిశ్చయంగా, దాని (ఆ శిక్ష) జ్ఞానం కేవలం అల్లాహ్‌కే వుంది మరియు నేను మాత్రం నాకు ఇచ్చి పంపబడిన సందేశాన్ని మీకు అందజేస్తున్నాను. కాని, నేను మిమ్మల్ని మూఢత్వంలో పడిపోయిన వారిగా చూస్తున్నాను!"

---

1. అల్-అ'హ్ఖాఫు, 'హిఖ్ఫున్ దీని ఏకవచనం: అంటే పొడువుగా పోయే ఇసుక దిబ్బలు. ఇది హూద్ ('అ.స.) జాతివారైన 'ఆద్‌లు నివసించే ప్రాంతం పేరు. ఇది 'హ'దర్‌మౌత్ (యమన్) ప్రాంతంలో ఉంది. వారు కూడా హద్దులుమీరి ప్రవర్తించారు.

فَلَمَّا رَأَوۡهُ عَارِضًا مُّسۡتَقۡبِلَ أَوۡدِيَتِهِمۡ قَالُواْ هَٰذَا عَارِضٌ مُّمۡطِرُنَاۚ بَلۡ هُوَ مَا ٱسۡتَعۡجَلۡتُم بِهِۦۖ رِيحٌ فِيهَا عَذَابٌ أَلِيمٌ ﴿٢٤﴾

**24**. ఆ తరువాత వారు ఒక దట్టమైన మేఘాన్ని వారి లోయల వైపునకు రావటం చూసి ఇలా అన్నారు: "ఈ మేఘం మాకు వర్షం ఇస్తుంది!"[1] (హూద్ అన్నాడు): "కాదుకాదు, మీరు దేనికి తొందర పెడుతున్నారో అది (ఆ శిక్ష) ఇదే! ఒక తుఫాను గాలి అందులో బాధాకరమైన శిక్ష ఉంది;

تُدَمِّرُ كُلَّ شَيۡءِۭ بِأَمۡرِ رَبِّهَا فَأَصۡبَحُواْ لَا يُرَىٰٓ إِلَّا مَسَٰكِنُهُمۡۚ كَذَٰلِكَ نَجۡزِي ٱلۡقَوۡمَ ٱلۡمُجۡرِمِينَ ﴿٢٥﴾

**25**. "అది తన ప్రభువు ఆజ్ఞతో ప్రతి దానిని నాశనం చేస్తుంది." చివరకు వారి నివాసస్థలాలు తప్ప, అక్కడ ఏమీ కనిపించకుండా పోయాయి. ఈ విధంగా మేము నేరస్తులకు ప్రతీకారం చేస్తాము.

وَلَقَدۡ مَكَّنَّٰهُمۡ فِيمَآ إِن مَّكَّنَّٰكُمۡ فِيهِ وَجَعَلۡنَا لَهُمۡ سَمۡعًا وَأَبۡصَٰرًا وَأَفۡـِٔدَةً فَمَآ أَغۡنَىٰ عَنۡهُمۡ سَمۡعُهُمۡ وَلَآ أَبۡصَٰرُهُمۡ وَلَآ أَفۡـِٔدَتُهُم مِّن شَيۡءٍ إِذۡ كَانُواْ يَجۡحَدُونَ بِـَٔايَٰتِ ٱللَّهِ وَحَاقَ بِهِم مَّا كَانُواْ بِهِۦ يَسۡتَهۡزِءُونَ ﴿٢٦﴾

**26**. మరియు వాస్తవానికి మేము వారిని దృఢంగా స్థిరపరచి ఉన్నాము; ఆవిధంగా మేము, (ఓ ఖురైషులారా) మిమ్మల్ని కూడా స్థిరపరచలేదు. మేము వారికి చెవులను, కన్నులను మరియు హృదయాలను ఇచ్చాము. కాని వారి చెవులూ, కళ్ళూ మరియు హృదయాలు వారికి ఉపయోగపడలేదు, ఎందుకంటే వారు అల్లాహ్ సూచనలను తిరస్కరిస్తూ ఉండేవారు మరియు వారు దేనిని గురించి పరిహాసం చేస్తూ ఉండేవారో అదే వారిని చుట్టుకున్నది.

---

**1**. 'ఆయి'షహ్ (ర.'అన్హా), దైవప్రవక్త ('స'అస)తో అన్నారు: "ప్రజలు మేఘాలను చూసి సంతోషపడుతారు. కానీ మేఘాలను చూసినప్పుడు మీరు ('స'అస) ఆందోళన పడుతారెందుకు?" దానికి అతను ('స'అస) జవాబిచ్చారు: " 'ఆయి'షహ్ (ర.'అన్హా) ఈ మేఘాలలో అల్లాహ్ (సు.తా.) శిక్ష లేదనే హామీ ఏమీ లేదు కదా! ఒక జాతి గాలి శిక్షతో నాశనం చేయబడింది కదా! వారు కూడా మేఘాలను చూసి అన్నారు: 'ఈ మేఘాలు మాపై వర్షం కురిపిస్తాయి.' " ('స. బు'ఖారీ, 'స. ముస్లిం) మేఘాలను చూసినప్పుడు దైవప్రవక్త ('స'అస) దు'ఆ చేసేవారు. దీనికి చూడండి, 69:6-8, 7:72, 11:53-56.

وَلَقَدْ أَهْلَكْنَا مَا حَوْلَكُم مِّنَ ٱلْقُرَىٰ وَصَرَّفْنَا ٱلْـَٔايَـٰتِ لَعَلَّهُمْ يَرْجِعُونَ ﴿٢٧﴾

27. మరియు వాస్తవానికి, మేము మీ చుట్టుప్రక్కల ఎన్నో నగరాలను నాశనం చేశాము. మరియు బహుశా వారు (సత్యం వైపునకు) మరలివస్తారని, మా సంకేతాలను వారికి ఎన్నో విధాలుగా చూపాము.

فَلَوْلَا نَصَرَهُمُ ٱلَّذِينَ ٱتَّخَذُوا۟ مِن دُونِ ٱللَّهِ قُرْبَانًا ءَالِهَةًۢ ۖ بَلْ ضَلُّوا۟ عَنْهُمْ ۚ وَذَٰلِكَ إِفْكُهُمْ وَمَا كَانُوا۟ يَفْتَرُونَ ﴿٢٨﴾

28. అల్లాహ్‌ను వదలి - తమను ఆయన సాన్నిధ్యానికి తేగలవారని - వారు భావించిన, వారి దేవతలు వారికెందుకు సహాయం చేయవు? అలాకాదు! అవి వారిని త్యజించాయి. ఎందుకంటే అది కేవలం వారి భ్రమ. మరియు వారు కల్పించుకున్న బూటక కల్పన మాత్రమే!

وَإِذْ صَرَفْنَآ إِلَيْكَ نَفَرًا مِّنَ ٱلْجِنِّ يَسْتَمِعُونَ ٱلْقُرْءَانَ فَلَمَّا حَضَرُوهُ قَالُوٓا۟ أَنصِتُوا۟ ۖ فَلَمَّا قُضِىَ وَلَّوْا۟ إِلَىٰ قَوْمِهِم مُّنذِرِينَ ﴿٢٩﴾

29. మరియు (ఓ ము'హమ్మద్!) జిన్నాతుల ఒక సమూహాన్ని[1] మేము - ఖుర్ఆన్‌ను వినటానికి - నీ వైపునకు మొగ్గునట్లు చేసినపుడు, వారు అక్కడ చేరిన తరువాత పరస్పరం ఇలా మాట్లాడుకున్నారు: "నిశ్శబ్దంగా వినండి!" అది (ఆ పఠనం) ముగిసిన తరువాత, వారు హెచ్చరిక చేసేవారిగా, తమ జాతివారి వైపునకు మరలిపోయారు.

قَالُوا۟ يَـٰقَوْمَنَآ إِنَّا سَمِعْنَا كِتَـٰبًا أُنزِلَ مِنۢ بَعْدِ مُوسَىٰ مُصَدِّقًا لِّمَا

30. వారు (జిన్నాతులు) ఇలా అన్నారు: "ఓ మా జాతి వారలారా! వాస్తవంగా మేము మూసా తరువాత అవతరింపజేయబడిన ఒక గ్రంథాన్ని

---

1. నఫరన్: అంటే '3నుండి 10 వరకు' ఉండే సంఖ్యల సమూహం. ఈ సంఘటన మక్కా-'తాయఫ్ దారిలో న'ఖ్ల లోయలో సంభవించింది. వివరాలకు చూడండి, 72:1-15. ('స. ముస్లిం, 'స. బు'ఖారీ) ఈ సంఘటన తరువాత జిన్నాతుల రాయబారులు దైవప్రవక్త ('స'అస) దగ్గరికి ఎన్నోసార్లు ఇస్లాం స్వీకరించటానికి, నేర్చుకోవటానికి వచ్చారు. (ఇబ్నె-కసీ'ర్).

بَيْنَ يَدَيْهِ يَهْدِىٓ إِلَى ٱلْحَقِّ وَإِلَىٰ طَرِيقٍ مُّسْتَقِيمٍ ﴿٣٠﴾

విన్నాము. అది దానికి పూర్వం వచ్చిన దానిని (తౌరాత్‌ను) ధృవీకరిస్తుంది; సత్యం వైపునకు మరియు ఋజుమార్గం (ఇస్లాం) వైపునకు మార్గదర్శకత్వం చేస్తుంది.[1]

يَٰقَوْمَنَآ أَجِيبُوا۟ دَاعِىَ ٱللَّهِ وَءَامِنُوا۟ بِهِۦ يَغْفِرْ لَكُم مِّن ذُنُوبِكُمْ وَيُجِرْكُم مِّنْ عَذَابٍ أَلِيمٍ ﴿٣١﴾

**31**. "మా జాతి వారలారా! అల్లాహ్ వైపునకు పిలిచేవానిని అనుసరించండి. మరియు ఆయన(అల్లాహ్)ను విశ్వసించండి. ఆయన మీ పాపాలను క్షమిస్తాడు మరియు మిమ్మల్ని బాధాకరమైన శిక్షనుండి కాపాడుతాడు.

وَمَن لَّا يُجِبْ دَاعِىَ ٱللَّهِ فَلَيْسَ بِمُعْجِزٍ فِى ٱلْأَرْضِ وَلَيْسَ لَهُۥ مِن دُونِهِۦٓ أَوْلِيَآءُ ۚ أُو۟لَٰٓئِكَ فِى ضَلَٰلٍ مُّبِينٍ ﴿٣٢﴾

**32**. "మరియు అల్లాహ్ వైపునకు పిలిచే వానిని అనుసరించనివాడు భూమిలో (అల్లాహ్ నుండి) తప్పించుకోలేడు. మరియు అతడికి, ఆయన తప్ప మరొక సంరక్షకుడు లేడు. అలాంటి వారు స్పష్టంగా మార్గభ్రష్టత్వంలో పడిఉన్నట్లే!"

أَوَلَمْ يَرَوْا۟ أَنَّ ٱللَّهَ ٱلَّذِى خَلَقَ ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضَ وَلَمْ يَعْىَ بِخَلْقِهِنَّ بِقَٰدِرٍ عَلَىٰٓ أَن يُحْۦِىَ ٱلْمَوْتَىٰ ۚ بَلَىٰٓ إِنَّهُۥ عَلَىٰ كُلِّ شَىْءٍ قَدِيرٌ ﴿٣٣﴾

**33**. ఏమీ? వారికి తెలియదా? నిశ్చయంగా ఆకాశాలనూ మరియు భూమినీ సృష్టించిన వాడు అల్లాహ్ యేనని మరియు ఆయన వారిని సృష్టించటంలో అలసిపోడని, మరణించిన వారిని తిరిగి బ్రతికించగల సామర్థ్యం గలవాడని! అలాకాదు (ఎందుకు కలిగిలేదు)! నిశ్చయంగా, ఆయన ప్రతిదీ చేయగల సమర్థుడు.

---

**1**. ప్రవక్తలందరూ మానవులే! జిన్నాతులలో ప్రవక్తలు వచ్చినట్లు ఖుర్ఆన్‌లో, 'స'హీ'హ్ 'హదీస్'లలో లేదు. చూడండి, 16;43, 25:20. ఈ సూరహ్‌లోని ఆయత్‌లతో దైవప్రవక్త ('స'అస) జిన్నాతులకు కూడా ప్రచారంచేశారని తెలుస్తోంది.

وَيَوۡمَ يُعۡرَضُ ٱلَّذِينَ كَفَرُواْ عَلَى ٱلنَّارِ أَلَيۡسَ هَٰذَا بِٱلۡحَقِّۖ قَالُواْ بَلَىٰ وَرَبِّنَاۚ قَالَ فَذُوقُواْ ٱلۡعَذَابَ بِمَا كُنتُمۡ تَكۡفُرُونَ ٣٤

**34**. మరియు సత్యాన్ని తిరస్కరించిన వారిని నరకాగ్ని ముందు ప్రవేశపెట్టబడే రోజు వారితో ఇలా ప్రశ్నించడం జరుగుతుంది: "ఏమీ? ఇది సత్యంకాదా?" అని. వారంటారు: "ఎందుకు కాదు! మా ప్రభువు సాక్షిగా (ఇది సత్యమే!)" వారితో అనబడుతుంది: "అయితే, మీరు తిరస్కరిస్తూవున్న దానికి గానూ ఈ శిక్షను రుచిచూడండి!"

فَٱصۡبِرۡ كَمَا صَبَرَ أُوْلُواْ ٱلۡعَزۡمِ مِنَ ٱلرُّسُلِ وَلَا تَسۡتَعۡجِل لَّهُمۡۚ كَأَنَّهُمۡ يَوۡمَ يَرَوۡنَ مَا يُوعَدُونَ لَمۡ يَلۡبَثُوٓاْ إِلَّا سَاعَةٗ مِّن نَّهَارِۭۚ بَلَٰغٞۚ فَهَلۡ يُهۡلَكُ إِلَّا ٱلۡقَوۡمُ ٱلۡفَٰسِقُونَ ٣٥

**35**. కావున నీవు (ఓ ప్రవక్తా!) సహనం వహించు! దృఢసంకల్పం గల ప్రవక్తలు సహనంవహించినట్లు మరియు వారి విషయంలో తొందరపడకు. నిశ్చయంగా, వారికి వాగ్దానం చేయబడిన (శిక్షను) వారు చూసిన రోజు, వారు (ఈ ప్రపంచంలో) దినంలోని ఒక ఘడియ కంటే ఎక్కువకాలం గడపలేదని అనుకుంటారు. (ఇదే మా) సందేశం! అలాంటప్పుడు, దుష్టులు (ఫాసిఖూన్) గాక, ఇతరులు నశింపజేయబడతారా?

*****

## 47. సూరహ్ ము'హమ్మద్

## سُورَةُ مُحَمَّدٍ

ఈ సూరహ్ మరొక పేరు **అల్-ఖితాల్** అని కూడా ఉంది. దైవప్రవక్త ('స'అస) పేరు **2వ ఆయత్**‌లో వచ్చింది. ఇది మొదటి **మదీనా** కాలపు సూరాహ్‌లలోనిది. ఇందులో **38 ఆయతులు** ఉన్నాయి. ఇంతవరకు 5/6వ భాగం ఖుర్ఆన్ పూర్తి అయ్యింది. ఈ మిగిలిన 1/6వ భాగంలో చిన్న చిన్న సూరాహ్‌లు ఉన్నాయి. ఈ వరుసలో 3 సూరాహ్‌లు ఉన్నాయి.

**ము'హమ్మద్** ('స'అస) పేరు ఖుర్ఆన్‌లో 4 సార్లు వచ్చింది. ఇక్కడ, 3:144, 33:40, మరియు 48:29లలో. **అ'హ్మద్** ('స'అస) అని, ఒకేసారి 61:6లో వచ్చింది.

C B A

అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో

ٱلَّذِينَ كَفَرُواْ وَصَدُّواْ عَن سَبِيلِ ٱللَّهِ أَضَلَّ أَعْمَٰلَهُمْ ﴿١﴾

**1.** ఎవరైతే సత్యాన్ని తిరస్కరించి (ఇతరులను) అల్లాహ్ మార్గంనుండి నిరోధించారో, వారి కర్మలను ఆయన (అల్లాహ్) నిష్ఫలం చేశాడు.

وَٱلَّذِينَ ءَامَنُواْ وَعَمِلُواْ ٱلصَّٰلِحَٰتِ وَءَامَنُواْ بِمَا نُزِّلَ عَلَىٰ مُحَمَّدٍ وَهُوَ ٱلْحَقُّ مِن رَّبِّهِمْ ۙ كَفَّرَ عَنْهُمْ سَيِّـَٔاتِهِمْ وَأَصْلَحَ بَالَهُمْ ﴿٢﴾

**2.** మరియు ఎవరైతే విశ్వసించి సత్కార్యాలు చేస్తూ - **ము'హమ్మద్** మీద అవతరింపజేయబడిన దానిని - తమ ప్రభువు తరఫునుండి వచ్చిన సత్యమని నమ్మారో! వారి పాపాలను ఆయన తుడిచివేశాడు మరియు వారి స్థితిని బాగుపరిచాడు.

ذَٰلِكَ بِأَنَّ ٱلَّذِينَ كَفَرُواْ ٱتَّبَعُواْ ٱلْبَٰطِلَ وَأَنَّ ٱلَّذِينَ ءَامَنُواْ ٱتَّبَعُواْ ٱلْحَقَّ مِن رَّبِّهِمْ ۚ كَذَٰلِكَ يَضْرِبُ ٱللَّهُ لِلنَّاسِ أَمْثَٰلَهُمْ ﴿٣﴾

**3.** ఇలా ఎందుకు జరిగిందంటే! వాస్తవానికి అవిశ్వాసులు, అసత్యాన్ని అనుసరించారు మరియు విశ్వసించిన వారు తమ ప్రభువు తరఫునుండి వచ్చిన సత్యాన్ని అనుసరించారు. ఈ విధంగా అల్లాహ్! ప్రజలకు ఉదాహరణల ద్వారా (వారి స్థానం) తెలియజేస్తున్నాడు.

فَإِذَا لَقِيتُمُ ٱلَّذِينَ كَفَرُواْ فَضَرْبَ ٱلرِّقَابِ حَتَّىٰٓ إِذَآ أَثْخَنتُمُوهُمْ فَشُدُّواْ ٱلْوَثَاقَ فَإِمَّا مَنًّۢا بَعْدُ وَإِمَّا فِدَآءً حَتَّىٰ تَضَعَ ٱلْحَرْبُ أَوْزَارَهَا ۚ ذَٰلِكَ وَلَوْ يَشَآءُ ٱللَّهُ لَٱنتَصَرَ مِنْهُمْ وَلَٰكِن لِّيَبْلُوَاْ بَعْضَكُم بِبَعْضٍ ۗ وَٱلَّذِينَ قُتِلُواْ فِى سَبِيلِ ٱللَّهِ فَلَن يُضِلَّ أَعْمَٰلَهُمْ ﴿٤﴾

**4**. కావున మీరు సత్యతిరస్కారులను (యుద్ధంలో) ఎదుర్కొన్నప్పుడు,[1] వారిపై ప్రాబల్యం పొందేవరకు, వారి మెడలపై కొట్టండి. ఆ తరువాత వారిని గట్టిగా బంధించండి, (యుద్ధం ముగిసిన) తరువాత వారిని కనికరించి వదలిపెట్టండి, లేదా పరిహారధనం తీసుకొని వదలిపెట్టండి.[2] (మీతో) యుద్ధం చేసేవారు తమ ఆయుధాలను పడవేసే వరకు (వారితో పోరాడండి). ఇది మీరు చేయవలసిన పని. అల్లాహ్ తలుచుకుంటే ఆయన వారికి ప్రతీకారం చేసేవాడు, కాని మిమ్మల్ని ఒకరిద్వారా మరొకరిని పరీక్షించటానికి (ఆయన ఇలా చేశాడు). మరియు ఎవరైతే అల్లాహ్ మార్గంలో చంపబడ్డారో, అలాంటి వారి కర్మలను ఆయన వ్యర్థంచేయడు.

سَيَهْدِيهِمْ وَيُصْلِحُ بَالَهُمْ ﴿٥﴾

**5**. ఆయన వారికి మార్గదర్శకత్వం చేస్తాడు మరియు వారి స్థితిని చక్కబరుస్తాడు.

**1**. ప్రతి మానవునికి తనకు నచ్చిన ధర్మాన్ని అనుసరించే హక్కు ఉంది. ధర్మ విషయంలో బలవంతం లేదు, చూడండి 2:256. కావున ఎవరైనా మీ ఇస్లాం ధర్మపాలన కారణంగా మీపై దౌర్జన్యాలు చేస్తే! మీరు ఇస్లాంపై నడవకుండా మీ స్వాతంత్ర్యాన్ని భంగపరిస్తే, వారితో మీ మానప్రాణాల రక్షణ మరియు మీ ఇస్లాంధర్మ రక్షణకై, వారిని పూర్తిగా అణగద్రొక్కే వరకు, లేదా వారిని ఖైదీలుగా చేసుకొనే వరకు, వారితో భయంకరంగా పోరాడమే జిహాద్. వారిపై ప్రాబల్యం వహించిన తరువాత వారిని బంధించండి. యుద్ధం ముగిసిన తరువాత వారిలో మంచితనం చూస్తే వారిని కనికరించి, లేదా పరిహారం తీసుకొని వదలండి. చూడండి, 2:190-191. ఇంకా చూడండి, జిహాద్‌ను గురించి అవతరింపజేయబడిన మొట్టమొదటి ఆయత్‌లకు, 22:39-40.

**2**. పరిహారధనానికి బదులుగా యుద్ధఖైదీలను పరస్పరం మార్పిడి కూడా చేసుకోవచ్చు.

6. మరియు వారికి తెలియజేసియున్న, స్వర్గంలోకి వారిని ప్రవేశింపజేస్తాడు.

وَيُدۡخِلُهُمُ ٱلۡجَنَّةَ عَرَّفَهَا لَهُمۡ ۝٦

7. ఓ విశ్వాసులారా! ఒకవేళ మీరు అల్లాహ్‌కు (ఆయన మార్గంలో) సహాయపడితే, ఆయన మీకు సహాయం చేస్తాడు మరియు మీ పాదాలను స్థిరపరుస్తాడు.[1]

يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوٓاْ إِن تَنصُرُواْ ٱللَّهَ يَنصُرۡكُمۡ وَيُثَبِّتۡ أَقۡدَامَكُمۡ ۝٧

8. ఇకపోతే సత్యాన్ని తిరస్కరించిన వారికి వినాశం తప్పదు. మరియు (అల్లాహ్) వారి కర్మలు వ్యర్థం చేస్తాడు.

وَٱلَّذِينَ كَفَرُواْ فَتَعۡسٗا لَّهُمۡ وَأَضَلَّ أَعۡمَٰلَهُمۡ ۝٨

9. ఇది ఎందుకంటే వాస్తవానికి, వారు అల్లాహ్ అవతరింపజేసిన దానిని అసహ్యించుకున్నారు కాబట్టి ఆయన వారి కర్మలను విఫలం చేశాడు.[2] (1/4)

ذَٰلِكَ بِأَنَّهُمۡ كَرِهُواْ مَآ أَنزَلَ ٱللَّهُ فَأَحۡبَطَ أَعۡمَٰلَهُمۡ ۝٩

10. * ఏమీ? వారు భూమిలో సంచరించి చూడలేదా? వారికి పూర్వం గతించిన వారి పర్యవసానం ఏమయిందో? అల్లాహ్ వారిని నిర్మూలించాడు. మరియు సత్యతిరస్కారులకు అలాంటి గతే పట్టబోతోంది.[3]

۞أَفَلَمۡ يَسِيرُواْ فِي ٱلۡأَرۡضِ فَيَنظُرُواْ كَيۡفَ كَانَ عَٰقِبَةُ ٱلَّذِينَ مِن قَبۡلِهِمۡۖ دَمَّرَ ٱللَّهُ عَلَيۡهِمۡۖ وَلِلۡكَٰفِرِينَ أَمۡثَٰلُهَا ۝١٠

11. ఇది ఎందుకంటే! నిశ్చయంగా, విశ్వసించిన వారి సంరక్షకుడు అల్లాహ్! మరియు నిశ్చయంగా, సత్యతిరస్కారులకు సంరక్షకుడు ఎవ్వడూ లేడు.[4]

ذَٰلِكَ بِأَنَّ ٱللَّهَ مَوۡلَى ٱلَّذِينَ ءَامَنُواْ وَأَنَّ ٱلۡكَٰفِرِينَ لَا مَوۡلَىٰ لَهُمۡ ۝١١

---

1. చూడండి, 22:40.
2. కర్మలంటే ఇక్కడ సత్యతిరస్కారుల సత్కర్మలు విఫలమవుతాయి. విశ్వాసం లేనిదే ఎన్ని పుణ్యకార్యాలు చేసినా అవి విఫలమే అవుతాయి. పరలోకంలో వాటికి ఎలాంటి మంచి ఫలితం దొరకదు. సత్యతిరస్కారుల గమ్యస్థానం నరకమే.
3. చూడండి, 6:10.
4. ఉ'హుద్ యుద్ధంలో మక్కా ముష్రిక్‌లు తమకు కొంత ప్రాబల్యం దొరికినందుకు:

إِنَّ ٱللَّهَ يُدۡخِلُ ٱلَّذِينَ ءَامَنُواْ وَعَمِلُواْ ٱلصَّٰلِحَٰتِ جَنَّٰتٖ تَجۡرِي مِن تَحۡتِهَا ٱلۡأَنۡهَٰرُۖ وَٱلَّذِينَ كَفَرُواْ يَتَمَتَّعُونَ وَيَأۡكُلُونَ كَمَا تَأۡكُلُ ٱلۡأَنۡعَٰمُ وَٱلنَّارُ مَثۡوٗى لَّهُمۡ ١٢

**12**. నిశ్చయంగా, అల్లాహ్! విశ్వసించి సత్కార్యాలు చేసేవారిని స్వర్గవనాలలో ప్రవేశింపజేస్తాడు. వాటి క్రింద సెలయేళ్ళు ప్రవహిస్తూ ఉంటాయి. మరియు సత్యాన్ని తిరస్కరించి భోగభాగ్యాలలో మునిగి ఉండి పశువుల మాదిరిగా తింటున్న వారి నివాసం నరకాగ్నియే అవుతుంది.[1]

وَكَأَيِّن مِّن قَرۡيَةٍ هِيَ أَشَدُّ قُوَّةٗ مِّن قَرۡيَتِكَ ٱلَّتِيٓ أَخۡرَجَتۡكَ أَهۡلَكۡنَٰهُمۡ فَلَا نَاصِرَ لَهُمۡ ١٣

**13**. మరియు (ఓ ము'హమ్మద్!) నిన్ను బహిష్కరించిన నగరం కంటే బలమైన ఎన్నో నగరాలను మేము నాశనం చేశాము వారికి సహాయపడే వాడెవ్వడూ లేక పోయాడు.[2]

أَفَمَن كَانَ عَلَىٰ بَيِّنَةٖ مِّن رَّبِّهِۦ كَمَن زُيِّنَ لَهُۥ سُوٓءُ عَمَلِهِۦ وَٱتَّبَعُوٓاْ أَهۡوَآءَهُم ١٤

**14**. ఏమీ? తన ప్రభువు తరఫునుండి వచ్చిన స్పష్టమైన మార్గంమీద ఉన్నవాడు, తమ దుష్కార్యాలను మనోహరమైనవిగా భావించి, తమ మనోవాంఛలను అనుసరించే వారితో సమానుడు కాగలడా?

---

'అ'అలు హుబల్ ' - హుబల్‌కు జై! అని, అంటే! విశ్వాసులు: 'అల్లాహు అ'అలావ అజల్లు.' - అల్లాహ్ మహోన్నతుడు, గొప్పస్థానం గలవాడు. అని అన్నారు. మరియు ముష్రికులు: 'లనల్ 'ఉ'జ్జా వలా 'ఉ'జ్జాలకుమ్' - 'ఉ'జ్జా మాతోపాటు ఉన్నాడు, 'ఉ'జ్జా మీతోలేడు. అని, అంటే! ముస్లింలు: 'అల్లాహు మౌలానా వలా మౌలా లకుమ్' - అల్లాహ్ (సు.తా.) మా సంరక్షకుడు, మీ సంరక్షకుడు ఎవ్వడూ లేడు! అని అన్నారు. ('స. బు'ఖారీ).

**1**. సత్యతిరస్కారులకు, తమ ఐహిక జీవితానికే ప్రాధాన్యతనివ్వటం, అంటే కడుపు నింపుకోవటం మరియు లైంగిక అవసరాలను పూర్తి చేసుకోవటమే ప్రధానమైనది. వీరు పరలోక జీవితం గురించి పూర్తిగా అంధకారంలో పడిఉన్నారు.

**2**. ఈ ఆయత్ దైవప్రవక్త ('స'అస) యొక్క మక్కా నుండి మదీనా ప్రస్థానం చేసిన మొదటి రాత్రి అవతరింపజేయబడింది. ('తబరీ - ఇబ్నె-'అబ్బాస్, కథనం) ఇంకా చూడండి, 6:131.

مَّثَلُ ٱلْجَنَّةِ ٱلَّتِى وُعِدَ ٱلْمُتَّقُونَ فِيهَآ أَنْهَٰرٌ مِّن مَّآءٍ غَيْرِ ءَاسِنٍ وَأَنْهَٰرٌ مِّن لَّبَنٍ لَّمْ يَتَغَيَّرْ طَعْمُهُۥ وَأَنْهَٰرٌ مِّنْ خَمْرٍ لَّذَّةٍ لِّلشَّٰرِبِينَ وَأَنْهَٰرٌ مِّنْ عَسَلٍ مُّصَفًّى وَلَهُمْ فِيهَا مِن كُلِّ ٱلثَّمَرَٰتِ وَمَغْفِرَةٌ مِّن رَّبِّهِمْ كَمَنْ هُوَ خَٰلِدٌ فِى ٱلنَّارِ وَسُقُوا۟ مَآءً حَمِيمًا فَقَطَّعَ أَمْعَآءَهُمْ ﴿١٥﴾

**15**. భయభక్తులు గలవారికి వాగ్దానం చేయబడిన స్వర్గం యొక్క ఉదాహరణ ఇలావుంది: అందులో వాసన మరియు రంగు మారని నీటి సెలయేళ్ళు ఉంటాయి మరియు రుచి మారని పాల కాలువలు ఉంటాయి[1] మరియు అందులో త్రాగేవారికి మధురంగా వుండే మద్యపానపు కాలువలు ఉంటాయి మరియు అందులో శుద్ధమైన తేనె కాలువలుంటాయి. మరియు వారికొరకు అందులో అన్నిరకాల మంచి ఫలాలు మరియు వారి ప్రభువు నుండి క్షమాపణ కూడా వుంటాయి.[2] ఇలాంటి వాడు - నరకాగ్నిలో శాశ్వతంగా వుండి సలసలకాగే నీటిని[3] త్రాగేందుకు ఇవ్వబడి, దానితో ప్రేగులు కోయబడినట్లు బాధపడేవానితో - సమానుడు కాగలడా?

وَمِنْهُم مَّن يَسْتَمِعُ إِلَيْكَ حَتَّىٰٓ إِذَا خَرَجُوا۟ مِنْ عِندِكَ قَالُوا۟ لِلَّذِينَ أُوتُوا۟ ٱلْعِلْمَ مَاذَا قَالَ ءَانِفًا أُو۟لَٰٓئِكَ ٱلَّذِينَ طَبَعَ ٱللَّهُ عَلَىٰ قُلُوبِهِمْ وَٱتَّبَعُوٓا۟ أَهْوَآءَهُمْ ﴿١٦﴾

**16**. మరియు (ఓ ము'హమ్మద్!) వారి (కపటవిశ్వాసుల)లో నీ మాటలను చెవియొగ్గి వినేవారు కొందరున్నారు.[4] కాని వారు నీ దగ్గరనుండి వెళ్ళిపోయిన తరువాత, జ్ఞానవంతులను ఇలా ప్రశ్నిస్తారు: "అతను చెప్పిందేమిటీ?" వీరే! అల్లాహ్ హృదయాలమీద ముద్రవేసిన వారు మరియు వీరే తమ మనోవాంఛలను అనుసరించే వారు.[5]

---

**1**. చూడండి, 37:45-47 మరియు 56:19.

**2**. మీరు ఎప్పుడు ప్రార్థించినా జన్నతుల్‌ఫిర్‌దౌస్ కొరకే ప్రార్థించండి. అది స్వర్గాలలో అన్నిటికంటే ఉత్తమమైనది. దానినుంచే స్వర్గపు సెలయేర్లు ప్రారంభమవుతాయి. మరియు దానిపైననే అనంతకరుణామయుని సింహాసనం ('అర్ష్) ఉంది. ('స.బు'ఖారీ).

**3**. చూడండి, 6:70.

**4**. చూడండి, 6:25 మరియు 10:42-43.

**5**. చూడండి, 2:7.

وَٱلَّذِينَ ٱهۡتَدَوۡاْ زَادَهُمۡ هُدٗى وَءَاتَىٰهُمۡ تَقۡوَىٰهُمۡ ﴿١٧﴾

17. మరియు మార్గదర్శకత్వం పొందిన వారికి ఆయన (అల్లాహ్) ఇంకా ఎక్కువగా సన్మార్గం చూపుతాడు మరియు వారి దైవభీతిని వృద్ధిచేస్తాడు.

فَهَلۡ يَنظُرُونَ إِلَّا ٱلسَّاعَةَ أَن تَأۡتِيَهُم بَغۡتَةٗۖ فَقَدۡ جَآءَ أَشۡرَاطُهَاۚ فَأَنَّىٰ لَهُمۡ إِذَا جَآءَتۡهُمۡ ذِكۡرَىٰهُمۡ ﴿١٨﴾

18. ఏమీ? ఇప్పుడు వారు అంతిమ ఘడియ అకస్మాత్తుగా రావాలని ఎదురుచూస్తున్నారా? వాస్తవానికి, దాని చిహ్నాలు కూడా వచ్చేశాయి.[1] అది వచ్చిపడితే, ఇక వారికి హితోపదేశం స్వీకరించే అవకాశం ఎక్కడ ఉంటుంది?

فَٱعۡلَمۡ أَنَّهُۥ لَآ إِلَٰهَ إِلَّا ٱللَّهُ وَٱسۡتَغۡفِرۡ لِذَنۢبِكَ وَلِلۡمُؤۡمِنِينَ وَٱلۡمُؤۡمِنَٰتِۗ وَٱللَّهُ يَعۡلَمُ مُتَقَلَّبَكُمۡ وَمَثۡوَىٰكُمۡ ﴿١٩﴾

19. కావున (ఓ ము'హమ్మద్) తెలుసుకో! నిశ్చయంగా, అల్లాహ్ తప్ప మరొక ఆరాధ్య దేవుడు లేడు. కావున నీ పాపాలకు మరియు విశ్వాసస్త్రీల కొరకు మరియు విశ్వాసపురుషుల కొరకు కూడా క్షమాపణవేడుకో![2] మరియు అల్లాహ్‌కు మీ కార్యకలాపాలు మరియు మీ (అంతిమ) నివాసం కూడా తెలుసు.

وَيَقُولُ ٱلَّذِينَ ءَامَنُواْ لَوۡلَا نُزِّلَتۡ سُورَةٞۖ فَإِذَآ أُنزِلَتۡ سُورَةٞ مُّحۡكَمَةٞ

20. మరియు విశ్వసించిన వారు ఇలా అంటున్నారు: "(యుద్ధం చేయమని ఆదేశిస్తూ) ఒక సూరహ్ ఎందుకు అవతరింపజేయబడలేదు?"[3] కాని

1. దైవప్రవక్త (సఅస) ప్రవచనం: 'నా కాలం మరియు పునరుత్థానదినం ఈ రెండు ౹వేళ్ళవలే ఉన్నాయి.' అంటూ అతను (సఅస) తన రెండు ౹వేళ్ళను చూపుతూ అన్నారు: 'ఏ విధంగానైతే ఒక ౹వేలు మరొక ౹వేలుతో కొద్ది మాత్రమే పొడవుగా ఉందో, అదేవిధంగా పునరుత్థాన దినం నా తరువాత కొంత కాలంలోనే రానున్నది.' (సహీహ్ బుఖారీ).

2. దైవప్రవక్త ('స'అస) ప్రవచనం: 'ప్రజలారా! అల్లాహ్ (సు.తా.) సన్నిధిలో, పశ్చాత్తాపపడుతూ క్షమాపణలు వేడుకుంటూ ఉండండి. నేను కూడా అల్లాహ్ (సు.తా.) సన్నిధిలో ప్రతిరోజూ డెబ్భై కంటే ఎక్కువసార్లు పశ్చాత్తాపపడుతూ క్షమాపణ వేడుకుంటూ ఉంటాను.' ('స. బు'ఖారీ)

3. ఈ సూరహ్ 22:39 కంటే ముందు అవతరింపజేయబడింది.

ఇప్పుడు యుద్ధం చేయమని నిర్దేశిస్తూ ఒక సూరహ్ అవతరింపజేయబడితే తమ హృదయాలలో వ్యాధి ఉన్నవారు, మరణం ఆవహించిన వారివలే నీ వైపునకు చూడటాన్ని, నీవు గమనిస్తావు.[1] కాని అది వారికే మేలైనదై ఉండేది -

وَذُكِرَ فِيهَا ٱلْقِتَالُ رَأَيْتَ ٱلَّذِينَ فِي قُلُوبِهِم مَّرَضٌ يَنظُرُونَ إِلَيْكَ نَظَرَ ٱلْمَغْشِيِّ عَلَيْهِ مِنَ ٱلْمَوْتِ فَأَوْلَىٰ لَهُمْ ﴿٢٠﴾

**21**. ఆజ్ఞాపాలన చేయటం మరియు మంచి మాటలు పలుకటం. ఒకవేళ (జిహాద్ కొరకు) దృఢమైన నిర్ణయం తీసుకోబడినప్పుడు, వారు అల్లాహ్ విషయంలో సత్యవంతులుగా ఉన్నట్లయితే వారికే మేలు జరిగేది.

طَاعَةٌ وَقَوْلٌ مَّعْرُوفٌ فَإِذَا عَزَمَ ٱلْأَمْرُ فَلَوْ صَدَقُوا۟ ٱللَّهَ لَكَانَ خَيْرًا لَّهُمْ ﴿٢١﴾

**22**. (వారితో ఇలా అను): "ఏమీ? మీరు (అల్లాహ్) ఆజ్ఞాపాలనకు విముఖులై, మరల భూమిలో సంక్షోభం రేకెత్తిస్తూ మీ బంధుత్వాలను తెంపుకుంటారా?"

فَهَلْ عَسَيْتُمْ إِن تَوَلَّيْتُمْ أَن تُفْسِدُوا۟ فِي ٱلْأَرْضِ وَتُقَطِّعُوٓا۟ أَرْحَامَكُمْ ﴿٢٢﴾

**23**. ఇలాంటి వారినే అల్లాహ్ శపించాడు (బహిష్కరించాడు). వారిని చెవిటివారిగా చేశాడు మరియు వారి కండ్లను గ్రుడ్డిచేశాడు.

أُو۟لَٰٓئِكَ ٱلَّذِينَ لَعَنَهُمُ ٱللَّهُ فَأَصَمَّهُمْ وَأَعْمَىٰٓ أَبْصَٰرَهُمْ ﴿٢٣﴾

**24**. వారు ఈ ఖుర్ఆన్‌ను గురించి యోచించరా? లేదా వారి హృదయాల మీద తాళాలు పడివున్నాయా?

أَفَلَا يَتَدَبَّرُونَ ٱلْقُرْءَانَ أَمْ عَلَىٰ قُلُوبٍ أَقْفَالُهَآ ﴿٢٤﴾

**25**. మార్గదర్శకత్వం స్పష్టమైన తర్వాత కూడా, ఎవరైతే తమ వీపులు త్రిప్పుకొని మరలిపోయారో! నిశ్చయంగా, షైతాన్ (వారి చేష్టలను) వారికి మంచివిగా చూపాడు మరియు (అల్లాహ్) వారికి వ్యవధినిచ్చాడు.

إِنَّ ٱلَّذِينَ ٱرْتَدُّوا۟ عَلَىٰٓ أَدْبَٰرِهِم مِّنۢ بَعْدِ مَا تَبَيَّنَ لَهُمُ ٱلْهُدَى ٱلشَّيْطَٰنُ سَوَّلَ لَهُمْ وَأَمْلَىٰ لَهُمْ ﴿٢٥﴾

---

1. చూడండి, 4:77 ఇటువంటి వాక్యానికి.

**26**. ఇది, వాస్తవానికి వారు అల్లాహ్ అవతరింపజేసిన దానిని అసహ్యించుకునే వారితో ఇలా అన్నందుకు: "మేము కొన్ని విషయాలలో మిమ్మల్ని అనుసరిస్తాము." కాని అల్లాహ్‌కు వారి రహస్యాలోచనల గురించి బాగా తెలుసు.[1]

ذَٰلِكَ بِأَنَّهُمْ قَالُواْ لِلَّذِينَ كَرِهُواْ مَا نَزَّلَ ٱللَّهُ سَنُطِيعُكُمْ فِي بَعْضِ ٱلْأَمْرِ ۖ وَٱللَّهُ يَعْلَمُ إِسْرَارَهُمْ ﴿٢٦﴾

**27**. అయితే దేవదూతలు వారి ఆత్మలను వశపరచుకొని, వారి ముఖాలమీద మరియు వీపులమీద కొడుతూ వారిని తీసుకు వెళ్ళేటప్పుడు వారి పరిస్థితి ఎలా ఉంటుంది?[2]

فَكَيْفَ إِذَا تَوَفَّتْهُمُ ٱلْمَلَٰٓئِكَةُ يَضْرِبُونَ وُجُوهَهُمْ وَأَدْبَٰرَهُمْ ﴿٢٧﴾

**28**. ఇది వాస్తవానికి, వారు అల్లాహ్‌కు ఆగ్రహం కలిగించే విధానాన్ని అనుసరించినందుకు మరియు ఆయన సమ్మతించే మార్గాన్ని అసహ్యించు కున్నందుకు! కావున ఆయన వారి కర్మలను వృథా చేశాడు.

ذَٰلِكَ بِأَنَّهُمُ ٱتَّبَعُواْ مَآ أَسْخَطَ ٱللَّهَ وَكَرِهُواْ رِضْوَٰنَهُۥ فَأَحْبَطَ أَعْمَٰلَهُمْ ﴿٢٨﴾

**29**. ఏమీ? తమ హృదయాలలో వ్యాధి ఉన్నవారు, అల్లాహ్ వారి ద్వేషాన్ని బయటపెట్టడని భావిస్తున్నారా?[3]

أَمْ حَسِبَ ٱلَّذِينَ فِي قُلُوبِهِم مَّرَضٌ أَن لَّن يُخْرِجَ ٱللَّهُ أَضْغَٰنَهُمْ ﴿٢٩﴾

**30**. మరియు మేము తలచుకుంటే, వారిని నీకు చూపేవారం; వారి లక్షణాలనుబట్టి నీవు వారిని తెలుసుకోగలవు. మరియు వారు మాట్లాడే రీతిని బట్టి, వారిని నీవు తప్పక తెలుసుకోగలవు. మరియు అల్లాహ్‌కు మీ కర్మలు బాగా తెలుసు.

وَلَوْ نَشَآءُ لَأَرَيْنَٰكَهُمْ فَلَعَرَفْتَهُم بِسِيمَٰهُمْ ۚ وَلَتَعْرِفَنَّهُمْ فِي لَحْنِ ٱلْقَوْلِ ۚ وَٱللَّهُ يَعْلَمُ أَعْمَٰلَكُمْ ﴿٣٠﴾

---

**1**. చూడండి, 4:81.

**2**. ఇటువంటి వాక్యాల కోసం చూడండి, 6:93 మరియు 8:50.

**3**. అ'ద్'గానున్: 'ది'గ్నున్ యొక్క బహువచనం. ద్వేషం, పగ, అసహ్యం, ఏవగింపు.

وَلَنَبۡلُوَنَّكُمۡ حَتَّىٰ نَعۡلَمَ ٱلۡمُجَٰهِدِينَ مِنكُمۡ وَٱلصَّٰبِرِينَ وَنَبۡلُوَاْ أَخۡبَارَكُمۡ ﴿٣١﴾

**31**. మరియు నిశ్చయంగా, మీలో ధర్మయుద్ధం చేసేవారెవరో మరియు సహనం వహించేవారెవరో! తెలుసు కోనంత వరకు మేము మిమ్మల్ని తప్పక పరీక్షిస్తాము.[1] మరియు మేము మీ ప్రతిజ్ఞావచనాలను కూడా పరీక్షిస్తాము.

إِنَّ ٱلَّذِينَ كَفَرُواْ وَصَدُّواْ عَن سَبِيلِ ٱللَّهِ وَشَآقُّواْ ٱلرَّسُولَ مِنۢ بَعۡدِ مَا تَبَيَّنَ لَهُمُ ٱلۡهُدَىٰ لَن يَضُرُّواْ ٱللَّهَ شَيۡـٔٗا وَسَيُحۡبِطُ أَعۡمَٰلَهُمۡ ﴿٣٢﴾

**32**. నిశ్చయంగా, మార్గదర్శకత్వం స్పష్టంగా తెలిసిన తర్వాత కూడా, సత్యాన్ని తిరస్కరించి ప్రజలను అల్లాహ్ మార్గం నుండి నిరోధిస్తూ, ప్రవక్తతో విరోధం కలిగివున్నవారు,[2] అల్లాహ్‌కు ఏ మాత్రం నష్టం కలిగించలేరు. కాని ఆయన వారి కర్మలను నిష్ఫలం చేయగలడు. (3/8)

۞ يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوٓاْ أَطِيعُواْ ٱللَّهَ وَأَطِيعُواْ ٱلرَّسُولَ وَلَا تُبۡطِلُوٓاْ أَعۡمَٰلَكُمۡ ﴿٣٣﴾

**33**. * ఓ విశ్వసించిన ప్రజలారా! మీరు అల్లాహ్‌కు విధేయులై ఉండండి మరియు ప్రవక్తను అనుసరించండి మరియు మీ కర్మలను వ్యర్థం చేసుకోకండి.[3]

إِنَّ ٱلَّذِينَ كَفَرُواْ وَصَدُّواْ عَن سَبِيلِ ٱللَّهِ ثُمَّ مَاتُواْ وَهُمۡ كُفَّارٞ فَلَن يَغۡفِرَ ٱللَّهُ لَهُمۡ ﴿٣٤﴾

**34**. నిశ్చయంగా, సత్యాన్ని తిరస్కరిస్తూ ప్రజలను అల్లాహ్ మార్గం నుండి నిరోధిస్తూ వుండి, సత్యతిరస్కారులుగానే మరణించిన వారిని అల్లాహ్ ఎంత మాత్రం క్షమించడు.

---

**1**. చూడండి, 3:140.

**2**. చూడండి, 8:13 మరియు 2:190.

**3**. చూడండి, 53:32 ఎన్ని మంచి పనులు చేసినా అవి అల్లాహ్ (సు.తా.) మరియు ఆయన ప్రవక్త ('స'అస) విధేయతల పరిధినుండి బయట ఉంటే అవి వ్యర్థమే అవుతాయి.

فَلَا تَهِنُوا۟ وَتَدْعُوٓا۟ إِلَى ٱلسَّلْمِ وَأَنتُمُ ٱلْأَعْلَوْنَ وَٱللَّهُ مَعَكُمْ وَلَن يَتِرَكُمْ أَعْمَٰلَكُمْ ﴿٣٥﴾

**35**. కావున మీరు (ధర్మయుద్ధంలో) ధైర్యాన్ని వీడకండి మరియు సంధి కొరకు అడగకండి మరియు మీరే ప్రాబల్యం వహిస్తారు.[1] మరియు అల్లాహ్ మీకు తోడుగా ఉన్నాడు మరియు ఆయన మీ కర్మలను వృథా కానివ్వడు.

إِنَّمَا ٱلْحَيَوٰةُ ٱلدُّنْيَا لَعِبٌ وَلَهْوٌ ۚ وَإِن تُؤْمِنُوا۟ وَتَتَّقُوا۟ يُؤْتِكُمْ أُجُورَكُمْ وَلَا يَسْـَٔلْكُمْ أَمْوَٰلَكُمْ ﴿٣٦﴾

**36**. నిశ్చయంగా, ఈ ప్రాపంచిక జీవితం ఒక ఆట మరియు కాలక్షేపం మాత్రమే. ఒకవేళ మీరు విశ్వసించి దైవభీతి కలిగి ఉన్నట్లయితే, ఆయన మీకు మీ ప్రతిఫలం ఇస్తాడు. మరియు మీ నుండి ధనాన్ని కూడా అడగడు.[2]

إِن يَسْـَٔلْكُمُوهَا فَيُحْفِكُمْ تَبْخَلُوا۟ وَيُخْرِجْ أَضْغَٰنَكُمْ ﴿٣٧﴾

**37**. ఒకవేళ ఆయన దానిని (ధనాన్నే) అడిగితే మరియు దాని కొరకు గట్టిపట్టు పట్టితే, మీరు పిసినారితనం చూపితే, ఆయన మీ ద్వేషాన్ని బయటపెట్టేవాడు.

---

**1**. చూడండి, 3:139 కాని మీరు మీ శత్రువులకంటే బలహీనులుగా ఉన్నారనుకుంటే సంధి చేసుకోవచ్చు. దైవప్రవక్త ('స'అస) మక్కా ముష్రికులతో హుదైబియాలో పది సంవత్సరాల సంధి చేసుకొన్నారు.

**2**. అల్లాహ్ (సు.తా.)కు మీ ధనం అవసరం లేదు. మదీనా కాలపు మొదటి రోజులలోనే 'జకాత్ విధించబడింది. అది ఇస్లాంధర్మాన్ని కాపాడుకోవటానికి దాని ప్రచారానికి మరియు ముస్లింల కుశలతకొరకు వారిసౌకర్యాల కొరకు. 'జకాత్ ఒక సంవత్సరం వరకు జమఉన్న ధనసంపత్తుల మీద, 2.5 % మాత్రమే. సంవత్సరం గడిచిన పిదపనే 'జకాత్ ఇవ్వవలసి ఉంటుంది.

هَٰٓأَنتُمۡ هَٰٓؤُلَآءِ تُدۡعَوۡنَ لِتُنفِقُواْ فِي سَبِيلِ ٱللَّهِ فَمِنكُم مَّن يَبۡخَلُۖ وَمَن يَبۡخَلۡ فَإِنَّمَا يَبۡخَلُ عَن نَّفۡسِهِۦۚ وَٱللَّهُ ٱلۡغَنِيُّ وَأَنتُمُ ٱلۡفُقَرَآءُۚ وَإِن تَتَوَلَّوۡاْ يَسۡتَبۡدِلۡ قَوۡمًا غَيۡرَكُمۡ ثُمَّ لَا يَكُونُوٓاْ أَمۡثَٰلَكُم ٣٨

**38**. ఇదిగో చూడండి! వారు మీరే! అల్లాహ్ మార్గంలో ఖర్చుచేయండని పిలువబడుతున్నవారు. కాని మీలో కొందరు పిసినారితనం వహిస్తున్నారు. మరియు ఎవడు పిసినారితనం వహిస్తున్నాడో, అతడు నిజానికి తన సొంత విషయంలోనే పిసినారితనం వహిస్తున్నాడు. మరియు అల్లాహ్ స్వయంసమృద్ధుడు మరియు మీరే కొరతగల (పేద) వారు.[1] మరియు మీరు విముఖులైతే ఆయన మీకు బదులుగా ఇతర జాతిని మీ స్థానంలో తేగలడు, అప్పుడు వారు మీలాంటివారై ఉండరు.

*****

**1**. అల్లాహ్ (సు.తా.) మిమ్మల్ని ఖర్చుచేయమని ప్రోత్సహించేది. మీ ఆత్మశుద్ధి కొరకు, మీ చుట్టు ప్రక్కలలో ఉండే పేదవారి అత్యావసరాలను పూర్తి చేయటానికి మరియు మీరు మీ శత్రువులపై ఆధిక్యతపొందటానికి.

## 48. సూరహ్ అల్-ఫత్'హ్ سُورَةُ الفَتْحِ

ఫ'త్హ్: **విజయం**. ఈ సమూహపు 3 సూరాహ్‌లలో ఇది 2వది. ఇది 'హుదైబియా ఒప్పందం తరువాత 6వ హిజ్రీ (628 క్రీ.శ.)లో అవతరింపజేయబడిన **మదీనా** సూరహ్. ఇందులో **29 ఆయతులు** ఉన్నాయి. దీని పేరు **మొదటి ఆయత్‌**లో ఉంది. జు'ల్-ఖా'ఇదహ్ 6వ హిజ్రీలో దైవప్రవక్త ('స'అస), దాదాపు 1400 అనుచరులతో ఇ'హ్రామ్ ధరించి 'ఉమ్రా కొరకు బయలుదేరుతారు. అది విని, మక్కా ముష్రిక్‌లు, వారి దారికి, అడ్డుపోతారు. అది తెలుసుకొని దైవ ప్రవక్త ('స'అస) బీర్ 'ఉస్ఫాన్ నుండి తమ త్రోవను మార్చి, 'హుదైబియా అనే ప్రాంతం వైపునకు వెళ్ళి అక్కడ ఆగుతారు. 'హూదైబియా జిద్దా-మక్కాల మధ్య హరం సరిహద్దుల బయట ఉంది. అక్కడి నుండి తమను 'ఉమ్రా చేసుకోవటానికి అనుమతి అడగటానికి రాయబారిగా 'ఉస్మాన్ బిన్ 'అప్ఫాన్(ర'ది.'అ.)ను మక్కాకు పంపుతారు. అతనిని చంపారని, శత్రువులు వదంతిలేపుతారు. అది విని దైవప్రవక్త ('స'అస) తమ అనుచరులతో (ర'ది.'అన్హుమ్) వాగ్దానం తీసుకుంటారు. దీనినే బై'అతుర్రి'ద్వాన్ అంటారు. ఆ తరువాత 'ఉస్మాన్ (ర'ది.'అ.) తిరిగి వస్తారు. తరువాత మక్కా ముష్రికులతో ఒప్పందం జరుగుతుంది. అందులో: 1) పది సంవత్సారాల వరకు వారి మధ్య ఎలాంటి యుద్ధం జరగకూడదు. 2) ఇరువురు, ఇతర తెగల వారితో, ఎవరితోనైనా స్నేహం చేసుకోవచ్చు. 3) ఒక ఖురైషుడు తన పెద్దవారి అనుమతి లేనిదే ఇస్లాం స్వీకరించి మదీనా వెళ్తే, ఆ పెద్దవారు అడిగితే, అతనిని వారికి అప్పగించాలి. కాని ఎవడైనా ఇస్లాం వదలి మక్కా వెళ్తే వారు అతనిని ముస్లింలకు అప్పగించే అవసరంలేదు. 4) ఆ సంవత్సరం వారు 'ఉమ్రా చేయకుండా తిరిగి వెళ్ళిపోవాలి. వచ్చే సంవత్సరం వారికి 3 రోజుల కొరకు 'ఉమ్రా చేయటానికి మక్కాలోకి వచ్చే అనుమతి ఇవ్వబడుతుంది, మొదలైనవి... మొదట ఈ ఒప్పందం అనుచరుల (ర'ది.'అన్హుమ్) దృష్టిలో మక్కా ముష్రిక్‌లకు లాభదాయకమైనదిగా కనిపించినా! చివరకు, అది మక్కా ముష్రిక్‌లకే దుర్భరమవుతుంది. ఈ ఒప్పందం తరువాత రెండు సంవత్సరాలలోనే ఖురైషులతో స్నేహసంబంధాలు గల బనీ-బక్ర్ తెగవారు, ముస్లింలతో స్నేహంగల బనీ-'ఖు'జా'అ తెగవారి కొందరు వ్యక్తులను మక్కాలో చంపుతారు. దాని ఫలితంగా 8వ హిజ్రీలో దైవప్రవక్త ('స'అస) పదివేల మందితో మక్కా ఆక్రమణకు బయలుదేరి. మక్కాను ఆక్రమించుకుంటారు. 19 సంవత్సరాలలో చాలా తక్కువ మంది, దాదాపు 3000, మాత్రమే ముస్లింలు అవుతారు. కాని ఈ ఒప్పందం తరువాత ప్రజలు వేల సంఖ్యలో ముస్లింలు అవుతారు. 8వ హిజ్రీలో 10వేల యుద్ధనిపుణులు తయారవుతారు. మరియు 10వ హిజ్రీలో లక్షమంది ముస్లింలు దైవప్రవక్త('స'అస)తో 'హజ్జ్ కొరకు పోతారు. మొదట ముస్లింలకు అనుకూలమైనదిగా లేకపోయినా, ఈ ఒప్పందం ముస్లింలకు గొప్ప విజయాన్ని ఇస్తుంది. అందుకనే, ఈ సూరహ్‌కు అల్‌ఫ'త్హ్ విజయం అనే పేరు ఇచ్చారు.

C B A

అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో

إِنَّا فَتَحْنَا لَكَ فَتْحًا مُّبِينًا ﴿١﴾

1. (ఓ ప్రవక్తా!) నిశ్చయంగా, మేము నీకు స్పష్టమైన విజయాన్ని ప్రసాదించాము,

لِّيَغْفِرَ لَكَ ٱللَّهُ مَا تَقَدَّمَ مِن ذَنۢبِكَ وَمَا تَأَخَّرَ وَيُتِمَّ نِعْمَتَهُۥ عَلَيْكَ وَيَهْدِيَكَ صِرَٰطًا مُّسْتَقِيمًا ﴿٢﴾

2. అల్లాహ్! నీ పూర్వపు మరియు భావికాలపు తప్పులను క్షమించటానికి మరియు నీపై తన అనుగ్రహాన్ని పూర్తిచేయుటానికి మరియు నీకు ఋజుమార్గం వైపునకు మార్గదర్శకత్వం చేయుటానికి;

وَيَنصُرَكَ ٱللَّهُ نَصْرًا عَزِيزًا ﴿٣﴾

3. మరియు అల్లాహ్! నీకు గొప్ప సహకారంతో సహాయపడటానికి.

هُوَ ٱلَّذِىٓ أَنزَلَ ٱلسَّكِينَةَ فِى قُلُوبِ ٱلْمُؤْمِنِينَ لِيَزْدَادُوٓا۟ إِيمَٰنًا مَّعَ إِيمَٰنِهِمْ ۗ وَلِلَّهِ جُنُودُ ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضِ ۚ وَكَانَ ٱللَّهُ عَلِيمًا حَكِيمًا ﴿٤﴾

4. ఆయనే, విశ్వాసుల హృదయాలలో శాంతిని అవతరింపజేశాడు - వారి విశ్వాసంలో మరింత విశ్వాసాన్ని అధికం చేసేందుకు. మరియు ఆకాశాలలోని, భూమిలోని సైన్యాలన్నీ అల్లాహ్ అధీనంలోనే ఉన్నాయి. మరియు అల్లాహ్ సర్వజ్ఞుడు, మహా వివేకవంతుడు.

لِّيُدْخِلَ ٱلْمُؤْمِنِينَ وَٱلْمُؤْمِنَٰتِ جَنَّٰتٍ تَجْرِى مِن تَحْتِهَا ٱلْأَنْهَٰرُ خَٰلِدِينَ فِيهَا وَيُكَفِّرَ عَنْهُمْ سَيِّـَٔاتِهِمْ ۚ وَكَانَ ذَٰلِكَ عِندَ ٱللَّهِ فَوْزًا عَظِيمًا ﴿٥﴾

5. విశ్వాసులైన పురుషులను మరియు విశ్వాసులైన స్త్రీలను క్రింద సెలయేళ్ళు ప్రవహించే స్వర్గవనాలలో ప్రవేశింపజేసేందుకు, అందులో వారు శాశ్వతంగా ఉండేందుకు మరియు వారి పాపాలను తొలగించేందుకూను. మరియు అల్లాహ్ దృష్టిలో ఇది ఒక గొప్ప విజయం.

6. మరియు కపటవిశ్వాసులు (మునాఫిఖీన్) అయిన పురుషులను మరియు కపటవిశ్వాసులైన స్త్రీలను; మరియు బహుదైవారాధకులైన పురుషులను మరియు బహుదైవారాధకులైన స్త్రీలను; అల్లాహ్‌ను గురించి చెడుభావనలు, భావించే వారందరినీ శిక్షించేందుకు. వారిపై చెడు అన్ని వైపులనుండి ఆవరించి ఉంటుంది. మరియు అల్లాహ్ యొక్క ఆగ్రహం వారిపై విరుచుకుపడుతుంది. మరియు ఆయన వారిని శపించాడు (బహిష్కరించాడు) మరియు వారి కొరకు నరకాన్ని సిద్ధపరచి ఉంచాడు. మరియు అది ఎంత చెడ్డ గమ్యస్థానం!

7. ఆకాశాలలోని మరియు భూమిలోని సైన్యాలన్నీ అల్లాహ్ అధీనంలోనే ఉన్నాయి. మరియు అల్లాహ్ సర్వశక్తిమంతుడు, మహా వివేకవంతుడు.

8. నిశ్చయంగా, (ఓ ము'హమ్మద్!) మేము నిన్ను సాక్షిగా, శుభవార్తలు అందజేసేవానిగా మరియు హెచ్చరించే వానిగానూ చేసి పంపాము.

9. ఎందుకంటే (ఓ ముస్లింలారా!) మీరు అల్లాహ్‌ను మరియు ఆయన ప్రవక్తను విశ్వసించాలనీ మరియు మీరు అతని(ప్రవక్త)తో సహకరించాలనీ మరియు అతనిని గౌరవించాలనీ మరియు ఉదయం మరియు సాయంత్రం ఆయన (అల్లాహ్) పవిత్రతను కొనియాడాలనీ!

وَيُعَذِّبَ ٱلۡمُنَٰفِقِينَ وَٱلۡمُنَٰفِقَٰتِ وَٱلۡمُشۡرِكِينَ وَٱلۡمُشۡرِكَٰتِ ٱلظَّآنِّينَ بِٱللَّهِ ظَنَّ ٱلسَّوۡءِۚ عَلَيۡهِمۡ دَآئِرَةُ ٱلسَّوۡءِۖ وَغَضِبَ ٱللَّهُ عَلَيۡهِمۡ وَلَعَنَهُمۡ وَأَعَدَّ لَهُمۡ جَهَنَّمَۖ وَسَآءَتۡ مَصِيرٗا ٦

وَلِلَّهِ جُنُودُ ٱلسَّمَٰوَٰتِ وَٱلۡأَرۡضِۚ وَكَانَ ٱللَّهُ عَزِيزًا حَكِيمًا ٧

إِنَّآ أَرۡسَلۡنَٰكَ شَٰهِدٗا وَمُبَشِّرٗا وَنَذِيرٗا ٨

لِّتُؤۡمِنُواْ بِٱللَّهِ وَرَسُولِهِۦ وَتُعَزِّرُوهُ وَتُوَقِّرُوهُ وَتُسَبِّحُوهُ بُكۡرَةٗ وَأَصِيلًا ٩

إِنَّ ٱلَّذِينَ يُبَايِعُونَكَ إِنَّمَا يُبَايِعُونَ ٱللَّهَ يَدُ ٱللَّهِ فَوْقَ أَيْدِيهِمْ ۚ فَمَن نَّكَثَ فَإِنَّمَا يَنكُثُ عَلَىٰ نَفْسِهِۦ ۖ وَمَنْ أَوْفَىٰ بِمَا عَـٰهَدَ عَلَيْهُ ٱللَّهَ فَسَيُؤْتِيهِ أَجْرًا عَظِيمًا ﴿١٠﴾

10. (ఓ ము'హమ్మద్!) నిశ్చయంగా, (నీ చేతిలో చేయివేసి) నీతో శపథం చేసేవారు, వాస్తవానికి అల్లాహ్‌తో శపథం చేస్తున్నారు.[1] అల్లాహ్ చెయ్యి వారి చేతులమీద ఉంది. ఇక ఎవడు (తన శపథాన్ని) భంగంచేస్తాడో, వాస్తవానికి అతడు తన నష్టంకొరకే తన శపథాన్ని భంగంచేస్తాడు. మరియు ఎవడు తన వాగ్దానాన్ని పూర్తిచేస్తాడో, అల్లాహ్ అతనికి గొప్ప ప్రతిఫలాన్ని ఇస్తాడు.

سَيَقُولُ لَكَ ٱلْمُخَلَّفُونَ مِنَ ٱلْأَعْرَابِ شَغَلَتْنَآ أَمْوَٰلُنَا وَأَهْلُونَا فَٱسْتَغْفِرْ لَنَا ۚ يَقُولُونَ بِأَلْسِنَتِهِم مَّا لَيْسَ فِى قُلُوبِهِمْ ۚ قُلْ فَمَن يَمْلِكُ لَكُم مِّنَ ٱللَّهِ شَيْـًٔا إِنْ أَرَادَ بِكُمْ ضَرًّا أَوْ أَرَادَ بِكُمْ نَفْعًۢا ۚ بَلْ كَانَ ٱللَّهُ بِمَا تَعْمَلُونَ خَبِيرًۢا ﴿١١﴾

11. వెనుక ఉండిపోయిన ఎడారివాసులు (బద్దూ)[2] నీతో ఇలా అంటారు: "మా ఆస్తిపాస్తుల మరియు మా ఆలుబిడ్డల చింత మాకు తీరికలేకుండా చేశాయి. కావున మా క్షమాపణకై ప్రార్థించండి!" వారు తమ హృదయాలలో లేనిది తమ నాలుకలతో పలుకుతున్నారు. వారితో ఇలా అను: "ఒకవేళ అల్లాహ్ మీకు నష్టం చేయదలిస్తే, లేదా లాభం చేయదలిస్తే, ఆయన నుండి మిమ్మల్ని తప్పించగల శక్తి ఎవరికుంది? వాస్తవానికి మీరు చేసేదంతా అల్లాహ్ బాగా ఎరుగును!

بَلْ ظَنَنتُمْ أَن لَّن يَنقَلِبَ ٱلرَّسُولُ وَٱلْمُؤْمِنُونَ إِلَىٰٓ أَهْلِيهِمْ أَبَدًا وَزُيِّنَ ذَٰلِكَ فِى قُلُوبِكُمْ وَظَنَنتُمْ ظَنَّ ٱلسَّوْءِ وَكُنتُمْ قَوْمًۢا بُورًا ﴿١٢﴾

12. "అలాకాదు! ప్రవక్త మరియు విశ్వాసులు ఎన్నటికీ - తమ ఆలుబిడ్డల వద్దకు - తిరిగిరాలేరని మీరు భావించారు; మరియు ఇది (ఈ ఆలోచన) మీ హృదయాలకు చాలా నచ్చింది మరియు మీరు చాలా చెడ్డ తలంపులు చేశారు మరియు మీరు అధోగతికి చెందినవారు."

---

1. చూడండి, 4:80.
2. 'గిఫార్, ముజైనహ్, జు'హైనహ్, అష్జా'అ, అస్లమ్, దయల్ అనే బద్దూ తెగల వారు, సాకులుచెప్పారు. వారు ఆయుధాలు లేకుండా మక్కా వెళ్ళితే ముష్రికులు వారిని చంపవచ్చని భయపడ్డారు. అందుకే దైవప్రవక్త('స'అస)కు 'హుదైబియాహ్ ఒప్పందం చేసుకోవలసి వచ్చింది.

وَمَن لَّمۡ يُؤۡمِنۢ بِٱللَّهِ وَرَسُولِهِۦ فَإِنَّآ أَعۡتَدۡنَا لِلۡكَٰفِرِينَ سَعِيرٗا ﴿١٣﴾

13. మరియు అల్లాహ్‌ను మరియు ఆయన ప్రవక్తను విశ్వసించని సత్యతిరస్కారుల కొరకు మేము నిశ్చయంగా, భగభగ మండే అగ్ని జ్వాలలను సిద్ధపరచి ఉంచాము.

وَلِلَّهِ مُلۡكُ ٱلسَّمَٰوَٰتِ وَٱلۡأَرۡضِۚ يَغۡفِرُ لِمَن يَشَآءُ وَيُعَذِّبُ مَن يَشَآءُۚ وَكَانَ ٱللَّهُ غَفُورٗا رَّحِيمٗا ﴿١٤﴾

14. మరియు భూమ్యాకాశాలపై సామ్రాజ్యాధిపత్యం అల్లాహ్ దే! ఆయన తాను కోరినవారిని క్షమిస్తాడు మరియు తాను కోరిన వారిని శిక్షిస్తాడు. మరియు అల్లాహ్ సదా క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత.

سَيَقُولُ ٱلۡمُخَلَّفُونَ إِذَا ٱنطَلَقۡتُمۡ إِلَىٰ مَغَانِمَ لِتَأۡخُذُوهَا ذَرُونَا نَتَّبِعۡكُمۡۖ يُرِيدُونَ أَن يُبَدِّلُواْ كَلَٰمَ ٱللَّهِۚ قُل لَّن تَتَّبِعُونَا كَذَٰلِكُمۡ قَالَ ٱللَّهُ مِن قَبۡلُۖ فَسَيَقُولُونَ بَلۡ تَحۡسُدُونَنَاۚ بَلۡ كَانُواْ لَا يَفۡقَهُونَ إِلَّا قَلِيلٗا ﴿١٥﴾

15. ఇక మీరు విజయధనాన్ని తీసుకోవటానికి పోయినప్పుడు, వెనుక ఉండిపోయిన వారు ఇలా అంటారు: "మమ్మల్ని కూడా మీ వెంట రానివ్వండి."[1] వారు అల్లాహ్ ఉత్తరువును మార్చగోరుతున్నారు.[2] వారితో అను: "మీరు మా వెంట రాజాలరు; మీ గురించి అల్లాహ్ ముందే ఈ విధంగా చెప్పాడు." అప్పుడు వారు ఇలా అంటారు: "అది కాదు! మీరు మా మీద అసూయపడుతున్నారు." అలా కాదు! వారు వాస్తవాన్ని అర్థం చేసుకోగలిగేది చాలా తక్కువ.

---

1. ఇక్కడ 'ఖైబర్ యుద్ధ ప్రస్తావన ఉంది. అది 7వ హిజ్రీలో జరిగింది. 'హుదైబియా ఒప్పందం తరువాత సూరహ్ అల్-ఫ'త్'హ్ అవతరింపజేయబడింది. అది విని 6వ హిజ్రీలో సాకులు చెప్పి మక్కాకు 'ఉమ్రా కొరకు రానివారు - విజయధనపు ఆశతో - 'ఖైబర్ యుద్ధంలో పాల్గొనటానికి అనుమతి అడుగుతారు. అప్పుడు దైవప్రవక్త ('స'అస), కేవలం 6వ హిజ్రీలో 'ఉమ్రా కొరకు మక్కాకు పోయినవారు మాత్రమే 'ఖైబర్‌కు పోవాలని, సెలవిస్తారు.
2. చూడండి, 8:1.

قُل لِّلۡمُخَلَّفِينَ مِنَ ٱلۡأَعۡرَابِ سَتُدۡعَوۡنَ إِلَىٰ قَوۡمٍ أُوْلِي بَأۡسٖ شَدِيدٖ تُقَٰتِلُونَهُمۡ أَوۡ يُسۡلِمُونَۖ فَإِن تُطِيعُواْ يُؤۡتِكُمُ ٱللَّهُ أَجۡرًا حَسَنٗاۖ وَإِن تَتَوَلَّوۡاْ كَمَا تَوَلَّيۡتُم مِّن قَبۡلُ يُعَذِّبۡكُمۡ عَذَابًا أَلِيمٗا ١٦

**16**. వెనుక ఉండిపోయిన ఎడారివాసు (బద్దూ)లతో ఇలా అను: "ఇకమీద చాలా కఠినంగా పోరాడే వారికి విరుద్ధంగా (యుద్ధం చేసేందుకు) మీరు పిలువబడతారు. అప్పుడు (మీరు చనిపోయే వరకూ) వారితో యుద్ధం చేయవలసి ఉంటుంది, లేదా వారు లొంగిపోయే వరకు. ఒకవేళ మీరు ఆజ్ఞాపాలన చేస్తే, అల్లాహ్ మీకు మంచి ప్రతిఫలం ఇస్తాడు. ఒకవేళ మీరు ఇంతకు ముందు మరలిపోయినట్లు, మరలిపోతే ఆయన మీకు అత్యంత బాధాకరమైన శిక్ష విధించగలడు."

لَّيۡسَ عَلَى ٱلۡأَعۡمَىٰ حَرَجٞ وَلَا عَلَى ٱلۡأَعۡرَجِ حَرَجٞ وَلَا عَلَى ٱلۡمَرِيضِ حَرَجٞۗ وَمَن يُطِعِ ٱللَّهَ وَرَسُولَهُۥ يُدۡخِلۡهُ جَنَّٰتٖ تَجۡرِي مِن تَحۡتِهَا ٱلۡأَنۡهَٰرُۖ وَمَن يَتَوَلَّ يُعَذِّبۡهُ عَذَابًا أَلِيمٗا ١٧

**17**. కాని గ్రుడ్డివానిపై ఎలాంటి నిందలేదు మరియు కుంటివానిపై కూడా ఎలాంటి నింద లేదు మరియు అదేవిధంగా వ్యాధిగ్రస్తునిపై కూడా ఎలాంటి నిందలేదు. అల్లాహ్ మరియు ఆయన ప్రవక్తకు విధేయత చూపే వారిని, ఆయన క్రింద సెలయేళ్ళు ప్రవహించే స్వర్గవనాలలో ప్రవేశింపజేస్తాడు. మరియు వెనుదిరిగిన వానికి ఆయన బాధాకరమైన శిక్ష విధిస్తాడు. (1/2)

۞ لَّقَدۡ رَضِيَ ٱللَّهُ عَنِ ٱلۡمُؤۡمِنِينَ إِذۡ يُبَايِعُونَكَ تَحۡتَ ٱلشَّجَرَةِ فَعَلِمَ مَا فِي قُلُوبِهِمۡ فَأَنزَلَ ٱلسَّكِينَةَ عَلَيۡهِمۡ وَأَثَٰبَهُمۡ فَتۡحٗا قَرِيبٗا ١٨

**18**. * వాస్తవానికి విశ్వాసులు చెట్టు క్రింద నీతో చేసినశపథం[1] చూసి అల్లాహ్ సంతోషించాడు మరియు వారి హృదయాల స్థితి ఆయనకు తెలిసిందే కావున ఆయన వారిమీద శాంతిని అవతరింపజేశాడు మరియు బహుమానంగా వారికి సమీప విజయాన్ని ప్రసాదించాడు.[2]

---

**1**. ఇది 'హుదైబియాలో 6వ హిజ్రీలో 'ఉస్మాన్ బిన్ అఫ్ఫాన్ (ర'ది.'అ.) మరణవార్త విని, దైవప్రవక్త ('స'అస) చేతిపై ఒక తుమ్మచెట్టు క్రింద 'స'హాబాలు (ర'ది.'అన్హుమ్) అందరూ, తమ చివరి ప్రాణాలవరకు 'ఉస్మాన్ (ర'ది.'అ.) మరణపు ప్రతీకారం తీర్చుకోవటానికి పోరాడుతామని, చేసిన ప్రతిజ్ఞ.

**2**. ఇది 'ఖైబర్ విజయమని చాలామంది వ్యాఖ్యాతలు అంటారు. కొందరు ఇది 8వ హిజ్రీ మక్కా విజయమని, ఆ తరువాత ముస్లింలకు లభించిన ఇతర విజయాలని అంటారు.

وَمَغَانِمَ كَثِيرَةً يَأْخُذُونَهَا ۗ وَكَانَ ٱللَّهُ عَزِيزًا حَكِيمًا ﴿١٩﴾

**19**. మరియు అందులో వారు చాలా విజయధనాన్ని కూడా పొందుతారు. మరియు అల్లాహ్ సర్వశక్తిమంతుడు, మహా వివేచనాపరుడు.

وَعَدَكُمُ ٱللَّهُ مَغَانِمَ كَثِيرَةً تَأْخُذُونَهَا فَعَجَّلَ لَكُمْ هَٰذِهِۦ وَكَفَّ أَيْدِىَ ٱلنَّاسِ عَنكُمْ وَلِتَكُونَ ءَايَةً لِّلْمُؤْمِنِينَ وَيَهْدِيَكُمْ صِرَٰطًا مُّسْتَقِيمًا ﴿٢٠﴾

**20**. మరియు అల్లాహ్ మీకు ఇంకా చాలా విజయధనాల వాగ్దానం చేశాడు. మీరు వాటిని పొందుతారు. కావున మీకు వాటిని త్వరగా ప్రసాదిస్తాడు. మరియు ఆయన ప్రజల చేతులను మీనుండి ఆపాడు. ఇది విశ్వాసులకు ఒక సూచనగా ఉండేందుకు మరియు ఆయన మీకు ఋజుమార్గం వైపునకు మార్గదర్శకత్వం చేసేందుకూను.[1]

وَأُخْرَىٰ لَمْ تَقْدِرُوا۟ عَلَيْهَا قَدْ أَحَاطَ ٱللَّهُ بِهَا ۚ وَكَانَ ٱللَّهُ عَلَىٰ كُلِّ شَىْءٍ قَدِيرًا ﴿٢١﴾

**21**. ఇంకా ఇతర (విజయాలు) కూడా! వాటిని మీరింకా సాధించలేదు. వాస్తవానికి, అల్లాహ్ వాటిని ఆవరించివున్నాడు. మరియు అల్లాహ్ ప్రతిదీ చేయగల సమర్థుడు.

وَلَوْ قَٰتَلَكُمُ ٱلَّذِينَ كَفَرُوا۟ لَوَلَّوُا۟ ٱلْأَدْبَٰرَ ثُمَّ لَا يَجِدُونَ وَلِيًّا وَلَا نَصِيرًا ﴿٢٢﴾

**22**. మరియు ఒకవేళ సత్య తిరస్కారులు మీతో యుద్ధానికి దిగివుంటే, వారు తప్పక వెన్నుచూపి పారిపోయేవారు, అప్పుడు వారు ఏ రక్షకుడిని గానీ లేదా సహాయకుడిని గానీ పొందేవారు కాదు.[2]

سُنَّةَ ٱللَّهِ ٱلَّتِى قَدْ خَلَتْ مِن قَبْلُ ۖ وَلَن تَجِدَ لِسُنَّةِ ٱللَّهِ تَبْدِيلًا ﴿٢٣﴾

**23**. ఇది మొదటినుంచే వస్తూ ఉన్న అల్లాహ్ సంప్రదాయం. నీవు అల్లాహ్ సంప్రదాయంలో ఎలాంటి మార్పును పొందలేవు.

---

**1**. ఇది తరువాత జరిగే యుద్ధాలు మరియు వాటిలో దొరికే విజయధనపు ప్రస్తావన.
**2**. ఇది హుదైబియా ఒప్పందాన్ని సూచిస్తోంది.

وَهُوَ ٱلَّذِى كَفَّ أَيۡدِيَهُمۡ عَنكُمۡ وَأَيۡدِيَكُمۡ عَنۡهُم بِبَطۡنِ مَكَّةَ مِنۢ بَعۡدِ أَنۡ أَظۡفَرَكُمۡ عَلَيۡهِمۡۚ وَكَانَ ٱللَّهُ بِمَا تَعۡمَلُونَ بَصِيرًا ﴿٢٤﴾

**24**. మరియు మక్కా లోయలో మీకు వారిమీద ప్రాబల్యం ఇచ్చిన తర్వాత, ఆయనే వారి చేతులను మీపై పడకుండా మరియు మీ చేతులు వారిపై పడకుండా చేశాడు.[1] మరియు మీరు చేసేదంతా అల్లాహ్ చూస్తున్నాడు.

هُمُ ٱلَّذِينَ كَفَرُواْ وَصَدُّوكُمۡ عَنِ ٱلۡمَسۡجِدِ ٱلۡحَرَامِ وَٱلۡهَدۡىَ مَعۡكُوفًا أَن يَبۡلُغَ مَحِلَّهُۥۚ وَلَوۡلَا رِجَالٞ مُّؤۡمِنُونَ وَنِسَآءٞ مُّؤۡمِنَٰتٞ لَّمۡ تَعۡلَمُوهُمۡ أَن تَطَـُٔوهُمۡ فَتُصِيبَكُم مِّنۡهُم مَّعَرَّةُۢ بِغَيۡرِ عِلۡمٖۖ لِّيُدۡخِلَ ٱللَّهُ فِى رَحۡمَتِهِۦ مَن يَشَآءُۚ لَوۡ تَزَيَّلُواْ لَعَذَّبۡنَا ٱلَّذِينَ كَفَرُواْ مِنۡهُمۡ عَذَابًا أَلِيمًا ﴿٢٥﴾

**25**. (వాస్తవానికి) సత్యాన్ని తిరస్కరించి, మిమ్మల్ని మస్జిద్ అల్-'హరామ్‌కు పోకుండా నిరోధించి, బలి (ఖుర్బానీ) జంతువులను వాటిని బలిచేసే స్థలానికి చేరనివ్వకుండా ఆపింది వారే కదా![2] ఒకవేళ వారిలో విశ్వాసులైన పురుషులు మరియు విశ్వాసులైన స్త్రీలు లేకుంటే - ఎవరిని గురించైతే మీకు తెలియదో - వారిని మీరు త్రొక్కివేసి ఉండేవారు. దాని వలన మీరు - మీకు తెలియకుండానే - పాపానికి గురి అయ్యేవారు. అల్లాహ్ తాను కోరిన వారిని తన కారుణ్యంలోనికి తీసుకుంటాడు. ఒకవేళ వారు (విశ్వాసులు), వారి నుండి వేరుగా ఉండిఉంటే, మేము తప్పక వారిలోని సత్యతిరస్కారులకు బాధాకరమైన శిక్ష విధించి ఉండేవారము.

---

1. 'హుదైబియా ఒప్పందానికి ముందు దాదాపు 80 మంది ముష్రికులు ఆయుధాలు తీసుకొని దైవప్రవక్త ('స'అస)ను చంపాలని బయలుదేరుతారు. కాని ముస్లింలు వారిని పట్టుకొని ఖైదీలు చేసుకుంటారు. ఒప్పందం జరిగిన తరువాత దైవప్రవక్త ('స'అస) వారిని విడిచిపెడ్తారు. (ముస్లిం, నసాయి' - 'తబరీ).
2. అల్-హద్‌య్: అంటే మక్కాకు 'ఉమ్రా లేక 'హజ్జ్ కొరకు పోయేవారు, అక్కడ బలిఇచ్చే పశువు. వారు దానిని తమ వెంట తీసుకురావచ్చు లేదా అక్కడే కొనవచ్చు.
   మ'హిల్లున్: అంటే ఖుర్బానీ (బలి) ఇచ్చేచోటు. ఇది 'హరం సరిహద్దులలోని భాగం ('హుదూద్ అల్-'హరం).

إِذْ جَعَلَ ٱلَّذِينَ كَفَرُوا۟ فِى قُلُوبِهِمُ ٱلْحَمِيَّةَ حَمِيَّةَ ٱلْجَٰهِلِيَّةِ فَأَنزَلَ ٱللَّهُ سَكِينَتَهُۥ عَلَىٰ رَسُولِهِۦ وَعَلَى ٱلْمُؤْمِنِينَ وَأَلْزَمَهُمْ كَلِمَةَ ٱلتَّقْوَىٰ وَكَانُوٓا۟ أَحَقَّ بِهَا وَأَهْلَهَا ۚ وَكَانَ ٱللَّهُ بِكُلِّ شَىْءٍ عَلِيمًا ﴿٢٦﴾

**26**. సత్యాన్ని తిరస్కరించిన వారు, తమ హృదయాలలోని మూఢ అభిమానం వల్ల, మూర్ఖపు పట్టు వహించినప్పుడు,[1] అల్లాహ్! తన సందేశహరుని మీద మరియు విశ్వాసుల మీద, శాంతిని అవతరింపజేశాడు మరియు వారిలో దైవభీతిని స్థిరపరచాడు మరియు వారే దానికి హక్కుదారులు మరియు అర్హులు కూడాను. మరియు అల్లాహ్ కు ప్రతి విషయం గురించి బాగా తెలుసు.

---

**1**. 'హమియ్యతల్ జాహిలియ్యహ్: అంటే ఇక్కడ ముస్లింలను ఎన్నటికీ మక్కాలోకి రానివ్వకూడదు అనే మూర్ఖ హఠము. అంటే ముస్లింలు 'హరంలో ప్రవేశించి, నమా'జ్ చేయటాన్ని మక్కా ముష్రిక్ ఖురైషులు సహించేవారు కాదు. ఎందుకంటే ముస్లింలు అల్లాహ్ (సు.తా.)ను ఆరాధించేవారు. కాని ముష్రిక్‌లు తమ విగ్రహాలను ఆరాధించేవారు. ఆ అభిమానం వారు ముస్లింలతో చేసిన సంధిలో వ్యక్తమవుతోంది. అది మొదట ముష్రిక్‌లకు అనుకూలమైనదిగా కనిపించినా చివరకు వారికి సహించరానిదిగా మారింది. వారి పతనానికి కారణమయ్యింది.
ఆ సంధి వ్రాసేటప్పుడు దైవప్రవక్త ('స'అస), 'అలీ (ర'ది.'అ.)తో మొదట: "బిస్మిల్లా హిర్ర'హ్మా నిర్ర'హీమ్" అని వ్రాయమంటారు. అప్పుడు సంధి చేసుకోవటానికి వచ్చిన సుహైల్ బిన్ 'అమ్ర్ అంటాడు: మేము 'అర్ర'హ్మాన్ అర్ర'హీమ్' ఏమిటో ఎరుగము. మేము వాడే పదం: "బిస్మిక అల్లాహుమ్మ" - 'నీ పేరుతో ఓ అల్లాహ్!' అని వ్రాయి, అంటాడు. దైవప్రవక్త ('స'అస) అలీ (ర'ది.'అ.)ను అలా వ్రాయమని అంటారు. ఆ తరువాత దైవప్రవక్త ('స'అస) అంటారు: 'ము'హమ్మద్ రసూలుల్లాహ్ మరియు మక్కా వాసుల మధ్య ఈ సంధి జరుగుతున్నది.' అని వ్రాయమంటారు. అలీ (ర'ది.'అ.)ను వెంటనే ఆపుతూ ముష్రిక్ నాయకుడు అంటాడు: 'రసూలుల్లాహ్' అనే పదవి మీదనే కదా మా మధ్య - మీ మధ్య వివాదమున్నది. అలాకాదు: 'ము'హమ్మద్ బిన్ అబ్దుల్లాహ్' అని వ్రాయాలి అంటాడు. దైవప్రవక్త ('స'అస) దానిని కొట్టేసి అలాగే వ్రాయమని అలీ (ర'ది.'అ.)తో అంటారు. దానికి అలీ (ర'ది.'అ.) ఒప్పుకోరు. అప్పుడు దైవప్రవక్త ('స'అస) తమ చేతితోనే దానిని కొట్టేసి, అతడు చెప్పినట్లు వ్రాయమంటారు. అప్పుడు ముస్లింల క్రోధావేశాలకు అంతులేకుండా పోతుంది. కాని అల్లాహ్ (సు.తా.) వారి హృదయాలకు శాంతిని ప్రసాదిస్తాడు. ('స.ముస్లిం, నసాయి', ఇబ్నె'హంబల్ - 'తబరీ).

لَّقَدْ صَدَقَ ٱللَّهُ رَسُولَهُ ٱلرُّءْيَا بِٱلْحَقِّ لَتَدْخُلُنَّ ٱلْمَسْجِدَ ٱلْحَرَامَ إِن شَآءَ ٱللَّهُ ءَامِنِينَ مُحَلِّقِينَ رُءُوسَكُمْ وَمُقَصِّرِينَ لَا تَخَافُونَ فَعَلِمَ مَا لَمْ تَعْلَمُوا۟ فَجَعَلَ مِن دُونِ ذَٰلِكَ فَتْحًا قَرِيبًا ﴿٢٧﴾

**27**. వాస్తవానికి అల్లాహ్ తన ప్రవక్తకు, అతని స్వప్నాన్ని, నిజంచేసి చూపాడు.[1] అల్లాహ్ కోరితే, మీరు తప్పక శాంతియుతంగా, మీ తలలను పూర్తిగా గొరిగించుకొని లేదా తలవెంట్రుకలను కత్తిరించుకొని, మస్జిద్ అల్-'హరామ్‌లోకి భయపడ కుండా ప్రవేశించే వారు. మీకు తెలియనిది ఆయనకు తెలుసు. ఇక ఇదే కాక సమీపంలోనే మీకు మరొక విజయాన్ని కూడా ప్రసాదించ బోతున్నాడు.[2]

هُوَ ٱلَّذِىٓ أَرْسَلَ رَسُولَهُۥ بِٱلْهُدَىٰ وَدِينِ ٱلْحَقِّ لِيُظْهِرَهُۥ عَلَى ٱلدِّينِ كُلِّهِۦ وَكَفَىٰ بِٱللَّهِ شَهِيدًا ﴿٢٨﴾

**28**. ఆయనే, తన ప్రవక్తను మార్గదర్శకత్వంతో మరియు సత్యధర్మంతో, అన్ని ధర్మాలపై అది ఆధిక్యత కలిగివుండేలా చేసిపంపాడు. మరియు సాక్షిగా అల్లాహ్ యే చాలు.[3]

---

**1**. దైవప్రవక్త ('స'అస) తన అచనురులతో (ర'ది.'అన్హుమ్) సహా ఇ'హ్రామ్ ధరించి 'హరమ్‌లో ప్రవేశించినట్లు చూసిన స్వప్నం. అది 7వ హి.జ్రీలో పూర్తి అయింది. అప్పుడు వారంతా 'ఉమ్రా చేసారు.

**2**. అంటే మక్కా, 'ఖైబర్ మరియు ముస్లింలకు లభించిన ఇతర విజయాలు.

**3**. ముస్లింలు, ఇస్లాంను తూ.చా. తప్పక పాటిస్తే ఈ రోజు కూడా వారు అన్ని ధర్మాలవారి మీద ప్రాబల్యం వహించగలరు. చూడండి, 3:139.

مُّحَمَّدٌ رَّسُولُ ٱللَّهِۚ وَٱلَّذِينَ مَعَهُۥٓ أَشِدَّآءُ عَلَى ٱلۡكُفَّارِ رُحَمَآءُ بَيۡنَهُمۡۖ تَرَىٰهُمۡ رُكَّعٗا سُجَّدٗا يَبۡتَغُونَ فَضۡلٗا مِّنَ ٱللَّهِ وَرِضۡوَٰنٗاۖ سِيمَاهُمۡ فِي وُجُوهِهِم مِّنۡ أَثَرِ ٱلسُّجُودِۚ ذَٰلِكَ مَثَلُهُمۡ فِي ٱلتَّوۡرَىٰةِۚ وَمَثَلُهُمۡ فِي ٱلۡإِنجِيلِ كَزَرۡعٍ أَخۡرَجَ شَطۡـَٔهُۥ فَـَٔازَرَهُۥ فَٱسۡتَغۡلَظَ فَٱسۡتَوَىٰ عَلَىٰ سُوقِهِۦ يُعۡجِبُ ٱلزُّرَّاعَ لِيَغِيظَ بِهِمُ ٱلۡكُفَّارَۗ وَعَدَ ٱللَّهُ ٱلَّذِينَ ءَامَنُواْ وَعَمِلُواْ ٱلصَّٰلِحَٰتِ مِنۡهُم مَّغۡفِرَةٗ وَأَجۡرًا عَظِيمَۢا ﴿٢٩﴾

**29**. ము'హమ్మద్ అల్లాహ్ యొక్క సందేశహరుడు. మరియు అతని వెంట ఉన్నవారు, సత్యతిరస్కారుల పట్ల కఠినులు మరియు పరస్పరం కరుణామయులు.[1] నీవు వారిని (అల్లాహ్ ముందు) వంగుతూ (రుకూ చేస్తూ), సాష్టాంగా (సజ్దా)లు చేస్తూ ఉండటం చూస్తున్నావు. వారు అల్లాహ్ అనుగ్రహాన్ని మరియు ప్రసన్నతను అర్థిస్తూ ఉంటారు. వారి ముఖాల మీద సాష్టాంగం (సజ్దా) చేయటం వల్ల వచ్చిన గుర్తులు వుంటాయి. వారి ఈ ఉపమానం తౌరాత్‌లో కూడా ఇవ్వబడింది. మరియు ఇంజీల్‌లో వారు ఒక పైరుతో పోల్చబడ్డారు: మొదట (బీజం నుండి) ఒక మొలక అంకురిస్తుంది,[2] తరువాత ఆయన దానిని బలపరుస్తాడు, తరువాత దానిని లావుగా చేస్తాడు. ఆ తరువాత అది తన కాండం మీద నిటారుగా నిలబడి[3] రైతులను ఆనందపరిచి సత్యతిరస్కారులకు క్రోధావేశాలు కలిగిస్తుంది. విశ్వసించి, సత్కార్యాలు చేసే వారికి క్షమాపణ మరియు గొప్ప ప్రతిఫలాన్ని ప్రసాదిస్తానని అల్లాహ్ వాగ్దానంచేశాడు. (5/8)

*****

---

1. చూడండి, 5:54.
2. ష'త్అ'హ: అంటే బీజాన్ని చీల్చి బయటికి వచ్చే మొదటి అంకురం.
3. ఇది 'స'హాబా(ర'ది.'అ.)లను సూచిస్తోంది. మొదట వారు అల్పసంఖ్యలో మరియు బలహీనులుగా ఉంటారు, క్రమక్రమంగా వారి సంఖ్య పెరిగి వారు బలాఢ్యులవుతారు.

## 49. సూరహ్ అల్-'హుజురాత్

## سُورَةُ الحُجُرَاتِ

'హుజురాత్: **గృహాలు,** ఇండ్లు. ఈ పేరు **4వ ఆయత్** నుండి తీసుకోబడింది. ఈ సూరహ్ ఈ వరుసలో 3వది మరియు చివరిది. 9వ హి'జ్రీలో **మదీనా**లో అవతరింపజేయబడింది. ఇందులో **18 ఆయతులు** ఉన్నాయి.

ఇందులో దైవప్రవక్త ('స'అస)కు ముస్లింలపై ఉన్న హక్కులు మరియు అతని పట్ల వారి మర్యాదలు మరియు ముస్లిం సహోదరుల పరస్పర హక్కులు మరియు తమ నాయకుని పట్ల ముస్లింల బాధ్యతలు బోధింపబడ్డాయి. 9వ హి'జ్రీలో రాయబారాలు చాల వస్తాయి. ఈ సూరహ్ వాటిని గురించి కూడా చెబుతోంది.

**1**) 'తివాలు ముఫ'స్సల్ (49-79): ఈ సమూహపు సూరాహ్‌లలో ఇది మొదటిది అని కొందరంటారు. మరికొందరు, ఇవి సూరహ్ ఖాఫ్ (50) నుండి మొదలౌతాయి అంటారు. వీటిని **ఫజ్ర్** నమా'జ్‌లో చదవటం మసూన్న్, ముస్త'హాబ్. (ఫ'త్హ్ అల్-ఖదీర్, ఇబ్నె-కసీ'ర్).

**2**) అవ్‌సా'తు ముఫ'స్సల్ (80-91): వీటిని ''జుహ్ర్ మరియు 'ఇషా నమాజులలో చదవటం, మసూన్న్, ముస్త'హబ్.

**3**) ఖి'సారు ముఫ'స్సల్ (92-114): వీటిని **మగ్‌రిబ్** నమాజ్‌లో చదవటం, మసూన్న్, ముస్త'హబ్. (అయ్‌సర్ అత్తఫాసీర్).

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

C B A

يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُواْ لَا تُقَدِّمُواْ بَيْنَ يَدَيِ ٱللَّهِ وَرَسُولِهِۦۖ وَٱتَّقُواْ ٱللَّهَۚ إِنَّ ٱللَّهَ سَمِيعٌ عَلِيمٌ ﴿١﴾

**1.** * ఓ విశ్వాసులారా! మీరు అల్లాహ్ మరియు ఆయన ప్రవక్త అనుమతికి ముందే నిర్ణయాలకు దిగకండి.[1] అల్లాహ్ యందు భయభక్తులు కలిగి ఉండండి. నిశ్చయంగా, అల్లాహ్ అంతా వినేవాడు, సర్వజ్ఞుడు.

---

**1**. ధర్మం విషయంలో మీ స్వంత నిర్ణయాలకు దిగకండి. అల్లాహ్ (సు.తా.) మరియు దైవప్రవక్త ('స'అస) ఆజ్ఞలనే పాటించండి. అంటే ఖుర్ఆన్ మరియు 'స'హీ'హ్ 'హదీస్'ల ఆదేశాలను మాత్రమే అనుసరించండి. మీ స్వంత భావాలను, నిర్ణయాలను ధర్మంలో చొచ్చితే, అది బిద్'అత్ అవుతుంది. చూడండి, 4:65.

يَـٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوا۟ لَا تَرْفَعُوٓا۟ أَصْوَٰتَكُمْ فَوْقَ صَوْتِ ٱلنَّبِىِّ وَلَا تَجْهَرُوا۟ لَهُۥ بِٱلْقَوْلِ كَجَهْرِ بَعْضِكُمْ لِبَعْضٍ أَن تَحْبَطَ أَعْمَـٰلُكُمْ وَأَنتُمْ لَا تَشْعُرُونَ ٢

2. ఓ విశ్వాసులారా! మీ కంఠస్వరాలను, ప్రవక్త కంఠస్వరాని కంటే పెంచకండి మరియు మీరు పరస్పరం ఒకరితోనొకరు విచ్చలవిడిగా మాట్లాడుకునే విధంగా అతనితో మాట్లాడకండి, దానివల్ల మీకు తెలియకుండానే, మీ కర్మలు వ్యర్థం కావచ్చు!

إِنَّ ٱلَّذِينَ يَغُضُّونَ أَصْوَٰتَهُمْ عِندَ رَسُولِ ٱللَّهِ أُو۟لَـٰٓئِكَ ٱلَّذِينَ ٱمْتَحَنَ ٱللَّهُ قُلُوبَهُمْ لِلتَّقْوَىٰ ۚ لَهُم مَّغْفِرَةٌ وَأَجْرٌ عَظِيمٌ ٣

3. నిశ్చయంగా, ఎవరైతే అల్లాహ్ యొక్క సందేశహరుని సన్నిధిలో తమ కంఠస్వరాలను తగ్గిస్తారో, అలాంటివారి హృదయాలను అల్లాహ్ భయభక్తుల కొరకు పరీక్షించి ఉన్నాడు. వారికి క్షమాపణ మరియు గొప్ప ప్రతిఫలం ఉంటాయి.

إِنَّ ٱلَّذِينَ يُنَادُونَكَ مِن وَرَآءِ ٱلْحُجُرَٰتِ أَكْثَرُهُمْ لَا يَعْقِلُونَ ٤

4. (ఓ ప్రవక్తా!) నిశ్చయంగా, ఎవరైతే, నిన్ను **గృహాల** బయటనుండి బిగ్గరగా (అరుస్తూ) పిలుస్తారో, వారిలో చాలామంది బుద్ధిహీనులే.[1]

وَلَوْ أَنَّهُمْ صَبَرُوا۟ حَتَّىٰ تَخْرُجَ إِلَيْهِمْ لَكَانَ خَيْرًا لَّهُمْ ۚ وَٱللَّهُ غَفُورٌ رَّحِيمٌ ٥

5. మరియు ఒకవేళ వారు నీవు బయటకు వచ్చేవరకు ఓపిక పట్టివుంటే, అది వారికే మేలై ఉండేది. మరియు అల్లాహ్ క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత.

يَـٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوٓا۟ إِن جَآءَكُمْ فَاسِقٌۢ بِنَبَإٍ فَتَبَيَّنُوٓا۟ أَن تُصِيبُوا۟ قَوْمًۢا بِجَهَـٰلَةٍ فَتُصْبِحُوا۟ عَلَىٰ مَا فَعَلْتُمْ نَـٰدِمِينَ ٦

6. ఓ విశ్వాసులారా! ఎవడైనా ఒక అవిధేయుడు (ఫాసిఖ్), మీ వద్దకు ఏదైనా వార్త తెస్తే, మీరు - మీకు తెలియకుండానే జనులకు నష్టం కలిగించి, మీరు చేసిన దానికి పశ్చాత్తాపపడవలసిన స్థితి రాకముందే - నిజానిజాలను విచారించి తెలుసుకోండి.[2]

---

1. ఒకరోజు మధ్యాహ్నం బనూ-తమీమ్ తెగవారు - మర్యాదలు తెలియని ఎడారివాసు (బద్దూ)లు - దైవప్రవక్త ('స'అస) ఇంటి ముందుకు వచ్చి పెద్ద కంఠస్వరంతో అతని ('స'అస)పేరు తీసుకొని అరుస్తారు; అప్పుడు ఈ ఆయత్ అవతరింపజేయబడుతుంది. (ముస్నద్ అ'హ్మద్, 3/488, 6/394).

2. ఒకవేళ దైవప్రవక్త ('స'అస) మీ మాటలు విని మిమ్మల్ని అనుసరిస్తే దానితో మీరే ఎక్కువ కష్టాలలో పడిపోవచ్చు! చూడండి, 23:71.

وَٱعۡلَمُوٓاْ أَنَّ فِيكُمۡ رَسُولَ ٱللَّهِۚ لَوۡ يُطِيعُكُمۡ فِي كَثِيرٖ مِّنَ ٱلۡأَمۡرِ لَعَنِتُّمۡ وَلَٰكِنَّ ٱللَّهَ حَبَّبَ إِلَيۡكُمُ ٱلۡإِيمَٰنَ وَزَيَّنَهُۥ فِي قُلُوبِكُمۡ وَكَرَّهَ إِلَيۡكُمُ ٱلۡكُفۡرَ وَٱلۡفُسُوقَ وَٱلۡعِصۡيَانَۚ أُوْلَٰٓئِكَ هُمُ ٱلرَّٰشِدُونَ ٧

**7**. మరియు మీ మధ్య అల్లాహ్ యొక్క సందేశహరుడు ఉన్నాడనే విషయాన్ని బాగా గుర్తుంచుకోండి. ఒకవేళ అతను చాలా విషయాలలో మీ మాటనే వింటే మీరే ఆపదలోపడవచ్చు, కానీ అల్లాహ్ మీకు విశ్వాసంపట్ల ప్రేమ కలిగించాడు మరియు దానిని మీ హృదయాలకు ఆకర్షణీయమైనదిగా చేశాడు. మరియు సత్యతిరస్కారాన్ని, అవిధేయతను మరియు దుర్నడతను (ఆజ్ఞోల్లంఘనను) మీకు అసహ్యాకరమైనదిగా చేశాడు. అలాంటి వారే సరైన మార్గదర్శకత్వం పొందినవారు.

فَضۡلٗا مِّنَ ٱللَّهِ وَنِعۡمَةٗۚ وَٱللَّهُ عَلِيمٌ حَكِيمٞ ٨

**8**. అది అల్లాహ్ తరఫునుండి వారికి లభించిన అనుగ్రహం మరియు ఉపకారం. మరియు అల్లాహ్ సర్వజ్ఞుడు, మహా వివేకవంతుడు.

وَإِن طَآئِفَتَانِ مِنَ ٱلۡمُؤۡمِنِينَ ٱقۡتَتَلُواْ فَأَصۡلِحُواْ بَيۡنَهُمَاۖ فَإِنۢ بَغَتۡ إِحۡدَىٰهُمَا عَلَى ٱلۡأُخۡرَىٰ فَقَٰتِلُواْ ٱلَّتِي تَبۡغِي حَتَّىٰ تَفِيٓءَ إِلَىٰٓ أَمۡرِ ٱللَّهِۚ فَإِن فَآءَتۡ فَأَصۡلِحُواْ بَيۡنَهُمَا بِٱلۡعَدۡلِ وَأَقۡسِطُوٓاْۖ إِنَّ ٱللَّهَ يُحِبُّ ٱلۡمُقۡسِطِينَ ٩

**9**. మరియు ఒకవేళ విశ్వాసులలోని రెండు వర్గాలవారు పరస్పరం కలహించు కుంటే, వారిద్దరి మధ్య సంధిచేయించండి. కాని ఒకవేళ, వారిలోని ఒక వర్గంవారు రెండవ వర్గంవారిపై దౌర్జన్యంచేస్తే, దౌర్జన్యం చేసినవారు, అల్లాహ్ ఆజ్ఞ వైపునకు మరలేవరకు, వారికి వ్యతిరేకంగా పోరాడండి.[1] తరువాత వారు మరలివస్తే, వారిమధ్య న్యాయంగా సంధి చేయించండి మరియు నిష్పక్షపాతంగా వ్యవహరించండి. నిశ్చయంగా, అల్లాహ్ నిష్పక్షపాతంగా వ్యవహరించే వారిని ప్రేమిస్తాడు.

---

**1**. ఒక ముస్లిం మరొక ముస్లింపై దౌర్జన్యం చేస్తే, ఖుర్ఆన్ మరియు 'హదీస్' వెలుగులో వారి మధ్య సంధి చేయించడానికి ప్రయత్నించాలి. దౌర్జన్యం చేసేవాడు దానికి అంగీకరించకపోతే, ముస్లింలు అందరూ కలిసి అతడు అల్లాహ్ (సు.తా.) ఆజ్ఞను అనుసరించటానికి అంగీకరించే వరకు అతనికి వ్యతిరేకంగా పోరాడాలి.

إِنَّمَا ٱلْمُؤْمِنُونَ إِخْوَةٌ فَأَصْلِحُواْ بَيْنَ أَخَوَيْكُمْ وَٱتَّقُواْ ٱللَّهَ لَعَلَّكُمْ تُرْحَمُونَ ﴿١٠﴾

**10**. వాస్తవానికి విశ్వాసులు పరస్పరం సహోదరులు, కావున మీ సహోదరుల మధ్య సంధిచేయించండి.[1] మరియు మీరు కరుణించబడాలంటే అల్లాహ్ యందు భయభక్తులు కలిగి ఉండండి.

يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُواْ لَا يَسْخَرْ قَوْمٌ مِّن قَوْمٍ عَسَىٰٓ أَن يَكُونُواْ خَيْرًا مِّنْهُمْ وَلَا نِسَآءٌ مِّن نِّسَآءٍ عَسَىٰٓ أَن يَكُنَّ خَيْرًا مِّنْهُنَّ وَلَا تَلْمِزُوٓاْ أَنفُسَكُمْ وَلَا تَنَابَزُواْ بِٱلْأَلْقَٰبِ بِئْسَ ٱلِٱسْمُ ٱلْفُسُوقُ بَعْدَ ٱلْإِيمَٰنِ وَمَن لَّمْ يَتُبْ فَأُوْلَٰٓئِكَ هُمُ ٱلظَّٰلِمُونَ ﴿١١﴾

**11**. ఓ విశ్వాసులారా! మీలో ఎవరూ (పురుషులు) ఇతరులెవరినీ ఎగతాళి చేయరాదు. బహుశా వారే (ఎగతాళి చేయబడే వారే) వీరికంటే శ్రేష్ఠులు కావచ్చు![2] అదేవిధంగా స్త్రీలు కూడా ఇతర స్త్రీలను ఎగతాళి చేయరాదు. బహుశా వారే (ఎగతాళి చేయబడే స్త్రీలే) వీరికంటే శ్రేష్ఠురాండ్రు కావచ్చు! మీరు పరస్పరం ఎత్తిపొడుచుకోకండి మరియు చెడ్డపేర్లతో పిలుచుకోకండి. విశ్వసించిన తర్వాత ఒకనిని చెడ్డ పేరుతో పిలవటం ఎంతో నీచమైన విషయం మరియు (ఇలా చేసిన పిదప) పశ్చాత్తాపపడకుంటే, అలాంటి వారు చాలా దుర్మార్గులు.[3]

يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُواْ ٱجْتَنِبُواْ كَثِيرًا مِّنَ ٱلظَّنِّ إِنَّ بَعْضَ ٱلظَّنِّ إِثْمٌ وَلَا تَجَسَّسُواْ وَلَا يَغْتَب بَّعْضُكُم بَعْضًا أَيُحِبُّ أَحَدُكُمْ أَن يَأْكُلَ

**12**. ఓ విశ్వాసులారా! అతిగా అనుమానించడం నుండి దూరంగా ఉండండి, ఎందుకంటే కొన్ని అనుమానాలే నిశ్చయంగా పాపాలు. మరియు మీరు మీ పరస్పర రహస్యాలను తెలుసుకోవటానికి ప్రయత్నించకండి మరియు చాడీలు చెప్పుకోకండి. మీలో ఎవడైనా చచ్చిన తన

---

**1**. చూడండి, 9:71.

**2**. మీరు ఇతరులను చిన్న వారిగా భావించి వారిని ఎగతాళి చేయకండి. వారిని కించపరచకండి. ఎవడు ఉత్తముడో, ఎవడు అధముడో కేవలం అల్లాహ్ (సు.తా.)కే తెలుసు. దైవప్రవక్త ('స'అస) ప్రవచనం: 'ఇతరులను నీచమైనవారుగా, తుచ్ఛమైనవారుగా భావించడం పెద్ద పాపాలలో ఒకటి.' (అబూ-దావూద్).

**3**. చూడండి, 6:82.

لَحۡمَ أَخِيهِ مَيۡتٗا فَكَرِهۡتُمُوهُۚ وَٱتَّقُواْ ٱللَّهَۚ إِنَّ ٱللَّهَ تَوَّابٞ رَّحِيمٞ ﴿١٢﴾

సోదరుని మాంసం తినటానికి ఇష్టపడతాడా? మీరు దానిని అసహ్యించుకుంటారు కదా! అల్లాహ్ పట్ల భయభక్తులు కలిగి ఉండండి. నిశ్చయంగా, అల్లాహ్ పశ్చాత్తాపాన్ని అంగీకరించే వాడు, అపార కరుణాప్రదాత.

يَٰٓأَيُّهَا ٱلنَّاسُ إِنَّا خَلَقۡنَٰكُم مِّن ذَكَرٖ وَأُنثَىٰ وَجَعَلۡنَٰكُمۡ شُعُوبٗا وَقَبَآئِلَ لِتَعَارَفُوٓاْۚ إِنَّ أَكۡرَمَكُمۡ عِندَ ٱللَّهِ أَتۡقَىٰكُمۡۚ إِنَّ ٱللَّهَ عَلِيمٌ خَبِيرٞ ﴿١٣﴾

**13.** ఓ మానవులారా! నిశ్చయంగా మేము మిమ్మల్ని ఒక పురుషుడు మరియు ఒక స్త్రీ నుండి పుట్టించాము మరియు మీరు ఒకరినొకరు గుర్తించు కోవటానికి మిమ్మల్ని జాతులుగా మరియు తెగలుగా చేశాము.[1] నిశ్చయంగా, మీలో ఎక్కువ దైవభీతి గలవాడే, అల్లాహ్ దగ్గర ఎక్కువ గౌరవం గలవాడు. నిశ్చయంగా, అల్లాహ్ సర్వజ్ఞుడు, సర్వం తెలిసినవాడు. (3/4)

۞ قَالَتِ ٱلۡأَعۡرَابُ ءَامَنَّاۖ قُل لَّمۡ تُؤۡمِنُواْ وَلَٰكِن قُولُوٓاْ أَسۡلَمۡنَا وَلَمَّا يَدۡخُلِ ٱلۡإِيمَٰنُ فِي قُلُوبِكُمۡۖ وَإِن تُطِيعُواْ ٱللَّهَ وَرَسُولَهُۥ لَا يَلِتۡكُم مِّنۡ أَعۡمَٰلِكُمۡ شَيۡـًٔاۚ إِنَّ ٱللَّهَ غَفُورٞ رَّحِيمٌ ﴿١٤﴾

**14.** * ఎడారివాసు(బద్దూ)లు: "మేము విశ్వసించాము." అని అంటారు. (ఓ ము'హమ్మద్!) వారితో ఇలా అను: "మీరు ఇంకా విశ్వసించలేదు కావున: 'మేము విధేయు(ముస్లిం)ల మయ్యాము.' అని అనండి. ఎందుకంటే విశ్వాసం (ఈమాన్) మీ హృదయాలలోకి ఇంకా ప్రవేశించలేదు. ఒకవేళ మీరు అల్లాహ్ యొక్క మరియు ఆయన ప్రవక్త యొక్క ఆజ్ఞాపాలన చేస్తే, ఆయన మీ కర్మలను ఏ మాత్రం వృథాకానివ్వడు. నిశ్చయంగా, అల్లాహ్ క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత."

1. షు'ఊబున్, ష'అబున్ యొక్క బహువచనం, పెద్ద కుటుంబాన్ని ష'అబ్ అంటారు. దాని తరువాత ఖబీలహ్, 'ఇమారహ్, బ'తన్, ఫ'సీలహ్ మరియు 'అషీరహ్. (ఫ'త్హ్ అల్-ఖదీర్).

إِنَّمَا ٱلْمُؤْمِنُونَ ٱلَّذِينَ ءَامَنُوا۟ بِٱللَّهِ وَرَسُولِهِۦ ثُمَّ لَمْ يَرْتَابُوا۟ وَجَٰهَدُوا۟ بِأَمْوَٰلِهِمْ وَأَنفُسِهِمْ فِى سَبِيلِ ٱللَّهِ ۚ أُو۟لَٰٓئِكَ هُمُ ٱلصَّٰدِقُونَ ﴿١٥﴾

15. వాస్తవానికి, ఎవరైతే అల్లాహ్ మరియు ఆయన ప్రవక్తను విశ్వసించి, ఆ తరువాత ఏ అనుమానానికీ లోనుకాకుండా, అల్లాహ్ మార్గంలో, తమ సిరిసంపదలతో మరియు ప్రాణాలతో పోరాడుతారో! అలాంటి వారు, వారే! సత్యవంతులు.

قُلْ أَتُعَلِّمُونَ ٱللَّهَ بِدِينِكُمْ وَٱللَّهُ يَعْلَمُ مَا فِى ٱلسَّمَٰوَٰتِ وَمَا فِى ٱلْأَرْضِ ۚ وَٱللَّهُ بِكُلِّ شَىْءٍ عَلِيمٌ ﴿١٦﴾

16. వారితో ఇలా అను: "ఏమిటి? మీరు అల్లాహ్‌కు మీ ధర్మస్వీకారం గురించి తెలియజేస్తున్నారా? ఆకాశాలలో మరియు భూమిలో ఉన్నదంతా అల్లాహ్‌కు బాగాతెలుసు. మరియు అల్లాహ్‌కు ప్రతి విషయం గురించి బాగాతెలుసు."

يَمُنُّونَ عَلَيْكَ أَنْ أَسْلَمُوا۟ ۖ قُل لَّا تَمُنُّوا۟ عَلَىَّ إِسْلَٰمَكُم ۖ بَلِ ٱللَّهُ يَمُنُّ عَلَيْكُمْ أَنْ هَدَىٰكُمْ لِلْإِيمَٰنِ إِن كُنتُمْ صَٰدِقِينَ ﴿١٧﴾

17. (ఓ ము'హమ్మద్!) వారు ఇస్లాంను స్వీకరించి, నీకు ఉపకారం చేసినట్లు వ్యవహరిస్తున్నారు. వారితో ఇలా అను: "మీరు ఇస్లాంను స్వీకరించి నాకు ఎలాంటి ఉపకారం చేయలేదు! వాస్తవానికి, మీరు సత్యవంతులే అయితే! మీకు విశ్వాసం వైపునకు మార్గదర్శకత్వం చేసి, అల్లాహ్‌యే మీకు ఉపకారం చేశాడని తెలుసుకోండి."

إِنَّ ٱللَّهَ يَعْلَمُ غَيْبَ ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضِ ۚ وَٱللَّهُ بَصِيرٌۢ بِمَا تَعْمَلُونَ ﴿١٨﴾

18. నిశ్చయంగా అల్లాహ్! ఆకాశాలలో మరియు భూమిలో నున్న అగోచర విషయాలన్నింటినీ ఎరుగును. మరియు మీరు చేసేదంతా అల్లాహ్ చూస్తున్నాడు.

*****

## 50. సూరహ్ ఖాఫ్ سُورَةُ قٓ

మొదటి ఆయత్‌లోనే ఈ సూరహ్ పేరుగల ఈ అక్షరముంది. దైవప్రవక్త('స'అస) సూరహ్ ఖాఫ్(50), సూరహ్ అల్-ఖమర్(54)లను పండుగల మరియు జుము'అహ్ నమా'జ్‌లలో పఠించేవారు, అంటే పెద్ద సమూహం ఉన్నప్పుడు, ('స. ముస్లిం). ఇది దైవప్రవక్త('స'అస), ప్రవక్త పదవికి ఎన్నుకోబడిన 4 సంవత్సరాల తరువాత అవతరింపజేయబడింది. ఇందులో మరణం మరియు పునరుత్థానం గురించి వివరాలున్నాయి. ఇది మక్కాకు చెందిన ఈ సమూహపు 7 సూరాహ్‌లలో మొదటిది (50-56). అవతరణాక్రమంలో సూరహ్ అల్-ఖలమ్/నూన్ (68) తరువాత-మొదట అక్షరాలు ఉన్న సూరాలలో - ఇది రెండవది. ఇందులో **45 ఆయతులు** ఉన్నాయి.

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

C B A

**1.** ఖాఫ్. మరియు దివ్యమైన[1] ఈ ఖుర్ఆన్ సాక్షిగా!

قٓ ۚ وَٱلْقُرْءَانِ ٱلْمَجِيدِ ﴿١﴾

**2.** అలాకాదు! హెచ్చరిక చేసేవాడు, వారివద్దకు వారిలో నుంచే వచ్చాడనే విషయం వారికి ఆశ్చర్యం కలిగించింది, కావున సత్యతిరస్కారులు ఇలా అన్నారు:[2] "ఇది ఆశ్చర్యకరమైన విషయం!

بَلْ عَجِبُوٓا۟ أَن جَآءَهُم مُّنذِرٌ مِّنْهُمْ فَقَالَ ٱلْكَٰفِرُونَ هَٰذَا شَىْءٌ عَجِيبٌ ﴿٢﴾

**3.** "మేము మరణించి మట్టిగా మారి పోయినా (మరల బ్రతికించబడతామా)? ఈ విధంగా మరల (సజీవులై) రావటం చాలా అసంభవమైన విషయం!"

أَءِذَا مِتْنَا وَكُنَّا تُرَابًا ۖ ذَٰلِكَ رَجْعٌۢ بَعِيدٌ ﴿٣﴾

**4.** వాస్తవానికి వారి (శరీరాల)లో నుండి భూమి దేనిని తగ్గిస్తుందో మాకు బాగా తెలుసు.[3] మరియు మా దగ్గర అంతా ఒక సురక్షితమైన గ్రంథంలో (వ్రాయబడి) ఉంది.

قَدْ عَلِمْنَا مَا تَنقُصُ ٱلْأَرْضُ مِنْهُمْ ۖ وَعِندَنَا كِتَٰبٌ حَفِيظٌۢ ﴿٤﴾

---

**1.** **అల్-మజీదు:** ఖుర్ఆన్‌ను సంబోధించిన సందర్భానికి చూడండి, 85:21. Glorious, Noble, **దివ్యమైన,** ఉత్కృష్టమైన. **అల్లాహుతా'ఆలాను** సంబోధించిన సందర్భానికి చూడండి, 11:73, 85:15. **మహత్త్వపూర్ణుడు.**

**2.** చూడండి, 25:7, 20.

**3.** పునరుత్థానం అంటే పూర్తిగా దుమ్ము ధూళిగా మారిపోయిన మానవులను తిరిగి మొదటి రూపంలో బ్రతికించి తీసుకురావటం. చూడండి, 10:4, 21:104, 30:11, 85:13 మొదలైనవి. ఇంకా చూడండి, 10:34, 27:64 మరియు 30:27.

بَلْ كَذَّبُوا۟ بِٱلْحَقِّ لَمَّا جَآءَهُمْ فَهُمْ فِىٓ أَمْرٍ مَّرِيجٍ ﴿٥﴾

**5.** కాని వారు, సత్యం వారివద్దకు వచ్చినపుడు దానిని అసత్యమని తిరస్కరించారు. కాబట్టి వారు ఈ విషయం గురించి కలవరపడుతున్నారు.

أَفَلَمْ يَنظُرُوٓا۟ إِلَى ٱلسَّمَآءِ فَوْقَهُمْ كَيْفَ بَنَيْنَٰهَا وَزَيَّنَّٰهَا وَمَا لَهَا مِن فُرُوجٍ ﴿٦﴾

**6.** వారు, తమ మీద ఉన్న ఆకాశం వైపునకు చూడటం లేదా ఏమిటి? మేము దానిని ఏవిధంగా నిర్మించి అలంకరించామో మరియు దానిలో ఎలాంటి చీలికలూ (పగుళ్ళూ) లేవు.[1]

وَٱلْأَرْضَ مَدَدْنَٰهَا وَأَلْقَيْنَا فِيهَا رَوَٰسِىَ وَأَنۢبَتْنَا فِيهَا مِن كُلِّ زَوْجٍۭ بَهِيجٍ ﴿٧﴾

**7.** ఇక భూమిని! మేము దానిని విస్తరింపజేసి, దానిలో స్థిరమైన పర్వతాలను నాటాము మరియు అందులో అన్నిరకాల మనోహరమైన వృక్షకోటిని ఉత్పత్తి చేశాము.[2]

تَبْصِرَةً وَذِكْرَىٰ لِكُلِّ عَبْدٍ مُّنِيبٍ ﴿٨﴾

**8.** (అల్లాహ్) వైపునకు మరలే ప్రతి దాసునికి సూచనగా మరియు బోధనగా!

وَنَزَّلْنَا مِنَ ٱلسَّمَآءِ مَآءً مُّبَٰرَكًا فَأَنۢبَتْنَا بِهِۦ جَنَّٰتٍ وَحَبَّ ٱلْحَصِيدِ ﴿٩﴾

**9.** మరియు మేము ఆకాశంనుండి శుభదాయకమైన నీటిని కురిపించి దానిద్వారా తోటలను ఉత్పతి చేశాము మరియు ధాన్యాలను పండించాము.

وَٱلنَّخْلَ بَاسِقَٰتٍ لَّهَا طَلْعٌ نَّضِيدٌ ﴿١٠﴾

**10.** మరియు ఎత్తైన ఖర్జూరపు చెట్లను పెంచి, వాటికి వరుసలలో పండ్లగుత్తులను (పుట్టించాము)[3] -

رِّزْقًا لِّلْعِبَادِ ۖ وَأَحْيَيْنَا بِهِۦ بَلْدَةً مَّيْتًا ۚ كَذَٰلِكَ ٱلْخُرُوجُ ﴿١١﴾

**11.** మా దాసులకు జీవనోపాధిగా. మరియు దాని(ఆ నీటి)తో చచ్చిన భూమికి ప్రాణం పోశాము. ఇదేవిధంగా (చచ్చిన వారిని) కూడా లేపుతాము.

---

**1**. అంటే ఎలాంటి లోపాలూ లేవు. చూడండి. 67:3-4.

**2**. బహీజున్: మనోహరమైన. ఇక్కడ 'జౌజ్-అంటే జతలు. చూడండి, 22:5.

**3**. బాసిఖాతిన్: 'తివాలన్ షాహిఖాతిన్, ఎత్తైన. 'తల్'ఉన్: క్రొత్తగా పుట్టిన ఖర్జూరపు ఫలాలు, న'దీదున్: గుత్తులు.

كَذَّبَتْ قَبْلَهُمْ قَوْمُ نُوحٍ وَأَصْحَٰبُ ٱلرَّسِّ وَثَمُودُ ﴿١٢﴾

12. వారికి పూర్వం నూ'హ్‌జాతి వారు, అర్-రస్[1] వాసులు మరియు సమూద్ జాతి వారు కూడా, సత్యాన్ని తిరస్కరించారు.

وَعَادٌ وَفِرْعَوْنُ وَإِخْوَٰنُ لُوطٍ ﴿١٣﴾

13. మరియు ఆద్‌జాతి వారు, ఫిర్'ఔన్ జాతి వారు మరియు లూ'త్ సహోదరులు కూడా;

وَأَصْحَٰبُ ٱلْأَيْكَةِ وَقَوْمُ تُبَّعٍ ۚ كُلٌّ كَذَّبَ ٱلرُّسُلَ فَحَقَّ وَعِيدِ ﴿١٤﴾

14. మరియు అయ్‌కహ్(వన)వాసులు మరియు తుబ్బ'అ[2] జాతివారు కూడాను. ప్రతి ఒక్కరూ తమ ప్రవక్తలను అసత్యులని తిరస్కరించారు, కావున నా బెదిరింపు వారి విషయంలో సత్యమయింది.

أَفَعَيِينَا بِٱلْخَلْقِ ٱلْأَوَّلِ ۚ بَلْ هُمْ فِى لَبْسٍ مِّنْ خَلْقٍ جَدِيدٍ ﴿١٥﴾

15. ఏమిటి? మేము మొదటి సృష్టితోనే అలసిపోయామా? అలాకాదు, అసలు వారు క్రొత్తసృష్టి (పునరుత్థానం) గురించి సందేహంలో పడిఉన్నారు.[3]

وَلَقَدْ خَلَقْنَا ٱلْإِنسَٰنَ وَنَعْلَمُ مَا تُوَسْوِسُ بِهِۦ نَفْسُهُۥ ۖ وَنَحْنُ أَقْرَبُ إِلَيْهِ مِنْ حَبْلِ ٱلْوَرِيدِ ﴿١٦﴾

16. మరియు వాస్తవంగా, మేమే మానవుణ్ణి సృష్టించాము మరియు అతని మనస్సులో మెదిలే ఊహలను కూడా మేము ఎరుగుతాము.[4] మరియు మేము అతనికి అతని కంఠరక్తనాళం కంటే కూడా అతి దగ్గరగా ఉన్నాము.

---

1. చూడండి, 25:38 మరియు సూరహ్ అల్-బురూజ్ (85). అర్-రస్ వారు ఎవరనే విషయంలో భేదాభిప్రాయాలు ఉన్నాయి. ఇబ్నె-జరీర్ 'తబరీ (ర'హ్మ) అభిప్రాయంలో వీరే అస్'హాబ్ అల్-ఉఖ్దూద్.
2. తుబ్బ'అ జాతివారి కొరకు చూడండి, 44:37. అయ్‌కహ్ వాసులు (వనవాసులు) అంటే మద్‌యన్ వాసులు. చూడండి, 26:176. ఇంకా వివరాలకు చూడండి, 11:84-95.
3. చూడండి, 30:27 మరియు 36:78-79.
4. హృదయాలలో దాగి ఉన్న విషయాలన్నీ అల్లాహ్ (సు.తా.)కు తెలుసు. దైవప్రవక్త ('స'అస) ప్రవచనం: 'అల్లాహ్ (సు.తా.) నా అనుచరుల మనస్సులలో మెదిలే విషయాలను క్షమించాడు. అంటే వాటి నిమిత్తం శిక్షించడు. ఎంతవరకైతే వారు వాటిని తమ నోటితో ఉచ్ఛరించరో! లేదా వాటిని ఆచరణలోకి తీసుకురారో!' ('స'హీ'హ్ బు'ఖారీ, ముస్లిం).

إِذۡ يَتَلَقَّى ٱلۡمُتَلَقِّيَانِ عَنِ ٱلۡيَمِينِ وَعَنِ ٱلشِّمَالِ قَعِيدٞ ١٧

మَا يَلۡفِظُ مِن قَوۡلٍ إِلَّا لَدَيۡهِ رَقِيبٌ عَتِيدٞ ١٨

وَجَآءَتۡ سَكۡرَةُ ٱلۡمَوۡتِ بِٱلۡحَقِّۖ ذَٰلِكَ مَا كُنتَ مِنۡهُ تَحِيدُ ١٩

وَنُفِخَ فِي ٱلصُّورِۚ ذَٰلِكَ يَوۡمُ ٱلۡوَعِيدِ ٢٠

وَجَآءَتۡ كُلُّ نَفۡسٖ مَّعَهَا سَآئِقٞ وَشَهِيدٞ ٢١

لَّقَدۡ كُنتَ فِي غَفۡلَةٖ مِّنۡ هَٰذَا فَكَشَفۡنَا عَنكَ غِطَآءَكَ فَبَصَرُكَ ٱلۡيَوۡمَ حَدِيدٞ ٢٢

وَقَالَ قَرِينُهُۥ هَٰذَا مَا لَدَيَّ عَتِيدٌ ٢٣

أَلۡقِيَا فِي جَهَنَّمَ كُلَّ كَفَّارٍ عَنِيدٖ ٢٤

**17**. (జ్ఞాపకముంచుకోండి) అతని కుడి మరియు ఎడమ ప్రక్కలలో కూర్చుండి (ప్రతి విషయాన్ని వ్రాసే) ఇద్దరు పర్యవేక్షకులు (దేవదూతలు) అతనిని కలుసుకొన్న తరువాత నుంచి -

**18**. అతనితో బాటు ఒక పర్య వేక్షకుడైనా సిద్ధంగా లేనిదే - అతడు ఏ మాటనూ పలకలేడు.

**19**. మరియు మరణమూర్ఛ వచ్చేది సత్యం. అది, ఇదే! దేనినుండైతే నీవు తప్పించుకో గోరుతూ ఉండేవాడివో!

**20**. మరియు బాకా (సూర్) ఊదబడుతుంది. ఆ హెచ్చరించబడిన (పునరుత్థాన) దినం అదే!

**21**. మరియు ప్రతి ఆత్మ (ప్రాణి) ఒక తోలేవాడితో మరొక సాక్ష్యమిచ్చేవాడితో సహా వస్తుంది.

**22**. (ఇలా అనబడుతుంది): "వాస్తవానికి నీవు (ఈ దినాన్ని గురించి) నిర్లక్ష్యంగా ఉండేవాడివి. కావున ఇపుడు మేము నీ ముందున్న తెరను తొలగించాము. కావున, ఈ రోజు నీదృష్టి చాలా చురుకుగాఉంది."

**23**. మరియు అతని స్నేహితుడు (ఖరీనున్) ఇలా అంటాడు: "ఇదిగో నాదగ్గర సిద్ధంగా ఉన్న (ఇతని కర్మపత్రం) ఇది!"

**24**. (ఇలా ఆజ్ఞ వస్తుంది): "మూర్ఖపు పట్టు (హఠము) గల ప్రతి సత్యతిరస్కారుణ్ణి మీరిద్దరు కలసి నరకంలో విసరివేయండి;

مَّنَّاعٍ لِّلۡخَيۡرِ مُعۡتَدٍ مُّرِيبٍ ﴿٢٥﴾

25. "మంచిని నిషేధించిన వాడిని, హద్దులు మీరి ప్రవర్తిస్తూ సందేహాలను వ్యాపింపజేసేవాడిని;

ٱلَّذِي جَعَلَ مَعَ ٱللَّهِ إِلَٰهًا ءَاخَرَ فَأَلۡقِيَاهُ فِي ٱلۡعَذَابِ ٱلشَّدِيدِ ﴿٢٦﴾

26. "అల్లాహ్‌కు సాటిగా ఇతర ఆరాధ్యదైవాన్నీ కల్పించినవాడు ఇతడే! కావున ఇతనిని మీరిద్దరూ కలిసి ఘోరశిక్షలో పడవేయండి." (7/8)

۞ قَالَ قَرِينُهُۥ رَبَّنَا مَآ أَطۡغَيۡتُهُۥ وَلَٰكِن كَانَ فِي ضَلَٰلِۭ بَعِيدٖ ﴿٢٧﴾

27. * అతని స్నేహితుడు (ఖరీనున్) ఇలా అంటాడు:[1] "ఓ మా ప్రభూ! నేను ఇతని తలబిరుసుతనాన్ని ప్రోత్సహించ లేదు, కాని ఇతడే స్వయంగా, మార్గభ్రష్టత్వంలో చాలాదూరం వెళ్ళి పోయాడు."

قَالَ لَا تَخۡتَصِمُواْ لَدَيَّ وَقَدۡ قَدَّمۡتُ إِلَيۡكُم بِٱلۡوَعِيدِ ﴿٢٨﴾

28. ఆయన (అల్లాహ్) ఇలా అంటాడు: "మీరు నా దగ్గర వాదులాడకండి మరియు వాస్తవానికి నేను ముందుగానే మీ వద్దకు హెచ్చరికను పంపి ఉన్నాను.

مَا يُبَدَّلُ ٱلۡقَوۡلُ لَدَيَّ وَمَآ أَنَا۠ بِظَلَّٰمٖ لِّلۡعَبِيدِ ﴿٢٩﴾

29. "నా దగ్గర మాట మార్చడం జరుగదు మరియు నేను నా దాసులకు అన్యాయం చేసేవాడను కాను."

يَوۡمَ نَقُولُ لِجَهَنَّمَ هَلِ ٱمۡتَلَأۡتِ وَتَقُولُ هَلۡ مِن مَّزِيدٖ ﴿٣٠﴾

30. ఆ రోజు మేము నరకంతో: "నీవు నిండిపోయావా?" అని ప్రశ్నిస్తాము. మరియు అది: "ఇంకా ఏమైనా ఉందా ఏమిటి?" అని అడుగుతుంది.[2]

وَأُزۡلِفَتِ ٱلۡجَنَّةُ لِلۡمُتَّقِينَ غَيۡرَ بَعِيدٍ ﴿٣١﴾

31. మరియు స్వర్గం దైవభీతి గలవారి దగ్గరకు తీసుకురాబడుతుంది! అది వారి నుండి ఏ మాత్రం దూరంగా ఉండదు.

---

1. చూడండి, 14:22.
2. చూడండి, 32:13.

هَٰذَا مَا تُوعَدُونَ لِكُلِّ أَوَّابٍ حَفِيظٍ ﴿٣٢﴾

**32**. (వారితో ఇలా అనబడుతుంది): "ఇదే మీకు వాగ్దానం చేయబడినది. మళ్ళీ మళ్ళీ మా వైపుకు మరలే ప్రతివానికి, (మా హద్దులను) లక్ష్యపెట్టిన (పాటించిన) వానికి;

مَّنْ خَشِيَ ٱلرَّحْمَٰنَ بِٱلْغَيْبِ وَجَآءَ بِقَلْبٍ مُّنِيبٍ ﴿٣٣﴾

**33**. "అగోచరుడైన ఆ కరుణామయునికి భయపడే వానికి మరియు మా వైపునకు పశ్చాత్తాప హృదయంతో మరలే వానికి!

ٱدْخُلُوهَا بِسَلَٰمٍ ۖ ذَٰلِكَ يَوْمُ ٱلْخُلُودِ ﴿٣٤﴾

**34**. "ఇందులో (ఈ స్వర్గంలో), శాంతితో ప్రవేశించండి. ఇదే శాశ్వత జీవితదినం."

لَهُم مَّا يَشَآءُونَ فِيهَا وَلَدَيْنَا مَزِيدٌ ﴿٣٥﴾

**35**. అందులో వారికి, వారు కోరేదంతా ఉంటుంది మరియు మా దగ్గర ఇంకా చాలా ఉంది.[1]

وَكَمْ أَهْلَكْنَا قَبْلَهُم مِّن قَرْنٍ هُمْ أَشَدُّ مِنْهُم بَطْشًا فَنَقَّبُوا۟ فِى ٱلْبِلَٰدِ هَلْ مِن مَّحِيصٍ ﴿٣٦﴾

**36**. మరియు మేము, వీరికి పూర్వం ఎన్నోతరాల వారిని నాశనం చేశాము. వారు వీరికంటే ఎక్కువ శక్తిమంతులు. కాని, (మా శిక్ష పడినప్పుడు) వారు దేశదిమ్మరులై పోయారు. ఏమీ? వారికి తప్పించుకొనే మార్గం ఏదైనా దొరికిందా?

إِنَّ فِى ذَٰلِكَ لَذِكْرَىٰ لِمَن كَانَ لَهُۥ قَلْبٌ أَوْ أَلْقَى ٱلسَّمْعَ وَهُوَ شَهِيدٌ ﴿٣٧﴾

**37**. నిశ్చయంగా, హృదయమున్న వాడికి, శ్రద్ధతో వినేవాడికి మరియు లక్ష్యపెట్టే వాడికి ఇందులో ఒక గుణపాఠముంది.

وَلَقَدْ خَلَقْنَا ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضَ وَمَا بَيْنَهُمَا فِى سِتَّةِ أَيَّامٍ وَمَا مَسَّنَا مِن لُّغُوبٍ ﴿٣٨﴾

**38**. మరియు వాస్తవంగా! మేము ఆకాశాలను మరియు భూమిని మరియు వాటి మధ్య నున్న సమస్తాన్ని ఆరుదినములు (అయ్యామ్)లలో సృష్టించాము. కాని మాకు ఎలాంటి అలసట కలుగలేదు.

---

1. చూడండి, 10:26.

فَٱصۡبِرۡ عَلَىٰ مَا يَقُولُونَ وَسَبِّحۡ بِحَمۡدِ رَبِّكَ قَبۡلَ طُلُوعِ ٱلشَّمۡسِ وَقَبۡلَ ٱلۡغُرُوبِ ٣٩

39. కావున (ఓ ము'హమ్మద్!) వారు పలికే మాటలకు సహనంవహించు మరియు నీ ప్రభువు పవిత్రతను కొనియాడు. ఆయన స్తోత్రాలు చెయ్యి, ప్రతిరోజు సూర్యోదయానికి ముందు మరియు సూర్యాస్తమయానికి ముందు కూడా;[1]

وَمِنَ ٱلَّيۡلِ فَسَبِّحۡهُ وَأَدۡبَٰرَ ٱلسُّجُودِ ٤٠

40. మరియు రాత్రివేళలో కూడా ఆయన పవిత్రతను కొనియాడు[2] మరియు సాష్టాంగం (సజ్దా) చేసిన తరువాత కూడా స్తుతించు.[3]

وَٱسۡتَمِعۡ يَوۡمَ يُنَادِ ٱلۡمُنَادِ مِن مَّكَانٖ قَرِيبٖ ٤١

41. మరియు చెవియొగ్గి విను, చాటింపు చేసేవాడు అతి దగ్గరినుంచే పిలిచే రోజున!

يَوۡمَ يَسۡمَعُونَ ٱلصَّيۡحَةَ بِٱلۡحَقِّۚ ذَٰلِكَ يَوۡمُ ٱلۡخُرُوجِ ٤٢

42. ఆ రోజు మీరు ఒక భయంకర శబ్దం వినేది సత్యం. (గోరీలలో నుండి) బయటికి వచ్చే దినం అదే!

إِنَّا نَحۡنُ نُحۡيِۦ وَنُمِيتُ وَإِلَيۡنَا ٱلۡمَصِيرُ ٤٣

43. నిశ్చయంగా, మేమే జీవనమిచ్చే వారం మరియు మేమే మరణింపజేసే వారం మరియు మీ అందరి మరలింపు మా వైపునకే జరుగుతుంది.

---

1. ఫ'జ్ర్ మరియు 'అ'స్ర్ నమాజులు చేయండి.
2. చూడండి, 17:79 అంటే రాత్రిపూట లేచి తహజ్జుద్ నమా'జ్ చేయండి. మే'రాజ్‌కు ముందు ముస్లింలందరికీ ఫ'జ్ర్ మరియు 'అ'స్ర్ నమాజ్‌లు విధించబడి ఉండేవి మరియు దైవప్రవక్త ('స'అస) తహజ్జుద్ విధిగా చేసేవారు. కానీ మే'రాజ్ తరువాత 5 నమా'జ్‌లు అందరి కొరకు విధిగా చేయబడ్డాయి. (ఇబ్నె-కసీ'ర్).
3. ఫ'ర్ద్ నమాజుల తరువాత త'స్బీహ్ చేయాలి. అంటే సుబ్'హానల్లాహ్ 33 సార్లు, అల్'హమ్దులిల్లాహ్ 33 సార్లు మరియు అల్లాహు అక్బర్ 34 సార్లు చదవాలి. ('స. బు'ఖారీ, 'స. ముస్లిం).

يَوْمَ تَشَقَّقُ ٱلْأَرْضُ عَنْهُمْ سِرَاعًا ۚ ذَٰلِكَ حَشْرٌ عَلَيْنَا يَسِيرٌ ﴿٤٤﴾

**44**. ఆ రోజు భూమి చీలిపోయి వారందరూ పరుగిడుతూ బయటికి వస్తారు. అదే సమావేశసమయం. అది మాకెంతో సులభం.

نَّحْنُ أَعْلَمُ بِمَا يَقُولُونَ ۖ وَمَآ أَنتَ عَلَيْهِم بِجَبَّارٍ ۖ فَذَكِّرْ بِٱلْقُرْءَانِ مَن يَخَافُ وَعِيدِ ﴿٤٥﴾

**45**. వారనేది మాకు బాగా తెలుసు. నీవు వారిని (విశ్వసించమని) బలవంతం చేయులేవు. కావున నా హెచ్చరికకు భయపడేవాడికి మాత్రమే నీవు ఈ ఖుర్ఆన్ ద్వారా హితబోధ చెయ్యి.

*****

## 51. సూరహ్ అజ్-జా'రియాత్ — سُورَةُ الذَّارِيَاتِ

అజ్-జా'రియాత్: **ఎగురగొట్టే, వెదజల్లే,** చెల్లాచెదురుచేసే, లేక విసరే వాయువులు. పునరుత్థానం గురించి వివరించే 7 సూరాహ్‌లలో ఇది 2వది. సుయూతీ అభిప్రాయంలో ఇది ప్రస్థానానికి (హిజ్రత్‌కు) 2 సంవత్సరాలకు ముందు మక్కాలో అవతరింపజేయబడింది. ఇందులో **60 ఆయతులు** ఉన్నాయి.

| C | B | A |
|---|---|---|

అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో

وَٱلذَّٰرِيَٰتِ ذَرۡوٗا ﴿١﴾

**1**. దుమ్ము **ఎగురవేసే** వాటి (గాలుల) సాక్షిగా!

فَٱلۡحَٰمِلَٰتِ وِقۡرٗا ﴿٢﴾

**2**. మరియు, (నీటి) భారాన్ని మోసే (మేఘాల);

فَٱلۡجَٰرِيَٰتِ يُسۡرٗا ﴿٣﴾

**3**. మరియు సముద్రంలో సులభంగా తేలియాడే (ఓడల);

فَٱلۡمُقَسِّمَٰتِ أَمۡرًا ﴿٤﴾

**4**. మరియు (ఆయన) ఆజ్ఞతో (అనుగ్రహాలను) పంచిపెట్టే (దేవదూతల సాక్షిగా);[1]

إِنَّمَا تُوعَدُونَ لَصَادِقٞ ﴿٥﴾

**5**. నిశ్చయంగా, మీకు చేయబడ్డ వాగ్దానం సత్యం.

وَإِنَّ ٱلدِّينَ لَوَٰقِعٞ ﴿٦﴾

**6**. మరియు నిశ్చయంగా తీర్పు రానున్నది.

وَٱلسَّمَآءِ ذَاتِ ٱلۡحُبُكِ ﴿٧﴾

**7**. మార్గాలతో నిండిన ఆకాశం సాక్షిగా!

إِنَّكُمۡ لَفِي قَوۡلٖ مُّخۡتَلِفٖ ﴿٨﴾

**8**. నిశ్చయంగా, మీరు భేదాభిప్రాయాలలో పడి ఉన్నారు.[2]

---

**1**. సాక్షిగా అంటే ఇక్కడ నొక్కి చెప్పడం అన్నట్లు. లేక ఉదాహరణగా ఇవ్వటం. ఏ విధంగానైతే గాలులు, మేఘాలు, నీటిపై ఓడలు పయనించటం ఎంత సత్యమో పునరుత్థానం కూడా అంతే సత్యం.

**2**. మీలో ఏకాభిప్రాయంలేదు. మీలో కొందరు దైవప్రవక్త ('స'అస)ను మాంత్రికుడు, మరి కొందరు కవి, మరికొందరు జ్యోతిషుడు, మరికొందరు అసత్యవాది, అని అంటున్నారు.

**9**. (సత్యం నుండి) మరలింపబడిన వాడే, మోసగింపబడిన వాడు.

**10**. ఆధారంలేని అభిప్రాయాలు గలవారే నాశనం చేయబడే వారు!

**11**. ఎవరైతే నిర్లక్ష్యంలోపడి అశ్రద్ధగా ఉన్నారో!

**12**. వారు ఇలా అడుగుతున్నారు: "తీర్పుదినం ఎప్పుడు రానున్నది?"

**13**. ఆ దినమున, వారు అగ్నితో దహింప (పరీక్షింప) బడతారు.

**14**. (వారితో ఇలా అనబడుతుంది): "మీ పరీక్షను[1] రుచిచూడండి! మీరు దీని కొరకే తొందర పెట్టేవారు!"

**15**. నిశ్చయంగా, దైవభీతి గలవారు చెలమలు గల స్వర్గవనాలలో ఉంటారు.

**16**. తమ ప్రభువు తమకు ప్రసాదించిన వాటితో సంతోషపడుతూ! నిశ్చయంగా వారు అంతకు పూర్వం సజ్జనులై ఉండే వారు.

**17**. వారు రాత్రివేళలో చాలా తక్కువగా నిద్రపోయే వారు.

**18**. మరియు వారు రాత్రి చివరి గడియలలో[2] క్షమాపణ వేడుకునే వారు.

يُؤْفَكُ عَنْهُ مَنْ أُفِكَ ﴿٩﴾

قُتِلَ ٱلْخَرَّٰصُونَ ﴿١٠﴾

ٱلَّذِينَ هُمْ فِى غَمْرَةٍ سَاهُونَ ﴿١١﴾

يَسْـَٔلُونَ أَيَّانَ يَوْمُ ٱلدِّينِ ﴿١٢﴾

يَوْمَ هُمْ عَلَى ٱلنَّارِ يُفْتَنُونَ ﴿١٣﴾

ذُوقُوا۟ فِتْنَتَكُمْ هَٰذَا ٱلَّذِى كُنتُم بِهِۦ تَسْتَعْجِلُونَ ﴿١٤﴾

إِنَّ ٱلْمُتَّقِينَ فِى جَنَّٰتٍ وَعُيُونٍ ﴿١٥﴾

ءَاخِذِينَ مَآ ءَاتَىٰهُمْ رَبُّهُمْ ۚ إِنَّهُمْ كَانُوا۟ قَبْلَ ذَٰلِكَ مُحْسِنِينَ ﴿١٦﴾

كَانُوا۟ قَلِيلًا مِّنَ ٱلَّيْلِ مَا يَهْجَعُونَ ﴿١٧﴾

وَبِٱلْأَسْحَارِ هُمْ يَسْتَغْفِرُونَ ﴿١٨﴾

---

అంతే కాదు మీలో కొందరు పునరుత్థానదినం రానేరాదని అంటున్నారు. మరికొందరు దానిని గురించి సంశయంలో పడిఉన్నారు. మీరు అల్లాహ్(సు.తా.)ను సృష్టికర్త మరియు సర్వపోషకుడని, అంటారు, కాని ఇతరులను కూడా ఆయన(సు.తా.)కు సాటి (భాగస్వాములు)గా నిలబెడతారు. మీలో చిత్తశుద్ధి, ఏకాభిప్రాయం లేవు.

1. ఫిత్‌నతున్: అంటే ఇక్కడ శిక్ష లేక నరకాగ్నిలో కాలడం. చూడండి, 6:128, 40:12, 43:74.

2. అల్-అస్'హారు: అంటే చివరి మూడోవంతు రాత్రి. అది ప్రార్థన (దు'ఆ)లు

وَفِىٓ أَمْوَٰلِهِمْ حَقٌّ لِّلسَّآئِلِ وَٱلْمَحْرُومِ ﴿١٩﴾

**19**. మరియు వారి సంపదలో యాచించే వారికి మరియు ఆవశ్యకత గలవారికి[1] హక్కు ఉంటుంది.

وَفِى ٱلْأَرْضِ ءَايَٰتٌ لِّلْمُوقِنِينَ ﴿٢٠﴾

**20**. మరియు భూమిలో కూడా నమ్మేవారి కొరకు ఎన్నో నిదర్శనాలు (ఆయత్‌లు) ఉన్నాయి.

وَفِىٓ أَنفُسِكُمْ ۚ أَفَلَا تُبْصِرُونَ ﴿٢١﴾

**21**. మరియు స్వయంగా మీలో కూడా ఉన్నాయి. ఏమీ? మీరు చూడలేరా?[2]

وَفِى ٱلسَّمَآءِ رِزْقُكُمْ وَمَا تُوعَدُونَ ﴿٢٢﴾

**22**. మరియు ఆకాశంలో మీ జీవనోపాధి మరియు మీకు వాగ్దానం చేయబడినది ఉంది.

فَوَرَبِّ ٱلسَّمَآءِ وَٱلْأَرْضِ إِنَّهُۥ لَحَقٌّ مِّثْلَ مَآ أَنَّكُمْ تَنطِقُونَ ﴿٢٣﴾

**23**. కావున భూమ్యాకాశాల ప్రభువు సాక్షిగా! నిశ్చయంగా, ఇది సత్యం; ఏ విధంగానైతే మీరు మాట్లాడగలిగేది (సత్యమో)!

هَلْ أَتَىٰكَ حَدِيثُ ضَيْفِ إِبْرَٰهِيمَ ٱلْمُكْرَمِينَ ﴿٢٤﴾

**24**. ఏమీ? ఇబ్రాహీమ్ యొక్క గౌరవ నీయులైన అతిథుల గాథ నీకు చేరిందా?[3]

إِذْ دَخَلُوا۟ عَلَيْهِ فَقَالُوا۟ سَلَٰمًا ۖ قَالَ سَلَٰمٌ قَوْمٌ مُّنكَرُونَ ﴿٢٥﴾

**25**. వారు అతని వద్దకు వచ్చినపుడు: "మీకు సలాం!" అని అన్నారు. అతను: "మీకూ సలాం!" అని జవాబిచ్చి: "మీరు పరిచయంలేని (కొత్త) వారుగా ఉన్నారు." అని అన్నాడు.

---

అంగీకరించబడే సమయం. దైవప్రవక్త ('స'అస) ప్రవచనం: మూడోవంతు రాత్రి బాకీ ఉన్నప్పుడు అల్లాహ్ (సు.తా.) భూమికి దగ్గరగా ఉన్న ఆకాశంమీదికి దిగివస్తాడు మరియు ఇలా అంటాడు: 'ఏమీ? తౌబాచేసే (పశ్చాత్తాపపడే) వారు ఎవరైనా ఉన్నారా? నేను వారి పశ్చాత్తాపాన్ని అంగీకరిస్తాను. క్షమాపణవేడుకొనేవారు ఎవరైనా ఉన్నారా? నేను వారిని క్షమిస్తాను. ఏమీ? ఎవరైనా ఏమైనా కోరుకునే వారున్నారా? నేను వారి కోరికలను పూర్తిచేస్తాను. ఇలా తెల్లవారే వరకు ప్రశ్నిస్తూ ఉంటాడు.' ('స'హీ'హ్ ముస్లిం) చూడండి, 3:17.

1. మ'హ్రూమ్‌లకు: అంటే ఆవశ్యకత ఉండి కూడా యాచించని వారికి.
2. చూడండి, 45:4.
3. ఇబ్రాహీమ్ ('అ.స.) గాథ కోసం చూడండి, 11:69 మరియు 15:51. ఈ ఆయతులు అవతరింపజేయబడేవరకు ఈ గాథ దైవప్రవక్త ('స'అస)కు తెలియదు. కాబట్టి వ'హీ ద్వారా తెలుపబడుతోంది.

فَرَاغَ إِلَىٰٓ أَهۡلِهِۦ فَجَآءَ بِعِجۡلٖ سَمِينٖ ٢٦

**26**. తరువాత అతను తన ఇంటిలోకి పోయి బలిసిన (వేయించిన) ఒక ఆవు దూడను తీసుకొనివచ్చాడు.

فَقَرَّبَهُۥٓ إِلَيۡهِمۡ قَالَ أَلَا تَأۡكُلُونَ ٢٧

**27**. దానిని వారి ముందుకుజరిపి: "ఏమీ? మీరెందుకు తినటంలేదు?" అని అడిగాడు.

فَأَوۡجَسَ مِنۡهُمۡ خِيفَةٗۖ قَالُواْ لَا تَخَفۡۖ وَبَشَّرُوهُ بِغُلَٰمٍ عَلِيمٖ ٢٨

**28**. (వారు తినకుండా ఉండటం చూసి), వారినుండి భయపడ్డాడు.[1] వారన్నారు: "భయపడకు!" మరియు వారు అతనికి జ్ఞానవంతుడైన కుమారుని శుభవార్తనిచ్చారు.

فَأَقۡبَلَتِ ٱمۡرَأَتُهُۥ فِي صَرَّةٖ فَصَكَّتۡ وَجۡهَهَا وَقَالَتۡ عَجُوزٌ عَقِيمٞ ٢٩

**29**. అప్పుడతని భార్య అరుస్తూ వారి ముందుకు వచ్చి, తన చేతిని నుదుటి మీద కొట్టుకుంటూ: "నేను ముసలిదాన్ని, గొడ్రాలను కదా!" అని అన్నది.

قَالُواْ كَذَٰلِكِ قَالَ رَبُّكِۖ إِنَّهُۥ هُوَ ٱلۡحَكِيمُ ٱلۡعَلِيمُ ٣٠

**30**. వారన్నారు: "నీ ప్రభువు ఇలాగే అన్నాడు! నిశ్చయంగా, ఆయన మహా వివేకవంతుడు, సర్వజ్ఞుడు!"

---

**1**. ఇంటికి వచ్చిన అతిథులు ఆహారం తినకపోవడం చూసి, వారు సహృదయంతో రాలేదు! ఏదో, ఆపద నిలబెట్టుటకైతే రాలేదు కదా! అని భయపడ్డాడు.

۞ قَالَ فَمَا خَطْبُكُمْ أَيُّهَا الْمُرْسَلُونَ ﴿٣١﴾

31. (*) (ఇబ్రాహీమ్) అడిగాడు: "ఓ సందేశహరు(దేవదూత)లారా! అయితే మీరు వచ్చిన కారణమేమిటి?"

قَالُوا إِنَّا أُرْسِلْنَا إِلَىٰ قَوْمٍ مُّجْرِمِينَ ﴿٣٢﴾

32. వారన్నారు: "వాస్తవానికి, మేము నేరస్థులైన జనుల వైపునకు పంపబడ్డాము.

لِنُرْسِلَ عَلَيْهِمْ حِجَارَةً مِّن طِينٍ ﴿٣٣﴾

33. "వారి మీద (కాల్చబడిన) మట్టి రాళ్ళను కురిపించటం కోసం![1]

مُّسَوَّمَةً عِندَ رَبِّكَ لِلْمُسْرِفِينَ ﴿٣٤﴾

34. "నీ ప్రభువు తరఫునుండి గుర్తువేయ బడిన (రాళ్ళు);[2] మితిమీరి ప్రవర్తించేవారి కొరకు!"

فَأَخْرَجْنَا مَن كَانَ فِيهَا مِنَ الْمُؤْمِنِينَ ﴿٣٥﴾

35. అప్పుడు మేము అందులో ఉన్న విశ్వాసులందరినీ బయటికి తీశాము.[3]

فَمَا وَجَدْنَا فِيهَا غَيْرَ بَيْتٍ مِّنَ الْمُسْلِمِينَ ﴿٣٦﴾

36. మేమందు ఒక్కగృహం తప్ప![4] ఇతర విధేయుల (ముస్లింల)[5] గృహాన్ని చూడలేదు.

---

1. చూడండి, 11:82.
2. ముసవ్వమతున్: అంటే ప్రత్యేకించబడినవి.
3. వివరాలకు చూడండి, 11:77 మరియు 15:61.
4. ఆ ఇల్లు లూ'త్ ('అ.స.) యొక్క ఇల్లు. అతని ఇద్దరు కుమార్తెలు మరియు కొంతమంది విశ్వాసులు. అంతా కలసి దాదాపు 13 మంది మాత్రమే ఉంటారు. లూ'త్ ('అ.స.) భార్య వారితో చేరక, సత్యతిరస్కారులలో చేరిపోతుంది.
5. ఒకరు దైవప్రవక్త (సఅస)ను ప్రశ్నిస్తారు: 'ఇస్లాం అంటే ఏమిటి?' అతను ('స'అస) అంటారు: '1) లా ఇలాహ ఇల్లల్లాహ్ (షహాదహ్) సాక్ష్యం పలకడం, 2) నమా'జ్ స్థాపించడం, 3) 'జకాత్ ఇవ్వడం, 4) రమజాన్ నెలలో ఉపవాసముండడం మరియు 5) ' హజ్జ్ చేయడం.' అని అంటారు, తరువాత 'ఈమాన్ అంటే ఏమిటి?' అని ప్రశ్నిస్తే, అతను ('స'అస) అంటారు: '1) అల్లాహ్ (సు.తా.)ను విశ్వసించడం, 2) ఆయన దూతలను, 3) దివ్యగ్రంథాలను, 4) ప్రవక్తలను, 5) పునరుత్థాన దినాన్ని మరియు 6) ఖద్ర్ (మంచి లేక చెడు ఏది సంభవించినా అల్లాహ్ తరఫునుండేనని) విశ్వసించడం.' అంటే హృదయపూర్వకంగా ఈ విషయాలను నమ్మడమే ఈమాన్. అల్లాహ్ (సు.తా.) ఆజ్ఞలను మరియు విధులను పాటించడం ఇస్లాం. దీని ప్రకారం ప్రతి మూ'మిన్ ముస్లిం మరియు ప్రతి ముస్లిం మూ'మిన్. (ఫ'త్హ్అల్-ఖదీర్).
ఇక ఎవరైతే మూ'మిన్ మరియు ముస్లింల మధ్య వ్యత్యాసం చూపుతారో, వారు

وَتَرَكْنَا فِيهَآ ءَايَةً لِّلَّذِينَ يَخَافُونَ ٱلْعَذَابَ ٱلْأَلِيمَ ﴿٣٧﴾

**37**. మరియు బాధాకరమైన శిక్షకు భయపడేవారి కొరకు, మేము అక్కడ ఒక సూచన (ఆయత్)ను వదలిపెట్టాము.[1]

وَفِى مُوسَىٰٓ إِذْ أَرْسَلْنَٰهُ إِلَىٰ فِرْعَوْنَ بِسُلْطَٰنٍ مُّبِينٍ ﴿٣٨﴾

**38**. ఇక మూసా (గాథ)లో కూడ (ఒక సూచన వుంది) మేము అతనిని ఫిర్'ఔన్ వద్దకు స్పష్టమైన ప్రమాణంతో పంపినపుడు;

فَتَوَلَّىٰ بِرُكْنِهِۦ وَقَالَ سَٰحِرٌ أَوْ مَجْنُونٌ ﴿٣٩﴾

**39**. అతడు (ఫిర్'ఔన్) తన సభాసదులతో సహా మరలిపోతూ, ఇలా అన్నాడు: "ఇతడు మాంత్రికుడు లేదా పిచ్చివాడు!"

فَأَخَذْنَٰهُ وَجُنُودَهُۥ فَنَبَذْنَٰهُمْ فِى ٱلْيَمِّ وَهُوَ مُلِيمٌ ﴿٤٠﴾

**40**. కావున మేము అతనిని మరియు అతని సైనికులను పట్టుకొని, వారందరినీ సముద్రంలో ముంచివేశాము మరియు దానికి అతడే నిందితుడు.

وَفِى عَادٍ إِذْ أَرْسَلْنَا عَلَيْهِمُ ٱلرِّيحَ ٱلْعَقِيمَ ﴿٤١﴾

**41**. ఇక 'ఆద్ జాతివారిలో కూడా (ఒక సూచన వుంది): మేము వారిపై వినాశకరమైన గాలిని పంపినప్పుడు![2]

مَا تَذَرُ مِن شَىْءٍ أَتَتْ عَلَيْهِ إِلَّا جَعَلَتْهُ كَٱلرَّمِيمِ ﴿٤٢﴾

**42**. అది దేనిపైనయితే వీచిందో, దానిని క్షీణింపజేయకుండా వదలలేదు.[3]

وَفِى ثَمُودَ إِذْ قِيلَ لَهُمْ تَمَتَّعُوا۟ حَتَّىٰ حِينٍ ﴿٤٣﴾

**43**. మరియు స'మూద్ జాతివారి గాథలో కూడా (ఒక సూచన ఉంది). వారితో: "కొంతకాలం మీరు సుఖసంతోషాలను అనుభవించండి." అని అన్నాము.[4]

---

అంటారు: 'ఖుర్ఆన్‌లో ఇక్కడ ఒకేరకమైన జనుల కొరకు మూ'మిన్ మరియు ముస్లిం శబ్దాలు వాడబడ్డాయి. కాని వీటి మధ్య ఉన్న వ్యత్యాసాన్ని బట్టి ప్రతి మూ'మిన్ ముస్లిం అవుతాడు. కానీ ప్రతి ముస్లిం మూ'మిన్ అవటం అనివార్యం కాదు.' ఇబ్నె-కసీ'ర్, (వివరాలకు ము'హమ్మద్ జూనాగఢి-పేజీ, 1478, మలిక్ ఫహద్ ఖుర్ఆన్ ప్రింటింగ్ కాంప్లెక్స్, మదీన మునవ్వరహ్).

1. ఆ సూచన (గుర్తు), అంటే మృత సముద్రం.
2. చూడండి, 7:65.
3. ఆ గాలి ఎనిమిది రోజులు ఏడురాత్రులు వీచింది. చూడండి, 69:7.
4. వారి కోరిక ప్రకారం వారికి ఒక ఆడఒంటె అల్లాహ్ (సు.తా.) తరఫునుండి, ఒక అద్భుత సూచనగా పంపబడితే, వారు దానిని చంపుతారు. అప్పుడు వారితో: 'ఇక మీరు మూడు రోజులు సుఖసంతోషాలను అనుభవించండి.' అని అనబడింది.

44. అప్పుడు వారు తమ ప్రభువు ఆజ్ఞను ఉపేక్షించారు. కావున వారు చూస్తూఉండగానే ఒకపెద్ద పిడుగు వారిమీద విరుచుకుపడింది.[1]

فَعَتَوۡاْ عَنۡ أَمۡرِ رَبِّهِمۡ فَأَخَذَتۡهُمُ ٱلصَّٰعِقَةُ وَهُمۡ يَنظُرُونَ ٤٤

45. అప్పుడు వారికి లేచి నిలబడే శక్తి కూడా లేకపోయింది మరియు వారు తమను తాము కూడా కాపాడుకోలేక పోయారు.

فَمَا ٱسۡتَطَٰعُواْ مِن قِيَامٖ وَمَا كَانُواْ مُنتَصِرِينَ ٤٥

46. మరియు దీనికి ముందు నూ'హ్ జాతి వారిని కూడా (నాశనంచేశాము). నిశ్చయంగా వారు కూడా అవిధేయులు.

وَقَوۡمَ نُوحٖ مِّن قَبۡلُۖ إِنَّهُمۡ كَانُواْ قَوۡمٗا فَٰسِقِينَ ٤٦

47. మరియు ఆకాశాన్ని మేము (మా) చేతులతో నిర్మించాము. మరియు నిశ్చయంగా, మేమే దానిని విస్తరింపజేయగల వారము.

وَٱلسَّمَآءَ بَنَيۡنَٰهَا بِأَيۡيْدٖ وَإِنَّا لَمُوسِعُونَ ٤٧

48. మరియు భూమిని మేము పరుపుగా చేశాము, మేమే చక్కగా పరిచేవారము!

وَٱلۡأَرۡضَ فَرَشۡنَٰهَا فَنِعۡمَ ٱلۡمَٰهِدُونَ ٤٨

49. మరియు మేము ప్రతి దానిని జంటలుగా సృష్టించాము, మీరు గ్రహించాలని.[2]

وَمِن كُلِّ شَيۡءٍ خَلَقۡنَا زَوۡجَيۡنِ لَعَلَّكُمۡ تَذَكَّرُونَ ٤٩

---

1. 'సా'ఇఖతున్: అంటే ఒకపెద్ద ధ్వని, గర్జన లేక పిడుగు నుండి వచ్చేధ్వనిలాంటిది. ఈ ధ్వని ఆకాశంలో నుండి వచ్చింది మరియు భూమిలో భూకంపం కూడా వచ్చింది. చూడండి, 7:73-79.
2. అంటే ప్రతి దానిని జంటలుగా సృష్టించాము. ఆడ-మగలు, చీకటి-వెలుగులు, సూర్య-చంద్రులు, తీపి-చేదులు, రాత్రింబవళ్ళు, కీడు-మేలు, జీవన్మరణాలు, విశ్వాసం-అవిశ్వాసం, స్వర్గనరకాలు, జిన్నాతులు-మానవులు, మొదలైనవి. వీటన్నింటినీ సృష్టించిన వాడు అల్లాహ్ (సు.తా.). ఆయనకు ఎవరూ భాగస్వాములు లేరు. చూడండి, 36:36.

فَفِرُّوٓاْ إِلَى ٱللَّهِۖ إِنِّي لَكُم مِّنۡهُ نَذِيرٞ مُّبِينٞ ٥٠

50. "కావున మీరు అల్లాహ్ వైపుకు పరుగెత్తండి. నిశ్చయంగా, నేను (ముహమ్మద్) ఆయన తరఫునుండి మీకు స్పష్టంగా హెచ్చరిక చేసేవాడిని మాత్రమే!

وَلَا تَجۡعَلُواْ مَعَ ٱللَّهِ إِلَٰهًا ءَاخَرَۖ إِنِّي لَكُم مِّنۡهُ نَذِيرٞ مُّبِينٞ ٥١

51. "మరియు మీరు అల్లాహ్‌కు సాటిగా ఇతర దైవాన్ని నిలుపకండి! నిశ్చయంగా, నేను (ముహమ్మద్) ఆయన తరఫునుండి మీకు స్పష్టంగా హెచ్చరిక చేసేవాడిని మాత్రమే!"

كَذَٰلِكَ مَآ أَتَى ٱلَّذِينَ مِن قَبۡلِهِم مِّن رَّسُولٍ إِلَّا قَالُواْ سَاحِرٌ أَوۡ مَجۡنُونٌ ٥٢

52. ఇదేవిధంగా, వారికి పూర్వం గడచిన వారివద్దకు ఏ ప్రవక్త వచ్చినా వారు: "ఇతను మాంత్రికుడు లేదా పిచ్చివాడు." అని అనకుండా ఉండలేదు.

أَتَوَاصَوۡاْ بِهِۦۚ بَلۡ هُمۡ قَوۡمٞ طَاغُونَ ٥٣

53. ఏమీ? దీనిని (ఇలా పలుకుటను) వారు ఒకరికొకరు వారసత్వంగా ఇచ్చుకున్నారా? అలాకాదు! అసలు వారు తలబిరుసుతనంతో ప్రవర్తించే జనం!

فَتَوَلَّ عَنۡهُمۡ فَمَآ أَنتَ بِمَلُومٖ ٥٤

54. కావున నీవు వారినుండి మరలిపో, ఇక నీపై ఎలాంటి నిందలేదు.

وَذَكِّرۡ فَإِنَّ ٱلذِّكۡرَىٰ تَنفَعُ ٱلۡمُؤۡمِنِينَ ٥٥

55. మరియు వారిని ఉపదేశిస్తూ వుండు, నిశ్చయంగా ఉపదేశం విశ్వాసులకు ప్రయోజనకరమవుతుంది.

وَمَا خَلَقۡتُ ٱلۡجِنَّ وَٱلۡإِنسَ إِلَّا لِيَعۡبُدُونِ ٥٦

56. మరియు నేను జిన్నాతులను మరియు మానవులను సృష్టించింది, కేవలం వారు నన్ను ఆరాధించటానికే!

مَآ أُرِيدُ مِنۡهُم مِّن رِّزۡقٖ وَمَآ أُرِيدُ أَن يُطۡعِمُونِ ٥٧

**57**. నేను వారినుండి ఎలాంటి జీవనోపాధిని కోరటం లేదు మరియు వారు నాకు ఆహారం పెట్టాలని కూడా కోరటం లేదు.

إِنَّ ٱللَّهَ هُوَ ٱلرَّزَّاقُ ذُو ٱلۡقُوَّةِ ٱلۡمَتِينُ ٥٨

**58**. నిశ్చయంగా, అల్లాహ్! ఆయన మాత్రమే ఉపాధి ప్రదాత, మహా బలవంతుడు, స్థైర్యం గలవాడు.[1]

فَإِنَّ لِلَّذِينَ ظَلَمُواْ ذَنُوبٗا مِّثۡلَ ذَنُوبِ أَصۡحَٰبِهِمۡ فَلَا يَسۡتَعۡجِلُونِ ٥٩

**59**. కావున నిశ్చయంగా, దుర్మార్గానికి పాల్పడిన వారి పాపాలు వారి (పూర్వ) స్నేహితుల పాపాలవంటివే! కావున వారు (నా శిక్ష కొరకు) తొందరపెట్టనవసరం లేదు!

فَوَيۡلٞ لِّلَّذِينَ كَفَرُواْ مِن يَوۡمِهِمُ ٱلَّذِي يُوعَدُونَ ٦٠

**60**. కావున సత్యతిరస్కారులకు వినాశం గలదు - వారికి వాగ్దానం చేయబడిన - ఆ దినమున!

*****

---

1. **అర్-రజ్జాఖు:** All Provider, The Sustainer. The supplier of the means of subsistence. **ఉపాధి ప్రదాత,** సర్వపోషకుడు, జీవనోపాధిని ప్రసాదించేవాడు. **అల్-ఖవియ్యు:** Owner of Power, **మహా బలవంతుడు,** బలశాలి, బలాఢ్యుడు. చూడండి, 11:66, 28:26, 42:19.
**అల్-మతీను:** The Strongest, Steadfast, Hard, Firm, **స్థైర్యవంతుడు. దృఢమైనవాడు,** పటిష్ఠవంతుడు, నిలకడ, స్థామం గలవాడు, ఇక్కడ ఒకేచోట వచ్చింది. పైవి అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లు.

## 52. సూరహ్ అత్-ʼతూర్ سُورَةُ الطُّورِ

అత్-ʼతూరు: ఒక పర్వతం పేరు. ఈ పదం **మొదటి ఆయత్**‌లో పేర్కొనబడింది. అది సినాయి ద్వీపకల్పంలో ఉంది. ఆ పర్వతం మీదనే మూసా (ʼఅ.స.)పై తౌరాత్ అవతరింపజేయబడింది. ఈ సూరహ్ ఈ సముదాయంలో 3వది. మధ్య **మక్కా** కాలంలో అవతరింపజేయబడింది. ఇందులో **49 ఆయతులు** ఉన్నాయి.

C B A

అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో

وَٱلطُّورِ ﴿١﴾

**1**. ʼతూర్ పర్వతం సాక్షిగా![1]

وَكِتَٰبٖ مَّسۡطُورٖ ﴿٢﴾

**2**. వ్రాయబడిన గ్రంథం సాక్షిగా!

فِي رَقّٖ مَّنشُورٖ ﴿٣﴾

**3**. విప్పబడిన చర్మపత్రం మీద.[2]

وَٱلۡبَيۡتِ ٱلۡمَعۡمُورِ ﴿٤﴾

**4**. చిరకాల సందర్శనాలయం సాక్షిగా![3]

وَٱلسَّقۡفِ ٱلۡمَرۡفُوعِ ﴿٥﴾

**5**. పైకెత్తబడిన కప్పు (అంతరిక్షం) సాక్షిగా![4]

وَٱلۡبَحۡرِ ٱلۡمَسۡجُورِ ﴿٦﴾

**6**. ఉప్పొంగే సముద్రం సాక్షిగా![5]

إِنَّ عَذَابَ رَبِّكَ لَوَٰقِعٞ ﴿٧﴾

**7**. నిశ్చయంగా, నీ ప్రభువు శిక్ష సంభవించనున్నది.

---

**1**. ఈ ʼతూర్ పర్వతం మీదనే మూసా(ʼఅ.స.) అల్లాహ్(సు.తా.)తో మాట్లాడారు. దీని మరొక పేరు ʼతూర్ సినాయి అని కూడా ఉంది.

**2**. రఖ్ఖిన్: Parchment, అంటే రాతకు అనువయ్యేటట్లు పదునుచేసిన గొర్రెతోలు, చర్మపత్రం, చర్మపత్ర రాతప్రతి.

**3**. బైతుల్-మʼఅమూర్: ఏడవ ఆకాశం మీద ఉన్న ఆలయం అక్కడ దైవదూతలు అల్లాహ్ (సు.తా.) ఆరాధన చేస్తూ ఉంటారు. ప్రతిరోజూ అక్కడికి డెబ్భై వేల దైవదూతలు ఆరాధన కోసం వస్తారు. అయినా వారికి పునరుత్థానదినం వరకూ రెండవసారి దాని దర్శనం చేసే అవకాశం దొరకదు. మʼఅమూర్ అంటే నిండిఉన్న ప్రదేశం. కాబట్టి కొందరు వ్యాఖ్యాతలు బైతుల్-మʼఅమూర్ అంటే మక్కాలోని కాబా అని, కూడా అంటారు. ఎందుకంటే అదికూడా ఎల్లప్పుడు అక్కడికి ఆరాధనకొరకు వచ్చే ప్రజలతో నిండి ఉంటుంది.

**4**. చూడండి, 21:32.

**5**. చూడండి, 81:6.

مَّا لَهُۥ مِن دَافِعٍ ⁽٨⁾

**8**. దానిని తప్పించేవాడు ఎవ్వడూ లేడు.

يَوْمَ تَمُورُ ٱلسَّمَآءُ مَوْرًا ⁽٩⁾

**9**. ఆకాశాలు భయంకరంగా కంపించే రోజు!

وَتَسِيرُ ٱلْجِبَالُ سَيْرًا ⁽١٠⁾

**10**. మరియు పర్వతాలు దారుణంగా చలించినప్పుడు!

فَوَيْلٌ يَوْمَئِذٍ لِّلْمُكَذِّبِينَ ⁽١١⁾

**11**. అప్పుడు, ఆ రోజు, అసత్యవాదులకు వినాశం ఉంది.

ٱلَّذِينَ هُمْ فِى خَوْضٍ يَلْعَبُونَ ⁽١٢⁾

**12**. ఎవరైతే వృథామాటలలో కాలక్షేపం చేస్తూ ఉంటారో!

يَوْمَ يُدَعُّونَ إِلَىٰ نَارِ جَهَنَّمَ دَعًّا ⁽١٣⁾

**13**. వారు నరకాగ్నిలోకి నెట్టుతూ త్రోయబడే రోజు,

هَٰذِهِ ٱلنَّارُ ٱلَّتِى كُنتُم بِهَا تُكَذِّبُونَ ⁽١٤⁾

**14**. (వారితో ఇలా అనబడుతుంది): "మీరు అసత్యమని నిరాకరిస్తూ వుండిన నరకాగ్ని ఇదే!

أَفَسِحْرٌ هَٰذَآ أَمْ أَنتُمْ لَا تُبْصِرُونَ ⁽١٥⁾

**15**. "ఏమీ? ఇది మంత్రజాలమా? లేక దీనిని మీరు చూడలేక పోతున్నారా?

ٱصْلَوْهَا فَٱصْبِرُوٓا۟ أَوْ لَا تَصْبِرُوا۟ سَوَآءٌ عَلَيْكُمْ ۖ إِنَّمَا تُجْزَوْنَ مَا كُنتُمْ تَعْمَلُونَ ⁽١٦⁾

**16**. "ఇందులో మీరు కాలుతూ ఉండండి. దానికి మీరు సహనం వహించినా, సహనం వహించక పోయినా అంతా మీకు సమానమే! నిశ్చయంగా, మీ కర్మలకు తగిన ప్రతిఫలమే మీకు ఇవ్వబడుతున్నది."

إِنَّ ٱلْمُتَّقِينَ فِى جَنَّٰتٍ وَنَعِيمٍ ⁽١٧⁾

**17**. నిశ్చయంగా, భయభక్తులు గలవారు స్వర్గవనాలలో సుఖసంతోషాలలో ఉంటారు.

فَٰكِهِينَ بِمَآ ءَاتَىٰهُمْ رَبُّهُمْ وَوَقَىٰهُمْ رَبُّهُمْ عَذَابَ ٱلْجَحِيمِ ⁽١٨⁾

**18**. వారి ప్రభువు వారికి ప్రసాదించిన వాటిని హాయిగా అనుభవిస్తూ ఉంటారు. మరియు వారి ప్రభువు వారిని భగభగ మండే నరకాగ్ని శిక్ష నుండి కాపాడాడు.

كُلُوا۟ وَٱشْرَبُوا۟ هَنِيٓـًٔۢا بِمَا كُنتُمْ تَعْمَلُونَ ١٩

**19**. (వారితో ఇలా అనబడుతుంది): "మీరు చేస్తూవుండిన కర్మలకు ఫలితంగా హాయిగా తినండి త్రాగండి!"

مُتَّكِـِٔينَ عَلَىٰ سُرُرٍ مَّصْفُوفَةٍ ۖ وَزَوَّجْنَـٰهُم بِحُورٍ عِينٍ ٢٠

**20**. వారు వరుసగా వేయబడిన ఆసనాల మీద, దిండ్లకు ఆనుకొని కూర్చొని ఉంటారు. మరియు మేము అందమైన పెద్దపెద్ద కన్నులుగల సుందరీమణులతో[1] వారి వివాహం చేయిస్తాము.

وَٱلَّذِينَ ءَامَنُوا۟ وَٱتَّبَعَتْهُمْ ذُرِّيَّتُهُم بِإِيمَـٰنٍ أَلْحَقْنَا بِهِمْ ذُرِّيَّتَهُمْ وَمَآ أَلَتْنَـٰهُم مِّنْ عَمَلِهِم مِّن شَىْءٍ ۚ كُلُّ ٱمْرِئٍۭ بِمَا كَسَبَ رَهِينٌ ٢١

**21**. మరియు ఎవరైతే విశ్వసిస్తారో మరియు వారి సంతానం వారు విశ్వాసంలో వారిని అనుసరిస్తారో! అలాంటి వారిని వారి సంతానంతో (స్వర్గంలో) కలుపుతాము.[2] మరియు వారి కర్మలలో వారికి ఏ మాత్రం నష్టం కలిగించము. ప్రతివ్యక్తి తాను సంపాదించిన దానికి తాకట్టుగా ఉంటాడు.[3]

وَأَمْدَدْنَـٰهُم بِفَـٰكِهَةٍ وَلَحْمٍ مِّمَّا يَشْتَهُونَ ٢٢

**22**. మరియు మేము వారికి, వారు కోరే ఫలాలను మరియు మాంసాన్ని పుష్కలంగా ప్రసాదిస్తాము.

يَتَنَـٰزَعُونَ فِيهَا كَأْسًا لَّا لَغْوٌ فِيهَا وَلَا تَأْثِيمٌ ٢٣

**23**. అందులో (ఆ స్వర్గంలో) వారు ఒకరి కొకరు (మధు) పాత్ర మార్చుకుంటూ ఉంటారు, దాన్ని (త్రాగటం) వల్ల వారు వ్యర్థపుమాటలు మాట్లాడరు మరియు పాపాలు చేయరు.[4] (1/8)

---

**1**. 'హూరున్: కొరకు చూడండి, 56:22, 55:56, 44:54, 38:52, 37:48.

**2**. దైవప్రవక్త ('స'అస) ప్రవచనం: 'మానవుడు మరణిస్తే అతని కర్మలు ఆగిపోతాయి. కాని మూడు విషయాల పుణ్యఫలితం మరణించిన తరువాత కూడా దొరుకుతూ ఉంటుంది. 1) సదఖహ్ జారియహ్, 2) అతడు వదలిన జ్ఞానం - దేనితోనైతే ఇతరులు లాభం పొందుతూ ఉంటారో! 3) సద్వర్తనులైన సంతానం - ఎవరైతే అతని కొరకు ప్రార్థిస్తూ ఉంటారో!' ('స. ముస్లిం).

**3**. ఇటువంటి ఆయత్ కే చూడండి, 74:38.

**4**. చూడండి, 37:47 మరియు 56:19.

۞ وَيَطُوفُ عَلَيْهِمْ غِلْمَانٌ لَّهُمْ كَأَنَّهُمْ لُؤْلُؤٌ مَّكْنُونٌ ﴿٢٤﴾ وَأَقْبَلَ بَعْضُهُمْ عَلَىٰ بَعْضٍ يَتَسَاءَلُونَ ﴿٢٥﴾ قَالُوٓا۟ إِنَّا كُنَّا قَبْلُ فِىٓ أَهْلِنَا مُشْفِقِينَ ﴿٢٦﴾ فَمَنَّ ٱللَّهُ عَلَيْنَا وَوَقَىٰنَا عَذَابَ ٱلسَّمُومِ ﴿٢٧﴾ إِنَّا كُنَّا مِن قَبْلُ نَدْعُوهُ ۖ إِنَّهُۥ هُوَ ٱلْبَرُّ ٱلرَّحِيمُ ﴿٢٨﴾ فَذَكِّرْ فَمَآ أَنتَ بِنِعْمَتِ رَبِّكَ بِكَاهِنٍ وَلَا مَجْنُونٍ ﴿٢٩﴾ أَمْ يَقُولُونَ شَاعِرٌ نَّتَرَبَّصُ بِهِۦ رَيْبَ ٱلْمَنُونِ ﴿٣٠﴾

**24.** * మరియు దాచబడిన ముత్యాల వంటి బాలురు,[1] వారి సేవకొరకు వారి చుట్టు ప్రక్కలలో తిరుగుతూ ఉంటారు.

**25.** మరియు వారు ఒకరివైపుకొకరు మరలి పరస్పరం (తమ గతించిన జీవితాలను గురించి) మాట్లాడుకుంటూ ఉంటారు.

**26.** వారు ఇలా అంటారు: "వాస్తవానికి మనం ఇంతకుపూర్వం మన కుటుంబం వారి మధ్య ఉన్నప్పుడు (అల్లాహ్ శిక్షకు) భయపడుతూ ఉండేవారము.

**27.** "కావున నిశ్చయంగా, అల్లాహ్ మనమీద కనికరం చూపాడు మరియు మమ్మి దహించే గాలుల శిక్షనుండి కాపాడాడు.[2]

**28.** "నిశ్చయంగా, మనం ఇంతకు పూర్వం ఆయననే ప్రార్థిస్తూ ఉండేవారము. నిశ్చయంగా, ఆయన మహోపకారి,[3] అపార కరుణాప్రదాత!"

**29.** కావున (ఓ ప్రవక్తా!) నీవు హితోపదేశం చేస్తూవుండు. నీ ప్రభువు అనుగ్రహం వల్ల నీవు జ్యోతిషుడవు కావు మరియు పిచ్చివాడవూ కావు.

**30.** లేదా? వారు: "ఇతను ఒక కవి, ఇతని వినాశకాలం కోసం మేము ఎదురుచూస్తున్నాం." అని అంటున్నారా?[4]

---

**1.** చూడండి, 56:17-18.

**2.** సమూమున్: అతి వేడిగల దహించే గాలి. నరకపు పేర్లలో ఇది కూడా ఒకటి.

**3.** అల్-బర్రు: Truely Benign to His servants, Gentle, Kind, Most Subtle, కృపాళువు, **మహోపకారి**, దయామయుడు. ఇది అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లలో ఒకటి.

**4.** రైబున్: అంటే అకస్మాత్తుగా జరిగే సంఘటన. మనూనున్: ఇది మరణపు పేర్లలో ఒకటి. అంటే కాలక్రమంలో సంభవించే ఉపద్రవం లేక దుర్ఘటన.

**31**. వారితో ఇలా అను: "మీరు ఎదురుచూస్తూ ఉండండి, నిశ్చయంగా, నేను కూడా మీతోపాటు ఎదురుచూస్తూ ఉంటాను!"

**32**. ఏమీ? వారి బుద్ధులు వారికి ఇవే ఆజ్ఞాపిస్తున్నాయా? లేక వారు తలబిరుసుతనం గల జనులా?[1]

**33**. ఏమీ? వారు: "ఇతనే, దీనిని (ఈ సందేశాన్ని) కల్పించుకున్నాడు." అని అంటున్నారా? అలాకాదు, వారు అసలు విశ్వసించదలుచుకోలేదు!

**34**. వారు సత్యవంతులే అయితే దీని వంటి ఒక వచనాన్ని (రచించి) తెమ్మను.[2]

**35**. వారు ఏ (సృష్టికర్త) లేకుండానే సృష్టింపబడ్డారా? లేక వారే సృష్టికర్తలా?

**36**. లేక వారు ఆకాశాలను మరియు భూమిని సృష్టించారా? అలాకాదు, అసలు వారికి విశ్వాసం లేదు.

**37**. వారి దగ్గర నీ ప్రభువు కోశాగారాలు ఏవైనా ఉన్నాయా? లేక వారు వాటికి అధికారులా?

**38**. వారి దగ్గర నిచ్చెన ఏదైనా ఉందా? దానితో పైకెక్కి వారు (దేవదూతల మాటలు) వినటానికి? అలా అయితే! వారిలో ఎవడైతే విన్నాడో, అతనిని స్పష్టమైన నిదర్శనాన్ని తెమ్మను.

قُلۡ تَرَبَّصُواْ فَإِنِّي مَعَكُم مِّنَ ٱلۡمُتَرَبِّصِينَ ٣١

أَمۡ تَأۡمُرُهُمۡ أَحۡلَٰمُهُم بِهَٰذَآۚ أَمۡ هُمۡ قَوۡمٞ طَاغُونَ ٣٢

أَمۡ يَقُولُونَ تَقَوَّلَهُۥۚ بَل لَّا يُؤۡمِنُونَ ٣٣

فَلۡيَأۡتُواْ بِحَدِيثٖ مِّثۡلِهِۦٓ إِن كَانُواْ صَٰدِقِينَ ٣٤

أَمۡ خُلِقُواْ مِنۡ غَيۡرِ شَيۡءٍ أَمۡ هُمُ ٱلۡخَٰلِقُونَ ٣٥

أَمۡ خَلَقُواْ ٱلسَّمَٰوَٰتِ وَٱلۡأَرۡضَۚ بَل لَّا يُوقِنُونَ ٣٦

أَمۡ عِندَهُمۡ خَزَآئِنُ رَبِّكَ أَمۡ هُمُ ٱلۡمُصَيۡطِرُونَ ٣٧

أَمۡ لَهُمۡ سُلَّمٞ يَسۡتَمِعُونَ فِيهِۖ فَلۡيَأۡتِ مُسۡتَمِعُهُم بِسُلۡطَٰنٖ مُّبِينٍ ٣٨

---

**1**. చూడండి, 96:6-7.
**2**. చూడండి, 17:88.

أَمۡ لَهُ ٱلۡبَنَٰتُ وَلَكُمُ ٱلۡبَنُونَ ﴿٣٩﴾

**39**. ఆయన(అల్లాహ్)కు కూతుళ్ళా మరియు మీకేమో కుమారులా?[1]

أَمۡ تَسۡـَٔلُهُمۡ أَجۡرٗا فَهُم مِّن مَّغۡرَمٖ مُّثۡقَلُونَ ﴿٤٠﴾

**40**. (ఓ ము'హమ్మద్!) నీవు వారితో ఏమైనా ప్రతిఫలం అడుగుతున్నావా? వారు ఋణభారంతో అణిగిపోవటానికి?

أَمۡ عِندَهُمُ ٱلۡغَيۡبُ فَهُمۡ يَكۡتُبُونَ ﴿٤١﴾

**41**. లేక వారి దగ్గర అగోచర విషయపు జ్ఞానముందా? వారు దానిని వ్రాసిపెట్టారా?[2]

أَمۡ يُرِيدُونَ كَيۡدٗاۖ فَٱلَّذِينَ كَفَرُواْ هُمُ ٱلۡمَكِيدُونَ ﴿٤٢﴾

**42**. లేక వారేదైనా పన్నాగం పన్నదలచారా? కాని ఎవరైతే సత్యాన్ని తిరస్కరిస్తారో, వారే పన్నాగానికి గురి అవుతారు.[3]

أَمۡ لَهُمۡ إِلَٰهٌ غَيۡرُ ٱللَّهِۚ سُبۡحَٰنَ ٱللَّهِ عَمَّا يُشۡرِكُونَ ﴿٤٣﴾

**43**. లేక వారికి అల్లాహ్ గాకుండా మరొక ఆరాధ్య దేవుడు ఉన్నాడా? వారు కల్పించే భాగస్వాములకు అల్లాహ్ అతీతుడు.

وَإِن يَرَوۡاْ كِسۡفٗا مِّنَ ٱلسَّمَآءِ سَاقِطٗا يَقُولُواْ سَحَابٞ مَّرۡكُومٞ ﴿٤٤﴾

**44**. ఒకవేళ వారు ఆకాశపు ఒక తునకను రాలిపడటం చూసినా: "ఇవి దట్టమైన మేఘాలు!" అని అనేవారు.

فَذَرۡهُمۡ حَتَّىٰ يُلَٰقُواْ يَوۡمَهُمُ ٱلَّذِي فِيهِ يُصۡعَقُونَ ﴿٤٥﴾

**45**. కావున వారు తమ (తీర్పు) దినాన్ని దర్శించేవరకు వారిని వదిలిపెట్టు. అప్పుడు వారు భీతితో మూర్ఛపోయి పడిపోతారు.

يَوۡمَ لَا يُغۡنِي عَنۡهُمۡ كَيۡدُهُمۡ شَيۡـٔٗا وَلَا هُمۡ يُنصَرُونَ ﴿٤٦﴾

**46**. ఆ రోజు వారి పన్నాగం వారికి ఏ మాత్రం పనికి రాదు. మరియు వారికి ఎలాంటి సహాయం కూడా లభించదు.

---

**1**. చూడండి, 16:57-59.
**2**. చూడండి, 68:47.
**3**. చూడండి, 35:43.

وَإِنَّ لِلَّذِينَ ظَلَمُوا۟ عَذَابًا دُونَ ذَٰلِكَ وَلَٰكِنَّ أَكْثَرَهُمْ لَا يَعْلَمُونَ ﴿٤٧﴾

**47**. మరియు నిశ్చయంగా, దుర్మార్గానికి పాల్పడినవారికి, ఇదేగాక మరొక శిక్షకూడా ఉంది,[1] కాని వారిలో చాలామందికి అది తెలియదు.

وَٱصْبِرْ لِحُكْمِ رَبِّكَ فَإِنَّكَ بِأَعْيُنِنَا ۖ وَسَبِّحْ بِحَمْدِ رَبِّكَ حِينَ تَقُومُ ﴿٤٨﴾

**48**. కావున (ఓ ము'హమ్మద్!) నీవు, నీ ప్రభువు ఆజ్ఞ వచ్చేవరకు సహనం వహించు. నిశ్చయంగా, నీవు మా దృష్టిలో ఉన్నావు. మరియు నీవు నిద్రనుండి లేచినపుడు నీ ప్రభువు పవిత్రతను కొనియాడు, ఆయన స్తోత్రం చెయ్యి.

وَمِنَ ٱلَّيْلِ فَسَبِّحْهُ وَإِدْبَٰرَ ٱلنُّجُومِ ﴿٤٩﴾

**49**. మరియు రాత్రివేళలో కూడా ఆయన పవిత్రతను కొనియాడు.[2] మరియు నక్షత్రాలు అస్తమించే వేళలో కూడాను![3]

*****

---

**1**. ఇటువంటి ఆయత్‌కై చూడండి, 32:21.

**2**. అంటే తహజ్జుద్ నమా'జ్. దైవప్రవక్త ('స'అస) ఎల్లప్పుడూ తహజ్జుద్ నమాజ్ చేసేవారు.

**3**. అంటే ఫజ్ర్ నమా'జ్ వేళ చేసే సున్నత్‌లు. దైవప్రవక్త ('స'అస) ప్రవచనం: 'ఫజ్ర్ యొక్క రెండు సున్నతులు ఈ లోకం మరియు దానిలో ఉన్నవాట న్నింటికంటే గొప్పవి.' ('స'హీ'హ్ బు'ఖారీ, 'స'హీ'హ్ ముస్లిం).

## 53. సూరహ్ అన్-నజ్మ్ سُورَةُ النَّجْمِ

అన్-నజ్ము: **నక్షత్రం. మొదటి ఆయత్**లోనే ఈ పదం ఉంది. మక్కా సూరాహ్‌ల ఈ సమూహంలో ఇది 4వది. ఇది మొదటి మక్కా కాలపు సూరహ్, బహుశా సూరహ్ అల్-ఇ'ఖ్లా'స్ (112) తరువాత అవతరింపజేయబడింది. ఇందులో **62 ఆయతులు** ఉన్నాయి. ఇందులో అల్లాహ్ (సు.తా.) ఏకత్వపు ప్రాముఖ్యత వివరించబడింది. ఇది దైవప్రవక్త ('స'అస) సత్యతిరస్కారుల ముందు చదివిన మొదటి సూరహ్. దీని పఠనం ముగించిన తరువాత అతను ('స'అస) సజ్దా చేశారు. అతని('స'అస)తో బాటు అందరూ సజ్దా చేశారు. ఒక్క ఉమయ్యా బిన్-'ఖలఫ్ తప్ప. అతడు తన చేతిలోకి మట్టి తీసుకొని దానిపై సజ్దా చేశాడు. కాబట్టి అతను సత్యతిరస్కారిగానే మరణించాడు. ('స'హీ'హ్ బు'ఖారీ). కొందరు ఇతడు 'ఉత్బాబిన్- రబీ'అ అంటారు. (ఇబ్నె-కసీ'ర్).

'జైద్ బిన్-సా'బిత్ (ర'ది.'అ.) కథనం: 'నేను దైవప్రవక్త ('స'అస) ముందు ఈ సూరహ్ చదివాను. అతనప్పుడు సజ్దా చేయలేదు,' ('స'హీ'హ్ బు'ఖారీ). దీని ద్వారా తెలిసేది ఏమిటంటే సజ్దా చేయటం అభిలషణీయం (ముస్త'హబ్), ఫ'ర్ద్ కాదు. ఒకవేళ సజ్దా చేయక పోయినా ఫర్వాలేదు!

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

C B A

**1.** అస్తమించే నక్షత్రం సాక్షిగా![1]

وَٱلنَّجْمِ إِذَا هَوَىٰ ﴿١﴾

**2.** మీ సహచరుడు (ము'హమ్మద్), మార్గభ్రష్టుడు కాలేదు మరియు తప్పు దారిలోనూ లేడు.[2]

مَا ضَلَّ صَاحِبُكُمْ وَمَا غَوَىٰ ﴿٢﴾

**3.** మరియు అతను తన మనోవాంఛలను అనుసరించి కూడా మాట్లాడడు.

وَمَا يَنطِقُ عَنِ ٱلْهَوَىٰٓ ﴿٣﴾

**4.** ఇది (అతను పలుకుతున్నది), అతనిపై అవతరింపజేయబడిన దివ్యజ్ఞానం (వ'హీ) మాత్రమే.

إِنْ هُوَ إِلَّا وَحْىٌ يُوحَىٰ ﴿٤﴾

**5.** అది అతనికి మహా బలవంతుడు (జిబ్రీల్) నేర్పాడు.

عَلَّمَهُۥ شَدِيدُ ٱلْقُوَىٰ ﴿٥﴾

---

**1.** లేక '*రాలిపోయే నక్షత్రం...*' అని కొందరు వ్యాఖ్యాతల అభిప్రాయం.
**2.** చూడండి, 7:184. మా 'గవా: తప్పు దారిలోనూ లేడు, పెడదారి పట్టలేదు.

ذُو مِرَّةٍ فَٱسْتَوَىٰ ﴿٦﴾

**6**. అతను శక్తిసామర్థ్యాలు గలవాడు,[1] తన వాస్తవ రూపంలో ప్రత్యక్ష మయినప్పుడు.

وَهُوَ بِٱلْأُفُقِ ٱلْأَعْلَىٰ ﴿٧﴾

**7**. అతను ఎత్తైన దిఙ్మండలంలో (దిక్చక్రంలో) కనిపించాడు.[2]

ثُمَّ دَنَا فَتَدَلَّىٰ ﴿٨﴾

**8**. తరువాత సమీపించాడు, మరింత క్రిందికి దిగివచ్చాడు.

فَكَانَ قَابَ قَوْسَيْنِ أَوْ أَدْنَىٰ ﴿٩﴾

**9**. అప్పుడు అతను రెండు ధనస్సుల దూరంలోనో లేక అంతకంటే తక్కువ దూరంలోనో ఉన్నాడు.

فَأَوْحَىٰٓ إِلَىٰ عَبْدِهِۦ مَآ أَوْحَىٰ ﴿١٠﴾

**10**. అప్పుడు అతను (జిబ్రీల్), ఆయన (అల్లాహ్) దాసునిపై అవతరింపజేయవలసిన, దాని (వ'హీ)ని అవతరింపజేశాడు.

مَا كَذَبَ ٱلْفُؤَادُ مَا رَأَىٰٓ ﴿١١﴾

**11**. అతను (ప్రవక్త) చూసిన దానిని, అతని హృదయం అబద్ధమని అనలేదు.

أَفَتُمَٰرُونَهُۥ عَلَىٰ مَا يَرَىٰ ﴿١٢﴾

**12**. అయితే మీరు, అతను (కళ్ళారా) చూసిన దానిని గురించి (అతనితో) వాదులాడుతారా?

وَلَقَدْ رَءَاهُ نَزْلَةً أُخْرَىٰ ﴿١٣﴾

**13**. మరియు వాస్తవానికి అతను (ప్రవక్త) అతనిని (జిబ్రీల్‌ను) మరొకసారి (ప్రత్యక్షంగా) అవతరించినప్పుడు చూశాడు.

---

**1**. శారీరక శక్తి గలవాడు.

**2**. చూడండి, 81:23, 'స'హీ'హ్ 'హదీస్'ల ప్రకారం దైవప్రవక్త ('స'అస), రెండుసార్లు దైవదూత జిబ్రీల్('అ.స.)ను అతని నిజరూపంలో చూశారు. మొదటిసారి ఫ'త్రతుల్ వ'హీ తరువాత. చూడండి, సూరహ్ అల్-ముద్దస్సి'ర్ (74) మరియు రెండవ సారి మే'రాజ్ రాత్రిలో ఏడవఆకాశపు చివరిహద్దులోనున్న రేగుచెట్టు(సిద్‌రతుల్- మున్‌తహా) దగ్గర. ఎవరు కూడా ఆ హద్దును దాటిపోలేరు. చూడండి, ఈ సూరహ్ 53:13-18 ఆయత్‌లు.

عِندَ سِدۡرَةِ ٱلۡمُنتَهَىٰ ﴿١٤﴾

**14**. (సప్తాకాశంలో) చివరి హద్దులో నున్న రేగుచెట్టు (సిద్‌రతుల్-మున్‌తహా) దగ్గర.[1]

عِندَهَا جَنَّةُ ٱلۡمَأۡوَىٰٓ ﴿١٥﴾

**15**. అక్కడికి దగ్గరలోనే జన్నతుల్ మఅ'వా ఉంది.[2]

إِذۡ يَغۡشَى ٱلسِّدۡرَةَ مَا يَغۡشَىٰ ﴿١٦﴾

**16**. అప్పుడు ఆ 'సిద్‌రహ్ వృక్షాన్ని కప్పేది కప్పేసినప్పుడు![3]

مَا زَاغَ ٱلۡبَصَرُ وَمَا طَغَىٰ ﴿١٧﴾

**17**. అతని (ప్రవక్త) దృష్టి తప్పిపోనూ లేదు మరియు హద్దులుదాటి కూడా పోలేదు.

لَقَدۡ رَأَىٰ مِنۡ ءَايَٰتِ رَبِّهِ ٱلۡكُبۡرَىٰٓ ﴿١٨﴾

**18**. వాస్తవంగా, అతను (ము'హమ్మద్) తన ప్రభువు యొక్క గొప్పగొప్ప సూచన(ఆయాత్)లను చూశాడు.[4]

أَفَرَءَيۡتُمُ ٱللَّٰتَ وَٱلۡعُزَّىٰ ﴿١٩﴾

**19**. మీరు, అల్-లాత్ మరియు అల్-'ఉ'జ్జాలను గురించి ఆలోచించారా?[5]

---

**1**. అంటే మే'రాజ్ రాత్రిలో ఏడవ ఆకాశపు చివరి హద్దులోనున్న రేగుచెట్టు(సిద్‌రతుల్-మున్‌తహా)దగ్గర దైవప్రవక్త('స'అస) జిబ్రీల్('అ.స.)ను అతని నిజరూపంలో రెండవసారి చూశారు. ఏ దైవదూత కూడా ఆ 'సిద్‌రతుల్-మున్‌తహా కంటే ముందుకు పోలేడు. దైవదూత ('అలైహిమ్. స.)లకు అల్లాహ్ (సు.తా.) ఆజ్ఞలు లభించేది అక్కడే.

**2**. దీనిని జన్నతుల్-మఅ'వా అనటానికి కారణం. ఇది ఒకప్పటి ఆదమ్('అ.స.) యొక్క నివాసస్థలం. ఆత్మలన్నీ అక్కడికేపోయి చేరుతాయని కొందరంటారు.(ఫ'త్హ్ అల్-ఖదీర్).

**3**. మే'రాజ్ రాత్రిలో దైవప్రవక్త('స'అస) అక్కడికి చేరుకున్నప్పుడు బంగారు పక్షులు దాని చుట్టూ ఎగురుతూ ఉంటాయి. దైవదూతల నీడలు దానిపై పడుతూ ఉంటాయి. అల్లాహ్ (సు.తా.) యొక్క జ్యోతి అక్కడ ఉంటుంది, (ఇబ్నె-కసీ'ర్ మరియు ఇతరులు). అక్కడ దైవప్రవక్త('స'అస)కు మూడు విషయాలు ప్రసాదించబడ్డాయి. 1) ఐదుపూటల నమా'జ్‌లు, 2) సూరహ్ బఖరహ్ చివరి ఆయతులు మరియు 3) షిర్క్‌కు దూరంగా ఉండే ముస్లింను క్షమిస్తాననే వాగ్దానం. ('స'హీ'హ్ ముస్లిం).

**4**. ఆ సూచనలు, జిబ్రీల్('అ.స.)ను నిజరూపంలో చూసింది. సిద్‌రతుల్-మున్‌తహాను చూసింది. మరియు ఇతర విషయాలను చూసింది. అవి 'హదీస్'లలో పేర్కొనబడ్డాయి. వివరాలకు చూడండి, 17:1 మరియు 7:187-188.

**5**. రఅ'య్‌తుమ్: అంటే అసలు అర్థం: 'చూశారా?' అని. కాని ఇక్కడ దాని అర్థం 'ఆలోచించారా?' లేక 'గమనించారా?' ఖుర్ఆన్‌లో ఈ పదం ఈ అర్థంలో చాలాసార్లు ఉపయోగించబడింది. ఇతర అర్థాలు యోచించు, అనుకొను, భావించు, తలచు, అభిప్రాయపడు, మొదలైనవి.

وَمَنَوٰةَ ٱلثَّالِثَةَ ٱلْأُخْرَىٰٓ ﴿٢٠﴾

20. మరియు మూడవదీ చివరిది అయిన మనాత్‌ను (గురించి కూడా)?[1]

أَلَكُمُ ٱلذَّكَرُ وَلَهُ ٱلْأُنثَىٰ ﴿٢١﴾

21. మీ కొరకైతే కుమారులు మరియు ఆయన కొరకు కుమార్తెలా?[2]

تِلْكَ إِذًا قِسْمَةٌ ضِيزَىٰٓ ﴿٢٢﴾

22. ఇది అన్యాయమైన విభజన కాదా?

إِنْ هِىَ إِلَّآ أَسْمَآءٌ سَمَّيْتُمُوهَآ أَنتُمْ وَءَابَآؤُكُم مَّآ أَنزَلَ ٱللَّهُ بِهَا مِن سُلْطَٰنٍ ۚ إِن يَتَّبِعُونَ إِلَّا ٱلظَّنَّ وَمَا تَهْوَى ٱلْأَنفُسُ ۖ وَلَقَدْ جَآءَهُم مِّن رَّبِّهِمُ ٱلْهُدَىٰٓ ﴿٢٣﴾

23. ఇవన్నీ మీరు మరియు మీ తండ్రి తాతలు పెట్టిన పేర్లు మాత్రమే, అల్లాహ్ వీటిని గురించి ఎట్టి ప్రమాణం అవతరింప జేయలేదు.[3] వారు, కేవలం తమ ఊహాగానాలను మరియు తమ ఆత్మలు కోరే మనోవాంఛలను మాత్రమే అనుసరిస్తున్నారు.[4] వాస్తవానికి వారి ప్రభువు తరఫునుండి వారి వద్దకు మార్గదర్శకత్వం కూడా వచ్చిఉన్నది!

أَمْ لِلْإِنسَٰنِ مَا تَمَنَّىٰ ﴿٢٤﴾

24. ఏమిటి? మానవునికి తాను కోరినదంతా లభిస్తుందా?

فَلِلَّهِ ٱلْءَاخِرَةُ وَٱلْأُولَىٰ ﴿٢٥﴾

25. వాస్తవానికి, అంతిమం (పరలోకం) మరియు ప్రథమం (ఇహలోకం) అన్నీ అల్లాహ్ కే చెందినవి. (1/4)

۞ وَكَم مِّن مَّلَكٍ فِى ٱلسَّمَٰوَٰتِ لَا تُغْنِى شَفَٰعَتُهُمْ شَيْـًٔا إِلَّا مِنۢ بَعْدِ أَن يَأْذَنَ ٱللَّهُ لِمَن يَشَآءُ وَيَرْضَىٰٓ ﴿٢٦﴾

26. * మరియు ఆకాశాలలో ఎందరో దేవదూతలు ఉన్నారు. కాని వారి సిఫారసు ఏ మాత్రం పనికిరాదు; అల్లాహ్ ఎవరి పట్లనైతే ప్రసన్నుడై, తన ఇష్టంతో వారికి అనుమతిస్తేనే తప్ప![5]

---

1. అంటే వారి శక్తి ఏమిటీ? అవి మీ కేమైనా మేలు గానీ, కీడు గానీ చేయగలవా? ఏమైనా సృష్టించగలవా? అవి తమకు తామే సహాయం చేసుకోలేవు మరి మీకెలా సహాయం చేయగలవు. ఇక్కడ ఆ కాలపు కేవలం మూడు విగ్రహాల పేర్లే పేర్కొనబడ్డాయి.
2. ఆడపిల్లలంటే ఆ కాలపు 'అరబ్బులతో ఉన్న అసహ్యానికి చూడండి, 16:57-59, 62.
3. చూడండి, 12:40.
4. మనోవాంఛలు అంటే, ఆ దేవతలు తమ కొరకు అల్లాహ్ (సు.తా.) దగ్గర సిఫారసు చేస్తారని భావించటం.
5. అల్లాహ్ (సు.తా.)కు అతి సమీపంగా ఉండే దైవదూతలకు కూడా కేవలం వారి కోసమే సిఫారసు చేసే హక్కు ఉంటుంది, ఎవరి కొరకైతే అల్లాహ్ (సు.తా.) సిఫారసు చేయటానికి అనుమతినిస్తాడో! వివరాలకు చూడండి, 10:3 మరియు 10:18.

إِنَّ ٱلَّذِينَ لَا يُؤۡمِنُونَ بِٱلۡأٓخِرَةِ لَيُسَمُّونَ ٱلۡمَلَٰٓئِكَةَ تَسۡمِيَةَ ٱلۡأُنثَىٰ ﴿٢٧﴾

**27**. నిశ్చయంగా, ఎవరైతే పరలోక జీవితాన్ని విశ్వసించరో! వారే దేవదూతలను స్త్రీల పేర్లతో పిలుస్తారు;

وَمَا لَهُم بِهِۦ مِنۡ عِلۡمٍۖ إِن يَتَّبِعُونَ إِلَّا ٱلظَّنَّۖ وَإِنَّ ٱلظَّنَّ لَا يُغۡنِي مِنَ ٱلۡحَقِّ شَيۡـٔٗا ﴿٢٨﴾

**28**. ఈ విషయం గురించి వారికి ఎలాంటి జ్ఞానంలేదు. వారు కేవలం తమ ఊహలనే అనుసరిస్తున్నారు. కాని వాస్తవానికి, ఊహ సత్యానికి ఏమాత్రం బదులు కాజాలదు.

فَأَعۡرِضۡ عَن مَّن تَوَلَّىٰ عَن ذِكۡرِنَا وَلَمۡ يُرِدۡ إِلَّا ٱلۡحَيَوٰةَ ٱلدُّنۡيَا ﴿٢٩﴾

**29**. కావున, మా హితబోధ (ఖుర్ఆన్) నుండి ముఖం త్రిప్పుకొని ఇహలోక జీవితం తప్ప మరేమీ కోరని వ్యక్తిని నీవు పట్టించుకోకు.

ذَٰلِكَ مَبۡلَغُهُم مِّنَ ٱلۡعِلۡمِۚ إِنَّ رَبَّكَ هُوَ أَعۡلَمُ بِمَن ضَلَّ عَن سَبِيلِهِۦ وَهُوَ أَعۡلَمُ بِمَنِ ٱهۡتَدَىٰ ﴿٣٠﴾

**30**. ఇదే వారి జ్ఞానపరిధి. నిశ్చయంగా, నీ ప్రభువుకు, ఆయన మార్గంనుండి ఎవడు తప్పిపోయాడో తెలుసు. మరియు ఎవడు సన్మార్గంలో ఉన్నాడో కూడా, ఆయనకు బాగా తెలుసు.

وَلِلَّهِ مَا فِي ٱلسَّمَٰوَٰتِ وَمَا فِي ٱلۡأَرۡضِ لِيَجۡزِيَ ٱلَّذِينَ أَسَٰٓـُٔواْ بِمَا عَمِلُواْ وَيَجۡزِيَ ٱلَّذِينَ أَحۡسَنُواْ بِٱلۡحُسۡنَى ﴿٣١﴾

**31**. మరియు ఆకాశాలలో నున్నది మరియు భూమిలో నున్నది. అంతా అల్లాహ్‌కే చెందుతుంది - దుష్టులకు వారి కర్మలకు తగిన ప్రతిఫలం ఇవ్వటానికి మరియు సత్కార్యాలు చేసిన వారికి మంచి ప్రతిఫలం ఇవ్వటానికి.[1]

---

**1**. సత్కార్యాలకు ఎన్నోరెట్లు ప్రతిఫలమివ్వబడుతుంది. కాని పాపాలకు మాత్రం సమాన శిక్షయే విధించబడుతుంది. చూడండి, 6:160.

ٱلَّذِينَ يَجۡتَنِبُونَ كَبَٰٓئِرَ ٱلۡإِثۡمِ وَٱلۡفَوَٰحِشَ إِلَّا ٱللَّمَمَۚ إِنَّ رَبَّكَ وَٰسِعُ ٱلۡمَغۡفِرَةِۚ هُوَ أَعۡلَمُ بِكُمۡ إِذۡ أَنشَأَكُم مِّنَ ٱلۡأَرۡضِ وَإِذۡ أَنتُمۡ أَجِنَّةٞ فِي بُطُونِ أُمَّهَٰتِكُمۡۖ فَلَا تُزَكُّوٓاْ أَنفُسَكُمۡۖ هُوَ أَعۡلَمُ بِمَنِ ٱتَّقَىٰٓ ٣٢

**32**. ఎవరైతే చిన్నచిన్న తప్పులు తప్ప, పెద్దపాపాల నుండి[1] మరియు అసహ్యాకరమైన పనుల నుండి దూరంగా ఉంటారో వారి కొరకు, నిశ్చయంగా, నీ ప్రభువు క్షమాపణ పరిధి చాలా విశాలమైనది. మిమ్మల్ని మట్టినుండి సృష్టించినప్పటి నుండి మరియు మీరు మీ తల్లుల గర్భాలలో పిండాలుగా[2] ఉన్నప్పటి నుండి కూడా, ఆయనకు మీ గురించి బాగా తెలుసు. కావున మీరు మీ పవిత్రతను గురించి (గొప్పలు) చెప్పుకోకండి.[3] ఎవడు భయభక్తులు గలవాడో ఆయనకు బాగా తెలుసు.

أَفَرَءَيۡتَ ٱلَّذِي تَوَلَّىٰ ٣٣

**33**. నీవు (ఇస్లాంనుండి) మరలిపోయే వాడిని చూశావా?

وَأَعۡطَىٰ قَلِيلٗا وَأَكۡدَىٰٓ ٣٤

**34**. మరియు (అల్లాహ్ మార్గంలో) కొంత మాత్రమే ఇచ్చి, చేయి ఆపుకునే వాడిని?

أَعِندَهُۥ عِلۡمُ ٱلۡغَيۡبِ فَهُوَ يَرَىٰٓ ٣٥

**35**. అతని వద్ద అగోచర జ్ఞానముందా? అతడు (స్పష్టంగా) చూడటానికి?

---

**1**. పెద్దపాపాల వివరణ విషయంలో విద్వాంసుల మధ్య భేదాభిప్రాయాలున్నాయి. చాలా మంది విద్వాంసుల దృష్టిలో నరకశిక్ష సూచించబడిన పాపాలు పెద్దవి లేక ఖుర్ఆన్ మరియు 'హదీస్'లో గట్టిగా వారించబడినవి కూడా! అలాగే చిన్న పాపాలు మళ్ళీమళ్ళీ చేయటం కూడా పెద్ద పాపమే.
ఫవా'హిషున్, ఫా'హిషతున్ యొక్క బహువచనం. అంటే సిగ్గుమాలిన పనులు ఉదా: 'జినా మరియు లువా'తత్. ఎవరైతే పెద్ద పాపాల నుండి మరియు అసహ్యాకరమైన పనుల నుండి దూరంగా ఉంటారో వారికి క్షమాభిక్ష దొరకవచ్చు అని ఈ ఆయత్‌లో చెప్పబడింది.

**2**. అజిన్నతున్-జనీనున్ యొక్క బహువచనం అంటే తల్లిగర్భంలో ఉండే పిండం. అది ఇతరులకు కనిపించదు కనుక దాన్ని ఆ విధంగా అంటారు.

**3**. చూడండి, 4:49.

أَمۡ لَمۡ يُنَبَّأۡ بِمَا فِي صُحُفِ مُوسَىٰ ﴿٣٦﴾

**36**. లేక, మూసా గ్రంథంలో నున్న విషయాలు అతనికి తెలుపబడలేదా?

وَإِبۡرَٰهِيمَ ٱلَّذِي وَفَّىٰٓ ﴿٣٧﴾

**37**. మరియు తన బాధ్యతను నెరవేర్చిన ఇబ్రాహీమ్ విషయము;[1]

أَلَّا تَزِرُ وَازِرَةٞ وِزۡرَ أُخۡرَىٰ ﴿٣٨﴾

**38**. మరియు (పాపాల) భారం మోసే వాడెవడూ ఇతరుల (పాపాల) భారం మోయడని;[2]

وَأَن لَّيۡسَ لِلۡإِنسَٰنِ إِلَّا مَا سَعَىٰ ﴿٣٩﴾

**39**. మరియు మానవునికి తాను చేసినదాని ఫలితం తప్ప మరొకటి లభించదని;[3]

وَأَنَّ سَعۡيَهُۥ سَوۡفَ يُرَىٰ ﴿٤٠﴾

**40**. మరియు నిశ్చయంగా, అతనికి తన కృషి ఫలితమే చూపబడుతుందని;

ثُمَّ يُجۡزَىٰهُ ٱلۡجَزَآءَ ٱلۡأَوۡفَىٰ ﴿٤١﴾

**41**. అప్పుడు అతనికి తన కృషికి పూర్తి ప్రతిఫలం ఇవ్వబడుతుందని;

---

**1**. చూడండి, 2:124.

**2**. ఈ ఆయత్ ఖుర్ఆన్‌లో ఐదుసార్లు వచ్చింది. 6:164, 17:15, 35:18, 39:7 మరియు ఇక్కడ. ఈ సూరహ్‌లో ఖుర్ఆన్ అవతరణలో మొట్ట మొదటి సారి వచ్చింది. ఇది క్రైస్తవుల 'మూలపాపం' అనే సిద్ధాంతాన్ని ఖండిస్తోంది. రెండవది: 'ఒకని పాపభారాన్ని ఒక ప్రవక్త లేక సన్యాసి భరిస్తాడు.' అనే సిద్ధాంతాన్ని కూడా ఖండిస్తోంది. ఉదా: క్రైస్తవుల: 'దైవప్రవక్త 'ఈసా('అ.స.) మానవజాతి పాపాలను భరిస్తాడు.' అనే సిద్ధాంతం.

**3**. దైవప్రవక్త('స'అస) ప్రవచనం: 'కర్మల ఫలితాలు, వాటి కర్తల ఉద్దేశాలను బట్టి నిర్ణయించబడతాయి. ప్రతివాడు తాను బుద్ధిపూర్వకంగా చేసిన దాని ఫలితమే పొందుతాడు.' (బు'ఖారీ, ముస్లిం, తిర్మిజీ', అబూ-దావూద్, నసాయి', ఇబ్నె-మాజా, ఇబ్నె-'హంబల్ మరియు ఇతరులు). ఆమాల్ అంటే కర్మలు - మంచివి గానీ, చెడ్డవీ గానీ. చేయడమే గాక పలకడం గూడా లెక్కించబడుతుంది. ఒక పని, చేయటమే గాక, బుద్ధిపూర్వకంగా ఒక పని చేయకుండా ఉండటం కూడా కర్మగానే లెక్కించబడుతుంది. అది మంచిపని గానీ లేక చెడ్డ పని గానీ. అదే విధంగా నమ్మకాలను, విశ్వాసాలను ప్రకటించటం కూడా, అవి మూఢనమ్మకాలు గానీ లేదా సత్య విశ్వాసాలు గానీ లెక్కించబడతాయి. అంటే మానవుడు చేసే ప్రతి పని, పలికే ప్రతిమాట లెక్కించబడుతుందన్న మాట.

وَأَنَّ إِلَىٰ رَبِّكَ ٱلْمُنتَهَىٰ ﴿٤٢﴾

**42**. మరియు నిశ్చయంగా, నీ ప్రభువు వద్దనే (ప్రతిదాని) ముగింపు ఉన్నదని;

وَأَنَّهُۥ هُوَ أَضْحَكَ وَأَبْكَىٰ ﴿٤٣﴾

**43**. మరియు నిశ్చయంగా, ఆయనే నిన్ను నవ్విస్తున్నాడు మరియు ఏడ్పిస్తున్నాడని;

وَأَنَّهُۥ هُوَ أَمَاتَ وَأَحْيَا ﴿٤٤﴾

**44**. మరియు నిశ్చయంగా, ఆయనే మరణింపజేసేవాడు మరియు జీవితాన్ని ప్రసాదించేవాడని;

وَأَنَّهُۥ خَلَقَ ٱلزَّوْجَيْنِ ٱلذَّكَرَ وَٱلْأُنثَىٰ ﴿٤٥﴾

**45**. మరియు నిశ్చయంగా, మగ-ఆడ జంటలను సృష్టించిన వాడు ఆయనేనని -

مِن نُّطْفَةٍ إِذَا تُمْنَىٰ ﴿٤٦﴾

**46**. ప్రవహింపజేయబడిన, వీర్య బిందువు నుండి.

وَأَنَّ عَلَيْهِ ٱلنَّشْأَةَ ٱلْأُخْرَىٰ ﴿٤٧﴾

**47**. మరియు నిశ్చయంగా, దానికి మరొక జీవితాన్ని (పునరుత్థానం) ప్రసాదించడం ఆయన(అల్లాహ్)కే చెందినదని;

وَأَنَّهُۥ هُوَ أَغْنَىٰ وَأَقْنَىٰ ﴿٤٨﴾

**48**. మరియు నిశ్చయంగా, ఆయనే సంపన్నునిగా చేసేవాడు మరియు తృప్తి నిచ్చువాడని;

وَأَنَّهُۥ هُوَ رَبُّ ٱلشِّعْرَىٰ ﴿٤٩﴾

**49**. మరియు నిశ్చయంగా, ఆయనే అగ్ని[1] నక్షత్రానికి ప్రభువని;

وَأَنَّهُۥٓ أَهْلَكَ عَادًا ٱلْأُولَىٰ ﴿٥٠﴾

**50**. మరియు నిశ్చయంగా, ఆయనే తొలి 'ఆద్ జాతిని నాశనం చేసినవాడని;[2]

---

**1**. అష్-షి'అరా: Sirius, **అగ్ని** నక్షత్రం. ఇది ఆకాశంలో దేదీప్యమానంగా వెలుగుతూ ఉంటుంది. ముష్రిక్ 'అరబ్బులు దీన్ని పూజించేవారు.

**2**. 'ఆద్ జాతివారి గాథకై చూడండి, 7:65-69 వీరు నూ'హ్ జాతివారి తరువాత నాశనం చేయబడ్డవారు.

وَثَمُودَاْ فَمَآ أَبْقَىٰ ﴿٥١﴾

**51**. మరియు స'మూద్ జాతిని; ఒక్కడూ కూడా లేకుండా రూపు మాపాడని.[1]

وَقَوْمَ نُوحٍ مِّن قَبْلُۖ إِنَّهُمْ كَانُواْ هُمْ أَظْلَمَ وَأَطْغَىٰ ﴿٥٢﴾

**52**. మరియు అంతకు పూర్వం నూ'హ్ జాతివారిని. నిశ్చయంగా, వారు పరమ దుర్మార్గులు మరియు తలబిరుసులు.

وَٱلْمُؤْتَفِكَةَ أَهْوَىٰ ﴿٥٣﴾

**53**. మరియు ఆయనే తలక్రిందులైన నగరాలను నాశనం చేశాడు.[2]

فَغَشَّىٰهَا مَا غَشَّىٰ ﴿٥٤﴾

**54**. తరువాత వాటిని క్రమ్ము కొనవలసింది (రాళ్ళ వర్షం) క్రమ్ముకున్నది.

فَبِأَيِّ ءَالَآءِ رَبِّكَ تَتَمَارَىٰ ﴿٥٥﴾

**55**. అయితే (ఓ మానవుడా!) నీ ప్రభువు యొక్క ఏ యే అనుగ్రహాలను గురించి నీవు అనుమానంలో పడి ఉంటావు?[3]

هَٰذَا نَذِيرٌ مِّنَ ٱلنُّذُرِ ٱلْأُولَىٰٓ ﴿٥٦﴾

**56**. ఇదివరకు వచ్చిన హెచ్చరిక చేసే వారివలే ఇతను (ము'హమ్మద్) కూడా హెచ్చరిక చేసేవాడు మాత్రమే!

أَزِفَتِ ٱلْأَزِفَةُ ﴿٥٧﴾

**57**. రానున్న ఘడియ (పునరుత్థాన దినం) సమీపంలోనే వుంది.

لَيْسَ لَهَا مِن دُونِ ٱللَّهِ كَاشِفَةٌ ﴿٥٨﴾

**58**. అల్లాహ్ తప్ప మరెవ్వరూ దానిని తొలగించ లేరు.

---

**1**. స'మూద్ జాతివారి గాథకై చూడండి, 7:73 మరియు 26:141-158.
**2**. లూ'త్ ప్రజల నాశనానికై చూడండి, 11:77-83.
**3**. చూడండి, 55:13.

أَفَمِنْ هَٰذَا ٱلْحَدِيثِ تَعْجَبُونَ ۝٥٩

**59**. ఏమీ? మీరు ఈ సందేశాన్ని చూసి ఆశ్చర్యపడుతున్నారా?

وَتَضْحَكُونَ وَلَا تَبْكُونَ ۝٦٠

**60**. మరియు మీరు నవ్వుతున్నారా? మరియు మీకు ఏడ్పు రావటంలేదా?

وَأَنتُمْ سَٰمِدُونَ ۝٦١

**61**. మరియు మీరు నిర్లక్ష్యంలో మునిగి ఉన్నారా?[1]

فَٱسْجُدُوا۟ لِلَّهِ وَٱعْبُدُوا۟ ۩ ۝٦٢

**62**. కావున! అల్లాహ్‌కు సాష్టాంగం (సజ్దా) చేయండి. మరియు (ఆయనను మాత్రమే) ఆరాధించండి![2] ۩

*****

1. లేక: 'ఆటపాటల్లో మునిగి ఉన్నారా?'

2. ఈ ఆజ్ఞను పాటిస్తూ దైవప్రవక్త ('స'అస) సజ్దా చేశారు. అతనితోబాటు 'స'హాబా(ర'ది.'అన్హుమ్)లు మరియు అక్కడున్న ముష్రికులు కూడా సజ్దాచేశారు.

## 54. సూరహ్ అల్-ఖమర్

## سُورَةُ القَمَرِ

అల్-ఖమరు: **చంద్రుడు**, The Moon. **మొదటి ఆయత్**‌లో ఈ పేరు ఉంది. ఈ సమూహంలో ఇది 5వ సూరహ్. ఇది **మక్కా** మొదటి కాలంలో అవతరింపజేయబడింది. దైవప్రవక్త ('స'అస) పండుగ('ఈద్)ల నమా'జ్‌లలో చదివే సూరాహ్‌లలో సూరహ్ ఖాఫ్ (50) మరియు ఇది పేర్కొనదగినవి. ఇందులో **55 ఆయతులు** ఉన్నాయి.

C B A

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

اَقْتَرَبَتِ السَّاعَةُ وَانْشَقَّ الْقَمَرُ ۝١

**1.** ఆ ఘడియ దగ్గరకువచ్చింది మరియు **చంద్రుడు** పూర్తిగా చీలిపోయాడు.[1]

وَاِنْ يَّرَوْا اٰيَةً يُّعْرِضُوْا وَيَقُوْلُوْا سِحْرٌ مُّسْتَمِرٌّ ۝٢

**2.** అయినా (సత్యతిరస్కారులు), అద్భుత సూచనను చూసినా తమ ముఖాలను త్రిప్పుకొంటున్నారు. మరియు: "ఇది ఎప్పటినుంచో జరుగుతూ వస్తున్న మంత్ర జాలమే." అని అంటున్నారు.

وَكَذَّبُوْا وَاتَّبَعُوْٓا اَهْوَآءَهُمْ وَكُلُّ اَمْرٍ مُّسْتَقِرٌّ ۝٣

**3.** మరియు వారు దీనిని (ఈ ఖుర్ఆన్‌ను) అసత్యమని తిరస్కరించారు. మరియు తమ మనోవాంఛలను అనుసరించారు. మరియు ప్రతి వ్యవహారం ఒక పర్యవసానానికి చేరవలసి ఉంటుంది.[2]

وَلَقَدْ جَآءَهُمْ مِّنَ الْاَنْۢبَآءِ مَا فِيْهِ مُزْدَجَرٌ ۝٤

**4.** మరియు వాస్తవానికి, వారివద్దకు సమాచారాలు వచ్చాయి. అందు వారికి మందలింపులు ఉండేవి.

---

**1.** ఈ అద్భుత నిదర్శనం, మక్కావాసుల కోరికపై దైవప్రవక్త ('స'అస) చూపించారు. ('స. ముస్లిం).

**2.** ప్రతి కార్యానికి పర్యవసానం ఉంది. అంటే మంచికి మంచి ప్రతిఫలం మరియు చెడుకు శిక్ష. ఈ ప్రతిఫలం ఈ లోకంలోనే లభించవచ్చు లేనిచో పరలోకంలో తప్పకుండా లబిస్తుంది.

حِكْمَةٌۢ بَٰلِغَةٌۖ فَمَا تُغْنِ ٱلنُّذُرُ ٥

5. కావలసినంత వివేకమూ ఉండేది. కాని ఆ హెచ్చరికలు వారికి ప్రయోజనకరం కాలేదు.

فَتَوَلَّ عَنْهُمْۘ يَوْمَ يَدْعُ ٱلدَّاعِ إِلَىٰ شَيْءٍ نُّكُرٍ ٦

6. కావున (ఓ ము'హమ్మద్!) నీవు వారి నుండి మరలిపో! పిలిచేవాడు భయంకరమైన ఒక విషయం వైపునకు పిలిచే రోజున;

خُشَّعًا أَبْصَٰرُهُمْ يَخْرُجُونَ مِنَ ٱلْأَجْدَاثِ كَأَنَّهُمْ جَرَادٌ مُّنتَشِرٌ ٧

7. వారి చూపులు క్రిందికి వాలి ఉంటాయి, వారు చెల్లాచెదురైన మిడతలవలే, తమ గోరీలనుండి లేచి బయటికి వస్తారు;

مُّهْطِعِينَ إِلَى ٱلدَّاعِۖ يَقُولُ ٱلْكَٰفِرُونَ هَٰذَا يَوْمٌ عَسِرٌ ٨

8. వేగంగా, పిలిచేవాని వైపునకు! సత్యతిరస్కారులు: "ఇది చాలా కఠినమైన రోజు." అని అంటారు. (3/8)

۞ كَذَّبَتْ قَبْلَهُمْ قَوْمُ نُوحٍ فَكَذَّبُوا۟ عَبْدَنَا وَقَالُوا۟ مَجْنُونٌ وَٱزْدُجِرَ ٩

9.* వారికి పూర్వం నూ'హ్[1] జాతివారు (తమ ప్రవక్తలను) అసత్యవాదులని తిరస్కరించి ఉన్నారు, అప్పుడు వారు మా దాసుణ్ణి: "అసత్యవాది!" అని అన్నారు. మరియు: "ఇతడు పిచ్చివాడు." అని అన్నారు. మరియు అతను కసిరికొట్టబడ్డాడు.

فَدَعَا رَبَّهُۥٓ أَنِّى مَغْلُوبٌ فَٱنتَصِرْ ١٠

10. అప్పుడతను తన ప్రభువును ఇలా ప్రార్థించాడు: "నిశ్చయంగా నేను ఓడిపోయాను కావున నాకు సహాయం చేయి!"

فَفَتَحْنَآ أَبْوَٰبَ ٱلسَّمَآءِ بِمَآءٍ مُّنْهَمِرٍ ١١

11. అప్పుడు మేము ఆకాశపు ద్వారాలు తెరిచి కుంభవర్షాన్ని కురిపించాము.

1. నూ'హ్ గాథ కోసం చూడండి, 11:25-48 మరియు 26:116.

وَفَجَّرۡنَا ٱلۡأَرۡضَ عُيُونٗا فَٱلۡتَقَى ٱلۡمَآءُ عَلَىٰٓ أَمۡرٖ قَدۡ قُدِرَ ﴿١٢﴾

**12**. మరియు భూమినుండి ఊటలను పొంగింపజేశాము అపుడు నిర్ణీత కార్యానికి గాను నీళ్ళన్నీ కలిసిపోయాయి.

وَحَمَلۡنَٰهُ عَلَىٰ ذَاتِ أَلۡوَٰحٖ وَدُسُرٖ ﴿١٣﴾

**13**. మరియు మేము అతనిని (నూ'హ్‌ను) పలకలు మరియు మేకులు గల దాని(ఓడ)పై ఎక్కించాము.

تَجۡرِي بِأَعۡيُنِنَا جَزَآءٗ لِّمَن كَانَ كُفِرَ ﴿١٤﴾

**14**. అది మా కన్నుల ముందు తేలియాడుతూ పోయింది. (తన జాతి వారి చేత) తిరస్కరింపబడిన వానికి ప్రతిఫలంగా!

وَلَقَد تَّرَكۡنَٰهَآ ءَايَةٗ فَهَلۡ مِن مُّدَّكِرٖ ﴿١٥﴾

**15**. మరియు వాస్తవానికి మేము దానిని (ఆ ఓడను) ఒక సూచనగా చేసి వదలిపెట్టాము. అయితే, హితబోధ స్వీకరించే వాడు ఎవడైనా ఉన్నాడా?[1]

فَكَيۡفَ كَانَ عَذَابِي وَنُذُرِ ﴿١٦﴾

**16**. చూశారా! నా శిక్ష మరియు నా హెచ్చరికలు ఎలా ఉండేవో!

وَلَقَدۡ يَسَّرۡنَا ٱلۡقُرۡءَانَ لِلذِّكۡرِ فَهَلۡ مِن مُّدَّكِرٖ ﴿١٧﴾

**17**. మరియు వాస్తవానికి మేము ఈ ఖుర్ఆన్‌ను హితబోధ గ్రహించటం కోసం సులభం చేశాము. అయితే హితబోధను స్వీకరించేవాడు ఎవడైనా ఉన్నాడా?

كَذَّبَتۡ عَادٞ فَكَيۡفَ كَانَ عَذَابِي وَنُذُرِ ﴿١٨﴾

**18**. ఆద్‌జాతి సత్యాన్ని తిరస్కరించింది. చూశారా! నా శిక్ష మరియు నా హెచ్చరికలు ఎలా ఉండేవో!

إِنَّآ أَرۡسَلۡنَا عَلَيۡهِمۡ رِيحٗا صَرۡصَرٗا فِي يَوۡمِ نَحۡسٖ مُّسۡتَمِرّٖ ﴿١٩﴾

**19**. నిశ్చయంగా, మేము పూర్తిగా దురదృష్ట(అరిష్టదాయక)మైన ఒక రోజున, తీవ్రమైన ఎడతెగని తుఫానుగాలిని పంపాము.[2]

---

**1**. ముద్దకిర్: ఈ పదం అసలు రూపం, 'మజ్'తకిర్.' అంటే హితబోధ స్వీకరించేవాడని అర్థం, (ఫ'త్హ్ అల్-ఖదీర్). చూడండి, 36:41-42.

**2**. ఆ 'తుఫాను గాలి ఏడు రాత్రులు మరియు ఎనిమిది పగళ్ళు ఎడతెగకుండా వీచింది. ఆ విధంగా ఆ దినాలు, ఆ సత్యతిరస్కారులకు అశుభకరంగా పరిణమించాయి. అంతేగాని విశ్వాసులకు ఏ దినమూ అశుభం కాదు. ఏ దినాన్ని గూడా ఈ ప్రత్యేక దినం అశుభమైనదని అనటం తప్పు. వారంలోని ఏడుదినాలూ మంచివే.

تَنزِعُ ٱلنَّاسَ كَأَنَّهُمۡ أَعۡجَازُ نَخۡلٖ مُّنقَعِرٖ ﴿٢٠﴾

**20**. అది ప్రజలను, వేళ్ళతో పెళ్ళగింపబడిన ఖర్జూరపు చెట్లవలె పెళ్ళగించి వేసింది.[1]

فَكَيۡفَ كَانَ عَذَابِي وَنُذُرِ ﴿٢١﴾

**21**. ఇక చూశారా! నా శిక్ష మరియు నాహెచ్చరికలు ఎలా ఉండేవో!

وَلَقَدۡ يَسَّرۡنَا ٱلۡقُرۡءَانَ لِلذِّكۡرِ فَهَلۡ مِن مُّدَّكِرٖ ﴿٢٢﴾

**22**. మరియు వాస్తవానికి మేము ఈ ఖుర్ఆన్‌ను హితబోధ గ్రహించటం కోసం సులభం చేశాము, అయితే హితబోధను స్వీకరించేవాడు ఎవడైనా ఉన్నాడా?

كَذَّبَتۡ ثَمُودُ بِٱلنُّذُرِ ﴿٢٣﴾

**23**. స'మూద్ జాతి హెచ్చరికలను అసత్యాలని తిరస్కరించింది.

فَقَالُوٓاْ أَبَشَرٗا مِّنَّا وَٰحِدٗا نَّتَّبِعُهُۥٓ إِنَّآ إِذٗا لَّفِي ضَلَٰلٖ وَسُعُرٍ ﴿٢٤﴾

**24**. అప్పుడు వారు ఇలా అన్నారు: "ఏమీ? మాలోని ఒకవ్యక్తిని, ఒంటరి వాడిని, మేము అనుసరించాలా? అలా అయితే నిశ్చయంగా, మేము మార్గభ్రష్టులం మరియు పిచ్చివారం అయినట్లే కదా?"

أَءُلۡقِيَ ٱلذِّكۡرُ عَلَيۡهِ مِنۢ بَيۡنِنَا بَلۡ هُوَ كَذَّابٌ أَشِرٞ ﴿٢٥﴾

**25**. "ఏమీ? మా అందరిలో, కేవలం అతని మీదనే (దివ్య) సందేశం పంపబడిందా? అలాకాదు! అసలు అతను అసత్యవాది, డంబాలు పలికేవాడు!"

سَيَعۡلَمُونَ غَدٗا مَّنِ ٱلۡكَذَّابُ ٱلۡأَشِرُ ﴿٢٦﴾

**26**. అసత్యవాది, డంబాలు పలికే వాడు! ఎవడో రేపే (త్వరలోనే) వారికి తెలిసిపోతుంది!

إِنَّا مُرۡسِلُواْ ٱلنَّاقَةِ فِتۡنَةٗ لَّهُمۡ فَٱرۡتَقِبۡهُمۡ وَٱصۡطَبِرۡ ﴿٢٧﴾

**27**. నిశ్చయంగా, మేము ఆడ ఒంటెను, వారిని పరీక్షించటం కోసం పంపుతున్నాము, కావున (ఓ 'సాలి'హ్!) వారి విషయంలో వేచిఉండు మరియు సహనంవహించు!

---

1. చూడండి, 69:6-8.

**28**. మరియు వారి మధ్య నీరు (న్యాయంగా) పంచబడాలని వారికి బోధించు. ప్రతిఒక్కరూ తమవంతు వచ్చే రోజునే త్రాగాలని నియమించబడింది.[1]

وَنَبِّئۡهُمۡ أَنَّ ٱلۡمَآءَ قِسۡمَةُۢ بَيۡنَهُمۡۖ كُلُّ شِرۡبٖ مُّحۡتَضَرٞ ٢٨

**29**. ఆ పిదప వారు తమ సహచరుణ్ణి పిలిచారు. వాడు దాన్ని పట్టుకొని (దాని వెనుకకాలి మోకాలినరాలు కోసి) చంపాడు.[2]

فَنَادَوۡاْ صَاحِبَهُمۡ فَتَعَاطَىٰ فَعَقَرَ ٢٩

**30**. అప్పుడు చూశారా! నా శిక్ష మరియు నా హెచ్చరికలు ఎలా ఉండేవో!

فَكَيۡفَ كَانَ عَذَابِي وَنُذُرِ ٣٠

**31**. నిశ్చయంగా, మేము వారి మీదకు ఒక భయంకరమైన శబ్దాన్ని ('సయ్'హాను) పంపాము, దాంతో వారు త్రొక్కబడిన పశువుల దొడ్డి కంచెవలే నుగ్గునుగ్గు అయిపోయారు.

إِنَّآ أَرۡسَلۡنَا عَلَيۡهِمۡ صَيۡحَةٗ وَٰحِدَةٗ فَكَانُواْ كَهَشِيمِ ٱلۡمُحۡتَظِرِ ٣١

**32**. మరియు వాస్తవానికి, మేము ఈ ఖుర్ఆన్‌ను హితబోధ గ్రహించటానికి సులభం చేశాము, అయితే హితబోధ స్వీకరించేవాడు ఎవడైనా ఉన్నాడా?

وَلَقَدۡ يَسَّرۡنَا ٱلۡقُرۡءَانَ لِلذِّكۡرِ فَهَلۡ مِن مُّدَّكِرٖ ٣٢

**33**. లూ'త్ జాతి కూడా హెచ్చరికలను అసత్యాలని తిరస్కరించింది.

كَذَّبَتۡ قَوۡمُ لُوطِۭ بِٱلنُّذُرِ ٣٣

**34**. నిశ్చయంగా, మేము, లూ'త్ ఇంటివారు తప్ప! ఇతరుల మీదికి రాళ్ళువిసిరే 'తుఫాన్ గాలిని పంపాము. (లూ'త్ ఇంటి) వారిని మేము వేకువజామున రక్షించాము;[3]

إِنَّآ أَرۡسَلۡنَا عَلَيۡهِمۡ حَاصِبًا إِلَّآ ءَالَ لُوطٖۖ نَّجَّيۡنَٰهُم بِسَحَرٖ ٣٤

---

**1**. చూడండి, 26:155. ఒక రోజు ఒంటెను నీరు త్రాగనివ్వాలి, రెండవ రోజు ప్రజలు త్రాగాలి.

**2**. చూడండి, 7:77.

**3**. ఆల-లూ'తున్: అంటే అతనితో సహా అతని ఇద్దరు కూతుళ్ళు మరియు కొందరు అతని అనుచరులు. అతని భార్య సత్యతిరస్కారులలో చేరిపోయింది. ఈ గాథ వివరాల కోసం చూడండి, 11:69-83.

نِّعۡمَةٗ مِّنۡ عِندِنَاۚ كَذَٰلِكَ نَجۡزِي مَن شَكَرَ ﴿٣٥﴾

وَلَقَدۡ أَنذَرَهُم بَطۡشَتَنَا فَتَمَارَوۡاْ بِٱلنُّذُرِ ﴿٣٦﴾

وَلَقَدۡ رَٰوَدُوهُ عَن ضَيۡفِهِۦ فَطَمَسۡنَآ أَعۡيُنَهُمۡ فَذُوقُواْ عَذَابِي وَنُذُرِ ﴿٣٧﴾

وَلَقَدۡ صَبَّحَهُم بُكۡرَةً عَذَابٞ مُّسۡتَقِرّٞ ﴿٣٨﴾

فَذُوقُواْ عَذَابِي وَنُذُرِ ﴿٣٩﴾

وَلَقَدۡ يَسَّرۡنَا ٱلۡقُرۡءَانَ لِلذِّكۡرِ فَهَلۡ مِن مُّدَّكِرٖ ﴿٤٠﴾

وَلَقَدۡ جَآءَ ءَالَ فِرۡعَوۡنَ ٱلنُّذُرُ ﴿٤١﴾

كَذَّبُواْ بِـَٔايَٰتِنَا كُلِّهَا فَأَخَذۡنَٰهُمۡ أَخۡذَ عَزِيزٖ مُّقۡتَدِرٍ ﴿٤٢﴾

**35**. మా తరఫునుండి అనుగ్రహంగా. ఈ విధంగా మేము కృతజ్ఞులకు ప్రతిఫలం ఇస్తాము.

**36**. మరియు వాస్తవానికి (లూ'త్ తన జాతి) వారిని మా రాబోయే శిక్షను గురించి హెచ్చరించాడు. కాని వారు మా హెచ్చరికలను సందేహించి (మొండి) వాదనలకు దిగారు!

**37**. మరియు వాస్తవానికి వారు అతని అతిథులను[1] అతని నుండి బలవంతంగా లాక్కోవాలని అనుకున్నారు. కావున మేము వారి కళ్ళను పోగొట్టాము. (వారితో ఇలా అన్నాము): "ఇప్పుడు నా శిక్షను మరియు నా హెచ్చరికను చవి చూడండి."

**38**. మరియు వాస్తవానికి, ఉదయపు వేళ శాశ్వతమైన శిక్ష వారిమీద పడింది:

**39**. "ఇప్పుడు మీరు నా శిక్షను మరియు నా హెచ్చరికలను చవిచూడండి."

**40**. మరియు వాస్తవానికి మేము ఈ ఖుర్ఆన్‌ను హితబోధ గ్రహించడానికి సులభం చేశాము. అయితే, హితబోధ స్వీకరించే వాడు ఎవడైనా ఉన్నాడా?

**41**. మరియు వాస్తవానికి ఫిర్'ఔన్ జాతి వారికి కూడా హెచ్చరికలు వచ్చాయి.

**42**. వారు మా సూచనలను అన్నిటినీ అబద్ధాలని తిరస్కరించారు, కావున మేము వారిని పట్టుకున్నాము, సర్వశక్తిమంతుడు సర్వసమర్థుడు పట్టుకునే విధంగా!

---

**1**. వారు జిబ్రీల్, మీకాయీ'ల్ మరియు ఇస్రాఫీల్('అలైహిమ్.స.)లు. చూడండి, 11:77-79.

أَكُفَّارُكُمْ خَيْرٌ مِّنْ أُوْلَٰٓئِكُمْ أَمْ لَكُم بَرَآءَةٌ فِى ٱلزُّبُرِ ﴿٤٣﴾

**43**. (ఓ ఖురేషులారా!) ఏమీ? మీ సత్యతిరస్కారులు మీకు పూర్వం గడిచిన వారికంటే శ్రేష్ఠులా? లేక దివ్య గ్రంథాలలో మీ కొరకు (మా శిక్ష నుండి) ఏదైనా మినహాయింపు వ్రాయబడి ఉందా?

أَمْ يَقُولُونَ نَحْنُ جَمِيعٌ مُّنتَصِرٌ ﴿٤٤﴾

**44**. లేక వారు: "మాది ఒక శక్తిగల వర్గం, (కావున) మేము ప్రాబల్యం పొందగలం" అని అంటున్నారా?

سَيُهْزَمُ ٱلْجَمْعُ وَيُوَلُّونَ ٱلدُّبُرَ ﴿٤٥﴾

**45**. కాని త్వరలోనే ఈ శక్తిగల వర్గం పరాజయం పొందగలదు. మరియు వారు వెన్నుచూపి పారిపోతారు.[1]

بَلِ ٱلسَّاعَةُ مَوْعِدُهُمْ وَٱلسَّاعَةُ أَدْهَىٰ وَأَمَرُّ ﴿٤٦﴾

**46**. అంతేకాదు! అంతిమ ఘడియయే, వారి వాగ్దాన సమయం మరియు ఆ ఘడియ ఎంతో దారుణమైనది మరియు ఎంతో తీవ్రమైనదీను (చేదైనదీను).

إِنَّ ٱلْمُجْرِمِينَ فِى ضَلَٰلٍ وَسُعُرٍ ﴿٤٧﴾

**47**. నిశ్చయంగా, పాపాత్ములు మార్గ భ్రష్టత్వంలో ఉన్నారు మరియు వారు (పరలోకంలో) నరకాగ్నిలో కాలుతారు.

يَوْمَ يُسْحَبُونَ فِى ٱلنَّارِ عَلَىٰ وُجُوهِهِمْ ذُوقُوا۟ مَسَّ سَقَرَ ﴿٤٨﴾

**48**. ఆ రోజు వారు తమ ముఖాల మీద నరకాగ్నిలోకి ఈడ్చబడతారు; (వారితో): "నరకాగ్ని స్పర్శను చవిచూడండి!" అని అనబడుతుంది.[2]

إِنَّا كُلَّ شَىْءٍ خَلَقْنَٰهُ بِقَدَرٍ ﴿٤٩﴾

**49**. నిశ్చయంగా, మేము ప్రతి దానిని ఒక విధివ్రాత(ఖద్ర్)తో సృష్టించాము.[3]

---

**1**. దైవప్రవక్త ('స'అస) ఈ ఆయత్‌ను బద్ర్ యుద్ధ ఆరంభంలో చదివారు.

**2**. చూడండి, 33:66 మరియు 25:34.

**3**. అహ్లెసున్నత్ వల్-జమా'అత్ విద్వాంసులు ఈ ఆయత్ మరియు ఇటువంటి ఆయత్‌ల ఆధారంగా అంటారు. అల్లాహ్(సు.తా.)కు మానవులను సృష్టించకముందే వారికి సంబంధించిన అన్ని విషయాల జ్ఞానముంది, కావున ఆయన అందరి 'ఖద్ర్,' Destiny, విధి, అంటే విధివ్రాత, నియమం, లేక అదృష్టం ముందే వ్రాసిపెట్టాడు. (ఇబ్నె-కసీ'ర్).

**50**. మరియు మా ఆజ్ఞ కేవలం ఒక్కటే చాలు, కనురెప్పపాటుది, (అది అయిపోతుంది).[1]

وَمَآ أَمۡرُنَآ إِلَّا وَٰحِدَةٌ كَلَمۡحِۭ بِٱلۡبَصَرِ ۝٥٠

**51**. మరియు వాస్తవానికి, మేము మీవంటి వారిని, ఎందరినో నాశనం చేశాము. అయితే, హితబోధ స్వీకరించే వాడు ఎవడైనా ఉన్నాడా?

وَلَقَدۡ أَهۡلَكۡنَآ أَشۡيَاعَكُمۡ فَهَلۡ مِن مُّدَّكِرٖ ۝٥١

**52**. మరియు వారు చేసిన ప్రతి విషయం వారి కర్మగ్రంథాలలో (చిట్టాలలో) వ్రాయబడి ఉంది.[2]

وَكُلُّ شَيۡءٖ فَعَلُوهُ فِي ٱلزُّبُرِ ۝٥٢

**53**. మరియు ప్రతి చిన్న మరియు ప్రతి పెద్ద విషయం అన్నీ వ్రాయబడి ఉన్నాయి.[3]

وَكُلُّ صَغِيرٖ وَكَبِيرٖ مُّسۡتَطَرٌ ۝٥٣

**54**. నిశ్చయంగా, దైవభీతి గలవారు స్వర్గవనాలలో సెలయేళ్ళ దగ్గర ఉంటారు.

إِنَّ ٱلۡمُتَّقِينَ فِي جَنَّٰتٖ وَنَهَرٖ ۝٥٤

**55**. సత్యపీఠం మీద,[4] విశ్వసామ్రాట్టు,[5] సర్వసమర్థుని సన్నిధిలో. (1/2)

فِي مَقۡعَدِ صِدۡقٍ عِندَ مَلِيكٖ مُّقۡتَدِرِۭ ۝٥٥

*****

---

**1**. అల్లాహ్ (సు.తా.) ఏదైనా చేయాలనుకుంటే, దానిని: 'అయిపో!' అని అంటాడు. అంతే అది అయిపోతుంది. చూడండి, 2:117, 3:47, 59, 6:73, 16:40, 19:35, 36:82, 40:68.

**2**. లేక లౌ'హె-మ'హ్ఫూ''జ్‌లో వ్రాయబడి ఉంది.

**3**. అంటే మానవుల కర్మలూ, మాటలూ అన్నీ వ్రాయబడి ఉన్నాయి చిన్నవి గానీ పెద్దవి గానీ, మంచివి గానీ చెడ్డవి గానీ!

**4**. మఖ్'అది 'సిద్‌ఖిన్: గౌరవప్రదమైన స్థానంలో - అంటే స్వర్గం.

**5**. చూడండి, 20:114 వ్యాఖ్యానం 3.

## 55. సూరహ్ అర్-ర'హ్మాన్ سُورَةُ الرَّحْمَنِ

అర్-ర'హ్మాన్: **అనంతకరుణామయుడు**. చాలా మంది వ్యాఖ్యాతలు ఈ సూరహ్ **మదీనాలో** అవతరింపజేయబడిందని అంటారు. ఈ సూరహ్‌లో **78 ఆయతులు** ఉన్నాయి. ఈ సముదాయంలో ఇది 6వది. దీనిపేరు **మొదటి ఆయత్**‌లోనే ఉంది. ఇది పునరుత్థానదినం గురించి వివరిస్తోంది. దైవప్రవక్త('స'అస) ప్రవచనం: ''ఏమీ? మీరు మౌనం వహిస్తున్నారా? మీ కంటే జిన్నాతులు మేలు! రాత్రి నేను ఈ సూరహ్‌ను జిన్నాతులకు వినిపించినప్పుడు నేను: 'ఫబి అయ్యి ఆలాయి' రబ్బికుమా తుకజ్జి'బాన్.' చదివినప్పుడల్లా జిన్నాతులు దానికి జవాబుగా: 'ఓ మా ప్రభూ! మేము నీ యొక్క ఏ అనుగ్రహాలను కూడా నిరాకరించడం లేదు! సర్వస్తోత్రాలకు అర్హుడవు నీవు మాత్రమే!' అని అన్నారు.'' (తిర్మిజీ', అల్బానీ).

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

C B A

**1.** * **అనంత కరుణామయుడు** (అల్లాహ్)!

ٱلرَّحْمَٰنُ ﴿١﴾

**2.** ఆయనే ఈ ఖుర్ఆన్‌ను నేర్పాడు.[1]

عَلَّمَ ٱلْقُرْءَانَ ﴿٢﴾

**3.** ఆయనే మానవుణ్ణి సృష్టించాడు.

خَلَقَ ٱلْإِنسَٰنَ ﴿٣﴾

**4.** ఆయనే అతనికి మాట్లాడటం నేర్పాడు.

عَلَّمَهُ ٱلْبَيَانَ ﴿٤﴾

**5.** సూర్యుడు మరియు చంద్రుడు ఒక నియమిత గమనాన్ని (నియమిత పరిధిలో) అనుసరిస్తున్నారు.

ٱلشَّمْسُ وَٱلْقَمَرُ بِحُسْبَانٍ ﴿٥﴾

**6.** మరియు నక్షత్రాలు మరియు వృక్షాలు అన్నీ ఆయనకు సాష్టాంగం (సజ్దా) చేస్తూ ఉంటాయి.[2]

وَٱلنَّجْمُ وَٱلشَّجَرُ يَسْجُدَانِ ﴿٦﴾

---

**1.** ఇది మక్కా ముష్రికులకు ఇవ్వబడిన జవాబు. ఎందుకంటే వారు, దైవప్రవక్త(సఅస) మీద, ఈ ఖుర్ఆన్‌ను అతనికి ఒక మానవుడు నేర్పాడు అనే అపనింద మోపారు. కాని వాస్తవానికి అల్లాహ్(సు.తా.) దీనిని తన సందేశహరునికి నేర్పాడు మరియు అతను తమ అనుచరులకు (ర'ది.'అన్హుమ్) నేర్పారు, (ఫ'త్హ్ అల్-ఖదీర్).

**2.** చూడండి, 22:18.

وَٱلسَّمَآءَ رَفَعَهَا وَوَضَعَ ٱلۡمِيزَانَ ٧

7. మరియు ఆయనే ఖగోళాన్ని పైకెత్తి ఉంచాడు మరియు ఆయనే త్రాసును నెలకొల్పాడు.[1]

أَلَّا تَطۡغَوۡاْ فِي ٱلۡمِيزَانِ ٨

8. తద్వారా మీరు తూకంలో మోసానికి పాల్పడకూడదని![2]

وَأَقِيمُواْ ٱلۡوَزۡنَ بِٱلۡقِسۡطِ وَلَا تُخۡسِرُواْ ٱلۡمِيزَانَ ٩

9. మరియు న్యాయంగా తూకం చేయండి మరియు తూకంలో తగ్గించకండి.

وَٱلۡأَرۡضَ وَضَعَهَا لِلۡأَنَامِ ١٠

10. మరియు ఆయన, భూమిని సకల జీవరాసుల కొరకు ఉంచాడు.

فِيهَا فَٰكِهَةٞ وَٱلنَّخۡلُ ذَاتُ ٱلۡأَكۡمَامِ ١١

11. అందులో రకరకాల ఫలాలు మరియు పొరలలో (పుష్పకోశాలలో) ఉండే ఖర్జూరపండ్లు ఉన్నాయి.

وَٱلۡحَبُّ ذُو ٱلۡعَصۡفِ وَٱلرَّيۡحَانُ ١٢

12. మరియు దంట్లపై (పొరలలో చుట్టబడి)[3] ఉన్న ధాన్యం మరియు సుగంధ పుష్పాలు కూడా!

فَبِأَيِّ ءَالَآءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ١٣

13. అయితే మీరిరువురు (మానవులు మరియు జిన్నాతులు) మీ ప్రభువు యొక్క ఏ యే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

خَلَقَ ٱلۡإِنسَٰنَ مِن صَلۡصَٰلٖ كَٱلۡفَخَّارِ ١٤

14. ఆయన మానవుణ్ణి పెంకులాంటి శబ్దమిచ్చే మట్టితో [4] సృష్టించాడు.

وَخَلَقَ ٱلۡجَآنَّ مِن مَّارِجٖ مِّن نَّارٖ ١٥

15. మరియు జిన్నాతులను అగ్ని జ్వాలలతో సృష్టించాడు.[5]

---

1. అంటే ప్రపంచంలో న్యాయాన్ని నెలకొల్పాడు. చూడండి, 57:25, 42:17.
2. అంటే న్యాయానికి విరుద్ధంగా పోకండి, న్యాయాన్ని భంగపరచకండి.
3. అల్-'అస్ఫ్: అంటే ఎండిన గడ్డి, గడ్డి పరక, పొట్టు, ఊక, పొర, ధాన్యపు దంట్లు ఎండిపోయిన తరువాత 'అస్ఫ్‌గా మారిపోతాయి. దానిని పశువులు తింటాయి.
4. 'సల్-'సాలిన్: అంటే ఎండిన మట్టి. ఫ'ఖ్ఖారున్: అంటే మంటలో కాలిన మట్టి ఇంకా చూడండి, 15:26.
5. చూడండి, 15:27, 6:100 మరియు 37:158.

فَبِأَيِّ ءَالَآءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿١٦﴾

**16**. అయితే మీరిద్దరు మీ ప్రభువుయొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

رَبُّ ٱلْمَشْرِقَيْنِ وَرَبُّ ٱلْمَغْرِبَيْنِ ﴿١٧﴾

**17**. ఆయనే రెండు తూర్పు (దిక్కు)లకు మరియు రెండు పడమర (దిక్కు)లకు ప్రభువు.[1]

فَبِأَيِّ ءَالَآءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿١٨﴾

**18**. అయితే మీరిరువురు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

مَرَجَ ٱلْبَحْرَيْنِ يَلْتَقِيَانِ ﴿١٩﴾

**19**. ఆయనే రెండు సముద్రాలను కలుసుకోవటానికి వదలిపెట్టాడు.

بَيْنَهُمَا بَرْزَخٌ لَّا يَبْغِيَانِ ﴿٢٠﴾

**20**. ఆ రెండింటి మధ్య, అవి అతిక్రమించలేని అడ్డుతెర వుంది.[2]

فَبِأَيِّ ءَالَآءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٢١﴾

**21**. అయితే మీరిరువురు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

يَخْرُجُ مِنْهُمَا ٱللُّؤْلُؤُ وَٱلْمَرْجَانُ ﴿٢٢﴾

**22**. ఆ రెండింటి నుండి ముత్యాలు మరియు పగడాలు వస్తాయి.

فَبِأَيِّ ءَالَآءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٢٣﴾

**23**. అయితే మీరిరువురు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

وَلَهُ ٱلْجَوَارِ ٱلْمُنشَـَٔاتُ فِى ٱلْبَحْرِ كَٱلْأَعْلَـٰمِ ﴿٢٤﴾

**24**. మరియు ఎత్తైన కొండలవలే సముద్రంలో పయనించే ఓడలు ఆయనకు చెందినవే![3]

---

**1**. చూడండి, 37:5 మరియు 70:40.

**2**. ఈ విషయం ఎన్నో విధాలుగా బోధించబడింది: 1) భూమిపై మంచి నీళ్ళ నదులు, చెరువులు సరస్సులు మొదలైనవి మరియు ఉప్పునీటి సముద్రాలు, అన్నీ భూమి మీదనే ఉన్నా, వాటి రుచులు వేరువేరుగా ఉన్నాయి. 2) ఉప్పునీటి సముద్రాలలో మంచినీటి ప్రవాహాలు ప్రవహిస్తూ ఉంటాయి. కాని అవి కలిసిపోవు. వాటి రుచి, భిన్నంగానే ఉంటుంది. 3) మరికొన్ని చోట్లలో నదుల నీరు సముద్రంలో పోయి కలుస్తుంది. చాలా దూరం వరకు ఒకవైపు సముద్రపు నీళ్ళు ఉప్పుగానూ మరొక వైపు నది నీళ్ళు తియ్యగాను ఉంటాయి. ఇంకా చూడండి, 25:53.

**3**. చూడండి, 42:32-34.

فَبِأَيِّ ءَالَآءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٢٥﴾

**25**. అయితే మీరిరువురు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

كُلُّ مَنْ عَلَيْهَا فَانٍ ﴿٢٦﴾

**26**. దానిపై (భూమిపై) నున్నది ప్రతిదీ నశిస్తుంది.

وَيَبْقَىٰ وَجْهُ رَبِّكَ ذُو ٱلْجَلَٰلِ وَٱلْإِكْرَامِ ﴿٢٧﴾

**27**. మరియు మిగిలివుండేది, కేవలం మహిమాన్వితుడు[1] మరియు పరమదాత[2] అయిన నీప్రభువు ముఖం (ఉనికి) మాత్రమే![3]

فَبِأَيِّ ءَالَآءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٢٨﴾

**28**. అయితే మీరిరువురు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

يَسْـَٔلُهُۥ مَن فِى ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضِ ۚ كُلَّ يَوْمٍ هُوَ فِى شَأْنٍ ﴿٢٩﴾

**29**. భూమిలో మరియు ఆకాశాలలో నున్న ప్రతిదీ (తమ జీవనోపాధి కొరకు) ఆయననే యాచిస్తుంది. మరియు ప్రతిక్షణం (రోజు) ఆయన ఒక కార్యంలో నిమగ్నుడై ఉంటాడు.

فَبِأَيِّ ءَالَآءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٣٠﴾

**30**. అయితే మీరిరువురు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

سَنَفْرُغُ لَكُمْ أَيُّهَ ٱلثَّقَلَانِ ﴿٣١﴾

**31**. భారాలను మోసే మీరిద్దరు![4] త్వరలోనే మేము మీ విషయం నిర్ణయించగలము.

فَبِأَيِّ ءَالَآءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٣٢﴾

**32**. అయితే మీరిరువురు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

---

**1**. జు'ల్-జలాల్: Majesty, Possessor of Glory, Greatness, మహిమాన్వితుడు, ఘనత, వైభవం, విఖ్యాతి, ప్రతాపం గలవాడు, సార్వభౌముడు.

**2**. అల్-ఇక్రామ్: Most Generous, Bounteous, Noble, Honourable, పరమదాత, దాతృత్వుడు, ఆదరణీయుడు, మహోపకారి, ఉదారుడు, దివ్యుడు. చూడండి, 55:78. **జుల్-జలాలి వల్-ఇక్రామ్: మహిమాన్వితుడు** మరియు పరమదాత, Lord of Majesty and Generosity, ఇవి అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లు.

**3**. చూడండి, 28:88.

**4**. అస్-స'ఖలాన్: దీని మరొక తాత్పర్యం: 'భూమికి భారమైన మీరిద్దరు!' అని ఇవ్వబడింది. ఈపదం జిన్నాతులు మరియు మానవుల కోసం వాడబడింది.

يَٰمَعۡشَرَ ٱلۡجِنِّ وَٱلۡإِنسِ إِنِ ٱسۡتَطَعۡتُمۡ أَن تَنفُذُواْ مِنۡ أَقۡطَارِ ٱلسَّمَٰوَٰتِ وَٱلۡأَرۡضِ فَٱنفُذُواْۚ لَا تَنفُذُونَ إِلَّا بِسُلۡطَٰنٖ ﴿٣٣﴾

**33**. ఓ జిన్నాతుల మరియు మానవ జాతి వారలారా! ఒకవేళ మీరు ఆకాశాల మరియు భూమి యొక్క సరిహద్దుల నుండి బయటికి వెళ్ళిపోగలిగితే, వెళ్ళిపొండి! ఆయన (అల్లాహ్) యొక్క సెలవు లేనిదే మీరు వాటినుండి వెళ్ళిపోలేరు.[1]

فَبِأَيِّ ءَالَآءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٣٤﴾

**34**. అయితే మీరిరువురు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

يُرۡسَلُ عَلَيۡكُمَا شُوَاظٞ مِّن نَّارٖ وَنُحَاسٞ فَلَا تَنتَصِرَانِ ﴿٣٥﴾

**35**. మీ ఇద్దరిపైకి అగ్నిజ్వాలలు మరియు పొగ[2] పంపబడతాయి. అప్పుడు మీరు ఎదుర్కోలేరు (మిమ్మల్ని మీరు కాపాడుకోలేరు).

فَبِأَيِّ ءَالَآءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٣٦﴾

**36**. అయితే మీరిరువురు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

فَإِذَا ٱنشَقَّتِ ٱلسَّمَآءُ فَكَانَتۡ وَرۡدَةٗ كَٱلدِّهَانِ ﴿٣٧﴾

**37**. మరియు ఆకాశం ప్రేలిపోయినప్పుడు అది మండే నూనెగా ఎర్రగా మారిపోతుంది.[3]

فَبِأَيِّ ءَالَآءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٣٨﴾

**38**. అయితే మీరిరువురు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

فَيَوۡمَئِذٖ لَّا يُسۡـَٔلُ عَن ذَنۢبِهِۦٓ إِنسٞ وَلَا جَآنّٞ ﴿٣٩﴾

**39**. ఇక, ఆ రోజు ఏ మానవునితో గానీ, లేక, ఏ జిన్నాతునితో గానీ అతని పాపాలను గురించి అడగడం జరుగదు.[4]

فَبِأَيِّ ءَالَآءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٤٠﴾

**40**. అయితే మీరిరువురు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

---

**1**. అల్లాహ్(సు.తా.) యొక్క విధివ్రాత నుండి పారిపోగల శక్తి ఎవ్వరికీ లేదు. ఎక్కడికి పారిపోగలరు? అల్లహ్(సు.తా.) హద్దులలో లేని చోటు అనేదే లేదు!

**2**. నుహాసున్: దీని మరొక అర్థం కరిగిన రాగి లేక ఇత్తడి.

**3**. అద్దిహాను: దీని మరొక అర్థం ఎర్రని చర్మం (పచ్చిది లేదా శుభ్రం చేసింది).

**4**. చూడండి, 18:49 వారి, నాలుకలు చేతులు మరియు కాళ్ళు వారికి వ్యతిరేకంగా సాక్ష్యమిస్తాయి. ఇంకా చూడండి, 24:24.

يُعْرَفُ ٱلْمُجْرِمُونَ بِسِيمَٰهُمْ فَيُؤْخَذُ بِٱلنَّوَٰصِى وَٱلْأَقْدَامِ ﴿٤١﴾

**41**. ఈ నేరస్తులు వారి వారి ముఖ చిహ్నాలతోనే గుర్తింపబడతారు. అప్పుడు వారు, వారి ముంగురులు మరియు కాళ్ళు పట్టి లాగబడతారు.[1]

فَبِأَىِّ ءَالَآءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٤٢﴾

**42**. అయితే మీరిరువురు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

هَٰذِهِۦ جَهَنَّمُ ٱلَّتِى يُكَذِّبُ بِهَا ٱلْمُجْرِمُونَ ﴿٤٣﴾

**43**. ఈ నేరస్థులు అసత్యమని నిరాకరిస్తూ వుండిన నరకం ఇదే!

يَطُوفُونَ بَيْنَهَا وَبَيْنَ حَمِيمٍ ءَانٍ ﴿٤٤﴾

**44**. వారు దానిలో (ఆ నరకంలో) మరియు సలసల కాగే నీటి మధ్య అటూ ఇటూ తిరుగుతూ ఉంటారు.

فَبِأَىِّ ءَالَآءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٤٥﴾

**45**. అయితే మీరిరువురు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

وَلِمَنْ خَافَ مَقَامَ رَبِّهِۦ جَنَّتَانِ ﴿٤٦﴾

**46**. మరియు ఎవడైతే తన ప్రభువు సన్నిధిలో హాజరుకావలసి ఉంటుందనే భయం కలిగిఉంటాడో, అతనికి రెండు స్వర్గవనాలుంటాయి.

فَبِأَىِّ ءَالَآءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٤٧﴾

**47**. అయితే మీరిరువురు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

ذَوَاتَآ أَفْنَانٍ ﴿٤٨﴾

**48**. అవి రెండూ అనేక శాఖల (వృక్షాల)తో నిండి ఉంటాయి.[2]

فَبِأَىِّ ءَالَآءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٤٩﴾

**49**. అయితే మీరిరువురు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

فِيهِمَا عَيْنَانِ تَجْرِيَانِ ﴿٥٠﴾

**50**. ఆ రెండింటిలో రెండు సెలయేళ్ళు ప్రవహిస్తూ ఉంటాయి.[3]

---

**1**. చూడండి, 96:15-16.

**2**. చూడండి, 32:17 స్వర్గంలో ఉన్న భోగభాగ్యాలు ఎవ్వరూ ఊహించలేరు.

**3**. ఒక సెలయేరు పేరు తస్నీమ్, మరొక దానిపేరు సల్సబీల్.

**51**. అయితే మీరిరువురు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

فَبِأَيِّ ءَالَآءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٥١﴾

**52**. ఆ రెండింటిలో ప్రతి ఫలం జోడుగా (రెండు రకాలుగా) ఉంటుంది.

فِيهِمَا مِن كُلِّ فَٰكِهَةٍ زَوْجَانِ ﴿٥٢﴾

**53**. అయితే మీరిరువురు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

فَبِأَيِّ ءَالَآءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٥٣﴾

**54**. వారు జరీపని అస్తరుగల పట్టు తివాచీల మీద ఆనుకొని కూర్చొని ఉంటారు. మరియు ఆ రెండు స్వర్గవనాల ఫలాలు దగ్గరగా అందుబాటులో ఉంటాయి.[1]

مُتَّكِـِٔينَ عَلَىٰ فُرُشٍۭ بَطَآئِنُهَا مِنْ إِسْتَبْرَقٍ ۚ وَجَنَى ٱلْجَنَّتَيْنِ دَانٍ ﴿٥٤﴾

**55**. అయితే మీరిరువురు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

فَبِأَيِّ ءَالَآءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٥٥﴾

**56**. అందులో తమ దృష్టిని ఎల్లపుడూ క్రిందికివంచిఉంచే నిర్మల కన్యలుంటారు. వారిని ఇంతకు పూర్వం ఏ మానవుడు గానీ, ఏ జిన్నాతుగానీ తాకిఉండడు.[2]

فِيهِنَّ قَٰصِرَٰتُ ٱلطَّرْفِ لَمْ يَطْمِثْهُنَّ إِنسٌ قَبْلَهُمْ وَلَا جَآنٌّ ﴿٥٦﴾

**57**. అయితే మీరిరువురు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

فَبِأَيِّ ءَالَآءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٥٧﴾

**58**. వారు కెంపు(మాణిక్యా)లను మరియు పగడాలను పోలి ఉంటారు.

كَأَنَّهُنَّ ٱلْيَاقُوتُ وَٱلْمَرْجَانُ ﴿٥٨﴾

**59**. అయితే మీరిరువురు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

فَبِأَيِّ ءَالَآءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٥٩﴾

**60**. సత్కార్యానికి మంచి ప్రతిఫలం తప్ప మరేమైనా ఉంటుందా?

هَلْ جَزَآءُ ٱلْإِحْسَٰنِ إِلَّا ٱلْإِحْسَٰنُ ﴿٦٠﴾

**61**. అయితే మీరిరువురు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

فَبِأَيِّ ءَالَآءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٦١﴾

---

**1**. చూడండి, 18:31.
**2**. చూడండి, 56:35-36, 38:52.

وَمِن دُونِهِمَا جَنَّتَانِ ﴿٦٢﴾

62. మరియు ఆ రెండే కాక ఇంకా రెండు స్వర్గవనాలు ఉంటాయి.

فَبِأَيِّ ءَالَآءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٦٣﴾

63. అయితే మీరిరువురు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

مُدْهَآمَّتَانِ ﴿٦٤﴾

64. అవి దట్టంగా ముదురుపచ్చగా ఉంటాయి.

فَبِأَيِّ ءَالَآءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٦٥﴾

65. అయితే మీరిరువురు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

فِيهِمَا عَيْنَانِ نَضَّاخَتَانِ ﴿٦٦﴾

66. ఆ రెండు తోటలలో పొంగి ప్రవహించే రెండు చెలమలుంటాయి.

فَبِأَيِّ ءَالَآءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٦٧﴾

67. అయితే మీరిరువురు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

فِيهِمَا فَٰكِهَةٌ وَنَخْلٌ وَرُمَّانٌ ﴿٦٨﴾

68. ఆ రెండింటిలో ఫలాలు, ఖర్జూరాలు మరియు దానిమ్మలు ఉంటాయి.

فَبِأَيِّ ءَالَآءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٦٩﴾

69. అయితే మీరిరువురు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

فِيهِنَّ خَيْرَٰتٌ حِسَانٌ ﴿٧٠﴾

70. వాటిలో గుణవంతులు, సౌందర్య వతులైన స్త్రీలు ఉంటారు.

فَبِأَيِّ ءَالَآءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٧١﴾

71. అయితే మీరిరువురు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

حُورٌ مَّقْصُورَٰتٌ فِى ٱلْخِيَامِ ﴿٧٢﴾

72. నిర్మలమైన, శీలవతులైన స్త్రీలు ('హూర్) డేరాలలో ఉంటారు.[1]

فَبِأَيِّ ءَالَآءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٧٣﴾

73. అయితే మీరిరువురు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

لَمْ يَطْمِثْهُنَّ إِنسٌ قَبْلَهُمْ وَلَا جَآنٌّ ﴿٧٤﴾

74. ఆ స్త్రీలను ఇంతకుముందు ఏ మానవుడు కాని, ఏ జిన్నాతుకాని తాకి ఉండడు.

1. చూడండి, 55:56, 52:20, 44:54, 38:52 మరియు 37:48.

فَبِأَيِّ ءَالَآءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٧٥﴾

75. అయితే మీరిరువురు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?

مُتَّكِـِٔينَ عَلَىٰ رَفْرَفٍ خُضْرٍ وَعَبْقَرِيٍّ حِسَانٍ ﴿٧٦﴾

76. వారు అందమైన తివాచీల మీద ఆకుపచ్చని దిండ్లకు ఆనుకొని కూర్చొని ఉంటారు.

فَبِأَيِّ ءَالَآءِ رَبِّكُمَا تُكَذِّبَانِ ﴿٧٧﴾

77. అయితే మీరిరువురు మీ ప్రభువు యొక్క ఏయే అనుగ్రహాలను నిరాకరిస్తారు?[1]

تَبَٰرَكَ ٱسْمُ رَبِّكَ ذِى ٱلْجَلَٰلِ وَٱلْإِكْرَامِ ﴿٧٨﴾

78. మహిమాన్వితుడు మరియు పరమదాత[2] అయిన నీ ప్రభువు పేరే సర్వశ్రేష్ఠమైనది.[3] (5/8)

*****

1. ఈ ఆయత్, ఈ సూరహ్‌లో 31 సార్లు వచ్చింది. అల్లాహ్(సు.తా.) ఈ సూరహ్‌లో స్వర్గంలో ప్రసాదించబడే అన్ని రకాల సౌకర్యాలను, బోగభాగ్యాలను వివరించిన తరువాత ఈ ప్రశ్న వేశాడు. అంతే కాక నరక శిక్ష తరువాత కూడా ఈ ప్రశ్న వేశాడు. అంటే మీరు దాని నుండి ఎందుకు తప్పించుకోవటానికి ప్రయత్నించరు? అని అర్థం. రెండవది: ఏమిటంటే, జిన్నాతులు కూడా మానవులవలే బుద్ధి మరియు మంచి చెడును అర్థం చేసుకునే విచక్షణాశక్తి కలిగిఉన్నారు. కావున వారు కూడా ఏక దైవారాధన చేయటానికి ఆజ్ఞాపించబడ్డారు. సర్వసృష్టిలో కేవలం ఈ రెండురకాల జీవులు మాత్రమే - బుద్ధి మరియు విచక్షణాశక్తి ప్రసాదించబడటం వల్ల - పరీక్షకు గురిచేయబడ్డారు. అందులో నెగ్గిన వారికి స్వర్గం మరియు నెగ్గని వారికి నరకం. మూడవది: అల్లాహ్ (సు.తా.) ప్రసాదించిన సుఖసంతోషాలను అనుభవించటం ముస్త'హాబ్. ఈ ఆయత్ మళ్ళీ మళ్ళీ చెప్పే నాలుగవ ఉద్దేశ్యం: అల్లాహ్‌కు అవిధేయులై ఉండటం నుండి ఆపటం. ఎందుకంటే ఆయనే (సు.తా.) ఈ అనుగ్రహాలన్నింటినీ ప్రసాదించాడు. కావున దైవప్రవక్త('స'అస) దీనికి జవాబుగా అన్నారు: 'ఓ మా ప్రభూ! మేము నీ యొక్క ఏ అనుగ్రహాన్ని కూడా నిరాకరించడంలేదు, సర్వస్తోత్రాలకు అర్హుడవు నీవే!' (తిర్మిజీ' - అల్బానీ ప్రమాణీకం).

2. చూడండి, 55:27 వ్యాఖ్యానం 2.

3. *తబారక, బరకతున్:* అంటే ఎల్లప్పుడు శాశ్వతంగా ఉండే మేలు. ఆయన దగ్గర ఎల్లప్పుడు మేలే ఉంది. కొందరు దీని అర్థం, ఎంతో శుభదాయకమైనది, సర్వశ్రేష్ఠమైనది అని అన్నారు. ఆయన పేరే ఇంత శ్రేష్ఠమైనదైతే ఆయన స్వయంగా ఎంత గొప్పవాడు, మహిమగల వాడు మరియు శుభాలను ప్రసాదించేవాడు కాగలడు!

## 56. సూరహ్ అల్-వాఖి'అహ్

## سُورَةُ الوَاقِعَةِ

అల్-వాఖి'అహ్: రానున్న సంఘటన. ఇది సంపదల సూరహ్ అని ప్రఖ్యాతి చెందింది. "దీనిని ప్రతిరోజు రాత్రి చదివేవాడు ఎన్నడూ పస్తులుండడు." కాని ఈ ప్రవచనం, ప్రమాణీకమైనది కాదు. (అల్బానీ). దీని పేరు మొదటి ఆయత్‌లో ఉంది. ఈ సమూహంలో ఇది 7వది, చివరిది. ఈ సూరాహ్‌లన్నీ దివ్యజ్ఞానం మరియు పరలోక జీవితాన్ని గురించి చర్చించాయి. ఈ సూరహ్ మక్కా మొదటి కాలానికి చెందింది. పునరుత్థానం గురించి ఇందు వివరాలున్నాయి. ఇందులో **96 ఆయతులు** ఉన్నాయి.

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

C B A

**1.** * ఆ అనివార్య సంఘటన సంభవించినపుడు,[1]

إِذَا وَقَعَتِ ٱلْوَاقِعَةُ ۝١

**2.** అది సంభవించటంలో ఎలాంటి సందేహం (అసత్యం) లేదు.

لَيْسَ لِوَقْعَتِهَا كَاذِبَةٌ ۝٢

**3.** అది కొందరిని హీనపరుస్తుంది, మరికొందరిని పైకెత్తుతుంది.[2]

خَافِضَةٌ رَّافِعَةٌ ۝٣

**4.** భూమి తీవ్రకంపనంతో కంపించి నప్పుడు;

إِذَا رُجَّتِ ٱلْأَرْضُ رَجًّا ۝٤

**5.** మరియు పర్వతాలు పొడిగా మార్చబడినప్పుడు;

وَبُسَّتِ ٱلْجِبَالُ بَسًّا ۝٥

**6.** అప్పుడు వాటి దుమ్ము నలువైపులా నిండిపోయినపుడు;

فَكَانَتْ هَبَآءً مُّنۢبَثًّا ۝٦

**7.** మరియు మీరు మూడు వర్గాలుగా విభజింపబడతారు.

وَكُنتُمْ أَزْوَٰجًا ثَلَٰثَةً ۝٧

---

**1.** అనివార్య సంఘటన అంటే, అంతిమ ఘడియ, పునరుత్థాన దినం.

**2.** అల్లాహ్(సు.తా.) ఆజ్ఞలను అనుసరించిన వారు పైకెత్తబడతారు. వాటిని తిరస్కరించినవారు హీనపరచబడతారు.

فَأَصۡحَٰبُ ٱلۡمَيۡمَنَةِ مَآ أَصۡحَٰبُ ٱلۡمَيۡمَنَةِ ٨

**8**. ఇక కుడిపక్షం వారు, ఆ కుడిపక్షము వారు ఎంత (అదృష్టవంతులు)![1]

وَأَصۡحَٰبُ ٱلۡمَشۡـَٔمَةِ مَآ أَصۡحَٰبُ ٱلۡمَشۡـَٔمَةِ ٩

**9**. మరికొందరు వామపక్షం వారుంటారు,[2] ఆ వామపక్షపు వారు ఎంత (దౌర్భాగ్యులు)!

وَٱلسَّٰبِقُونَ ٱلسَّٰبِقُونَ ١٠

**10**. మరియు (ఇహలోకంలో విశ్వాసంలో) ముందున్న వారు (స్వర్గంలో కూడా) ముందుంటారు.

أُوْلَٰٓئِكَ ٱلۡمُقَرَّبُونَ ١١

**11**. అలాంటి వారు (అల్లాహ్) సాన్నిధ్యాన్ని పొందుతారు.

فِي جَنَّٰتِ ٱلنَّعِيمِ ١٢

**12**. వారు సర్వసుఖాలు గల స్వర్గవనాలలో ఉంటారు.

ثُلَّةٞ مِّنَ ٱلۡأَوَّلِينَ ١٣

**13**. మొదటి తరాలవారిలో నుండి చాలామంది;

وَقَلِيلٞ مِّنَ ٱلۡأٓخِرِينَ ١٤

**14**. మరియు తరువాత తరాలవారిలో నుండి కొంతమంది.

عَلَىٰ سُرُرٖ مَّوۡضُونَةٖ ١٥

**15**. (బంగారు) జలతారు అల్లిన ఆసనాల మీద;

مُّتَّكِـِٔينَ عَلَيۡهَا مُتَقَٰبِلِينَ ١٦

**16**. ఒకరికొకరు ఎదురెదురుగా, వాటి మీద దిండ్లకు ఆనుకొని కూర్చొని ఉంటారు.[3]

يَطُوفُ عَلَيۡهِمۡ وِلۡدَٰنٞ مُّخَلَّدُونَ ١٧

**17**. వారిచుట్టు ప్రక్కలలో చిరంజీవులైన (నిత్య బాల్యం) గల బాలురు (సేవకులు) తిరుగుతూ ఉంటారు.

---

**1**. కుడిపక్షం వారంటే తమ కర్మపత్రాలు కుడిచేతిలో ఇవ్వబడేవారు. అంటే స్వర్గానికి అర్హులైనవారు. చూడండి, 74:39.

**2**. వామ (ఎడమ) పక్షంవారు అంటే తమ కర్మపత్రాలు ఎడమచేతిలో ఇవ్వబడిన వారు. అంటే నరకానికి అర్హులైనవారు. చూడండి, 90:19.

**3**. చూడండి, 15:47.

بِأَكْوَابٍ وَأَبَارِيقَ وَكَأْسٍ مِّن مَّعِينٍ ﴿١٨﴾

**18**. (మధువు) ప్రవహించే చెలమల నుండి నింపిన పాత్రలు, గిన్నెలు మరియు కప్పులతో!

لَّا يُصَدَّعُونَ عَنْهَا وَلَا يُنزِفُونَ ﴿١٩﴾

**19**. దాని వలన వారికి తలనొప్పి గానీ లేక మత్తు గానీ కలుగదు.

وَفَٰكِهَةٍ مِّمَّا يَتَخَيَّرُونَ ﴿٢٠﴾

**20**. మరియు వారు కోరే పండ్లూ, ఫలాలు ఉంటాయి.

وَلَحْمِ طَيْرٍ مِّمَّا يَشْتَهُونَ ﴿٢١﴾

**21**. మరియు వారు ఇష్టపడే పక్షుల మాంసం.[1]

وَحُورٌ عِينٌ ﴿٢٢﴾

**22**. మరియు అందమైన కన్నులు గల సుందరాంగులు ('హూర్);

كَأَمْثَٰلِ ٱللُّؤْلُوِ ٱلْمَكْنُونِ ﴿٢٣﴾

**23**. దాచబడిన ముత్యాలవలే!

جَزَآءًۢ بِمَا كَانُوا۟ يَعْمَلُونَ ﴿٢٤﴾

**24**. ఇదంతా వారు చేస్తూ ఉండిన వాటికి (సత్కార్యాలకు) ప్రతిఫలంగా!

لَا يَسْمَعُونَ فِيهَا لَغْوًا وَلَا تَأْثِيمًا ﴿٢٥﴾

**25**. అందులో వారు వ్యర్థమైన మాటలు గానీ, పాప విషయాలు గానీ వినరు.[2]

إِلَّا قِيلًا سَلَٰمًا سَلَٰمًا ﴿٢٦﴾

**26**. "శాంతి (సలాం) శాంతి (సలాం)!" అనే మాటలు తప్ప![3]

وَأَصْحَٰبُ ٱلْيَمِينِ مَآ أَصْحَٰبُ ٱلْيَمِينِ ﴿٢٧﴾

**27**. మరియు కుడిపక్షం వారు, ఆ కుడిపక్షము వారు ఎంత (అదృష్టవంతులు)!

---

**1**. 'నేను నా సద్వర్తనులైన దాసుల కొరకు సిద్ధపరచి ఉంచినదాన్ని ఇంతవరకూ ఏ కన్నూ చూడలేదు, ఏ చెవీ వినలేదు మరియు ఏ మానవ హృదయం (మనస్సు) కూడా ఊహించలేదు.' (బు'ఖారీ, ముస్లిం, తిర్మిజీ' - అబూహురైరహ్ కథనం, ఇంకా చూడండి, 32:17).

**2**. ప్రాపంచిక జీవితంలో పోట్లాటలు, ఏవగింపులు, అసహ్యాలు స్వంత అన్నదమ్ముల మధ్య కూడా తప్పవు. కాని స్వర్గవాసుల మధ్య ఇటువంటి వ్యర్థపు మాటలు ఎన్నడూ జరుగవు.

**3**. చూడండి, 19:62.

**28**. వారు ముళ్ళు లేని సిద్ర వృక్షాల మధ్య![1]

فِي سِدۡرٖ مَّخۡضُودٖ ٢٨

**29**. మరియు పండ్లగెలలతో నిండిన అరటి చెట్లు,

وَطَلۡحٖ مَّنضُودٖ ٢٩

**30**. మరియు వ్యాపించి ఉన్న నీడలు,[2]

وَظِلّٖ مَّمۡدُودٖ ٣٠

**31**. మరియు ఎల్లప్పుడు ప్రవహించే నీరు,

وَمَآءٖ مَّسۡكُوبٖ ٣١

**32**. మరియు సమృద్ధిగా ఉన్న పండ్లు ఫలాలు,

وَفَٰكِهَةٖ كَثِيرَةٖ ٣٢

**33**. ఎడతెగ కుండా మరియు అంతం కాకుండా (ఉండే వనాలలో);

لَّا مَقۡطُوعَةٖ وَلَا مَمۡنُوعَةٖ ٣٣

**34**. మరియు ఎత్తైన ఆసనాల మీద (కూర్చొని ఉంటారు).[3]

وَفُرُشٖ مَّرۡفُوعَةٍ ٣٤

**35**. నిశ్చయంగా, మేము వారిని ప్రత్యేక సృష్టిగా సృష్టించాము;

إِنَّآ أَنشَأۡنَٰهُنَّ إِنشَآءٗ ٣٥

**36**. మరియు వారిని (నిర్మలమైన) కన్యలుగా చేశాము;[4]

فَجَعَلۡنَٰهُنَّ أَبۡكَارًا ٣٦

**37**. వారు ప్రేమించే వారుగానూ, సమ వయస్సుగల వారుగానూ (ఉంటారు);[5]

عُرُبًا أَتۡرَابٗا ٣٧

**38**. కుడి పక్షం వారి కొరకు.

لِّأَصۡحَٰبِ ٱلۡيَمِينِ ٣٨

**39**. అందులో చాలా మంది మొదటి తరాలకు చెందిన వారుంటారు;

ثُلَّةٞ مِّنَ ٱلۡأَوَّلِينَ ٣٩

---

**1**. చూడండి, 53:14.

**2**. చూడండి, 4:57.

**3**. కొందరు వ్యాఖ్యాతలు: 'ఫురుషిన్'- శబ్దానికి, భార్యలు అని అర్థమిచ్చారు. మరియు 'మర్ఫూ'అతిన్' అంటే మంచి, పెద్ద స్థానాలు గలవారు అని.

**4**. సద్వర్తనులైన స్త్రీలు చనిపోయినప్పుడు ఎంత వృద్ధులుగా ఉన్నా, పునరుత్థాన దినమున యవ్వన కన్యలుగా లేపబడతారు. వారు నిత్యం యవ్వన స్థితిలోనే ఉంటారు.

**5**. చూడండి, 38:52 మరియు 78:33.

وَثُلَّةٌ مِّنَ ٱلۡأٓخِرِينَ ﴿٤٠﴾

**40**. మరియు తరువాత తరాల వారిలో నుండి కూడా చాలా మంది ఉంటారు.

وَأَصۡحَٰبُ ٱلشِّمَالِ مَآ أَصۡحَٰبُ ٱلشِّمَالِ ﴿٤١﴾

**41**. ఇక వామ (ఎడమ) పక్షం వారు; ఆ వామ పక్షం వారు ఎంత (దౌర్భాగ్యులు)?

فِي سَمُومٖ وَحَمِيمٖ ﴿٤٢﴾

**42**. వారు దహించే నరకాగ్నిలో మరియు సలసల కాగే నీటిలో;

وَظِلّٖ مِّن يَحۡمُومٖ ﴿٤٣﴾

**43**. మరియు నల్లటి పొగ ఛాయలో (ఉంటారు).

لَّا بَارِدٖ وَلَا كَرِيمٍ ﴿٤٤﴾

**44**. అది చల్లగానూ ఉండదు మరియు ఓదార్చేదిగానూ ఉండదు;

إِنَّهُمۡ كَانُواْ قَبۡلَ ذَٰلِكَ مُتۡرَفِينَ ﴿٤٥﴾

**45**. నిశ్చయంగా వారు ఇంతకు ముందు చాలా భోగభాగ్యాలలో పడి ఉండేవారు;

وَكَانُواْ يُصِرُّونَ عَلَى ٱلۡحِنثِ ٱلۡعَظِيمِ ﴿٤٦﴾

**46**. మరియు వారు మూర్ఖపు పట్టుతో ఘోరమైన పాపాలలో పడి ఉండేవారు;

وَكَانُواْ يَقُولُونَ أَئِذَا مِتۡنَا وَكُنَّا تُرَابٗا وَعِظَٰمًا أَءِنَّا لَمَبۡعُوثُونَ ﴿٤٧﴾

**47**. మరియు వారు ఇలా అనేవారు: 'ఏమీ? మేము మరణించి, మట్టిగా మరియు ఎముకలుగా మారిపోయిన తరువాత కూడా మరల బ్రతికించి లేపబడతామా?

أَوَ ءَابَآؤُنَا ٱلۡأَوَّلُونَ ﴿٤٨﴾

**48**. "మరియు పూర్వీకులైన మా తాత ముత్తాతలు కూడానా?"

قُلۡ إِنَّ ٱلۡأَوَّلِينَ وَٱلۡأٓخِرِينَ ﴿٤٩﴾

**49**. వారితో ఇలా అను: "నిశ్చయంగా, పూర్వీకులు మరియు తరువాత వారు కూడాను!

لَمَجۡمُوعُونَ إِلَىٰ مِيقَٰتِ يَوۡمٖ مَّعۡلُومٖ ﴿٥٠﴾

**50**. "వారందరూ ఆ నిర్ణీతరోజు, ఆ సమయమున సమావేశపరచబడతారు.

ثُمَّ إِنَّكُمۡ أَيُّهَا ٱلضَّآلُّونَ ٱلۡمُكَذِّبُونَ ﴿٥١﴾

**51**. " ఇక నిశ్చయంగా మార్గభ్రష్టులైన ఓ అసత్యవాదులారా!

لَأَكِلُونَ مِن شَجَرٍ مِّن زَقُّومٍ ﴿٥٢﴾

**52**. "మీరు 'జఖ్ఖూమ్ చెట్టు (ఫలాల)ను తింటారు.[1]

فَمَالِـُٔونَ مِنْهَا ٱلْبُطُونَ ﴿٥٣﴾

**53**. "దానితో కడుపులు నింపుకుంటారు.

فَشَٰرِبُونَ عَلَيْهِ مِنَ ٱلْحَمِيمِ ﴿٥٤﴾

**54**. "తరువాత, దాని మీద సలసల కాగే నీరు త్రాగుతారు.

فَشَٰرِبُونَ شُرْبَ ٱلْهِيمِ ﴿٥٥﴾

**55**. "వాస్తవానికి మీరు దానిని దప్పిక గొన్న ఒంటెలవలే త్రాగుతారు."

هَٰذَا نُزُلُهُمْ يَوْمَ ٱلدِّينِ ﴿٥٦﴾

**56**. తీర్పుదినం నాడు (ఈ వామ పక్షం) వారికి లభించే ఆతిథ్యం ఇదే!

نَحْنُ خَلَقْنَٰكُمْ فَلَوْلَا تُصَدِّقُونَ ﴿٥٧﴾

**57**. మిమ్మల్ని మేమే సృష్టించాము; అయితే మీరెందుకు ఇది సత్యమని నమ్మరు?

أَفَرَءَيْتُم مَّا تُمْنُونَ ﴿٥٨﴾

**58**. ఏమీ? మీరెప్పుడైనా, మీరు విసర్జించే వీర్యబిందువును గమనించారా?

ءَأَنتُمْ تَخْلُقُونَهُۥٓ أَمْ نَحْنُ ٱلْخَٰلِقُونَ ﴿٥٩﴾

**59**. ఏమీ? మీరా, దానిని సృష్టించే వారు? లేక మేమా దాని సృష్టికర్తలము?

نَحْنُ قَدَّرْنَا بَيْنَكُمُ ٱلْمَوْتَ وَمَا نَحْنُ بِمَسْبُوقِينَ ﴿٦٠﴾

**60**. మేమే మీ కోసం మరణం నిర్ణయించాం మరియు మమ్మల్ని అధిగమించేది ఏదీ లేదు;

عَلَىٰٓ أَن نُّبَدِّلَ أَمْثَٰلَكُمْ وَنُنشِئَكُمْ فِى مَا لَا تَعْلَمُونَ ﴿٦١﴾

**61**. మీ రూపాలను మార్చివేసి మీరు ఎరుగని (ఇతర రూపంలో) మిమ్మల్ని సృష్టించటం నుండి.

وَلَقَدْ عَلِمْتُمُ ٱلنَّشْأَةَ ٱلْأُولَىٰ فَلَوْلَا تَذَكَّرُونَ ﴿٦٢﴾

**62**. మరియు వాస్తవానికి మీ మొదటి సృష్టిని గురించి మీరు తెలుసుకున్నారు, అయితే మీరెందుకు గుణపాఠం నేర్చుకోరు?

---

**1**. చూడండి, 38:52 మరియు 78:33.

**63**. మీరు నాటే, విత్తనాలను గురించి, మీరెప్పుడైనా ఆలోచించారా?

**64**. మీరా వాటిని పండించేది? లేక మేమా వాటిని పండించేవారము?

**65**. మేము తలచుకుంటే, దానిని పొట్టుగా మార్చివేయగలము, అప్పుడు మీరు ఆశ్చర్యంలో పడిపోతారు.

**66**. (మీరు అనే వారు): "నిశ్చయంగా, మేము పాడైపోయాము!

**67**. "కాదుకాదు, మేము దరిద్రుల మయ్యాము!" అని.

**68**. ఏమీ? మీరు ఎప్పుడైనా మీరు త్రాగే నీటిని గురించి ఆలోచించారా?

**69**. మీరా దానిని మేఘాల నుండి కురిపించే వారు? లేక మేమా దానిని కురిపించే వారము?

**70**. మేము తలచుకుంటే దానిని ఎంతో ఉప్పుగా ఉండేలా చేసేవారము! అయినా మీరెందుకు కృతజ్ఞత చూపరు?

**71**. మీరు రాజేసే అగ్నిని గమనించారా?

**72**. దాని వృక్షాన్ని పుట్టించినవారు మీరా? లేక దానిని ఉత్పత్తి చేసినది మేమా?[1]

**73**. మేము దానిని (నరకాగ్నిని), గుర్తు చేసేదిగా మరియు ప్రయాణీకులకు (అవసరం గలవారికి) ప్రయోజనకారిగా చేశాము.[2]

أَفَرَءَيْتُم مَّا تَحْرُثُونَ ﴿٦٣﴾

ءَأَنتُمْ تَزْرَعُونَهُۥٓ أَمْ نَحْنُ ٱلزَّٰرِعُونَ ﴿٦٤﴾

لَوْ نَشَآءُ لَجَعَلْنَٰهُ حُطَٰمًا فَظَلْتُمْ تَفَكَّهُونَ ﴿٦٥﴾

إِنَّا لَمُغْرَمُونَ ﴿٦٦﴾

بَلْ نَحْنُ مَحْرُومُونَ ﴿٦٧﴾

أَفَرَءَيْتُمُ ٱلْمَآءَ ٱلَّذِى تَشْرَبُونَ ﴿٦٨﴾

ءَأَنتُمْ أَنزَلْتُمُوهُ مِنَ ٱلْمُزْنِ أَمْ نَحْنُ ٱلْمُنزِلُونَ ﴿٦٩﴾

لَوْ نَشَآءُ جَعَلْنَٰهُ أُجَاجًا فَلَوْلَا تَشْكُرُونَ ﴿٧٠﴾

أَفَرَءَيْتُمُ ٱلنَّارَ ٱلَّتِى تُورُونَ ﴿٧١﴾

ءَأَنتُمْ أَنشَأْتُمْ شَجَرَتَهَآ أَمْ نَحْنُ ٱلْمُنشِـُٔونَ ﴿٧٢﴾

نَحْنُ جَعَلْنَٰهَا تَذْكِرَةً وَمَتَٰعًا لِّلْمُقْوِينَ ﴿٧٣﴾

---

**1**. అంటే అన్ని రకాల ఇంధనం, బొగ్గు, పెట్రోలు, మొదలైనవి చెట్ల నుంచే వస్తాయని.

**2**. 'హదీస్'లో మూడు వస్తువుల నుండి ఎవ్వరినీ ఆపకూడదని ఉంది: అవి నీరు, ఆహారం మరియు అగ్ని, (అబూ-దావూద్, సునన్ ఇబ్నె-మాజా - ఇబ్నె-కసీ'ర్ వ్యాఖ్యానం).

فَسَبِّحۡ بِٱسۡمِ رَبِّكَ ٱلۡعَظِيمِ ﴿٧٤﴾

74. కావున సర్వోత్తముడైన నీ ప్రభువు నామాన్ని స్తుతించు. (3/4)

۞ فَلَآ أُقۡسِمُ بِمَوَٰقِعِ ٱلنُّجُومِ ﴿٧٥﴾

75.* ఇక నేను నక్షత్రాల స్థానాల (కక్ష్యల) సాక్షిగా చెబుతున్నాను.

وَإِنَّهُۥ لَقَسَمٞ لَّوۡ تَعۡلَمُونَ عَظِيمٌ ﴿٧٦﴾

76. మరియు నిశ్చయంగా, మీరు గమనించగలిగితే, ఈ శపథం ఎంతో గొప్పది!

إِنَّهُۥ لَقُرۡءَانٞ كَرِيمٞ ﴿٧٧﴾

77. నిశ్చయంగా ఈ ఖుర్ఆన్ దివ్యమైనది.

فِي كِتَٰبٖ مَّكۡنُونٖ ﴿٧٨﴾

78. సురక్షితమైన[1] గ్రంథంలో ఉన్నది.

لَّا يَمَسُّهُۥٓ إِلَّا ٱلۡمُطَهَّرُونَ ﴿٧٩﴾

79. దానిని[2] పరిశుద్ధులు తప్ప మరెవ్వరూ తాకలేరు.

تَنزِيلٞ مِّن رَّبِّ ٱلۡعَٰلَمِينَ ﴿٨٠﴾

80. ఇది సర్వలోకాల ప్రభువు తరఫు నుండి అవతరింపజేయబడింది.

أَفَبِهَٰذَا ٱلۡحَدِيثِ أَنتُم مُّدۡهِنُونَ ﴿٨١﴾

81. ఏమీ? మీరు ఈ సందేశాన్ని[3] తేలికగా తీసుకుంటున్నారా?

وَتَجۡعَلُونَ رِزۡقَكُمۡ أَنَّكُمۡ تُكَذِّبُونَ ﴿٨٢﴾

82. మరియు (అల్లాహ్) మీకు ప్రసాదిస్తున్న జీవనోపాధికి (కృతజ్ఞతలు) చూపక, వాస్తవానికి ఆయనను మీరు తిరస్కరిస్తున్నారా?[4]

---

1. అంటే లౌ'హె మ'హ్ఫూ'జ్‌లో.
2. దానిని అంటే లౌ'హె మ'హ్ఫూ'జ్ మరియు పరిశుద్ధులు అంటే దైవదూతలు, అని కొందరి అభిప్రాయం. మరికొందరు దానిని - అంటే - ఖుర్ఆన్, అని అంటారు. దానిని ఆకాశంనుండి అవతరింపజేస్తున్న వారు కేవలం దైవదూతలే! సత్యతిరస్కారులు అపోహలు లేపినట్లు, షైతానులు కాదు. ఎందుకంటే వారు దానిని తాకలేరు. చూడండి, 85:21-22.
3. సందేశమంటే ఇక్కడ ఖుర్ఆన్ అని హదీస్‌లో పేర్కొనబడింది.
4. పైది ఇబ్నె-కసీ'ర్ తాత్పర్యం. ము'హమ్మద్ జూనాగఢీ గారి తాత్పర్యం ఈ విధంగా ఉంది: 'మరియు మీరు తిరస్కరిస్తూ ఉండటమే మీ జీవనోపాధిగా చేసుకుంటున్నారా?'

فَلَوْلَآ إِذَا بَلَغَتِ ٱلْحُلْقُومَ ﴿٨٣﴾

**83**. అయితే (చనిపోయే వాడి) ప్రాణం గొంతులోనికి వచ్చినపుడు, మీరెందుకు (ఆపలేరు)?

وَأَنتُمْ حِينَئِذٍ تَنظُرُونَ ﴿٨٤﴾

**84**. మరియు అప్పుడు మీరు (ఏమీ చేయలేక) చూస్తూ ఉండిపోతారు.

وَنَحْنُ أَقْرَبُ إِلَيْهِ مِنكُمْ وَلَٰكِن لَّا تُبْصِرُونَ ﴿٨٥﴾

**85**. మరియు అప్పుడు, మేము అతనికి మీ కంటే చాలా దగ్గరలో ఉంటాము, కాని మీరు చూడలేకపోతారు.[1]

فَلَوْلَآ إِن كُنتُمْ غَيْرَ مَدِينِينَ ﴿٨٦﴾

**86**. ఒకవేళ మీరు ఎవరి అదుపాజ్ఞలో (ఆధీనంలో) లేరనుకుంటే,

تَرْجِعُونَهَآ إِن كُنتُمْ صَٰدِقِينَ ﴿٨٧﴾

**87**. మీరు సత్యవంతులే అయితే దానిని (ఆ ప్రాణాన్ని) ఎందుకు తిరిగి రప్పించుకోలేరు?

فَأَمَّآ إِن كَانَ مِنَ ٱلْمُقَرَّبِينَ ﴿٨٨﴾

**88**. కాని అతడు (మరణించే వాడు), (అల్లాహ్) సాన్నిధ్యాన్ని పొందినవాడైతే![2]

فَرَوْحٌ وَرَيْحَانٌ وَجَنَّتُ نَعِيمٍ ﴿٨٩﴾

**89**. అతని కొరకు సుఖసంతోషాలు మరియు తృప్తి మరియు పరమానంద కరమైన స్వర్గవనం ఉంటాయి.

وَأَمَّآ إِن كَانَ مِنْ أَصْحَٰبِ ٱلْيَمِينِ ﴿٩٠﴾

**90**. మరియు ఎవడైతే కుడిపక్షం వారికి చెందిన వాడో![3]

فَسَلَٰمٌ لَّكَ مِنْ أَصْحَٰبِ ٱلْيَمِينِ ﴿٩١﴾

**91**. అతనితో: ''నీకు శాంతి కలుగుగాక (సలాం)! నీవు కుడిపక్షంవారిలో చేరావు.'' (అని అనబడుతుంది).

---

**1**. ఇక్కడ కొందరు అల్లాహ్(సు.తా.) తన జ్ఞానంతో మీ దగ్గరలో ఉన్నాడనీ, మరికొందరు ఇక్కడ దాని భావం ప్రాణం తీసే దైవదూతలనీ వ్యాఖ్యానించారు.

**2**. సూరహ్ మొదట్లో పేర్కొన్న మూడు రకాల వారిలో వీరు మొదటి రకానికి చెందినవారు.

**3**. వీరు రెండవ రకానికి చెందిన వారు.

وَأَمَّآ إِن كَانَ مِنَ ٱلْمُكَذِّبِينَ ٱلضَّآلِّينَ ﴿٩٢﴾

**92**. మరియు ఎవడైతే, అసత్యవాదులు, మార్గభ్రష్టులైన వారిలో చేరుతాడో![1]

فَنُزُلٌ مِّنْ حَمِيمٍ ﴿٩٣﴾

**93**. అతని ఆతిథ్యానికి సలసల కాగే నీరు ఉంటుంది.

وَتَصْلِيَةُ جَحِيمٍ ﴿٩٤﴾

**94**. మరియు భగభగమండే నరకాగ్ని ఉంటుంది.

إِنَّ هَٰذَا لَهُوَ حَقُّ ٱلْيَقِينِ ﴿٩٥﴾

**95**. నిశ్చయంగా, ఇది రూఢిఅయిన నమ్మదగిన సత్యం!

فَسَبِّحْ بِٱسْمِ رَبِّكَ ٱلْعَظِيمِ ﴿٩٦﴾

**96**. కావున సర్వోత్తముడైన నీ ప్రభువు పేరును స్తుతించు.[2]

*****

---

**1**. వీరు మూడవవరకానికి చెందినవారు. వీరు అస్'హాబ్ అల్ మష్అమ అని, ఈ సూరహ్ మొదట్లో పేర్కొనబడ్డారు.

**2**. 'హదీస్'లో వచ్చింది: రెండు పదాలు అల్లాహ్(సు.తా.)కు ఎంతో ప్రియమైనవి. ఉచ్చరించటానికి సులభమైనవి మరియు ప్రతిఫలం రీత్యా బరువైనవి. ''సుబ్'హా నల్లాహి వ బి'హమ్ది హీ, సుబ్'హానల్లాహిల్ 'అ''జీమ్!'' ('స'హీ'హ్ బు'ఖారీ, 'స'హీ'హ్ ముస్లిం).

## 57. సూరహ్ అల్-'హదీద్

## سُورَةُ الحَدِيدِ

ఈ సూరాహ్ 8వ హిజ్రీ ప్రాంతంలో **మదీనాలో** అవతరింపజేయబడింది. ఇందులో **29 ఆయతులు** ఉన్నాయి. అల్-'హదీదు అంటే **ఇనుము**. దీనిపేరు **25**వ ఆయత్‌నుండి తీసుకోబడింది. ఇంతవరకు దాదాపు 9/10వంతులు ఖుర్ఆన్ పూర్తి అయ్యింది. మిగిలిన 1/10 భాగాన్ని 2భాగాలలో విభజించవచ్చు. **మొదటి** దానిలో 10సూరాహ్‌లు ఉన్నాయి, 57-66వరకు. ఇవన్నీ **మదీనాలో** అవతరింపజేయబడ్డాయి. ప్రతి ఒక్కటి సాంఘిక జీవితపు ఒక విషయాన్ని వివరిస్తోంది. **రెండవ** భాగంలో 48 సూరాహ్‌లు, 67-114 వరకు ఉన్నాయి. ఇవి చిన్నచిన్న మక్కా సూరాహ్‌లు, కొన్ని తప్ప. ప్రతిఒక్కటి ధర్మ విషయాలను బోధిస్తోంది. ఈ సూరహ్ వినయవిధేయతలను బోధిస్తోంది, అహంకారాన్ని ఖండిస్తోంది.

C B A

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

سَبَّحَ لِلَّهِ مَا فِي ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضِ ۖ وَهُوَ ٱلْعَزِيزُ ٱلْحَكِيمُ ﴿١﴾

**1.** ఆకాశాలలోను మరియు భూమిలోనూ ఉన్న సమస్తం అల్లాహ్ పవిత్రతను కొనియాడుతుంటాయి.[1] మరియు ఆయనే సర్వ శక్తిమంతుడు, మహా వివేకవంతుడు.

لَهُۥ مُلْكُ ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضِ ۖ يُحْيِۦ وَيُمِيتُ ۖ وَهُوَ عَلَىٰ كُلِّ شَيْءٍ قَدِيرٌ ﴿٢﴾

**2.** ఆకాశాలపై మరియు భూమిపై సామ్రాజ్యాధిపత్యం ఆయనదే. ఆయనే జీవిత మిచ్చేవాడు మరియు మరణమిచ్చే వాడు. మరియు ఆయనే ప్రతిదీ చేయగల సమర్థుడు.

هُوَ ٱلْأَوَّلُ وَٱلْءَاخِرُ وَٱلظَّٰهِرُ وَٱلْبَاطِنُ ۖ وَهُوَ بِكُلِّ شَيْءٍ عَلِيمٌ ﴿٣﴾

**3.** ఆయనే ప్రథమం మరియు ఆయనే అంతం[2] మరియు ఆయనే ప్రత్యక్షుడు మరియు ఆయనే పరోక్షుడు.[3] మరియు

---

**1**. చూడండి, 17:44, 21:79.

**2**. దైవప్రవక్త ('స'అస) ప్రవచనం: 'కాలం, అనేది మానవుని జ్ఞానపరిధికి మించినది, కాని దానిని అల్లాహ్ (సు.తా.) సృష్టించాడు.'

**3**. ప్రతి వస్తువు చివరకు అల్లాహ్ (సు.తా.) వద్దకే చేరుతుంది. ఎందుకంటే ఆయన (సు.తా.) ప్రతిదానికి మూలం. ఆయన ప్రతిదానికి - మరే ఇతర దానికంటే - తన జ్ఞానపరంగా సమీపంలో ఉన్నాడు.

**అల్-అవ్వలు:** The First, **ప్రథముడు**, మొట్ట మొదటి వాడు, ఆద్యుడు, సర్వసృష్టిరాసుల సృష్టికి పూర్వమే ఉన్నవాడు.

ఆయనే ప్రతిదాని గురించి జ్ఞానం గలవాడు.

هُوَ ٱلَّذِى خَلَقَ ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضَ فِى سِتَّةِ أَيَّامٍ ثُمَّ ٱسْتَوَىٰ عَلَى ٱلْعَرْشِ ۚ يَعْلَمُ مَا يَلِجُ فِى ٱلْأَرْضِ وَمَا يَخْرُجُ مِنْهَا وَمَا يَنزِلُ مِنَ ٱلسَّمَآءِ وَمَا يَعْرُجُ فِيهَا ۖ وَهُوَ مَعَكُمْ أَيْنَ مَا كُنتُمْ ۚ وَٱللَّهُ بِمَا تَعْمَلُونَ بَصِيرٌ ﴿٤﴾

**4.** ఆయనే ఆకాశాలను మరియు భూమిని ఆరు దినములలో (అయ్యామ్) సృష్టించిన వాడు, తరువాత ఆయన సింహాసనాన్ని ('అర్ష్‌ను) అధిష్ఠించాడు.[1] భూమిలోకి పోయేది మరియు దానినుండి బయటికివచ్చేది మరియు ఆకాశంనుండి దిగేది మరియు దానిలోకి ఎక్కేది అంతా ఆయనకు తెలుసు.[2] మరియు మీరెక్కడున్నా ఆయన మీతో పాటు ఉంటాడు. మరియు అల్లాహ్ మీరు చేసేదంతా చూస్తున్నాడు.

لَّهُۥ مُلْكُ ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضِ ۚ وَإِلَى ٱللَّهِ تُرْجَعُ ٱلْأُمُورُ ﴿٥﴾

**5.** ఆకాశాలపై మరియు భూమిపై సామ్రాజ్యాధిపత్యం ఆయనదే మరియు అన్ని వ్యవహారాలు (నిర్ణయానికై) అల్లాహ్ వైపునకే తీసుకు పోబడతాయి.

يُولِجُ ٱلَّيْلَ فِى ٱلنَّهَارِ وَيُولِجُ ٱلنَّهَارَ فِى ٱلَّيْلِ ۚ وَهُوَ عَلِيمٌۢ بِذَاتِ ٱلصُّدُورِ ﴿٦﴾

**6.** ఆయనే రాత్రిని పగటిలోకి ప్రవేశింపజేస్తాడు మరియు పగటిని రాత్రిలోకి ప్రవేశింపజేస్తాడు.[3] మరియు ఆయనకు హృదయాలలో ఉన్న విషయాలన్నీ బాగా తెలుసు.

---

**అల్-ఆఖిరు:** The Last, The End. **అంతం**, అంతిమ, కడపటి, చివరికి మిగిలే వాడు, సర్వసృష్టిరాసుల వినాశం తరువాతకూడా ఉండేవాడు.

**అజ్-'జాహిరు:** The Ascendant or Predominant, over all things, The Outward. **ప్రత్యక్షుడు**, గోచరుడు, బాహ్యం.

**అల్-బాతిను:** He who knows the secret and hidden things. He who is veiled from the eyes and imaginations of created beings. **పరోక్షుడు**, అగోచరుడు, దృష్టికిగోచరించని, గోప్యమైన, మరగైనవాడు. ఇవి అల్లాహ్(సు.తా.) అత్యుత్తమ పేర్లు.

**1**. చూడండి, 7:54; 10:3, 32:4 మొదలైన వాటిలో ఈ వాక్యం ఉంది.

**2**. చూడండి, 34:2.

**3**. అంటే కొన్ని దినాలు రాత్రి పెద్దది పగలు చిన్నదిగా ఉంటాయి, మరికొన్ని దినాలు పగలు పెద్దది మరియు రాత్రి చిన్నదిగా ఉంటాయి.

ءَامِنُواْ بِٱللَّهِ وَرَسُولِهِۦ وَأَنفِقُواْ مِمَّا جَعَلَكُم مُّسۡتَخۡلَفِينَ فِيهِۖ فَٱلَّذِينَ ءَامَنُواْ مِنكُمۡ وَأَنفَقُواْ لَهُمۡ أَجۡرٞ كَبِيرٞ ٧

7. అల్లాహ్ ను మరియు ఆయన ప్రవక్తను విశ్వసించండి, ఆయన మిమ్మల్ని ఉత్తరాధికారులుగా జేసిన వాటి నుండి (దానంగా) ఖర్చుపెట్టండి.[1] మీలో ఎవరైతే విశ్వసించి తమ ధనాన్ని (దానముగా) ఖర్చుచేస్తారో, వారికి గొప్ప ప్రతిఫలం ఉంటుంది.

وَمَا لَكُمۡ لَا تُؤۡمِنُونَ بِٱللَّهِ وَٱلرَّسُولُ يَدۡعُوكُمۡ لِتُؤۡمِنُواْ بِرَبِّكُمۡ وَقَدۡ أَخَذَ مِيثَٰقَكُمۡ إِن كُنتُم مُّؤۡمِنِينَ ٨

8. మరియు మీకేమయింది? మీరు (వాస్తవానికి) విశ్వాసులే అయితే? మీరెందుకు అల్లాహ్ ను విశ్వసించరు? మరియు ప్రవక్త, మిమ్మల్ని మీ ప్రభువును విశ్వసించండని పిలుస్తున్నాడు మరియు వాస్తవానికి మీచేత ప్రమాణం కూడా చేయించుకున్నాడు.[2]

هُوَ ٱلَّذِي يُنَزِّلُ عَلَىٰ عَبۡدِهِۦٓ ءَايَٰتِۭ بَيِّنَٰتٖ لِّيُخۡرِجَكُم مِّنَ ٱلظُّلُمَٰتِ إِلَى ٱلنُّورِۚ وَإِنَّ ٱللَّهَ بِكُمۡ لَرَءُوفٞ رَّحِيمٞ ٩

9. తన దాసుని(ము'హమ్మద్)పై స్పష్టమైన (ఆయాత్) సూచనలు అవతరింపజేసేవాడు ఆయనే! అతను వాటి ద్వారా మిమ్మల్ని అంధకారం నుండి వెలుతురులోకి తీసుకురావటానికి. మరియు నిశ్చయంగా, అల్లాహ్ మిమ్మల్ని ఎంతో కనికరించే వాడు, అపార కరుణాప్రదాత.

---

1. మానవుడు: 'నా సొమ్ము, నా సొమ్ము' అంటాడు. వాస్తవానికి, 1) నీవు తిని త్రాగి ఖర్చు చేసింది, 2) నీవు తొడిగి చించింది మరియు 3) నీవు అల్లాహ్ (సు.తా.) మార్గంలో ఖర్చు చేసింది మాత్రమే నీ సొమ్ము. వీటిని విడిచి మిగతాదంతా ఇతరులదే. (స'హీ'హ్ ముస్లిం; ముస్నద్ అ'హ్మద్, 4/24).
2. చూడండి, 7:172 అల్లాహ్ (సు.తా.) తన దాసుల చేత ఈ ప్రమాణం చేయించాడు.

وَمَا لَكُمْ أَلَّا تُنفِقُوا۟ فِى سَبِيلِ ٱللَّهِ وَلِلَّهِ مِيرَٰثُ ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضِ ۚ لَا يَسْتَوِى مِنكُم مَّنْ أَنفَقَ مِن قَبْلِ ٱلْفَتْحِ وَقَٰتَلَ ۚ أُو۟لَٰٓئِكَ أَعْظَمُ دَرَجَةً مِّنَ ٱلَّذِينَ أَنفَقُوا۟ مِنۢ بَعْدُ وَقَٰتَلُوا۟ ۚ وَكُلًّا وَعَدَ ٱللَّهُ ٱلْحُسْنَىٰ ۚ وَٱللَّهُ بِمَا تَعْمَلُونَ خَبِيرٌ ﴿١٠﴾

**10.** మరియు మీకేమయింది? మీరెందుకు అల్లాహ్‌మార్గంలో ఖర్చుపెట్టడం లేదు? ఆకాశాలు మరియు భూమి యొక్క వారసత్వం అల్లాహ్‌కే చెందుతుంది.[1] (మక్కా) విజయానికి ముందు (అల్లాహ్ మార్గంలో) ఖర్చుపెట్టిన వారితో మరియు పోరాడిన వారితో, (మక్కా విజయం తరువాత పోరాడిన వారు మరియు ఖర్చు పెట్టిన వారు) సమానులు కాజాలరు! అలాంటి వారి స్థానం (విజయం తరువాత అల్లాహ్ మార్గంలో) ఖర్చుపెట్టిన మరియు పోరాడిన వారికంటే గొప్పది. కాని వారందరికీ అల్లాహ్ ఉత్తమమైన (ప్రతిఫల) వాగ్దానం చేశాడు.[2] మరియు మీరు చేసేదంతా అల్లాహ్ బాగా ఎరుగును.

مَّن ذَا ٱلَّذِى يُقْرِضُ ٱللَّهَ قَرْضًا حَسَنًا فَيُضَٰعِفَهُۥ لَهُۥ وَلَهُۥٓ أَجْرٌ كَرِيمٌ ﴿١١﴾

**11.** అల్లాహ్‌కు ఉత్తమమైన అప్పు ఇచ్చేవాడు ఎవడు? ఆయన దానిని ఎన్నోరెట్లు హెచ్చించి తిరిగి అతనికి ఇస్తాడు[3] మరియు అతనికి శ్రేష్ఠమైన ప్రతిఫలం (స్వర్గం) ఉంటుంది.

---

**1**. చూడండి, 15:23.

**2**. దైవప్రవక్త ('స'అస) ప్రవచనం: "మీరు నా అనుచరు (ర'ది.'అన్హుమ్)లను ఎవ్వరినీ నిందించకండి. ఎవరిచేతిలో నా ప్రాణముందో ఆయన (సు.తా.) ప్రమాణం-మీలో ఎవడైనా ఉ'హుద్ పర్వతమంత బంగారాన్ని అల్లాహ్ (సు.తా.) మార్గంలో ఖర్చుచేసినా, అది నా సహచరుడు ('స'హాబి) ఖర్చుచేసిన ఒక్క 'ముద్' లేక సగం 'ముద్'తో సమానం కాజాలదు." ('స'హీ'హ్ బు'ఖారీ, 'స'హీ'హ్ ముస్లిం).

**3**. ఇటువంటి వాక్యం కోసం చూడండి, 2:245 అల్లాహ్ (సు.తా.)కు మంచి అప్పు ఇవ్వడం అంటే అల్లాహ్ (సు.తా.) మార్గంలో ఖర్చుచేయటం లేక దానం చేయటం. మానవుడు అల్లాహ్ (సు.తా.) మార్గంలో ఖర్చుచేసేది, అతనికి అల్లాహ్ (సు.తా.) అనుగ్రహించి ప్రసాదించినవే! అయినా అల్లాహ్ (సు.తా.) దానిని అప్పుగా పేర్కొనటం కేవలం ఆయన అనుగ్రహం మరియు కనికరం. అల్లాహ్ (సు.తా.) దానికి అదే విధంగా ప్రతిఫలమొసంగుతాడు, ఏవిధంగానైతే అప్పుతీర్చడం విధిగా చేయబడిందో!

يَوْمَ تَرَى ٱلْمُؤْمِنِينَ وَٱلْمُؤْمِنَٰتِ يَسْعَىٰ نُورُهُم بَيْنَ أَيْدِيهِمْ وَبِأَيْمَٰنِهِم بُشْرَىٰكُمُ ٱلْيَوْمَ جَنَّٰتٌ تَجْرِى مِن تَحْتِهَا ٱلْأَنْهَٰرُ خَٰلِدِينَ فِيهَا ذَٰلِكَ هُوَ ٱلْفَوْزُ ٱلْعَظِيمُ ﴿١٢﴾

**12**. ఆ దినమున నీవు విశ్వాసులైన పురుషులను మరియు విశ్వాసులైన స్త్రీలను చూస్తే, వారి వెలుగు, వారి ముందునుండి మరియు వారి కుడివైపు నుండి పరిగెత్తుతూ ఉంటుంది.[1] (వారితో ఇలా అనబడుతుంది): "ఈ రోజు మీకు క్రింద సెలయేర్లు ప్రవహించే స్వర్గవనాల శుభవార్త ఇవ్వబడుతోంది, మీరందులో శాశ్వతంగా ఉంటారు! ఇదే ఆ గొప్ప విజయం."[2]

يَوْمَ يَقُولُ ٱلْمُنَٰفِقُونَ وَٱلْمُنَٰفِقَٰتُ لِلَّذِينَ ءَامَنُوا۟ ٱنظُرُونَا نَقْتَبِسْ مِن نُّورِكُمْ قِيلَ ٱرْجِعُوا۟ وَرَآءَكُمْ فَٱلْتَمِسُوا۟ نُورًا فَضُرِبَ بَيْنَهُم بِسُورٍ لَّهُۥ بَابٌۢ بَاطِنُهُۥ فِيهِ ٱلرَّحْمَةُ وَظَٰهِرُهُۥ مِن قِبَلِهِ ٱلْعَذَابُ ﴿١٣﴾

**13**. ఆ రోజు కపటవిశ్వాసులైన పురుషులు మరియు కపటవిశ్వాసులైన స్త్రీలు విశ్వాసులతో ఇలా అంటారు:[3] "మీరు మా కొరకు కొంచెం వేచి ఉండండి; మేము మీ వెలుగునుండి కొంచెం తీసుకుంటాము."[4] వారితో ఇలా అనబడుతుంది: "మీరు వెనుకకు మరలిపొండి; తరువాత వెలుగు కొరకు వెదకండి!" అప్పుడు వారి మధ్య ఒకగోడ నిలబెట్టబడుతుంది. దానికి ఒక ద్వారముంటుంది; దాని లోపలివైపు కారుణ్యముంటుంది[5] మరియు దాని బయటవైపు శిక్ష ఉంటుంది.[6]

---

**1**. ఈ విషయం పుల్‌సరాత్‌పై జరుగుతుంది. ఈ జ్యోతి వారి సత్కార్యాల ఫలితం. దానివల్ల వారు సులభంగా స్వర్గపు త్రోవను ముగించుకుంటారు. ఇబ్నె-కసీ'ర్‌లో మరియు ఇబ్నె-జరీర్‌లో 'వ బి అయ్‌మానిహిమ్,'ను ఇలాబోధించారు: 'వారి కుడిచేతులలో వారికర్మ పత్రాలుంటాయి.'

**2**. ఈ పలుకులు వారి స్వాగతంకొరకు వేచిఉండే దైవదూతలు పలుకుతారు.

**3**. చూడండి, 29:11.

**4**. కపటవిశ్వాసులైన స్త్రీపురుషులు కొంతదూరం విశ్వాసుల వెలుగులో నడిచిన తరువాత, అల్లాహ్ (సు.తా.) వారిపై చీకటిని విధిస్తాడు. అప్పుడు వారు అలా పలుకుతారు.

**5**. అంటే స్వర్గం.

**6**. అంటే నరకం.

يُنَادُونَهُمْ أَلَمْ نَكُن مَّعَكُمْ ۖ قَالُوا۟ بَلَىٰ وَلَـٰكِنَّكُمْ فَتَنتُمْ أَنفُسَكُمْ وَتَرَبَّصْتُمْ وَٱرْتَبْتُمْ وَغَرَّتْكُمُ ٱلْأَمَانِىُّ حَتَّىٰ جَآءَ أَمْرُ ٱللَّهِ وَغَرَّكُم بِٱللَّهِ ٱلْغَرُورُ ﴿١٤﴾

**14.** (బయట నున్న కపటవిశ్వాసులు) ఇలా అరుస్తారు: "ఏమీ? మేము మీతో పాటు ఉండేవాళ్ళం కాదా?" (విశ్వాసులు) ఇలా జవాబిస్తారు: "ఎందుకు ఉండలేదు? కానీ వాస్తవానికి మిమ్మల్ని మీరు స్వయంగా పరీక్షకు గురిచేసుకున్నారు. మీరు మా (నాశనం కోసం) వేచి ఉన్నారు మరియు మీరు (పునరుత్థానాన్ని) సందేహిస్తూ ఉన్నారు మరియు మీ తుచ్ఛమైన కోరికలు మిమ్మల్ని మోసపుచ్చాయి. చివరకు అల్లాహ్ నిర్ణయం వచ్చింది. మరియు ఆ మోసగాడు (షైతాన్) మిమ్మల్ని అల్లాహ్ విషయంలో మోసపుచ్చాడు.[1]

فَٱلْيَوْمَ لَا يُؤْخَذُ مِنكُمْ فِدْيَةٌ وَلَا مِنَ ٱلَّذِينَ كَفَرُوا۟ ۚ مَأْوَىٰكُمُ ٱلنَّارُ ۖ هِىَ مَوْلَىٰكُمْ ۖ وَبِئْسَ ٱلْمَصِيرُ ﴿١٥﴾

**15.** కావున ఈ రోజు మీ నుండి ఏ విధమైన పరిహారం తీసుకోబడదు మరియు సత్యతిరస్కారుల నుండి కూడా తీసుకోబడదు. మీ నివాసం నరకమే, అదే మీ ఆశ్రయం.[2] ఎంతచెడ్డ గమ్యస్థానం!" (7/8)

۞ أَلَمْ يَأْنِ لِلَّذِينَ ءَامَنُوٓا۟ أَن تَخْشَعَ قُلُوبُهُمْ لِذِكْرِ ٱللَّهِ وَمَا نَزَلَ مِنَ ٱلْحَقِّ وَلَا يَكُونُوا۟ كَٱلَّذِينَ أُوتُوا۟ ٱلْكِتَـٰبَ مِن قَبْلُ فَطَالَ عَلَيْهِمُ ٱلْأَمَدُ فَقَسَتْ قُلُوبُهُمْ ۖ وَكَثِيرٌ مِّنْهُمْ فَـٰسِقُونَ ﴿١٦﴾

**16.** * ఏమీ? విశ్వాసుల హృదయాలు అల్లాహ్ ప్రస్తావనతో కృంగిపోయి, ఆయన అవతరింపజేసిన సత్యానికి విధేయులయ్యే సమయం ఇంకా రాలేదా? పూర్వగ్రంథ ప్రజల్లాగా వారుకూడా మారిపోకూడదు; ఎందుకంటే చాలాకాలం గడిచిపోయి నందుకు వారి హృదయాలు కఠినమై పోయాయి. మరియు వారిలో చాలామంది అవిధేయులు (ఫాసిఖూన్) ఉన్నారు.[3]

---

1. చూడండి, 31:33.
2. మౌలా: కార్యకర్త, యజమాని, సంరక్షకుడు, కర్తవ్యాన్ని నిర్వహించేవాడు స్నేహితుడు, సహచరుడు, ఎల్లప్పుడు తోడుగా ఉండేవాడు. ఇక్కడ నరకపు కర్తవ్యం శిక్ష విధించటమే కదా!
3. చూడండి, 5:13.

ٱعۡلَمُوٓاْ أَنَّ ٱللَّهَ يُحۡيِ ٱلۡأَرۡضَ بَعۡدَ مَوۡتِهَاۚ قَدۡ بَيَّنَّا لَكُمُ ٱلۡأٓيَٰتِ لَعَلَّكُمۡ تَعۡقِلُونَ ١٧

17. బాగా తెలుసుకోండి! నిశ్చయంగా అల్లాహ్, భూమి చనిపోయిన తరువాత, దానికి మళ్ళీ జీవంపోస్తాడు. వాస్తవానికి మేము ఈ సూచనలను మీకు స్పష్టంగా తెలుపుతున్నాము, బహుశా మీరు అర్థం చేసుకుంటారని.

إِنَّ ٱلۡمُصَّدِّقِينَ وَٱلۡمُصَّدِّقَٰتِ وَأَقۡرَضُواْ ٱللَّهَ قَرۡضًا حَسَنٗا يُضَٰعَفُ لَهُمۡ وَلَهُمۡ أَجۡرٞ كَرِيمٞ ١٨

18. నిశ్చయంగా, విధిదానం ('జకాత్) చేసే పురుషులు మరియు విధిదానం చేసే స్త్రీలు మరియు అల్లాహ్‌కు మంచి అప్పు ఇచ్చేవారికి, ఆయన దానిని ఎన్నోరెట్లు పెంచి (తిరిగి) ఇస్తాడు[1] మరియు వారికి గొప్ప ప్రతిఫలం ఉంటుంది.

وَٱلَّذِينَ ءَامَنُواْ بِٱللَّهِ وَرُسُلِهِۦٓ أُوْلَٰٓئِكَ هُمُ ٱلصِّدِّيقُونَۖ وَٱلشُّهَدَآءُ عِندَ رَبِّهِمۡ لَهُمۡ أَجۡرُهُمۡ وَنُورُهُمۡۖ وَٱلَّذِينَ كَفَرُواْ وَكَذَّبُواْ بِـَٔايَٰتِنَآ أُوْلَٰٓئِكَ أَصۡحَٰبُ ٱلۡجَحِيمِ ١٩

19. మరియు ఎవరైతే అల్లాహ్‌ను మరియు ఆయన ప్రవక్తలను విశ్వసిస్తారో, అలాంటి వారే సత్యసంధులైన (విశ్వాసులు). మరియు వారే తమ ప్రభువువద్ద అమర వీరులు. వారికి వారి ప్రతిఫలం మరియు జ్యోతి లభిస్తాయి. కాని ఎవరైతే సత్యాన్ని తిరస్కరిస్తారో మరియు మా ఆయతులను అబద్ధాలని అంటారో, అలాంటి వారు తప్పక భగభగ మండే నరకాగ్ని వాసులవుతారు.

ٱعۡلَمُوٓاْ أَنَّمَا ٱلۡحَيَوٰةُ ٱلدُّنۡيَا لَعِبٞ وَلَهۡوٞ وَزِينَةٞ وَتَفَاخُرُۢ بَيۡنَكُمۡ وَتَكَاثُرٞ فِي ٱلۡأَمۡوَٰلِ وَٱلۡأَوۡلَٰدِۖ

20. బాగా తెలుసుకోండి! నిశ్చయంగా, ఇహలోక జీవితం, ఒక ఆట మరియు ఒక వినోదం మరియు ఒక శృంగారం మరియు మీరు పరస్పరం గొప్పలు చెప్పుకోవడం మరియు సంపద మరియు సంతానం విషయంలో ఆధిక్యత పొందటానికి

---

1. ఒకదానికి పదిరెట్లు, ఐదువందలరెట్లు లేక అంతకంటే అధికంగా కూడా ఇస్తాడు. ఈ ఎక్కువరెట్లపుణ్యం వారిమాలిన్యరహితం, ఆవశ్యకత మరియు ఖర్చుచేసిన చోటు మరియు కాలాన్ని బట్టి ఉంటాయి. ఏ విధంగానైతే ఇంతకు ముందు పేర్కొనబడిందో ఫత్'హ్ మక్కాకు మొదట ఖర్చు చేసిన వారికి, దాని తరువాత ఖర్చుచేసిన వారికంటే ఎక్కువ పుణ్యముందని.

كَمَثَلِ غَيْثٍ أَعْجَبَ ٱلْكُفَّارَ نَبَاتُهُۥ ثُمَّ يَهِيجُ فَتَرَىٰهُ مُصْفَرًّا ثُمَّ يَكُونُ حُطَٰمًاۖ وَفِي ٱلْأٓخِرَةِ عَذَابٌ شَدِيدٌ وَمَغْفِرَةٌ مِّنَ ٱللَّهِ وَرِضْوَٰنٌۚ وَمَا ٱلْحَيَوٰةُ ٱلدُّنْيَآ إِلَّا مَتَٰعُ ٱلْغُرُورِ ﴿٢٠﴾

సాబِقُوٓاْ إِلَىٰ مَغْفِرَةٍ مِّن رَّبِّكُمْ وَجَنَّةٍ عَرْضُهَا كَعَرْضِ ٱلسَّمَآءِ وَٱلْأَرْضِ أُعِدَّتْ لِلَّذِينَ ءَامَنُواْ بِٱللَّهِ وَرُسُلِهِۦۚ ذَٰلِكَ فَضْلُ ٱللَّهِ يُؤْتِيهِ مَن يَشَآءُۚ وَٱللَّهُ ذُو ٱلْفَضْلِ ٱلْعَظِيمِ ﴿٢١﴾

مَآ أَصَابَ مِن مُّصِيبَةٍ فِي ٱلْأَرْضِ وَلَا فِيٓ أَنفُسِكُمْ إِلَّا فِي كِتَٰبٍ مِّن قَبْلِ أَن نَّبْرَأَهَآۚ إِنَّ ذَٰلِكَ عَلَى ٱللَّهِ يَسِيرٌ ﴿٢٢﴾

ప్రయత్నించడం మాత్రమే.[1] దాని దృష్టాంతం ఆ వర్షంవలే ఉంది: దాని (వర్షం) వల్ల పెరిగే పైరు రైతులకు ఆనందం కలిగిస్తుంది.[2] ఆ పిదప అది ఎండిపోయి పసుపుపచ్చగా మారిపోతుంది. ఆ పిదప అది పొట్టుగా మారిపోతుంది. కాని పరలోక జీవితంలో మాత్రం (దుష్టులకు) బాధాకరమైన శిక్ష మరియు (సత్పురుషులకు) అల్లాహ్ నుండి క్షమాపణ మరియు ఆయన ప్రసన్నత ఉంటాయి. కావున ఇహలోకజీవితం కేవలం మోసగించే బోగభాగ్యాలు మాత్రమే.

**21**. మీ ప్రభువు క్షమాపణ వైపునకు మరియు ఆకాశం మరియు భూమి యొక్క వైశాల్యమంతటి విశాలమైన స్వర్గం వైపునకు పరుగెత్తండి. అది అల్లాహ్ మరియు ఆయన ప్రవక్తలను విశ్వసించే వారికొరకు సిద్ధపరచబడి ఉంది. ఇది అల్లాహ్ అనుగ్రహం, ఆయన తానుకోరిన వారికి దానిని ప్రసాదిస్తాడు. మరియు అల్లాహ్ అనుగ్రహశాలి, సర్వోత్తముడు.

**22**. భూమి మీద గానీ లేదా స్వయంగా మీ మీద గానీ విరుచుకుపడే ఏ ఆపద అయినా సరే! మేము దానిని సంభవింపజేయక ముందే గ్రంథంలో వ్రాయబడకుండా లేదు. నిశ్చయంగా, ఇది అల్లాహ్‌కు ఎంతో సులభం.[3]

---

**1**. చూడండి, 38:27 మరియు 23:115.

**2**. అల్-కుఫ్ఫారు: అంటే ఇక్కడ రైతు అనే అర్థంలో వాడబడింది. అంటే దాచేవాడు, రైతు భూమిలో విత్తనాలను దాచుతాడు. అదేవిధంగా సత్యతిరస్కారుల హృదయాలలో అల్లాహ్ (సు.తా.) మరియు అంతిమదినపు తిరస్కారం దాగి ఉంటుంది.

**3**. అల్లాహ్(సు.తా.)కు జరిగిందీ, జరగబోయేదీ అన్ని విషయాల జ్ఞానముంది. కాబట్టి ఆయన సృష్టిని ఆరంభించకముందే అంతా ఒకగ్రంథంలో వ్రాసిపెట్టాడు. అదే ఖద్ర్/తఖ్దీర్, (స.ముస్లిం).

لِّكَيۡلَا تَأۡسَوۡاْ عَلَىٰ مَا فَاتَكُمۡ وَلَا تَفۡرَحُواْ بِمَآ ءَاتَىٰكُمۡۗ وَٱللَّهُ لَا يُحِبُّ كُلَّ مُخۡتَالٖ فَخُورٍ ٢٣

23. ఇదంతా మీరు పోయినదానికి నిరాశ చెందకూడదని మరియు మీకు ఇచ్చినదానికి సంతోషంతో ఉప్పొంగిపోరాదని.[1] మరియు అల్లాహ్ బడాయీలు చెప్పుకునే వారూ, గర్వించే వారూ అంటే ఇష్టపడడు.

ٱلَّذِينَ يَبۡخَلُونَ وَيَأۡمُرُونَ ٱلنَّاسَ بِٱلۡبُخۡلِۗ وَمَن يَتَوَلَّ فَإِنَّ ٱللَّهَ هُوَ ٱلۡغَنِيُّ ٱلۡحَمِيدُ ٢٤

24. ఎవరైతే స్వయంగా లోభత్వం చూపుతూ[2] ఇతరులను కూడా లోభత్వానికి పురికొలుపుతారో మరియు ఎవడైతే (సత్యం నుండి) వెనుదిరుగుతాడో వాడు (తెలుసు కోవాలి), నిశ్చయంగా అల్లాహ్ స్వయం సమృద్ధుడు, సర్వస్తోత్రాలకు అర్హుడని!

لَقَدۡ أَرۡسَلۡنَا رُسُلَنَا بِٱلۡبَيِّنَٰتِ وَأَنزَلۡنَا مَعَهُمُ ٱلۡكِتَٰبَ وَٱلۡمِيزَانَ لِيَقُومَ ٱلنَّاسُ بِٱلۡقِسۡطِۖ وَأَنزَلۡنَا ٱلۡحَدِيدَ فِيهِ بَأۡسٞ شَدِيدٞ وَمَنَٰفِعُ لِلنَّاسِ وَلِيَعۡلَمَ ٱللَّهُ مَن يَنصُرُهُۥ وَرُسُلَهُۥ بِٱلۡغَيۡبِۚ إِنَّ ٱللَّهَ قَوِيٌّ عَزِيزٞ ٢٥

25. వాస్తవానికి, మేము మా సందేశహరులను స్పష్టమైన సూచనలనిచ్చి పంపాము మరియు వారితో బాటు గ్రంథాన్ని అవతరింపజేశాము. మరియు మానవులు న్యాయశీలురుగా మెలగటానికి త్రాసును కూడా పంపాము[3] మరియు ఇనుమును కూడా ప్రసాదించాము. అందులో గొప్పశక్తి ఉంది మరియు మానవులకు ఎన్నో ప్రయోజనాలున్నాయి.[4] మరియు (ఇదంతా) అల్లాహ్ అగోచరుడైన తనకు మరియు తన ప్రవక్తలకు ఎవడు సహాయకుడవుతాడో తెలుసుకోవటానికి చేశాడు. నిశ్చయంగా, అల్లాహ్ మహా బలశాలి, సర్వ శక్తిమంతుడు.

---

1. మూమిన్ బాధ కలిగినప్పుడు సహనం వహిస్తాడు మరియు సంతోషం కలిగినప్పుడు అల్లాహ్(సు.తా.)కు కృతజ్ఞుడవుతాడు. ఎందుకంటే అతను అది తన శ్రమ కాదు అల్లాహ్ (సు.తా.) యొక్క అనుగ్రహమని నమ్ముతాడు.
2. అంటే అల్లాహ్ (సు.తా.) మార్గంలో ఖర్చుచేయటంలో లోభత్వం. చూడండి, 4:36-37.
3. మీ'జాన్: అంటే త్రాసు - ఇక్కడ న్యాయం అని అర్థం.
4. ఇనుమువల్ల ఎన్నో ఉపయోగాలు ఉన్నాయి. ఇది భూమిలో విస్తారంగా దొరుకుతుంది.

وَلَقَدۡ أَرۡسَلۡنَا نُوحٗا وَإِبۡرَٰهِيمَ وَجَعَلۡنَا فِي ذُرِّيَّتِهِمَا ٱلنُّبُوَّةَ وَٱلۡكِتَٰبَۖ فَمِنۡهُم مُّهۡتَدٖۖ وَكَثِيرٞ مِّنۡهُمۡ فَٰسِقُونَ ٢٦

26. మరియు వాస్తవంగా మేము నూ'హ్‌ను మరియు ఇబ్రాహీమ్‌ను పంపాము. మరియు వారిద్దరి సంతానంలో ప్రవక్తపదవినీ మరియు గ్రంథాన్ని ఉంచాము. కాని వారి సంతతిలో కొందరు మార్గదర్శకత్వం మీద ఉన్నారు, కాని వారిలో చాలామంది అవిధేయులు (ఫాసిఖూన్) ఉన్నారు.

ثُمَّ قَفَّيۡنَا عَلَىٰٓ ءَاثَٰرِهِم بِرُسُلِنَا وَقَفَّيۡنَا بِعِيسَى ٱبۡنِ مَرۡيَمَ وَءَاتَيۡنَٰهُ ٱلۡإِنجِيلَ وَجَعَلۡنَا فِي قُلُوبِ ٱلَّذِينَ ٱتَّبَعُوهُ رَأۡفَةٗ وَرَحۡمَةٗ وَرَهۡبَانِيَّةً ٱبۡتَدَعُوهَا مَا كَتَبۡنَٰهَا عَلَيۡهِمۡ إِلَّا ٱبۡتِغَآءَ رِضۡوَٰنِ ٱللَّهِ فَمَا رَعَوۡهَا حَقَّ رِعَايَتِهَاۖ فَـَٔاتَيۡنَا ٱلَّذِينَ ءَامَنُواْ مِنۡهُمۡ أَجۡرَهُمۡۖ وَكَثِيرٞ مِّنۡهُمۡ فَٰسِقُونَ ٢٧

27. ఆ తరువాత చాలామంది ప్రవక్తలను మేము వారి తరువాత పంపాము. మరియు మర్యమ్ కుమారుడు 'ఈసాను కూడా పంపాము మరియు అతనికి ఇంజీల్‌ను ప్రసాదించాము. మరియు అతనిని అనుసరించేవారి హృదయాలలో మేము జాలిని, కరుణను కలిగించాము, కాని సన్యాసాన్ని[1] వారే స్వయంగా కల్పించుకున్నారు. మేము దానిని వారిపై విధించలేదు, కాని అల్లాహ్ ప్రసన్నతను పొందగోరి వారే దానిని విధించుకున్నారు, కాని వారు దానిని పాటించవలసిన విధంగా నిజాయితీతో పాటించలేదు. కావున వారిలో విశ్వసించినవారికి వారి ప్రతిఫలాన్ని ప్రసాదించాము. కాని వారిలో చాలామంది అవిధేయులు (ఫాసిఖూన్) ఉన్నారు.

1. కఠోరమైన సన్యాసాన్ని వారే (క్రైస్తవులే) తమపై తాము విధించుకున్నారు. వారు ప్రాపంచిక జీవితానికి విలువఇవ్వలేదు. దీనిని ఖుర్ఆన్ ఖండిస్తుంది. చూడండి, 2:143. రఅ'ఫతన్ - అంటే జాలి, కనికరం, దయ. రుహ్బానియ్యాహ్ - అంటే త్యాగం, విడిచిపెట్టడం. అంటే ప్రాపంచిక విషయాలను త్యజించటం. అంటే సన్యాసత్వం స్వీకరించటం. ఇది వారే స్వయంగా కల్పించుకున్నారు. అల్లాహ్ (సు.తా.) దీనిని విధించలేదు. వారు అల్లాహ్(సు.తా.)ను సంతోషపరచాలని దీనిని అవలంబించారు. కాని అల్లాహ్ (సు.తా.) తాను చూపిన మార్గంపై నడిచే వారితోనే సంతోషపడతాడు. దానిలో క్రొత్త విషయాలను పుట్టించి వాటిని అవలంబించే వారితో కాదు.

يَـٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوا۟ ٱتَّقُوا۟ ٱللَّهَ وَءَامِنُوا۟ بِرَسُولِهِۦ يُؤْتِكُمْ كِفْلَيْنِ مِن رَّحْمَتِهِۦ وَيَجْعَل لَّكُمْ نُورًا تَمْشُونَ بِهِۦ وَيَغْفِرْ لَكُمْ ۚ وَٱللَّهُ غَفُورٌ رَّحِيمٌ ﴿٢٨﴾

**28.** ఓ విశ్వాసులారా! అల్లాహ్ యందు భయభక్తులు కలిగి ఉండండి మరియు ఆయన సందేశహరుణ్ణి విశ్వసించండి, ఆయన (అల్లాహ్) మీకు రెట్టింపు కరుణను ప్రసాదిస్తాడు మరియు వెలుగును ప్రసాదిస్తాడు, మీరు అందులో నడుస్తారు మరియు ఆయన మిమ్మల్ని క్షమిస్తాడు. మరియు అల్లాహ్ ఎంతో క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత.

لِّئَلَّا يَعْلَمَ أَهْلُ ٱلْكِتَـٰبِ أَلَّا يَقْدِرُونَ عَلَىٰ شَىْءٍ مِّن فَضْلِ ٱللَّهِ ۙ وَأَنَّ ٱلْفَضْلَ بِيَدِ ٱللَّهِ يُؤْتِيهِ مَن يَشَآءُ ۚ وَٱللَّهُ ذُو ٱلْفَضْلِ ٱلْعَظِيمِ ﴿٢٩﴾

**29.** అల్లాహ్ అనుగ్రహం మీద తమకు ఎలాంటి అధికారం లేదని మరియు నిశ్చయంగా, అనుగ్రహం కేవలం అల్లాహ్ చేతిలో ఉందని మరియు ఆయన తాను కోరిన వారికి దానిని ప్రసాదిస్తాడని, పూర్వ గ్రంథప్రజలు తెలుసుకోవాలి. మరియు అల్లాహ్ అనుగ్రహశాలి, సర్వోత్తముడు.

*****

## 58. సూరహ్ అల్-ముజాదిలహ్ | سُورَةُ المُجَادلَةِ

అల్-ముజాది(ద)లహ్: **వాదించటం.** ఈ 10 **మదీనా** సూరాహ్‌ల సమూహంలో ఇది 2వది. ఇందులో **22ఆయతులు** ఉన్నాయి. ఇస్లాంకు ముందు 'అరబ్బులలో స్త్రీలపై జరిగే అన్యాయాన్ని గురించి మరియు దానిని నిషేధించడం గురించి ఇందులో వివరించబడింది. ఇది దాదాపు 4-5హి(జ్రీలలో అవతరింపజేయబడింది. దీనిపేరు **మొదటిఆయత్**నుండి తీసుకోబడింది. ఇది బహుశా సూరహ్ అల్-అ'హ్'జాబ్ (33) కంటేముందు అవతరింపజేయబడింది.

C B A

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

قَدْ سَمِعَ ٱللَّهُ قَوْلَ ٱلَّتِى تُجَٰدِلُكَ فِى زَوْجِهَا وَتَشْتَكِىٓ إِلَى ٱللَّهِ وَٱللَّهُ يَسْمَعُ تَحَاوُرَكُمَآ ۚ إِنَّ ٱللَّهَ سَمِيعٌۢ بَصِيرٌ ﴿١﴾

1. (*) వాస్తవానికి, తన భర్తను గురించి నీతో **వాదిస్తున్న** మరియు అల్లాహ్‌తో మొర పెట్టుకుంటున్న ఆ స్త్రీ మాటలు అల్లాహ్ విన్నాడు.[1] అల్లాహ్ మీ ఇద్దరి సంభాషణ వింటున్నాడు. నిశ్చయంగా, అల్లాహ్ సర్వం వినేవాడు, సమస్తం చూసేవాడు.

ٱلَّذِينَ يُظَٰهِرُونَ مِنكُم مِّن نِّسَآئِهِم مَّا هُنَّ أُمَّهَٰتِهِمْ ۖ إِنْ أُمَّهَٰتُهُمْ إِلَّا ٱلَّٰٓـِٔى وَلَدْنَهُمْ ۚ وَإِنَّهُمْ لَيَقُولُونَ مُنكَرًا مِّنَ ٱلْقَوْلِ وَزُورًا ۚ وَإِنَّ ٱللَّهَ لَعَفُوٌّ غَفُورٌ ﴿٢﴾

2. మీలో ఎవరైతే తమ భార్యలను జి''హార్ ద్వారా దూరంగాఉంచుతారో! అలాంటివారి భార్యలు, వారి తల్లులుకాలేరు. వారిని కన్నవారు మాత్రమే వారితల్లులు.[2] మరియు నిశ్చయంగా, వారు అనుచితమైన మరియు అబద్ధమైన మాట పలుకుతున్నారు. మరియు నిశ్చయంగా అల్లాహ్ మన్నించేవాడు, క్షమాశీలుడు.

---

**1.** ఇక్కడ 'ఖౌలహ్ బిన్త్ మాలిక్ బిన్ స''అలబహ్ (ర. 'అన్హా)ను ఆమె భర్త ఔస్ బిన్ 'సామిత్ (రజి. 'అ.) ''జిహార్ చేసినందుకు ఆమె మొరపెట్టుకుంటుంది. దానికి అల్లాహ్ (సు.తా.) ఆదేశం వచ్చిన తరువాత, అది నిర్మూలించబడిన విషయం ఈ సూరహ్ యొక్క1-4వ ఆయతులలో పేర్కొనబడింది. ''జిహార్ - అంటే, ''నీ వీపు నాకు నా తల్లి వీపు వంటిది.'' అని తన భార్యను తాకకుండా దూరముండటం. మరియు ఆమెకు విడాకులు కూడా ఇవ్వకుండా ఉండటం. ఆమె దైవ ప్రవక్త ('స'అస) దగ్గరకు వచ్చి ఈ ఆచారాన్ని గురించి వాదులాడింది. అప్పుడు ఈ ఆయత్‌లు అవతరింపజేయబడ్డాయి. (అబూ-దావూద్) ఇంకా చూడండి, 33:4. స్త్రీ తన భర్తనుంచి విడాకులు తీసుకోగోరితే దానికి సంబంధించిన ఆదేశానికి చూడండి, 2:229. దానిని ఖుల్'అ అంటారు.

**2.** మీరు ''జిహార్ అన్నంత మాత్రాన్నే మీ భార్యలు మీ తల్లులు కారు, మిమ్మల్ని కన్నవారే మీ తల్లులు.

وَٱلَّذِينَ يُظَـٰهِرُونَ مِن نِّسَآئِهِمْ ثُمَّ يَعُودُونَ لِمَا قَالُواْ فَتَحْرِيرُ رَقَبَةٍ مِّن قَبْلِ أَن يَتَمَآسَّا ۚ ذَٰلِكُمْ تُوعَظُونَ بِهِۦ ۚ وَٱللَّهُ بِمَا تَعْمَلُونَ خَبِيرٌ ﴿٣﴾

**3**. మరియు ఎవరైతే తమ భార్యలను ``జిహార్ ద్వారా దూరంచేసి తరువాత తమ మాటను వారు ఉపసంహరించుకోదలిస్తే! వారిద్దరు ఒకరినొకరు తాకకముందు, ఒక బానిసను విడుదలచేయించాలి.[1] ఈ విధంగా మీకు ఉపదేశమివ్వబడుతోంది. మరియు మీరు చేస్తున్నదంతా అల్లాహ్ ఎరుగును.

فَمَن لَّمْ يَجِدْ فَصِيَامُ شَهْرَيْنِ مُتَتَابِعَيْنِ مِن قَبْلِ أَن يَتَمَآسَّا ۖ فَمَن لَّمْ يَسْتَطِعْ فَإِطْعَامُ سِتِّينَ مِسْكِينًا ۚ ذَٰلِكَ لِتُؤْمِنُواْ بِٱللَّهِ وَرَسُولِهِۦ ۚ وَتِلْكَ حُدُودُ ٱللَّهِ ۗ وَلِلْكَـٰفِرِينَ عَذَابٌ أَلِيمٌ ﴿٤﴾

**4**. కాని ఎవడైతే ఇలా చేయలేడో, అతడు తన భార్యను తాకకముందు, రెండు నెలలు వరుసగా ఉపవాసముండాలి. ఇది కూడా చేయలేని వాడు, అరవైమంది నిరుపేదలకు భోజనం పెట్టాలి. ఇదంతా మీరు అల్లాహ్‌ను మరియు ఆయన ప్రవక్తను దృఢంగా విశ్వసించటానికి. మరియు ఇవి అల్లాహ్ నిర్ణయించిన హద్దులు. మరియు సత్యతిరస్కారులకు బాధాకరమైన శిక్ష పడుతుంది.

إِنَّ ٱلَّذِينَ يُحَآدُّونَ ٱللَّهَ وَرَسُولَهُۥ كُبِتُواْ كَمَا كُبِتَ ٱلَّذِينَ مِن قَبْلِهِمْ ۚ وَقَدْ أَنزَلْنَآ ءَايَـٰتٍۭ بَيِّنَـٰتٍ ۚ وَلِلْكَـٰفِرِينَ عَذَابٌ مُّهِينٌ ﴿٥﴾

**5**. నిశ్చయంగా అల్లాహ్ మరియు ఆయన ప్రవక్తను వ్యతిరేకించే వారు, తమకు పూర్వం గతించిన వారు అవమానింపబడినట్లు అవమానింపబడతారు. మరియు వాస్తవానికి మేము స్పష్టమైన సూచన(ఆయాత్)లను అవతరింపజేశాము. మరియు సత్య తిరస్కారులకు అవమానకరమైన శిక్ష పడుతుంది.

---

**1**. ఇక్కడ దాని పరిహారం చెప్పబడుతోంది. ఒక బానిసను విడుదల చేయించాలి, లేక రెండు నెలల ఎడతెగకుండా ఉపవాసాలుండాలి, లేక 60 మంది పేదలకు, ప్రతివానికి 2 ముద్‌లు అంటే 1.25 కిలోగ్రాముల ధాన్యం ఇవ్వాలి లేక కడుపునిండా అన్నం తినిపించాలి. వారందరినీ ఒకే సారి తినిపించనవసరం లేదు. వేర్వేరు సమయాలలో తినిపించవచ్చు. (ఫత్హ్ అల్ ఖదీర్).

يَوۡمَ يَبۡعَثُهُمُ ٱللَّهُ جَمِيعٗا فَيُنَبِّئُهُم بِمَا عَمِلُوٓاْۚ أَحۡصَىٰهُ ٱللَّهُ وَنَسُوهُۚ وَٱللَّهُ عَلَىٰ كُلِّ شَيۡءٖ شَهِيدٌ ۝٦

6. అల్లాహ్ వారందరిని మరల బ్రతికించి లేపి, వారు చేసిందంతా వారికి తెలిపేరోజున వారు (తాము చేసిందంతా) మరచిపోయి ఉండ వచ్చు, కాని అల్లాహ్ అంతా లెక్క పెట్టి ఉంచుతాడు. మరియు అల్లాహ్‌యే ప్రతి దానికి సాక్షి.

أَلَمۡ تَرَ أَنَّ ٱللَّهَ يَعۡلَمُ مَا فِي ٱلسَّمَٰوَٰتِ وَمَا فِي ٱلۡأَرۡضِۖ مَا يَكُونُ مِن نَّجۡوَىٰ ثَلَٰثَةٍ إِلَّا هُوَ رَابِعُهُمۡ وَلَا خَمۡسَةٍ إِلَّا هُوَ سَادِسُهُمۡ وَلَآ أَدۡنَىٰ مِن ذَٰلِكَ وَلَآ أَكۡثَرَ إِلَّا هُوَ مَعَهُمۡ أَيۡنَ مَا كَانُواْۖ ثُمَّ يُنَبِّئُهُم بِمَا عَمِلُواْ يَوۡمَ ٱلۡقِيَٰمَةِۚ إِنَّ ٱللَّهَ بِكُلِّ شَيۡءٍ عَلِيمٌ ۝٧

7. ఏమీ? నీకు తెలియదా? నిశ్చయంగా, ఆకాశాలలో మరియు భూమిలో నున్న సర్వమూ అల్లాహ్‌కు తెలుసునని? ఏ ముగ్గురు కలిసి రహస్యసమాలోచనలు చేస్తూవున్నా ఆయన నాలుగవ వాడిగా ఉంటాడు. మరియు ఏ అయిదుగురు రహస్య సమాలోచనలు చేస్తూ వున్నా ఆయన ఆరవ వాడిగా ఉంటాడు. మరియు అంతకు తక్కువ మంది గానీ లేక అంతకు ఎక్కువ మంది గానీ ఉన్నా ఆయన వారితో తప్పక ఉంటాడు.[1] వారు ఎక్కడ వున్నాసరే! తరువాత ఆయన పునరుత్థాన దినమున వారు చేసిన కర్మలను వారికి తెలుపుతాడు. నిశ్చయంగా, అల్లాహ్‌కు ప్రతివిషయం గురించి బాగా తెలుసు.

أَلَمۡ تَرَ إِلَى ٱلَّذِينَ نُهُواْ عَنِ ٱلنَّجۡوَىٰ ثُمَّ يَعُودُونَ لِمَا نُهُواْ عَنۡهُ وَيَتَنَٰجَوۡنَ بِٱلۡإِثۡمِ وَٱلۡعُدۡوَٰنِ وَمَعۡصِيَتِ

8. ఏమీ? నీకు తెలియదా (చూడటం లేదా)? రహస్యసమాలోచనల్ని నిషేధించటం జరిగినప్పటికీ! వారు - వారికి నిషేధింపబడిన దానినే - మళ్ళీ చేస్తున్నారని?[2] మరియు వారు రహస్యంగా

1. అంటే అల్లాహ్ (సు.తా.) తన జ్ఞానంతో వారితో ఉంటాడు.

2. ఈ ఆయత్ మదీనా యొక్క యూదులను మరియు కపటవిశ్వాసులను గురించి పలుకుతుంది. వారు ఉన్నచోట నుండి ముస్లింలు పోతూ ఉంటే, వారు గుసగుసలాడే వారు, దానికి ముస్లింలు, వారు తమను గురించి ఏదైనా దురాలోచనలు చేస్తున్నారేమో! లేక ముస్లింల సైన్యం మీద ఏదైన శత్రువుల సైన్యం దాడిచేసి వారికి నష్టం కలిగించిందేమో! అని భయపడే వారు, కావున దైవప్రవక్త ('స'అస) ఇట్టి గుసగుసలను నిషేధించారు. అయినా

ٱلرَّسُولِ وَإِذَا جَآءُوكَ حَيَّوۡكَ بِمَا لَمۡ يُحَيِّكَ بِهِ ٱللَّهُ وَيَقُولُونَ فِيٓ أَنفُسِهِمۡ لَوۡلَا يُعَذِّبُنَا ٱللَّهُ بِمَا نَقُولُۚ حَسۡبُهُمۡ جَهَنَّمُ يَصۡلَوۡنَهَاۖ فَبِئۡسَ ٱلۡمَصِيرُ ٨

- పాపం, హద్దులు మీరి ప్రవర్తించడం మరియు ప్రవక్త ఆజ్ఞలను ఉల్లంఘించడం గురించి - సమాలోచనలు చేస్తున్నారని? (ఓ ము'హమ్మద్!) నీ వద్దకు వచ్చినపుడు, అల్లాహ్ కూడా నీకు సలాం చేయనివిధంగా, వారు నీకు సలాం చేస్తూ, తమలో తాము ఇలా అనుకుంటారు:[1] "మేము పలికే మాటలకు, అల్లాహ్ మమ్మల్ని ఎందుకు శిక్షించటం లేదు?" వారికి నరకమే చాలు, వారందులో ప్రవేశిస్తారు. ఎంత ఘోరమైన గమ్యస్థానం!

يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوٓاْ إِذَا تَنَٰجَيۡتُمۡ فَلَا تَتَنَٰجَوۡاْ بِٱلۡإِثۡمِ وَٱلۡعُدۡوَٰنِ وَمَعۡصِيَتِ ٱلرَّسُولِ وَتَنَٰجَوۡاْ بِٱلۡبِرِّ وَٱلتَّقۡوَىٰۖ وَٱتَّقُواْ ٱللَّهَ ٱلَّذِيٓ إِلَيۡهِ تُحۡشَرُونَ ٩

**9**. ఓ విశ్వాసులారా! మీరు రహస్య సమాలోచనలు చేస్తే - పాపకార్యాలు, హద్దులుమీరి ప్రవర్తించటం మరియు ప్రవక్త ఆజ్ఞలను ఉల్లంఘించటం గురించి కాకుండా - పుణ్యకార్యాలు మరియు దైవభీతికి సంబంధించిన విషయాలను గురించి మాత్రమే (రహస్య సమాలోచనలు) చేయండి. మరియు అల్లాహ్ పట్ల భయభక్తులు కలిగి ఉండండి. ఆయన సన్నిధిలోనే మీరు సమావేశపరచ బడతారు.

---

వారు కొంతకాలం తరువాత మళ్ళీ ప్రారంభించారు. ఆ సందర్భంలోనే ఈ ఆయత్ అవతరింపబడింది. చూడండి, 4:114.

**1**. అల్లాహ్ (సు.తా.), మిమ్మల్ని పరస్పరం 'అస్సలాము అలైకుమ్ వ ర'హ్మతుల్లాహ్,' మీకు శాంతి కలుగు గాక! అని, చెప్పుకోండి. అని ఆజ్ఞాపించాడు. కాని యూదులు దైవప్రవక్త ('స'అస)ను చూసినప్పుడు: 'అస్సాము అలైకుమ్.' అంటే మీకు చావు వచ్చుగాక! అని అనేవారు. కావున దైవప్రవక్త ('స'అస) అలాంటి వారికి: 'వ అలైకుమ్.' అని జవాబు ఇవ్వండి, అని అన్నారు. అంటే మీరన్నదే మీకు! ('స'హీ'హ్ బు'ఖారీ, 'స'హీ'హ్ ముస్లిం).

إِنَّمَا ٱلنَّجْوَىٰ مِنَ ٱلشَّيْطَٰنِ لِيَحْزُنَ ٱلَّذِينَ ءَامَنُواْ وَلَيْسَ بِضَآرِّهِمْ شَيْـًٔا إِلَّا بِإِذْنِ ٱللَّهِۚ وَعَلَى ٱللَّهِ فَلْيَتَوَكَّلِ ٱلْمُؤْمِنُونَ ﴿١٠﴾

**10**. నిశ్చయంగా, రహస్యసమాలోచన షై'తాన్ చేష్టయే.[1] అది విశ్వాసులకు దుఃఖం కలిగించటానికే! కాని అల్లాహ్ అనుమతిలేనిదే అది వారికి ఏ మాత్రం నష్టం కలిగించజాలదు.[2] మరియు విశ్వాసులు కేవలం అల్లాహ్ మీదే నమ్మకం ఉంచుకోవాలి.

يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوٓاْ إِذَا قِيلَ لَكُمْ تَفَسَّحُواْ فِى ٱلْمَجَٰلِسِ فَٱفْسَحُواْ يَفْسَحِ ٱللَّهُ لَكُمْۖ وَإِذَا قِيلَ ٱنشُزُواْ فَٱنشُزُواْ يَرْفَعِ ٱللَّهُ ٱلَّذِينَ ءَامَنُواْ مِنكُمْ وَٱلَّذِينَ أُوتُواْ ٱلْعِلْمَ دَرَجَٰتٍۚ وَٱللَّهُ بِمَا تَعْمَلُونَ خَبِيرٌ ﴿١١﴾

**11**. ఓ విశ్వాసులారా సమావేశాలలో (వచ్చేవారికి) చోటు కల్పించమని మీతో అన్నప్పుడు, మీరు జరిగి, చోటుకల్పిస్తే, అల్లాహ్ మీకు విశాలమైన చోటును ప్రసాదిస్తాడు.[3] మరియు ఒకవేళ మీతో (నమా'జ్ లేక జిహా'ద్‌కు) లేవండి అని చెప్పబడితే! మీరు లేవండి. మరియు మీలో విశ్వసించిన వారికి మరియు జ్ఞానం ప్రసాదించబడిన వారికి అల్లాహ్ ఉన్నత స్థానాలను ప్రసాదిస్తాడు.[4] మరియు మీరు చేసేదంతా అల్లాహ్ బాగా ఎరుగును.

---

**1**. ఒకవేళ మీరు ముగ్గురు ఒకేచోట ఉంటే, మీరు మీలో ఒకడిని విడిచి మిగతా ఇద్దరు పరస్పరం గుసగుసలాడుకోరాదు! ఎందుకంటే అది, మూడోవాణ్ణి చింతకు గురిచేస్తుంది. ('స'హీ'హ్ ముస్లిం, 'స'హీ'హ్ బు'ఖారీ) అతడు అనుమతి ఇస్తే, మిగతా ఇద్దరు ఏకాంతంలో మాట్లాడుకోవచ్చు!

**2**. చూడండి, 14:22.

**3**. ఈ సమావేశాలు ధర్మసమావేశాలు జుమ'అహ్ లేక ఇతర సమావేశాలు కావచ్చు! మొదట వచ్చినవారు విడివిడిగా దూరం దూరంగా కూర్చుంటే తరువాత వచ్చే వారికి చోటు దొరుకుతుంది. దైవప్రవక్త ప్రవచనం: 'ఏ వ్యక్తి కి కూడా మరొక వ్యక్తిని ఆతని చోటునుండి లేపి కూర్చోవటం సభ్యత కాదు. కావున మీరు సమావేశంలో కూర్చున్నప్పుడు దూరం దూరంగా కూర్చోండి.' ('స'హీ'హ్ బు'ఖారీ, 'స'హీ'హ్ ముస్లిం).

**4**. దైవప్రవక్త ('స'అస) ప్రవచనం: ఒక భక్తిపరుని ('ఆబిద్)పై ఒక జ్ఞానవంతుని ('ఆలిమ్) యొక్క ఆధిక్యత పూర్ణిమ రాత్రిలో, నక్షత్రాలపై చంద్రునికి ఉండే ఆధిక్యత వంటిది. (ఇబ్నె-'హంబల్, అబూ-దావూద్, తిర్మి'జీ', నసాయీ', ఇబ్నె-మాజా. మరియు దారిమీ).

**12.** ఓ విశ్వాసులారా! మీరు ప్రవక్తతో ఏకాంతంలో మాట్లాడదలిస్తే, మాట్లాడబోయేముందు, ఏదైనా కొంత దానం చేయండి. ఇది మీ కొరకు ఉత్తమమైనది మరియు చాలా శ్రేష్ఠమైనది. కాని (ఒకవేళ దానం చేయటానికి) మీ వద్ద ఏమీ లేకపోతే, నిశ్చయంగా, అల్లాహ్ క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత అని తెలుసుకోండి.

**13.** ఏమీ? మీరు (ప్రవక్తతో) మీ ఏకాంత సమాలోచనలకు ముందు దానాలు చేయవలసి ఉన్నదని భయపడుతున్నారా? ఒకవేళ మీరు అలా (దానం) చేయక పోతే అల్లాహ్ మిమ్మల్ని మన్నించాడు, కావున మీరు నమాజ్‌ను స్థాపించండి మరియు విధిదానం (జకాత్) ఇవ్వండి. అల్లాహ్ మరియు ఆయన ప్రవక్తకు విధేయులుగా ఉండండి. వాస్తవానికి మీరు చేసేదంతా అల్లాహ్ బాగా ఎరుగును. (1/8)

**14.** * ఏమీ? అల్లాహ్ ఆగ్రహానికి గురిఅయిన జాతివారి వైపుకు మరలినవారిని నీవు చూడలేదా? వారు మీతో చేరినవారు కారు మరియు వారితోను చేరినవారు కారు. వారు బుద్ధిపూర్వకంగా అసత్య ప్రమాణం చేస్తున్నారు.

**15.** అల్లాహ్ వారి కొరకు కఠిన శిక్షను సిద్ధపరచి ఉంచాడు. నిశ్చయంగా, వారు చేసే పనులన్నీ చాలాచెడ్డవి.

**16.** వారు తమ ప్రమాణాలను డాలుగా చేసుకొని (ప్రజలను) అల్లాహ్ మార్గం నుండి నిరోధిస్తున్నారు, కావున వారికి అవమానకరమైన శిక్ష పడుతుంది.

يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوٓاْ إِذَا نَٰجَيۡتُمُ ٱلرَّسُولَ فَقَدِّمُواْ بَيۡنَ يَدَيۡ نَجۡوَىٰكُمۡ صَدَقَةٗۚ ذَٰلِكَ خَيۡرٞ لَّكُمۡ وَأَطۡهَرُۚ فَإِن لَّمۡ تَجِدُواْ فَإِنَّ ٱللَّهَ غَفُورٞ رَّحِيمٌ ١٢

ءَأَشۡفَقۡتُمۡ أَن تُقَدِّمُواْ بَيۡنَ يَدَيۡ نَجۡوَىٰكُمۡ صَدَقَٰتٖۚ فَإِذۡ لَمۡ تَفۡعَلُواْ وَتَابَ ٱللَّهُ عَلَيۡكُمۡ فَأَقِيمُواْ ٱلصَّلَوٰةَ وَءَاتُواْ ٱلزَّكَوٰةَ وَأَطِيعُواْ ٱللَّهَ وَرَسُولَهُۥۚ وَٱللَّهُ خَبِيرُۢ بِمَا تَعۡمَلُونَ ١٣

۞ أَلَمۡ تَرَ إِلَى ٱلَّذِينَ تَوَلَّوۡاْ قَوۡمًا غَضِبَ ٱللَّهُ عَلَيۡهِم مَّا هُم مِّنكُمۡ وَلَا مِنۡهُمۡ وَيَحۡلِفُونَ عَلَى ٱلۡكَذِبِ وَهُمۡ يَعۡلَمُونَ ١٤

أَعَدَّ ٱللَّهُ لَهُمۡ عَذَابٗا شَدِيدًاۖ إِنَّهُمۡ سَآءَ مَا كَانُواْ يَعۡمَلُونَ ١٥

ٱتَّخَذُوٓاْ أَيۡمَٰنَهُمۡ جُنَّةٗ فَصَدُّواْ عَن سَبِيلِ ٱللَّهِ فَلَهُمۡ عَذَابٞ مُّهِينٞ ١٦

لَّن تُغۡنِيَ عَنۡهُمۡ أَمۡوَٰلُهُمۡ وَلَآ أَوۡلَٰدُهُم مِّنَ ٱللَّهِ شَيۡـًٔاۚ أُوْلَٰٓئِكَ أَصۡحَٰبُ ٱلنَّارِۖ هُمۡ فِيهَا خَٰلِدُونَ ١٧

**17**. అల్లాహ్ (శిక్ష) నుండి కాపాడటానికి, వారి సంపదలు గానీ, వారి సంతానం గానీ, వారికి ఏమాత్రం పనికిరావు. ఇలాంటి వారే నరకాగ్నివాసులు. అందులో వారు శాశ్వతంగా ఉంటారు.

يَوۡمَ يَبۡعَثُهُمُ ٱللَّهُ جَمِيعٗا فَيَحۡلِفُونَ لَهُۥ كَمَا يَحۡلِفُونَ لَكُمۡۖ وَيَحۡسَبُونَ أَنَّهُمۡ عَلَىٰ شَيۡءٍۚ أَلَآ إِنَّهُمۡ هُمُ ٱلۡكَٰذِبُونَ ١٨

**18**. అల్లాహ్ వారందరినీ మరల బ్రతికించి లేపిన రోజు, వారు మీతో ప్రమాణాలు చేసినట్లు ఆయన (అల్లాహ్) ముందు కూడా ప్రమాణాలు చేస్తారు. మరియు దానివలన వారు మంచి స్థితిలో ఉన్నారని భావిస్తారు. జాగ్రత్త! నిశ్చయంగా, ఇలాంటి వారే మహా అసత్యవాదులు!

ٱسۡتَحۡوَذَ عَلَيۡهِمُ ٱلشَّيۡطَٰنُ فَأَنسَىٰهُمۡ ذِكۡرَ ٱللَّهِۚ أُوْلَٰٓئِكَ حِزۡبُ ٱلشَّيۡطَٰنِۚ أَلَآ إِنَّ حِزۡبَ ٱلشَّيۡطَٰنِ هُمُ ٱلۡخَٰسِرُونَ ١٩

**19**. షైతాన్ వారిపై ప్రాబల్యం పొందినందు వలన వారిని అల్లాహ్ ధ్యానం నుండి మరపింపజేశాడు. అలాంటి వారు షైతాన్ పక్షానికి చెందినవారు. జాగ్రత్త! షైతాన్ పక్షానికి చెందినవారు, వారే! నిశ్చయంగా నష్టపోయే వారు.

إِنَّ ٱلَّذِينَ يُحَآدُّونَ ٱللَّهَ وَرَسُولَهُۥٓ أُوْلَٰٓئِكَ فِي ٱلۡأَذَلِّينَ ٢٠

**20**. నిశ్చయంగా, ఎవరైతే అల్లాహ్ మరియు ఆయన ప్రవక్తను వ్యతిరేకిస్తారో! అలాంటి వారే, పరమనీచులలో చేరినవారు.

كَتَبَ ٱللَّهُ لَأَغۡلِبَنَّ أَنَا۠ وَرُسُلِيٓۚ إِنَّ ٱللَّهَ قَوِيٌّ عَزِيزٞ ٢١

**21**. "నిశ్చయంగా, నేను మరియు నా ప్రవక్తలు మాత్రమే ప్రాబల్యం వహిస్తాము." అని అల్లాహ్ వ్రాసిపెట్టాడు[1] నిశ్చయంగా, అల్లాహ్ మహా బలశాలి, సర్వశక్తిమంతుడు!

---

**1**. లౌహె-మహ్ఫూజ్‌లో వ్రాసిపెట్టబడిన విధివ్రాతలోఎలాంటి మార్పు జరగదు. ఇంకా చూడండి, 40:51-52.

لَّا تَجِدُ قَوۡمٗا يُؤۡمِنُونَ بِٱللَّهِ وَٱلۡيَوۡمِ ٱلۡأٓخِرِ يُوَآدُّونَ مَنۡ حَآدَّ ٱللَّهَ وَرَسُولَهُۥ وَلَوۡ كَانُوٓاْ ءَابَآءَهُمۡ أَوۡ أَبۡنَآءَهُمۡ أَوۡ إِخۡوَٰنَهُمۡ أَوۡ عَشِيرَتَهُمۡۚ أُوْلَٰٓئِكَ كَتَبَ فِي قُلُوبِهِمُ ٱلۡإِيمَٰنَ وَأَيَّدَهُم بِرُوحٖ مِّنۡهُۖ وَيُدۡخِلُهُمۡ جَنَّٰتٖ تَجۡرِي مِن تَحۡتِهَا ٱلۡأَنۡهَٰرُ خَٰلِدِينَ فِيهَاۚ رَضِيَ ٱللَّهُ عَنۡهُمۡ وَرَضُواْ عَنۡهُۚ أُوْلَٰٓئِكَ حِزۡبُ ٱللَّهِۚ أَلَآ إِنَّ حِزۡبَ ٱللَّهِ هُمُ ٱلۡمُفۡلِحُونَ ﴿٢٢﴾

**22**. అల్లాహ్ మరియు పరలోకాన్ని విశ్వసించే జనులలో - అల్లాహ్ మరియు ఆయన సందేశహరుణ్ణి వ్యతిరేకించే వారితో - స్నేహంచేసుకునే వారిని నీవు పొందలేవు;[1] ఆ వ్యతిరేకించే వారు, తమ తండ్రులైనా లేదా తమ కుమారులైనా లేదా తమ సోదరులైనా లేదా తమ కుంటుంబంవారైనా సరే![2] అలాంటి వారి హృదయాలలో ఆయన విశ్వాసాన్ని స్థిరపరచాడు. మరియు వారిని తన వైపునుండి ఒక ఆత్మశక్తి (రూ'హ్) ఇచ్చి బలపరిచాడు. మరియు వారిని క్రింద కాలువలు ప్రవహించే స్వర్గవనాలలో ప్రవేశింపజేస్తాడు. అందులో వారు శాశ్వతంగా ఉంటారు. అల్లాహ్ వారిపట్ల ప్రసన్నుడవుతాడు మరియు వారు ఆయనపట్ల ప్రసన్నులవుతారు. ఇలాంటి వారు, అల్లాహ్ పక్షానికి చెందిన వారు. గుర్తుంచుకోండి! నిశ్చయంగా, అల్లాహ్ పక్షం వారే సాఫల్యం పొందేవారు.

*****

1. చూడండి, 3:28, 9:24 మొదలైనవి.

2. చూడండి, 8:67.

## 59. సూరహ్ అల్-'హష్ర్ سُورَةُ الحَشْرِ

అల్-హ'ష్రు: సమకూర్చటం, సమావేశపరచటం, ప్రోగుచేయటం, కూడబెట్టటం, **సమీకరించటం**. ఈ 10 **మదీనా** సూరాహ్‌లలో ఇది 3వది. 3వ హిజ్రీలో ఉ'హుద్ యుద్ధంలో ముస్లింలకు కొంత పరాభవం కలిగినందుకు, బనూ-న'దీర్ తెగవారు ముస్లింలతో చేసుకున్న ఒప్పందాన్ని త్రెంపుకొని, మక్కా ముష్రిక్ ఖురైషులతో మైత్రి చేసుకొని విశ్వాసఘాతకం చేసినందుకు, వారిని రబీ' అల్-అవ్వల్ 4వ హిజ్రీలో మదీనా మునవ్వరహ్ నుండి వెడలగొట్టిన విషయం పేర్కొనబడింది. (2-7). సమాజపు కొన్ని ముఖ్య అంశాలు ఇందులో వివరించబడ్డాయి. దీని పేరు **2**వ **ఆయత్**‌లో ఉంది. బనూ-న'దీర్ తెగవారిని గురించి ఈ సూరాహ్ అవతరింపజేయబడింది. కాబట్టి ఇది **సూరహ్ అన్-న'దీర్** అని కూడా అనబడుతుంది. ('స'హీ'హ్ బు'ఖారీ). వారిలో చాలా మంది సిరియాకు వెళ్ళిపోయారు. రెండు కుటుంబాల వారు మాత్రమే 'ఖైబర్‌కు పోయారు. విశ్వాసులు, తాము సత్యసంధులై దైవభీతిపరులైతే - సంఖ్యలో, ధన సంపత్తులలో మరియు యద్ధ సామాగ్రిలో తక్కువ ఉన్నా - సర్వశక్తిమంతుడు, మహా వివేకవంతుడు అయిన అల్లాహ్ (సు.తా.) వారికి తప్పక సహాయం చేస్తాడని నమ్మాలి. ఇందులో **24 ఆయతులు** ఉన్నాయి.

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

C B A

**1.** ఆకాశాలలో నున్న సమస్తమూ మరియు భూమిలో నున్న సమస్తమూ, అల్లాహ్ పవిత్రతను కొనియాడుతుంటాయి. మరియు ఆయనే సర్వశక్తిమంతుడు, మహా వివేకవంతుడు.

سَبَّحَ لِلَّهِ مَا فِي ٱلسَّمَٰوَٰتِ وَمَا فِي ٱلْأَرْضِ ۖ وَهُوَ ٱلْعَزِيزُ ٱلْحَكِيمُ ﴿١﴾

**2.** గ్రంథప్రజలలోని సత్యతిరస్కారులను మొదట **సమీకరించిన** (బనూ-న'దీర్ తెగ) వారిని, వారి గృహాలనుండి వెళ్ళగొట్టిన వాడు ఆయనే.[1] వారు వెళ్ళిపోతారని మీరు ఏ

هُوَ ٱلَّذِيٓ أَخْرَجَ ٱلَّذِينَ كَفَرُوا۟ مِنْ أَهْلِ ٱلْكِتَٰبِ مِن دِيَٰرِهِمْ لِأَوَّلِ ٱلْحَشْرِ ۚ مَا ظَنَنتُمْ أَن يَخْرُجُوا۟ ۖ

---

**1**. దైవప్రవక్త ('స'అస) ప్రస్థానం చేసి మక్కా నుండి మదీనాకు వచ్చినప్పుడు మదీనా చుట్టుప్రాంతాలలో మూడు యూద తెగలవారు ఉండేవారు. 1) బనూ-ఖైనుఖా'అ, *2)* బనూ-న'దీర్ మరియు *3)* బనూ-ఖురై''జహ్. దైవప్రవక్త ('స'అస) వారందరితో సంధి చేసుకుంటారు. బనూ-ఖైనుఖా'అ తెగవారు తమ దౌర్జన్యాలవల్ల వెడలగొట్టబడతారు. దానికి చూడండి, 59:15 వ్యాఖ్యానం 2. బనూ-న'దీర్ తెగవారు 3వ హిజ్రీలో,

وَظَنُّوٓاْ أَنَّهُم مَّانِعَتُهُمْ حُصُونُهُم مِّنَ ٱللَّهِ فَأَتَىٰهُمُ ٱللَّهُ مِنْ حَيْثُ لَمْ يَحْتَسِبُواْ ۖ وَقَذَفَ فِى قُلُوبِهِمُ ٱلرُّعْبَ ۚ يُخْرِبُونَ بُيُوتَهُم بِأَيْدِيهِمْ وَأَيْدِى ٱلْمُؤْمِنِينَ فَٱعْتَبِرُواْ يَٰٓأُوْلِى ٱلْأَبْصَٰرِ ﴿٢﴾

మాత్రం భావించలేదు. మరియు అల్లాహ్ నుండి తమను తమ కోటలు తప్పక రక్షిస్తాయని వారు భావించారు! కాని అల్లాహ్ (శిక్ష) వారు ఊహించని వైపునుండి, వారిపై వచ్చిపడింది. మరియు ఆయన వారి హృదయాలలో భయం కలుగజేశాడు, కావున వారు తమ ఇండ్లను తమ చేతులారా మరియు విశ్వాసుల చేతులతో కూడా, నాశనం చేయించుకున్నారు. కావున ఓ పరిజ్ఞానం (కళ్ళు) గలవారలారా! గుణపాఠం నేర్చుకోండి.

وَلَوْلَآ أَن كَتَبَ ٱللَّهُ عَلَيْهِمُ ٱلْجَلَآءَ لَعَذَّبَهُمْ فِى ٱلدُّنْيَا ۖ وَلَهُمْ فِى ٱلْءَاخِرَةِ عَذَابُ ٱلنَّارِ ﴿٣﴾

**3.** మరియు ఒకవేళ అల్లాహ్ వారి విషయంలో దేశ బహిష్కారం వ్రాసి ఉండక పోతే, వారిని ఈ ప్రపంచములోనే శిక్షించి ఉండేవాడు. మరియు వారికి పరలోకంలో నరకాగ్ని శిక్ష పడుతుంది.

ذَٰلِكَ بِأَنَّهُمْ شَآقُّواْ ٱللَّهَ وَرَسُولَهُۥ ۖ وَمَن يُشَآقِّ ٱللَّهَ فَإِنَّ ٱللَّهَ شَدِيدُ ٱلْعِقَابِ ﴿٤﴾

**4.** ఇది ఎందుకంటే, వారు అల్లాహ్ మరియు ఆయన ప్రవక్తను వ్యతిరేకించారు. మరియు అల్లాహ్‌ను వ్యతిరేకించిన వాడిని శిక్షించటంలో నిశ్చయంగా, అల్లాహ్ చాలా కఠినుడు.

---

ముస్లింలకు ఉ'హుద్ యుద్ధరంగంలో కొంత నష్టం కలిగినందుకు, దైవప్రవక్త ('స'అస)తో తమ సంధిని తెంపుకుంటారు. అతనిని చంపటానికి ప్రయత్నిస్తారు. ముష్రిక్ ఖురైషులతో కలిసి ముస్లింలను పూర్తిగా నిర్మూలించాలని పన్నాగాలు పన్నుతారు. అప్పుడు దైవప్రవక్త ('స'అస) వారితో: 'మాతో యుద్ధం చేయటానికి సిద్ధపడండి లేక మదీనా విడిచి వెళ్ళిపోండి!' అనే రెండు దారులు చూపుతారు. వారు వెళ్ళిపోవటానికి ఒప్పుకొని, పది రోజుల గడువు కోరుతారు. ఈ మధ్య వారు, కపటవిశ్వాసుల నాయకుడైన 'అబ్దుల్లా బిన్ ఉబైతో రహస్యసమాలోచనలు చేస్తారు. అతడు వారితో: 'మీరు యుద్ధం చేస్తే మీకు మేము రెండువేల యుద్ధవీరులతో సహాయం చేస్తాము. కావున మీ కోటలను వదలి వెళ్ళకండి! ఒకవేళ ముస్లింలు మిమ్మల్ని వెడలగొట్టితే మేము కూడా మీ వెంటవస్తాము!' అని అంటాడు. అప్పుడు ముస్లింలు వారి కోటలను 21 రోజులు చుట్టు ముట్టి ఉంచుతారు. 'అబ్దుల్లా బిన్ ఉబై వారికి సహాయపడనందుకు, ముస్లింల అనుమతితో తాము తీసుకోగల సామాగ్రి తీసుకొని వెళ్ళిపోతారు.

مَا قَطَعۡتُم مِّن لِّينَةٍ أَوۡ تَرَكۡتُمُوهَا قَآئِمَةً عَلَىٰٓ أُصُولِهَا فَبِإِذۡنِ ٱللَّهِ وَلِيُخۡزِيَ ٱلۡفَٰسِقِينَ ۝٥

5. (ఓ విశ్వాసులారా!) మీరు ఏ ఖర్జూరపు చెట్లను నరికివేశారో[1] లేక ఏ ఖర్జూరపు చెట్లను వాటి వ్రేళ్ళమీద నిలబడేలా వదలిపెట్టారో, అంతా అల్లాహ్ ఆజ్ఞతోనే జరిగింది. మరియు ఇదంతా అవిధేయులను అవమానించటానికి జరిగిన విషయం.

وَمَآ أَفَآءَ ٱللَّهُ عَلَىٰ رَسُولِهِۦ مِنۡهُمۡ فَمَآ أَوۡجَفۡتُمۡ عَلَيۡهِ مِنۡ خَيۡلٖ وَلَا رِكَابٖ وَلَٰكِنَّ ٱللَّهَ يُسَلِّطُ رُسُلَهُۥ عَلَىٰ مَن يَشَآءُۚ وَٱللَّهُ عَلَىٰ كُلِّ شَيۡءٖ قَدِيرٞ ۝٦

6. మరియు అల్లాహ్ తన ప్రవక్తకు, వారి నుండి ఇప్పించిన ఫయ్అ' కొరకు, మీరు గుర్రాలను గానీ ఒంటెలను గానీ పరిగెత్తించలేదు.[2] కాని అల్లాహ్ తాను కోరిన వారిపై, తన సందేశహరునికి ఆధిక్యత నొసంగుతాడు. మరియు అల్లాహ్ ప్రతిదీ చేయగల సమర్థుడు.

مَّآ أَفَآءَ ٱللَّهُ عَلَىٰ رَسُولِهِۦ مِنۡ أَهۡلِ ٱلۡقُرَىٰ فَلِلَّهِ وَلِلرَّسُولِ وَلِذِي ٱلۡقُرۡبَىٰ وَٱلۡيَتَٰمَىٰ وَٱلۡمَسَٰكِينِ وَٱبۡنِ ٱلسَّبِيلِ كَيۡ لَا يَكُونَ دُولَةَۢ بَيۡنَ ٱلۡأَغۡنِيَآءِ مِنكُمۡۚ وَمَآ ءَاتَىٰكُمُ ٱلرَّسُولُ فَخُذُوهُ وَمَا نَهَىٰكُمۡ عَنۡهُ فَٱنتَهُواْۚ وَٱتَّقُواْ ٱللَّهَۖ إِنَّ ٱللَّهَ شَدِيدُ ٱلۡعِقَابِ ۝٧

7. అల్లాహ్ తన ప్రవక్తకు ఆ నగరవాసుల నుండి ఇప్పించిన దాని(ఫయ్అ')లో, అల్లాహ్‌కు మరియు ఆయన ప్రవక్తకు మరియు అతని దగ్గరిబంధువులకు మరియు అనాథులకు మరియు పేదలకు మరియు బాటసారులకు హక్కు ఉంది.[3] అది మీలో ధనవంతులైనవారి మధ్యనే తిరగకుండా ఉండటానికి, ఇలా నిర్ణయించబడింది. మరియు ప్రవక్త మీకు ఇచ్చిన దానిని తీసుకోండి మరియు అతను మీకు నిషేధించిన దానికి దూరంగా ఉండండి. అల్లాహ్‌పట్ల భయభక్తులు కలిగిఉండండి. నిశ్చయంగా, అల్లాహ్ శిక్షించటంలో చాలా కఠినుడు.

---

1. లీనతున్: ఒక రకపు ఖర్జూరపు చెట్టు. ఏ విధంగానైతే అజ్వా, బర్నీ ఉన్నాయో.
2. శత్రువు యుద్ధానికి ముందే పారిపోయి వదిలే సామగ్రిని ఫయ్ఉ'న్ అంటారు. యుద్ధంలో విజయం పొందిన తరువాత దొరికేసామగ్రిని 'గనీమత్అంటారు. చూడండి, 8:41.
3. యుద్ధబూటి / విజయధనం (మాలె 'గనీమత్) నుండి, 1/5వ వంతులో మాత్రమే ఇలాంటి వారికి హక్కు ఉంది. కాని ఫయ్అ'లో పూర్తి ఆదాయాన్ని ఇలాంటి వారిలోనే పంచాలి. ఎందుకంటే ఇక్కడ యుద్ధం చేసి గెలిచిన వారంటూ ఎవరూ లేరు.

لِلْفُقَرَآءِ ٱلْمُهَـٰجِرِينَ ٱلَّذِينَ أُخْرِجُوا۟ مِن دِيَـٰرِهِمْ وَأَمْوَٰلِهِمْ يَبْتَغُونَ فَضْلًا مِّنَ ٱللَّهِ وَرِضْوَٰنًا وَيَنصُرُونَ ٱللَّهَ وَرَسُولَهُۥٓ ۚ أُو۟لَـٰٓئِكَ هُمُ ٱلصَّـٰدِقُونَ ﴿٨﴾

**8**. (దానిలో నుండి కొంత భాగంపై) తమ ఇండ్లనుండి మరియు తమ ఆస్తిపాస్తుల నుండి వెడలగొట్టబడి, వలసవచ్చిన (ముహాజిర్) పేద వారికి కూడా హక్కు ఉంది. వారు అల్లాహ్ అనుగ్రహాన్ని మరియు ఆయన ప్రసన్నతను కోరుతున్నారు. మరియు వారు అల్లాహ్ మరియు ఆయన ప్రవక్తకు సహాయం చేస్తున్నారు. ఇలాంటి వారు, వీరే సత్యవంతులు.[1]

وَٱلَّذِينَ تَبَوَّءُو ٱلدَّارَ وَٱلْإِيمَـٰنَ مِن قَبْلِهِمْ يُحِبُّونَ مَنْ هَاجَرَ إِلَيْهِمْ وَلَا يَجِدُونَ فِى صُدُورِهِمْ حَاجَةً مِّمَّآ أُوتُوا۟ وَيُؤْثِرُونَ عَلَىٰٓ أَنفُسِهِمْ وَلَوْ كَانَ بِهِمْ خَصَاصَةٌ ۚ وَمَن يُوقَ شُحَّ نَفْسِهِۦ فَأُو۟لَـٰٓئِكَ هُمُ ٱلْمُفْلِحُونَ ﴿٩﴾

**9**. మరియు ఎవరైతే - ఈ (వలస వచ్చిన వారు) రాకపూర్వమే - విశ్వసించి వలస కేంద్రం (మదీనా)లో నివసిస్తూ ఉండేవారో! వారికి కూడా హక్కు వుంది.[2] వారు తమ వద్దకు వలసవచ్చిన వారిని ప్రేమిస్తారు. మరియు వారు (వలసవచ్చిన) వారికి ఏది ఇవ్వబడినా! దాని అవసరం తమకు ఉన్నట్లు భావించరు మరియు తమకు అవసరమున్నా వారికి తమ సొంత (అవసరాల) మీద ప్రాధాన్యతనిస్తారు. మరియు ఎవరైతే ఆత్మ లోభంనుండి రక్షింపబడతారో! అలాంటి వారు, వారే! సాఫల్యం పొందేవారు.[3]

---

**1**. ఇందులో, ఫయ్అ' యొక్క ఒక భాగాన్ని వలస వచ్చిన వారికి ఇవ్వాలని పేర్కొనబడింది. దానితో పాటు వలస వచ్చినవారి (ముహాజిర్‌ల) గొప్పతనం కూడా వివరించబడింది. వారిని గురించి అల్లాహ్ (సు.తా.) ఇలాంటి ఆయత్ అవతరింపజేసిన తరువాత కూడా వారి విశ్వాసాన్ని అనుమానించటం, ఖుర్ఆన్‌ను తిరస్కరించటమే!

**2**. వీరు - ముహాజిర్‌లు మదీనాకు రాకముందే - విశ్వసించిన, మదీనా వాసులైన అన్సారులు. ఫయ్అ' ధనం మొదట ముహాజిర్‌లకు పంచిపెట్టబడినా, వీరు అసూయపడలేదు.

**3**. 'మిమ్మల్ని మీరు లోభం నుండి రక్షించుకోండి. ఈ లోభమే పూర్వ కాలపు వారిని నాశనం చేసింది. అదే వారిని రక్తపాతానికి గురిచేసింది. మరియు వారు నిషిద్ధ ('హారామ్) వస్తువులను, ధర్మసమ్మతం ('హలాల్) చేసుకున్నారు.' ('స'హీ'హ్ ముస్లిం).

وَٱلَّذِينَ جَآءُو مِنۢ بَعۡدِهِمۡ يَقُولُونَ رَبَّنَا ٱغۡفِرۡ لَنَا وَلِإِخۡوَٰنِنَا ٱلَّذِينَ سَبَقُونَا بِٱلۡإِيمَٰنِ وَلَا تَجۡعَلۡ فِي قُلُوبِنَا غِلّٗا لِّلَّذِينَ ءَامَنُواْ رَبَّنَآ إِنَّكَ رَءُوفٞ رَّحِيمٌ ١٠

**10**. మరియు ఎవరైతే వారి తరువాత వచ్చారో! వారికి అందులో హక్కు ఉంది. వారు ఇలా అంటారు: "ఓ మా ప్రభూ! మమ్మల్ని మరియు మా కంటే ముందు విశ్వసించిన మా సోదరులను క్షమించు. మరియు మా హృదయాలలో విశ్వాసుల పట్ల ద్వేషాన్ని కలిగించకు.[1] ఓ మా ప్రభూ! నిశ్చయంగా, నీవు చాలా కనికరించేవాడవు, అపార కరుణాప్రదాతవు!" (1/4)

۞ أَلَمۡ تَرَ إِلَى ٱلَّذِينَ نَافَقُواْ يَقُولُونَ لِإِخۡوَٰنِهِمُ ٱلَّذِينَ كَفَرُواْ مِنۡ أَهۡلِ ٱلۡكِتَٰبِ لَئِنۡ أُخۡرِجۡتُمۡ لَنَخۡرُجَنَّ مَعَكُمۡ وَلَا نُطِيعُ فِيكُمۡ أَحَدًا أَبَدٗا وَإِن قُوتِلۡتُمۡ لَنَنصُرَنَّكُمۡ وَٱللَّهُ يَشۡهَدُ إِنَّهُمۡ لَكَٰذِبُونَ ١١

**11**.* (ఓ ము'హమ్మద్!) కపట విశ్వాసులను గురించి నీకు తెలియదా?[2] వారు గ్రంథప్రజలలో సత్యతిరస్కారులైన తమ సోదరులతో, ఇలా అంటారు: "ఒకవేళ మీరు వెళ్ళగొట్టబడినట్లయితే, మేము కూడా తప్పక మీతోబాటు వెళ్తాము. మరియు మీ విషయంలో మేము ఎవ్వరి మాటా వినము. ఒకవేళ మీతో యుద్ధం జరిగితే, మేము తప్పక మీకు సహాయపడతాము." మరియు నిశ్చయంగా వారు అసత్యవాదులు, అల్లాహ్‌యే దీనికి సాక్షి!

---

**1**. వీరు ఫయ్అ'కు హక్కుదారులైన మరొక రకం వారు. వీరు సహాబీల తరువాత తరంవారు మరియు వారి అడుగుజాడలలో నడిచేవారు. వీరిలో తాబ'యీన్ మరియు వారిని అనుసరించిన వారూ మరియు పునరుత్థానదినం వరకు ఈమాన్‌లో ప్రవేశించే వారందరూ ఉన్నారు! ఇమామ్ మాలిక్ (ర'హ్మ) ఈ ఆయత్ వ్యాఖ్యానంలో అన్నారు: 'రాఫజీ, ఎవరైతే 'స'హాబా(ర'ది.'అన్హుమ్)లను దూషిస్తారో, వారికి ఫయ్అ' - ధనంలో భాగం లేదు. ఎందుకంటే అల్లాహ్ (సు.తా.) 'స'హాబా(ర'ది.'అన్హుమ్)లను పొగుడుతున్నాడు. మరియు వారేమో 'స'హాబా(ర'ది.'అన్హుమ్)లను దూషిస్తున్నారు.' (ఇబ్నె-కసీ'ర్). 'ఆయి'షహ్ (ర. 'అన్హా) కథనం: మీరు 'స'హాబా(ర'ది.'అన్హుమ్)ల కొరకు ఇస్తి'గ్ఫార్ చేయండని, దైవప్రవక్త ('స'అస) ద్వారా ఆజ్ఞాపించబడ్డారు. కాని మీరు వారిని దూషిస్తున్నారు. నేను మీ ప్రవక్త ('స'అస)ను ఇలా అంటుండగా విన్నాను: 'ఈ జాతిలోని చివరివారు తమ మొదటి వారిని శపించనంతవరకూ ఈ జాతి నశించదు.!' (బ'గవీ ఈ 'హదీస్'ను ఉల్లేఖించారు).

**2**. ఈ ఆయత్‌లు (11-14లు) ముస్లింలు, బనూ-న'దీర్ వారిపైకి దాడి చేయటానికి వెళ్ళకముందు అవతరింపజేయబడ్డాయి.

لَئِنۡ أُخۡرِجُواْ لَا يَخۡرُجُونَ مَعَهُمۡ وَلَئِن قُوتِلُواْ لَا يَنصُرُونَهُمۡ وَلَئِن نَّصَرُوهُمۡ لَيُوَلُّنَّ ٱلۡأَدۡبَٰرَ ثُمَّ لَا يُنصَرُونَ ١٢

**12**. కాని (వాస్తవానికి) వారు (యూదులు) వెడలగొట్టబడితే, వీరు (ఈ కపట విశ్వాసులు) వారివెంట ఎంతమాత్రం వెళ్ళరు మరియు వారితో యుద్ధంజరిగితే, (ఈ కపటవిశ్వాసులు) వారికి ఏమాత్రం సహాయపడరు.[1] ఒకవేళ వీరు, వారికి (యూదులకు) సహాయపడినా, వారు తప్పక వెన్నుచూపి పారిపోతారు. ఆ తరువాత వారు విజయం (సహాయం) పొందలేరు.

لَأَنتُمۡ أَشَدُّ رَهۡبَةٗ فِي صُدُورِهِم مِّنَ ٱللَّهِۚ ذَٰلِكَ بِأَنَّهُمۡ قَوۡمٞ لَّا يَفۡقَهُونَ ١٣

**13**. వారి హృదయాలలో, అల్లాహ్ భయంకంటే, మీ భయమే ఎక్కువ ఉంది. ఇది ఎందుకంటే! వాస్తవానికి వారు అర్థం చేసుకోలేని జనులు.

لَا يُقَٰتِلُونَكُمۡ جَمِيعًا إِلَّا فِي قُرٗى مُّحَصَّنَةٍ أَوۡ مِن وَرَآءِ جُدُرِۭۚ بَأۡسُهُم بَيۡنَهُمۡ شَدِيدٞۚ تَحۡسَبُهُمۡ جَمِيعٗا وَقُلُوبُهُمۡ شَتَّىٰۚ ذَٰلِكَ بِأَنَّهُمۡ قَوۡمٞ لَّا يَعۡقِلُونَ ١٤

**14**. వారందరూ కలసి కూడా, దృఢమైన కోటలుగల నగరాలలోనో, లేదా గోడల చాటు నుండో తప్ప, మీతో యుద్ధం చేయజాలరు. వారి మధ్య ఒకరి మీద ఒకరికి ఉన్న ద్వేషం, ఎంతో తీవ్రమైనది. వారు కలసిఉన్నట్లు నీవు భావిస్తావు, కాని వారి హృదయాలు చీలిపోయి ఉన్నాయి. ఇది ఎందుకంటే, వాస్తవానికి వారు బుద్ధిహీనులైన జనులు.

كَمَثَلِ ٱلَّذِينَ مِن قَبۡلِهِمۡ قَرِيبٗاۖ ذَاقُواْ وَبَالَ أَمۡرِهِمۡ وَلَهُمۡ عَذَابٌ أَلِيمٞ ١٥

**15**. వీరి దృష్టాంతం సమీపంలోనే గడిచిన వారిని (బనూ-ఖైనుఖా'అలను) పోలిఉంది. వారు తమ కార్యాల ఫలితాన్ని చవిచూశారు, మరియు (పరలోకంలో) వారికి బాధాకరమైన శిక్ష ఉంది.[2]

---

**1**. ఈ ఆయత్ మునాఫిఖుల బూటక వాగ్దానాలను వివరిస్తోంది. అలాగే జరిగింది. బనూ-న'దీర్ తెగవారిని వారి ఇండ్లనుండి వెడలగొట్టినప్పుడూ మరియు బనూ-ఖురై''జహ్ తెగవారిని బంధించి నప్పుడూ, ఈ కపట విశ్వాసులు వారికి ఎలాంటి సహాయం చేయలేదు.

**2**. ఈ ఆయత్ 2వహి'జ్రీలో, బద్ర్‌యుద్ధం తరువాత మదీనానుండి వెడలగొట్టబడిన బనూ-ఖైనుఖా'అ తెగవారిని ఉద్దేశించిందని కొందరి అభిప్రాయం. మరికొందరి అభిప్రాయం ఇది 2వహి'జ్రీలో మక్కా ముష్రికులతో జరిగిన బద్ర్‌యుద్ధానికి సంబంధించినదని, (ఇబ్నె-కసీ'ర్).

**16**. వారి దృష్టాంతం మానవుణ్ణి ప్రేరేపిస్తూ, ఇలా అనే ఆ షై'తాన్ వలే ఉంది అతడు: "సత్యాన్ని తిరస్కరించు." అని అంటాడు. అతడు తిరస్కరించిన తరువాత ఇలా అంటాడు: "నిశ్చయంగా, నాకు నీతో ఏ విధమైన సంబంధం లేదు, నిశ్చయంగా, నేను సర్వలోకాల ప్రభువైన అల్లాహ్‌కు భయపడే వాడిని!"[1]

كَمَثَلِ ٱلشَّيۡطَٰنِ إِذۡ قَالَ لِلۡإِنسَٰنِ ٱكۡفُرۡ فَلَمَّا كَفَرَ قَالَ إِنِّي بَرِيٓءٞ مِّنكَ إِنِّيٓ أَخَافُ ٱللَّهَ رَبَّ ٱلۡعَٰلَمِينَ ﴿١٦﴾

**17**. తరువాత ఆ ఇద్దరి పర్యవసానం, నిశ్చయంగా ఆ ఇరువురూ నరకాగ్నిలో ఉండటమే! అందు వారు శాశ్వతంగా ఉంటారు. మరియు దుర్మార్గులకు లభించే ప్రతిఫలం ఇదే!

فَكَانَ عَٰقِبَتَهُمَآ أَنَّهُمَا فِي ٱلنَّارِ خَٰلِدَيۡنِ فِيهَاۚ وَذَٰلِكَ جَزَٰٓؤُاْ ٱلظَّٰلِمِينَ ﴿١٧﴾

**18**. ఓ విశ్వాసులారా! అల్లాహ్ పట్ల భయభక్తులు కలిగి ఉండండి మరియు ప్రతివ్యక్తి, తాను రేపటి కొరకు ఏమి సమకూర్చుకున్నాడో చూసుకోవాలి మరియు అల్లాహ్ పట్ల భయభక్తులు కలిగి ఉండండి. నిశ్చయంగా, మీరు చేసేదంతా అల్లాహ్ ఎరుగును!

يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُواْ ٱتَّقُواْ ٱللَّهَ وَلۡتَنظُرۡ نَفۡسٞ مَّا قَدَّمَتۡ لِغَدٖۖ وَٱتَّقُواْ ٱللَّهَۚ إِنَّ ٱللَّهَ خَبِيرُۢ بِمَا تَعۡمَلُونَ ﴿١٨﴾

**19**. మరియు అల్లాహ్‌ను మరచిపోయిన వారి మాదిరిగా మీరూ అయిపోకండి. అందు వలన ఆయన వారిని, తమను తాము మరచి పోయేటట్లు చేశాడు. అలాంటి వారు! వారే అవిధేయులు (ఫాసిఖూన్).

وَلَا تَكُونُواْ كَٱلَّذِينَ نَسُواْ ٱللَّهَ فَأَنسَىٰهُمۡ أَنفُسَهُمۡۚ أُوْلَٰٓئِكَ هُمُ ٱلۡفَٰسِقُونَ ﴿١٩﴾

**20**. నరకవాసులు మరియు స్వర్గ వాసులు సరిసమానులు కాజాలరు. స్వర్గవాసులు, వారే! విజయం పొందేవారు.

لَا يَسۡتَوِيٓ أَصۡحَٰبُ ٱلنَّارِ وَأَصۡحَٰبُ ٱلۡجَنَّةِۚ أَصۡحَٰبُ ٱلۡجَنَّةِ هُمُ ٱلۡفَآئِزُونَ ﴿٢٠﴾

---

1. చూడండి, 8:48 మరియు 14:22.

لَوْ أَنزَلْنَا هَٰذَا ٱلْقُرْءَانَ عَلَىٰ جَبَلٍ لَّرَأَيْتَهُۥ خَٰشِعًا مُّتَصَدِّعًا مِّنْ خَشْيَةِ ٱللَّهِ ۚ وَتِلْكَ ٱلْأَمْثَٰلُ نَضْرِبُهَا لِلنَّاسِ لَعَلَّهُمْ يَتَفَكَّرُونَ ﴿٢١﴾

**21**. ఒకవేళ మేము ఈ ఖుర్ఆన్‌ను ఏ పర్వతంపైనైనా అవతరింపజేసి ఉంటే, అల్లాహ్ భయంవల్ల అది అణిగి బ్రద్దలైపోవటాన్ని నీవు చూసిఉంటావు. మరియు బహుశా ప్రజలు ఆలోచిస్తారని, ఇలాంటి దృష్టాంతాలను మేము వారిముందు పెడుతున్నాము.

هُوَ ٱللَّهُ ٱلَّذِى لَآ إِلَٰهَ إِلَّا هُوَ ۖ عَٰلِمُ ٱلْغَيْبِ وَٱلشَّهَٰدَةِ ۖ هُوَ ٱلرَّحْمَٰنُ ٱلرَّحِيمُ ﴿٢٢﴾

**22**. ఆయనే, అల్లాహ్! ఆయన తప్ప మరొక ఆరాధ్య దైవం లేడు. ఆయనకు అగోచర మరియు గోచర విషయాలన్నీ తెలుసు.[1] ఆయన అనంత కరుణామయుడు, అపార కరుణాప్రదాత.

هُوَ ٱللَّهُ ٱلَّذِى لَآ إِلَٰهَ إِلَّا هُوَ ٱلْمَلِكُ ٱلْقُدُّوسُ ٱلسَّلَٰمُ ٱلْمُؤْمِنُ ٱلْمُهَيْمِنُ ٱلْعَزِيزُ ٱلْجَبَّارُ ٱلْمُتَكَبِّرُ ۚ سُبْحَٰنَ ٱللَّهِ عَمَّا يُشْرِكُونَ ﴿٢٣﴾

**23**. ఆయనే, అల్లాహ్! ఆయన తప్ప మరొక ఆరాధ్యుడు లేడు. ఆయన విశ్వ సార్వభౌముడు, పరమ పవిత్రుడు, శాంతికి మూలాధారుడు, శాంతిప్రదాత, శరణమిచ్చే వాడు, సర్వశక్తిమంతుడు, నిరంకుశుడు, గొప్పవాడు. వారు కల్పించే భాగ స్వాములకు అల్లాహ్ అతీతుడు.[2]

---

**1**. చూడండి, 6:73.

**2**. **అల్-మలికు**: Sovereign, విశ్వసార్వభౌముడు, చక్రవర్తి, విశ్వాధిపతి, సర్వాధికారి. చూడండి, 20:114 వ్యాఖ్యానం 3.
**అల్-ఖుద్దూసు**: All-Holy, All-Pure, పరమపవిత్రుడు, పరిశుద్ధుడు, పావనుడు. చూ. 62:1.
**అస్-సలాము**: Author of Safety and Security, Free from all defects, imperfections, blemish or vices, **శాంతికి మూలాధారి**, సురక్షితుడు, సర్వదౌర్బల్యాలకు, బలహీనతలకు అతీతుడు.
**అల్-మూ'మిను**: He who Maketh mankind Secure from His punishment, **శాంతి ప్రదాత**, శాంతిమయుడు. సకల ఆపదలు, యాతనలనుండి కాపాడి ప్రశాంతిని ప్రసాదించేవాడు, భద్రత నిచ్చేవాడు.
**అల్-ముహైమిను**: Preserver of Safety, One who determines what is true and false, He who will faithfully perform to His servants what He has promised them. **శరణమిచ్చేవాడు**, సంరక్షకుడు, సత్యాసత్యాలను పరిష్కరించే, నిర్ణయించే వాడు, తన సృష్టిని కనిపెట్టుకొని ఉండేవాడు, **జాగరూకుడు**.

هُوَ ٱللَّهُ ٱلْخَٰلِقُ ٱلْبَارِئُ ٱلْمُصَوِّرُ ۖ لَهُ ٱلْأَسْمَآءُ ٱلْحُسْنَىٰ ۚ يُسَبِّحُ لَهُۥ مَا فِى ٱلسَّمَٰوَٰتِ وَٱلْأَرْضِ ۖ وَهُوَ ٱلْعَزِيزُ ٱلْحَكِيمُ ﴿٢٤﴾

**24.** ఆయనే, అల్లాహ్! విశ్వసృష్టికర్త, ప్రతిదానిని సృజించే వాడు మరియు రూపాలను తీర్చిదిద్దే వాడు. ఆయనకు సర్వశ్రేష్ఠమైన పేర్లున్నాయి.[1] ఆకాశాలలో మరియు భూమిలో ఉన్న సమస్తమూ, ఆయన పవిత్రతను కొనియాడుతూ ఉంటాయి. మరియు ఆయనే సర్వశక్తిమంతుడు, మహా వివేకవంతుడు.

*****

---

**అల్-'అ'జీ'జ్:** All-Mighty, సర్వశక్తిమంతుడు చూడండి, 2:129.

**అల్-జబ్బారు:** The Compeller of His creatures to do whatsoever He willeth, Irresistible, Insolent, Who exhalts Himself, Un-controlled, **నిరంకుశుడు,** గొప్ప ప్రాబల్యం గలవాడు.

**అల్-ముతకబ్బిరు:** The Incomparably Great, The Most Great, **గొప్పవాడు,** గొప్పదనానికి సరోవరం, మహనీయుడు, సర్వాధికుడు. ఇవి అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లు.

**సుబ్'హాన:** I extol or celeberate or declare Thy remoteness or freedom from every Impurity or Imperfection. Or extolled be His absolute perfection. Hallowed, Exalted, Extolled, Glorified, **సర్వలోపాలకు అతీతుడు,** పరిశుద్ధుడు, పరమ పవిత్రుడు, పావనుడు, ప్రశంసనీయుడు, శ్లాఘింప, పొగడ, స్తుతింపదగినవాడు. చూడండి, 2:32, 116, 12:108.

1. **అల్-'ఖాలిఖు:** The Creater of all things. సృష్టికర్త. చూడండి, 6:102.

**అల్-బారిఉ':** The Maker, ప్రతిదాని నిర్మాత, ఎట్టి పోలిక, సామ్యం లేకుండా ప్రతిదానిని **సృజించేవాడు.** లేమి నుండి ఉనికి లోకి తెచ్చేవాడు. చూడండి, 2:54.

**అల్-ము'సవ్విరు:** The Fashioner, of all existing things, **రూపమిచ్చేవాడు.** తాను కోరిన విధంగా తన సృష్టి రూపాన్ని తీర్చిదిద్దేవాడు. 3:6

**అల్-'హకీము:** All-Wise, Possessing knowledge or Science, Omniscient, **మహా వివేకవంతుడు,** వివేచనాపరుడు. చూడండి, 2:32. ఇంకా చూడండి, 7:180. ఇవి అల్లాహ్ (సు.తా.) అత్యుత్తమ పేర్లు.

## 60. సూరహ్ అల్-ముమ్‌త'హనహ్ سُورَةُ المُمتَحنَة

అల్-ముమ్‌త'హి('హ)నహ్: The Examined One, అంటే పరిశోధింపబడినది, పరిశీలింపబడినది, పరీక్షించబడినది. ఈ సమూహపు 10 **మదీనా** సూరాహ్‌లలో ఇది 4వది. ఈ సూరహ్ 7-8 హి(జ్రీలలో అవతరింపజేయబడింది. దీనిపేరు **10**వ **ఆయత్** నుండి తీసుకోబడింది. ము(ష్రిక్‌లను వదలి 'మేము విశ్వసించాము' అని మదీనాకు వచ్చే స్త్రీల నిజాయితీని పరిశీలించాలని ఈ సూరహ్‌లో ఆజ్ఞ వచ్చింది. ఇందులో **13 ఆయతులు** ఉన్నాయి.

**అనంత కరుణామయుడు అపార కరుణా(ప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

C B A

يَـٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوا۟ لَا تَتَّخِذُوا۟ عَدُوِّى وَعَدُوَّكُمْ أَوْلِيَآءَ تُلْقُونَ إِلَيْهِم بِٱلْمَوَدَّةِ وَقَدْ كَفَرُوا۟ بِمَا جَآءَكُم مِّنَ ٱلْحَقِّ يُخْرِجُونَ ٱلرَّسُولَ وَإِيَّاكُمْ ۙ أَن تُؤْمِنُوا۟ بِٱللَّهِ رَبِّكُمْ إِن كُنتُمْ خَرَجْتُمْ جِهَـٰدًا فِى سَبِيلِى وَٱبْتِغَآءَ مَرْضَاتِى ۚ تُسِرُّونَ إِلَيْهِم بِٱلْمَوَدَّةِ وَأَنَا۠ أَعْلَمُ بِمَآ

**1.** ఓ విశ్వాసులారా! నాకు శ(త్రువులైనవారిని మరియు మీకు కూడా శ(త్రువులైనవారిని - వారి మీద (పేమ చూపిస్తూ - వారిని మీ స్నేహితులుగా చేసుకోకండి.[1] మరియు వాస్తవానికి వారు మీ వద్దకు వచ్చిన సత్యాన్ని తిరస్కరించారు. మీ (ప్రభువైన అల్లాహ్‌ను మీరు విశ్వసించి నందుకు, వారు (ప్రవక్తను మరియు మిమ్మల్ని (మీ నగరం నుండి) వెడలగొట్టారు! ఒకవేళ మీరు నా (ప్రసన్నతకోరి, నా మార్గంలో ధర్మ యుద్ధం కొరకు వెళితే (ఈ సత్య

---

**1.** 'హుదైబియా సంధి అయినకొన్ని రోజుల తరువాత మక్కా ము(ష్రిక్‌లు దానిని ఉల్లంఘిస్తారు. దానికి దైవ(ప్రవక్త ('స'అస) రహస్యంగా యుద్ధసన్నాహాలు (ప్రారంభిస్తారు. 'హా'తిబ్ బిన్ అబీ బల్‌'అ (ర'ది.'అ.) అనే బదరీ 'స'హాబి ఈ విషయాన్ని ఒక ప(త్రం మీద (వ్రాసి మక్కాకు పోయే ఒక స్త్రీకి ఇస్తాడు. ఈ విషయం దైవ(ప్రవక్త('స'అస)కు వహీ ద్వారా తెలుస్తుంది. అతను ('స'అస) అలీ, ము'ఖ్దాద్ మరియు 'జుబైర్ (ర'ది.'అన్హుమ్)లతో: రవ్'దయే'ఖా'ఖ్, దగ్గర ఒక స్త్రీ ఉంది. ఆమె దగ్గర ఒక ఉత్తరం ఉంది. దానిని తీసుకురండి!' అని పంపుతారు. వారు ఆ ఉత్తరాన్ని ఆమె తల వెం(ట్రుకలనుండి తీయించి తెస్తారు. 'హా'తిబ్ (ర'ది.'అ.)ను (ప్రశ్నించగా: 'నేను ఖురైషును కాను. నా భార్యా పిల్లలు మక్కాలో నిస్సహాయులుగా ఉన్నారు. నేను ఖురైషులకు ఈ వార్త ఇస్తే వారు నా భార్యాపిల్లల పట్ల కనికరులుగా ఉంటారని ఇలా చేశాను.' అని అంటాడు. దైవ(ప్రవక్త ('స'అస) అతని సత్యాన్ని తెలుసుకొని అతనిని క్షమిస్తారు. ఆ సందర్భంలో ఈ ఆయత్ అవతరింపజేయబడింది. ('స. బు'ఖారీ, 'స. ముస్లిం).

أَخۡفَيۡتُمۡ وَمَآ أَعۡلَنتُمۡۚ وَمَن يَفۡعَلۡهُ مِنكُمۡ فَقَدۡ ضَلَّ سَوَآءَ ٱلسَّبِيلِ ١

తిరస్కారులను మీ స్నేహితులుగా చేసుకోకండి). వారి పట్ల వాత్సల్యం చూపుతూ మీరు వారికి రహస్యంగా సందేశం పంపుతారా! మీరు దాచేది మరియు వెలిబుచ్చేది, నాకు బాగా తెలుసు. మరియు మీలో ఎవడైతే ఇలా చేస్తాడో, అతడు వాస్తవంగా, ఋజుమార్గం నుండి తప్పిపోయిన వాడే!

إِن يَثۡقَفُوكُمۡ يَكُونُواْ لَكُمۡ أَعۡدَآءً وَيَبۡسُطُوٓاْ إِلَيۡكُمۡ أَيۡدِيَهُمۡ وَأَلۡسِنَتَهُم بِٱلسُّوٓءِ وَوَدُّواْ لَوۡ تَكۡفُرُونَ ٢

**2.** ఒకవేళ వారు మీ మీద ప్రాబల్యం వహిస్తే, వారు మీకు విరోధులవుతారు, మరియు కీడుతో మీ వైపుకు తమ చేతులను మరియు తమ నాలుకలను చాపుతారు.[1] మరియు మీరు కూడా సత్యతిరస్కారులై పోవాలని కోరుతారు.

لَن تَنفَعَكُمۡ أَرۡحَامُكُمۡ وَلَآ أَوۡلَٰدُكُمۡۚ يَوۡمَ ٱلۡقِيَٰمَةِ يَفۡصِلُ بَيۡنَكُمۡۚ وَٱللَّهُ بِمَا تَعۡمَلُونَ بَصِيرٞ ٣

**3.** మీ బంధువులు గానీ, మీ సంతానం గానీ మీకు ఏ విధంగానూ పనికిరారు.[2] ఆయన పునరుత్థానదినమున మీ మధ్య తీర్పుచేస్తాడు. మరియు అల్లాహ్ మీరు చేసేదంతా చూస్తున్నాడు.

قَدۡ كَانَتۡ لَكُمۡ أُسۡوَةٌ حَسَنَةٞ فِيٓ إِبۡرَٰهِيمَ وَٱلَّذِينَ مَعَهُۥٓ إِذۡ قَالُواْ لِقَوۡمِهِمۡ إِنَّا بُرَءَٰٓؤُاْ مِنكُمۡ وَمِمَّا تَعۡبُدُونَ مِن دُونِ ٱللَّهِ كَفَرۡنَا بِكُمۡ وَبَدَا بَيۡنَنَا وَبَيۡنَكُمُ ٱلۡعَدَٰوَةُ وَٱلۡبَغۡضَآءُ أَبَدًا

**4.** వాస్తవానికి ఇబ్రాహీమ్ మరియు అతనితో ఉన్నవారిలో మీ కొరకు ఒక మంచి ఆదర్శం ఉంది. వారు తమ జాతివారితో ఇలా అన్నప్పుడు: "నిశ్చయంగా, అల్లాహ్‌ను వదలి మీరు ఆరాధించే వాటితో మరియు మీతో, మాకు ఎలాంటి సంబంధం లేదు. మేము మిమ్మల్ని త్యజించాము మరియు మీరు అద్వితీయుడైన అల్లాహ్‌ను విశ్వసించనంత వరకు, మాకూ మీకూ మధ్య విరోధం

**1.** అంటే తమ చేష్టలతో మరియు మాటలతో మిమ్మల్ని వేధిస్తారు.
**2.** చూడండి, 80:34.

حَتَّىٰ تُؤْمِنُوا۟ بِٱللَّهِ وَحْدَهُۥٓ إِلَّا قَوْلَ إِبْرَٰهِيمَ لِأَبِيهِ لَأَسْتَغْفِرَنَّ لَكَ وَمَآ أَمْلِكُ لَكَ مِنَ ٱللَّهِ مِن شَىْءٍ ۖ رَّبَّنَا عَلَيْكَ تَوَكَّلْنَا وَإِلَيْكَ أَنَبْنَا وَإِلَيْكَ ٱلْمَصِيرُ ﴿٤﴾

మరియు ద్వేషం ఉంటుంది." ఇక ఇబ్రాహీమ్ తన తండ్రితో: "నేను తప్పక నిన్ను క్షమించమని (నా ప్రభువును) వేడుకుంటాను. ఇది తప్ప, నీ కొరకు అల్లాహ్ నుండి మరేమీ పొందే అధికారం నాకు లేదు." అని మాత్రమే అనగలిగాడు.[1] (అల్లాహ్‌తో ఇలా ప్రార్థించాడు): "ఓ నా ప్రభూ! మేము నిన్నే నమ్ముకున్నాము[2] మరియు నీ వైపునకే పశ్చాత్తాపంతో మరలుతున్నాము మరియు నీ వైపుకే మా గమ్యస్థానముంది.

رَبَّنَا لَا تَجْعَلْنَا فِتْنَةً لِّلَّذِينَ كَفَرُوا۟ وَٱغْفِرْ لَنَا رَبَّنَآ ۖ إِنَّكَ أَنتَ ٱلْعَزِيزُ ٱلْحَكِيمُ ﴿٥﴾

**5.** "ఓ మా ప్రభూ! మమ్మల్ని సత్యతిరస్కారుల కొరకు పరీక్షాసాధనంగా చేయకు[3] మరియు ఓ మా ప్రభూ మమ్మల్ని క్షమించు. నిశ్చయంగా కేవలం నీవే! సర్వ శక్తిమంతుడువు, మహా వివేచనాపరుడవు."

لَقَدْ كَانَ لَكُمْ فِيهِمْ أُسْوَةٌ حَسَنَةٌ لِّمَن كَانَ يَرْجُوا۟ ٱللَّهَ وَٱلْيَوْمَ ٱلْـَٔاخِرَ ۚ وَمَن يَتَوَلَّ فَإِنَّ ٱللَّهَ هُوَ ٱلْغَنِىُّ ٱلْحَمِيدُ ﴿٦﴾

**6.** వాస్తవంగా! మీకు - అల్లాహ్‌ను మరియు అంతిమ దినాన్ని అపేక్షించే వారికి[4] - వారిలో ఒక మంచి ఆదర్శం ఉంది. మరియు ఎవడైనా దీనినుండి మరలిపోతే! నిశ్చయంగా, అల్లాహ్ నిరపేక్షాపరుడు, సర్వస్తోత్రాలకు అర్హుడు (అని తెలుసుకోవాలి). (3/8)

---

**1**. కాని అతని తండ్రి ముష్రిక్‌గా మరణించిన తరువాత ఇబ్రాహీమ్ ('అ.స.) తన తండ్రితో సంబంధం తెంపుకున్నాడు. చూడండి, 9:114 మరియు 19:47-48.

**2**. తవక్కల్: అంటే వీలైనంత వరకు ప్రయత్నంచేసి, ఆ తరువాత అల్లాహ్ (సు.తా.) పై నమ్మకం ఉంచుకొని, అల్లాహ్(సు.తా.)పై ఆధారపడాలి. అలా చేయకుండా అల్లాహ్ (సు.తా.)పై మాత్రమే ఆధారపడి ఉంటామనడం తగినది కాదు. దైవప్రవక్త ('స'అస) దగ్గరికి ఒక వ్యక్తి వస్తాడు. అతడు తన ఒంటెను బయటవిడిచి లోపలికి వెళ్తాడు. దైవప్రవక్త ('స'అస) అడగ్గా ఇలా అంటాడు: 'నేను ఒంటెను అల్లాహ్‌కు అప్పగించి వచ్చాను.' దైవప్రవక్త ('స'అస) అంటారు: 'ఇది తవక్కల్ కాదు. మొదట దానిని కట్టి ఉంచు తరువాత అల్లాహ్ (సు.తా.)పై ఆధారపడు!' (తిర్మిజీ').

**3**. ఇటువంటి ఆయత్‌కు చూడండి, 10:85.

**4**. చూడండి, 33:21.

۞ عَسَى ٱللَّهُ أَن يَجۡعَلَ بَيۡنَكُمۡ وَبَيۡنَ ٱلَّذِينَ عَادَيۡتُم مِّنۡهُم مَّوَدَّةٗۚ وَٱللَّهُ قَدِيرٞۚ وَٱللَّهُ غَفُورٞ رَّحِيمٞ ۝٧

7. * బహుశా, అల్లాహ్ మీ మధ్య మరియు మీకు విరోధులైన వారి మధ్య ప్రేమ కలిగించవచ్చు. మరియు అల్లాహ్ (ప్రతిదీ చేయగల) సమర్థుడు. మరియు అల్లాహ్ క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత.

لَّا يَنۡهَىٰكُمُ ٱللَّهُ عَنِ ٱلَّذِينَ لَمۡ يُقَٰتِلُوكُمۡ فِي ٱلدِّينِ وَلَمۡ يُخۡرِجُوكُم مِّن دِيَٰرِكُمۡ أَن تَبَرُّوهُمۡ وَتُقۡسِطُوٓاْ إِلَيۡهِمۡۚ إِنَّ ٱللَّهَ يُحِبُّ ٱلۡمُقۡسِطِينَ ۝٨

8. ఎవరైతే ధర్మవిషయంలో మీతో యుద్ధంచేయరో మరియు మిమ్మల్ని మీ గృహాలనుండి వెళ్ళగొట్టరో! వారిపట్ల మీరు సత్ప్రవర్తనతో మరియు న్యాయంతో వ్యవహరించటాన్ని అల్లాహ్ నిషేధించలేదు.[1] నిశ్చయంగా, అల్లాహ్ న్యాయవర్తులను ప్రేమిస్తాడు.[2]

إِنَّمَا يَنۡهَىٰكُمُ ٱللَّهُ عَنِ ٱلَّذِينَ قَٰتَلُوكُمۡ فِي ٱلدِّينِ وَأَخۡرَجُوكُم مِّن دِيَٰرِكُمۡ وَظَٰهَرُواْ عَلَىٰٓ إِخۡرَاجِكُمۡ أَن تَوَلَّوۡهُمۡۚ وَمَن يَتَوَلَّهُمۡ فَأُوْلَٰٓئِكَ هُمُ ٱلظَّٰلِمُونَ ۝٩

9. కాని, వాస్తవానికి ఎవరైతే, ధర్మ విషయంలో మీతో యుద్ధంచేస్తారో మరియు మిమ్మల్ని మీ ఇండ్ల నుండి వెళ్ళగొడ్తారో మరియు మిమ్మల్ని వెళ్ళగొట్టటంలో పరస్పరం సహకరించు కుంటారో; వారితో స్నేహం చేయటాన్ని అల్లాహ్ మీ కొరకు నిషేధిస్తున్నాడు. మరియు ఎవరైతే వారితో స్నేహంచేస్తారో, అలాంటి వారు, వారే! దుర్మార్గులు.[3]

---

1. ఎలాంటి సత్యతిరస్కారులతో సత్ప్రవర్తనతో వ్యవహరించాలో వారి వివరాలు ఇక్కడ ఇవ్వబడ్డాయి. **ఒకటి:** మీరు కేవలం ముస్లింలు అయినందుకు మీతో శత్రుత్వం వహించి మీతో పోరాడనివారితో, **రెండు:** మిమ్మల్ని మీ ఇల్లూ వాకిలి విడిచిపొమ్మని బలవంతం చేయనివారితో! **మూడు:** మీకు విరుద్ధంగా ఇతర సత్య తిరస్కారులకు సహాయపడని వారితో!
2. దైవప్రవక్త ('స'అస)ను అస్మా బిన్తె అబూబక్ర్ సిద్దీఖ్ (ర. 'అన్హా), ముష్రిక్‌రాలైన తన తల్లితో ఎలా వ్యవహరించాలని అడిగారు. అతను ('స'అస) ఇలా జవాబిచ్చారు: 'నీ తల్లితో రక్త సంబంధాన్ని ఉంచుకో!' ('స'హీ'హ్ ముస్లిం, 'స'హీ'హ్ బు'ఖారీ) మరొక విషయం ఏమిటంటే బంధువులు కాని సత్యతిరస్కారులతో కూడ న్యాయంగా ప్రవర్తించాలి.
3. చూడండి, 5:51.

يَـٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوٓا۟ إِذَا جَآءَكُمُ ٱلْمُؤْمِنَـٰتُ مُهَـٰجِرَٰتٍ فَٱمْتَحِنُوهُنَّ ۖ ٱللَّهُ أَعْلَمُ بِإِيمَـٰنِهِنَّ ۖ فَإِنْ عَلِمْتُمُوهُنَّ مُؤْمِنَـٰتٍ فَلَا تَرْجِعُوهُنَّ إِلَى ٱلْكُفَّارِ ۖ لَا هُنَّ حِلٌّ لَّهُمْ وَلَا هُمْ يَحِلُّونَ لَهُنَّ ۖ وَءَاتُوهُم مَّآ أَنفَقُوا۟ ۚ وَلَا جُنَاحَ عَلَيْكُمْ أَن تَنكِحُوهُنَّ إِذَآ ءَاتَيْتُمُوهُنَّ أُجُورَهُنَّ ۚ وَلَا تُمْسِكُوا۟ بِعِصَمِ ٱلْكَوَافِرِ وَسْـَٔلُوا۟ مَآ أَنفَقْتُمْ وَلْيَسْـَٔلُوا۟ مَآ أَنفَقُوا۟ ۚ ذَٰلِكُمْ حُكْمُ ٱللَّهِ ۖ يَحْكُمُ بَيْنَكُمْ ۚ وَٱللَّهُ عَلِيمٌ حَكِيمٌ ﴿١٠﴾

**10.** ఓ విశ్వాసులారా! విశ్వసించిన స్త్రీలు, మీ వద్దకు వలస వచ్చినపుడు, వారిని పరీక్షించండి.[1] అల్లాహ్‌కు వారి విశ్వాసం గురించి బాగా తెలుసు. వారు వాస్తవంగా విశ్వసించిన వారని మీకు తెలిసినప్పుడు, వారిని సత్యతిరస్కారుల వద్దకు తిరిగి పంపకండి. (ఎందుకంటే) ఆ స్త్రీలు వారికి (సత్యతిరస్కారులకు) ధర్మసమ్మతమైన (భార్యలు) కారు మరియు వారు కూడా ఆ స్త్రీలకు ధర్మసమ్మతమైన (భర్తలు) కారు. కాని, వారు (సత్యతిరస్కారులు), వారికిచ్చిన (మ్రహ్) మీరు వారికి చెల్లించండి. మరియు వారికి వారి మ్రహ్ ఇచ్చిన తరువాత, ఆ స్త్రీలను వివాహమాడితే మీకు ఎలాంటి దోషంలేదు. మరియు మీరు కూడా సత్యతిరస్కారులైన స్త్రీలను మీ వివాహబంధంలో ఉంచుకోకండి.[2] (అవిశ్వాసులుగా ఉండిపోదలచిన) మీ భార్యల నుండి మీరు ఇచ్చిన మ్రహ్ అడిగి తీసుకోండి.[3]

---

**1.** 6వ హిజ్రీలో జరిగిన 'హుదైబియా ఒప్పందంలో ఏవ్యక్తి అయినా మక్కానుండి మదీనాకు వెళ్ళిపోతే ఆవ్యక్తిని మక్కావారు - తిరిగి ఇవ్వమని అడిగితే - ఇవ్వాలి అనే షర్త్ ఉండింది. కాని అందులో స్త్రీ/ పురుషుల విషయం స్పష్టంగా లేదు. దానిని బట్టి ముస్లింలయి మదీనాకు వచ్చిన స్త్రీలను వాపసు ఇవ్వండి అని మక్కా ముష్రిక్‌లు కోరగా, ఈ ఆయత్ అవతరింపజేయబడింది. వారు కేవలం ఇస్లాం కొరకే వచ్చారని, నిర్ధారణ చేసుకోవాలని ఆజ్ఞ ఉంది. యుక్త వయస్కుడైన పురుషునికి లేక స్త్రీకి తనకు నచ్చిన ధర్మాన్ని అనుసరించే హక్కు ఉంది. ఈ ఆయత్ అవతరించక ముందు చాలా మంది ముస్లింల భర్తలు లేక భార్యలు ముష్రికులుగా ఉండేవారు. ఉదాహరణకు దైవప్రవక్త ('స'అస) బిడ్డ 'జైనబ్ (ర. 'అన్హా) భర్త అబుల్ 'ఆ'స్ బిన్ రబీ'అ, ముష్రిక్‌గా ఉండేవారు. అతను బద్ర్ యుద్ధపు కొంత కాలం తరువాత ఇస్లాం స్వీకరించి మదీనాకు వచ్చారు.

**2.** 'ఉమర్ (ర'ది.'అ.) గారి ఇద్దరు భార్యలు ముష్రికులు. ఈ ఆయత్ అవతరణ తరువాత అతను వారికి విడాకులిచ్చారు.

**3**. ఒక స్త్రీ ఇస్లాం స్వీకరించగానే ఆమె ముష్రిక్ భర్తతో ఆమె వివాహబంధం వెంటనే తెగిపోతుంది. అతడు ఆమె నుండి తన మ్రహ్ వాపసు తీసుకోవచ్చు.

(అలాగే అవిశ్వాసులను, విశ్వాసులైన తమ) భార్యలనుండి మహ్ర్ అడిగి తీసుకోనివ్వండి. ఇది అల్లాహ్ తీర్మానం. ఆయన ఈ విధంగా మీ మధ్య తీర్పుచేస్తున్నాడు. మరియు అల్లాహ్ సర్వజ్ఞుడు, మహా వివేచనాపరుడు.

وَإِن فَاتَكُمۡ شَيۡءٞ مِّنۡ أَزۡوَٰجِكُمۡ إِلَى ٱلۡكُفَّارِ فَعَاقَبۡتُمۡ فَـَٔاتُواْ ٱلَّذِينَ ذَهَبَتۡ أَزۡوَٰجُهُم مِّثۡلَ مَآ أَنفَقُواْۚ وَٱتَّقُواْ ٱللَّهَ ٱلَّذِيٓ أَنتُم بِهِۦ مُؤۡمِنُونَ ١١

**11**. మరియు ఒకవేళ మీ (విశ్వాసుల) భార్యలలో ఒకామె, మిమ్మల్ని విడిచి సత్యతిరస్కారుల వద్దకు వెళ్ళిపోతే! (ఆ సత్యతిరస్కారులు, మీరు ఆ స్త్రీలకు చెల్లించిన మహ్ర్, మీకు వాపసు ఇవ్వడానికి నిరాకరిస్తే)! ఆ తరువాత మీకు వారితో ప్రతీకారం తీర్చుకొనే అవకాశం దొరికితే (మీరు వారిపై యుద్ధంచేసి విజయం పొందితే)! [1] దాని (విజయధనం) నుండి, ఎవరి భార్యలైతే సత్యతిరస్కారుల వద్దకు పోయారో వారికి - వారు (తమ భార్యలకు) ఇచ్చిన దానికి (మహ్ర్‌కు) సమానంగా - చెల్లించండి. మరియు మీరు విశ్వసించిన, అల్లాహ్ యందు, భయభక్తులు కలిగి ఉండండి.

يَٰٓأَيُّهَا ٱلنَّبِيُّ إِذَا جَآءَكَ ٱلۡمُؤۡمِنَٰتُ يُبَايِعۡنَكَ عَلَىٰٓ أَن لَّا يُشۡرِكۡنَ بِٱللَّهِ شَيۡـٔٗا وَلَا يَسۡرِقۡنَ وَلَا يَزۡنِينَ وَلَا يَقۡتُلۡنَ أَوۡلَٰدَهُنَّ وَلَا يَأۡتِينَ بِبُهۡتَٰنٖ يَفۡتَرِينَهُۥ بَيۡنَ أَيۡدِيهِنَّ وَأَرۡجُلِهِنَّ

**12**. ఓ ప్రవక్తా! విశ్వసించిన స్త్రీలు ప్రమాణం (బైఅత్) చేయటానికి నీ వద్దకు వచ్చి, తాము ఎవరినీ అల్లాహ్‌కు సాటి కల్పించమని మరియు దొంగతనం చేయమని మరియు వ్యభిచారం చేయమని మరియు తమ సంతానాన్ని హత్యచేయమని మరియు తమచేతుల మధ్య మరియు తమకాళ్ళ మధ్య నిందారోపణ కల్పించమని మరియు

---

**1**. 'ఆఖబ్‌తుమ్ (దీని మరొక వ్యాఖ్యానం): ప్రతీకారం తీసుకునే అవకాశం దొరికితే అంటే, ముష్రికుల భార్యలు కూడా ముస్లింలై, ముస్లింల దగ్గరికి వస్తే వారి - ఆ ముస్లింలు అయిన స్త్రీల - మహ్ర్ వారి మొదటి ముష్రిక్ భర్తలకు చెల్లించక, దాని నుండి ఏ ముస్లింల భార్యలైతే ముష్రికులై వెళ్ళిపోయారో ఆ పురుషులకు చెల్లించాలి.

وَلَا يَعۡصِينَكَ فِي مَعۡرُوفٖ فَبَايِعۡهُنَّ وَٱسۡتَغۡفِرۡ لَهُنَّ ٱللَّهَۚ إِنَّ ٱللَّهَ غَفُورٞ رَّحِيمٞ ١٢

ధర్మసమ్మతమైన విషయాలలో నీకు అవిధేయత చూపమని, ప్రమాణం చేస్తే, వారినుండి ప్రమాణం (బై'అత్) తీసుకో[1] మరియు వారిని క్షమించమని అల్లాహ్ ను ప్రార్థించు. నిశ్చయంగా, అల్లాహ్ క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత.

يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُواْ لَا تَتَوَلَّوۡاْ قَوۡمًا غَضِبَ ٱللَّهُ عَلَيۡهِمۡ قَدۡ يَئِسُواْ مِنَ ٱلۡأٓخِرَةِ كَمَا يَئِسَ ٱلۡكُفَّارُ مِنۡ أَصۡحَٰبِ ٱلۡقُبُورِ ١٣

**13**. ఓ విశ్వాసులారా! అల్లాహ్ ఆగ్రహానికి గురిఅయిన జాతివారిని స్నేహితులుగా చేసుకోకండి.[2] వాస్తవానికి గోరీలలో ఉన్న సత్యతిరస్కారులు, నిరాశ చెందినట్లు వారు కూడా పరలోక జీవితంపట్ల నిరాశచెంది ఉన్నారు.

*****

---

**1**. ఈ విధమైన ప్రమాణం దైవప్రవక్త ('స'అస) ఇస్లాం స్వీకరించి, ముష్రికులను వదలి వచ్చే స్త్రీలచేత చేయించే వారు. మరియు 8వ హిజ్రీలో మక్కా విజయం తరువాత కూడా చేయించారు. కానీ శపథం చేయించేటప్పుడు దైవప్రవక్త ఏ స్త్రీని కూడా ముట్టుకోలేదు అంటే చేతిపై చేయిపెట్టి ప్రమాణం చేయించలేదు, కేవలం వారి నోటితో మాత్రమే ప్రమాణం చేయించారు! ('స'హీ'హ్ బు'ఖారీ - 'ఆయి'షహ్ (ర. 'అన్హా) కథనం).

**2**. చూడండి, 58:14.

## 61. సూరహ్ అస్-'సఫ్ఫ్ — سُورَةُ الصَّفِّ

అస్-'సఫ్ఫు: వరుస. ఇంతకు ముందు సూరహ్‌లో సత్యతిరస్కారుల పట్ల ఎలా వ్యవహరించాలో వివరించబడింది. ఈ సూరహ్‌లో ధర్మయుద్ధం గురించిన వివరాలున్నాయి. ఈ మదీనా సముదాయంలో ఇది 5వ సూరహ్. దీని పేరు 4వ ఆయత్ నుండి తీసుకోబడింది. ఇది బహుశా ఉ'హుద్ యుద్ధం తరువాత 3-4 హి్జ్రీలలో అవతరింపజేయబడింది. 'స'హాబా(ర'ది.'అన్హుమ్)లు: 'అల్లాహ్‌కు అన్నిటికంటే ప్రీతికరమైన కార్యం ఏది?' అని దైవప్రవక్త ('స'అస)ను అడగాలనుకున్నారు. కాని సాహసించలేకపోయారు. అప్పుడు ఈ సూరహ్ అవతరింపజేయబడింది, (అ'హ్మద్, తిర్మిజీ'). ఇందులో **14 ఆయతులు** ఉన్నాయి.

C B A

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

سَبَّحَ لِلَّهِ مَا فِي ٱلسَّمَٰوَٰتِ وَمَا فِي ٱلْأَرْضِ ۖ وَهُوَ ٱلْعَزِيزُ ٱلْحَكِيمُ ﴿١﴾

**1.** ఆకాశాలలో నున్న సమస్తమూ మరియు భూమిలో నున్న సమస్తమూ, అల్లాహ్ పవిత్రతను కొనియాడుతూ ఉంటాయి. మరియు ఆయనే సర్వ శక్తిమంతుడు, మహా వివేకవంతుడు.

يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوا۟ لِمَ تَقُولُونَ مَا لَا تَفْعَلُونَ ﴿٢﴾

**2.** ఓ విశ్వాసులారా! మీరు చేయని దానిని ఎందుకు పలుకుతున్నారు?[1]

كَبُرَ مَقْتًا عِندَ ٱللَّهِ أَن تَقُولُوا۟ مَا لَا تَفْعَلُونَ ﴿٣﴾

**3.** మీరు చేయని దానిని పలకటం అల్లాహ్ దృష్టిలో చాలా అసహ్యకరమైన విషయం.

إِنَّ ٱللَّهَ يُحِبُّ ٱلَّذِينَ يُقَٰتِلُونَ فِي سَبِيلِهِۦ صَفًّا كَأَنَّهُم بُنْيَٰنٌ مَّرْصُوصٌ ﴿٤﴾

**4.** నిశ్చయంగా, అల్లాహ్! తన మార్గంలో దృఢమైన కట్టడంవలే **బారులుతీరి** పోరాడేవారిని ప్రేమిస్తాడు.

---

**1.** ఈ ఆయత్ ఉ'హుద్ యుద్ధరంగంలో దైవప్రవక్త ('స'అస) అనుమతి లేనిదే తమ స్థానాలను వదలి విజయధనాన్ని ప్రోగు చేసుకోవటానికి వెళ్ళిన 'స'హాబా (ర'ది.'అన్హుమ్)లను గురించి ఉంది.

وَإِذْ قَالَ مُوسَىٰ لِقَوْمِهِۦ يَٰقَوْمِ لِمَ تُؤْذُونَنِى وَقَد تَّعْلَمُونَ أَنِّى رَسُولُ ٱللَّهِ إِلَيْكُمْ ۖ فَلَمَّا زَاغُوٓا۟ أَزَاغَ ٱللَّهُ قُلُوبَهُمْ ۚ وَٱللَّهُ لَا يَهْدِى ٱلْقَوْمَ ٱلْفَٰسِقِينَ ﴿٥﴾

**5.** మరియు మూసా తన జాతివారితో ఇలా అన్న విషయం (జ్ఞాపకం చేసుకోండి): "ఓ నా జాతి ప్రజలారా! వాస్తవానికి, నేను మీ వద్దకు పంపబడిన అల్లాహ్ యొక్క సందేశహరుడనని రూఢిగా తెలిసికూడా, మీరు నన్ను ఎందుకు బాధిస్తున్నారు?" అయినా వారు వక్రమార్గం అవలంబించినందుకు, అల్లాహ్ వారి హృదయాలను వక్రమార్గంలో పడవేశాడు. మరియు అల్లాహ్ దుర్జను (ఫాసిఖీన్)లకు సన్మార్గం చూపడు.

وَإِذْ قَالَ عِيسَى ٱبْنُ مَرْيَمَ يَٰبَنِىٓ إِسْرَٰٓءِيلَ إِنِّى رَسُولُ ٱللَّهِ إِلَيْكُم مُّصَدِّقًا لِّمَا بَيْنَ يَدَىَّ مِنَ ٱلتَّوْرَىٰةِ وَمُبَشِّرًۢا بِرَسُولٍ يَأْتِى مِنۢ بَعْدِى ٱسْمُهُۥٓ أَحْمَدُ ۖ فَلَمَّا جَآءَهُم بِٱلْبَيِّنَٰتِ قَالُوا۟ هَٰذَا سِحْرٌ مُّبِينٌ ﴿٦﴾

**6.** మరియు మర్యమ్ కుమారుడు 'ఈసా[1] (తన జాతివారితో) ఇలా అన్నది (జ్ఞాపకం చేసుకోండి): "ఓ ఇస్రాయీ'ల్ సంతతి వారలారా! నిశ్చయంగా, నేను మీ వద్దకు పంపబడిన అల్లాహ్ యొక్క సందేశహరుణ్ణి, నాకు పూర్వం, వచ్చిఉన్న తౌరాత్ గ్రంథాన్ని ధృవపరుస్తున్నాను. మరియు నా తరువాత అ'హ్మద్[2] అనే సందేశహరుడు రాబోతున్నాడు, అనే శుభవార్తను ఇస్తున్నాను." తరువాత అతను (అ'హ్మద్)[3]

1. ఇస్రాయీ'ల్ సంతతివారు ఏ విధంగా మూసా ('అ.స.) ఆదేశాలను ఉల్లంఘించారో! అదే విధంగా వారు 'ఈసా('అ.స.)ను కూడా తిరస్కరించారు. అలాంటప్పుడు దైవప్రవక్త ము'హమ్మద్ ('స'అస)ను యూదులు తిరస్కరించడం క్రొత్త విషయమేమీ కాదు. వారి చరిత్ర చూస్తే వారు ఎందరో దైవప్రవక్త ('అ.స.)లను తిరస్కరించారు మరియు కొందరిని చంపారు. 'ఈసా ('అ.స.) తౌరాత్‌ను ధృవపరిచారు.

2. 'ఈసా('అ.స.) తన తరువాత అ'హ్మద్‌అనే ప్రవక్త('స'అస) రానున్నాడు, అనే శుభవార్తను వినిపిస్తున్నారు. అతను('స'అస) ఇలా అన్నారు: 'నేను నాతండ్రి, ఇబ్రాహీమ్ ('అ.స.) ప్రార్థన(దు'ఆ)ను మరియు 'ఈసా('అ.స.) సూచన(బషారత్)ను,'(అయ్‌సర్ అత్తఫాసీర్). 'హమ్ద్ అంటే ప్రశంస (praise, laudation). అ'హ్మద్ పదాన్ని దాని ఫా'ఇల్ రూపంలో తీసుకుంటే అల్లాహుతాలాను అందరికంటే అధికంగా స్తుతించేవాడు మరియు మఫ్'ఊల్ రూపంలో తీసుకుంటే అత్యధికంగా కొనియాడబడినవాడు, అనే అర్థాలు వస్తాయి, ( ఫ'త్'హ్ అల్-ఖదీర్).

3. హిందూ ధర్మ గ్రంథాలలో కూడా అ'హ్మద్ అనే అంతిమఋుషి రానున్నాడని ఎన్నో చోట్లలో పేర్కొనబడింది.

వారి వద్దకు, స్పష్టమైన సూచనలు తీసుకొని వచ్చినపుడు వారు ఇలా అన్నారు: "ఇది కేవలం స్పష్టమైన మంత్రజాలమే!"

وَمَنْ أَظْلَمُ مِمَّنِ ٱفْتَرَىٰ عَلَى ٱللَّهِ ٱلْكَذِبَ وَهُوَ يُدْعَىٰٓ إِلَى ٱلْإِسْلَٰمِ ۚ وَٱللَّهُ لَا يَهْدِى ٱلْقَوْمَ ٱلظَّٰلِمِينَ ﴿٧﴾

**7.** తనను ఇస్లామ్ వైపునకు పిలిచినప్పుడు, అల్లాహ్ మీద అపనిందలు మోపేవాని కంటే పరమ దుర్మార్గుడెవడు? మరియు అల్లాహ్ దుర్మార్గులైన ప్రజలకు మార్గదర్శకత్వం చేయడు.

يُرِيدُونَ لِيُطْفِـُٔوا۟ نُورَ ٱللَّهِ بِأَفْوَٰهِهِمْ وَٱللَّهُ مُتِمُّ نُورِهِۦ وَلَوْ كَرِهَ ٱلْكَٰفِرُونَ ﴿٨﴾

**8.** వారు అల్లాహ్ జ్యోతిని (ఇస్లాంను) తమ నోటితో ఊది, ఆర్పివేయాలనుకుంటున్నారు. కాని సత్యతిరస్కారులకు ఎంత అసహ్యకరమైనా! అల్లాహ్ తన జ్యోతిని వ్యాపింపజేయాలని నిర్ణయించుకున్నాడు.

هُوَ ٱلَّذِىٓ أَرْسَلَ رَسُولَهُۥ بِٱلْهُدَىٰ وَدِينِ ٱلْحَقِّ لِيُظْهِرَهُۥ عَلَى ٱلدِّينِ كُلِّهِۦ وَلَوْ كَرِهَ ٱلْمُشْرِكُونَ ﴿٩﴾

**9.** ఆయనే, తన ప్రవక్తకు మార్గదర్శకత్వాన్ని మరియు సత్యధర్మాన్ని ఇచ్చి పంపి, దానిని సకల ధర్మాలపై ఆధిక్యత వహించే ధర్మంగా చేశాడు[1] - అది బహుదైవారాధకులకు ఎంత అసహ్యకరమైనా!

يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوا۟ هَلْ أَدُلُّكُمْ عَلَىٰ تِجَٰرَةٍ تُنجِيكُم مِّنْ عَذَابٍ أَلِيمٍ ﴿١٠﴾

**10.** ఓ విశ్వాసులారా! మిమ్మల్ని బాధాకరమైన శిక్షనుండి కాపాడే వ్యాపారాన్ని మీకు సూచించాలా?[2]

تُؤْمِنُونَ بِٱللَّهِ وَرَسُولِهِۦ وَتُجَٰهِدُونَ فِى سَبِيلِ ٱللَّهِ بِأَمْوَٰلِكُمْ وَأَنفُسِكُمْ ۚ ذَٰلِكُمْ خَيْرٌ لَّكُمْ إِن كُنتُمْ تَعْلَمُونَ ﴿١١﴾

**11.** (అది), మీరు అల్లాహ్‌ను మరియు ఆయన ప్రవక్తను విశ్వసించడం మరియు అల్లాహ్ మార్గంలో మీ సంపదలను మరియు మీ ప్రాణాలను వినియోగించి పోరాడటం. మీరు తెలుసుకుంటే! ఇదే మీకు ఎంతో మేలైనది.

---

**1**. చూడండి, 3:19.

**2**. అంటే విశ్వాసం మరియు అల్లాహ్ (సు.తా.) మార్గంలో జిహాద్. ఎందుకంటే వీటిలో కూడా వ్యాపారంలో దొరికినట్లు లాభం దొరుకుతుంది. అది స్వర్గప్రవేశం. దీనికంటే మంచి లాభం ఇంకేముంటుంది. ఇంకా చూడండి, 9:111.

يَغْفِرْ لَكُمْ ذُنُوبَكُمْ وَيُدْخِلْكُمْ جَنَّٰتٍ تَجْرِى مِن تَحْتِهَا ٱلْأَنْهَٰرُ وَمَسَٰكِنَ طَيِّبَةً فِى جَنَّٰتِ عَدْنٍ ذَٰلِكَ ٱلْفَوْزُ ٱلْعَظِيمُ ﴿١٢﴾

12. (ఇలా చేస్తే) ఆయన మీ పాపాలను క్షమిస్తాడు మరియు మిమ్మల్ని క్రింద సెలయేళ్ళు ప్రవహించే స్వర్గవనాలలో[1] ప్రవేశింపజేస్తాడు. మరియు శాశ్వతమైన స్వర్గవనాలలో మంచి గృహాలను ప్రసాదిస్తాడు. అదే ఆ గొప్ప విజయం.

وَأُخْرَىٰ تُحِبُّونَهَا نَصْرٌ مِّنَ ٱللَّهِ وَفَتْحٌ قَرِيبٌ وَبَشِّرِ ٱلْمُؤْمِنِينَ ﴿١٣﴾

13. మరియు మీకు ప్రీతికరమైన, మరొక (అనుగ్రహం) కూడా ఉంది! (అది) అల్లాహ్ సహాయం మరియు శీఘ్ర విజయం. మరియు ఈ శుభవార్తను విశ్వాసులకు తెలుపు.[2]

يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوا۟ كُونُوٓا۟ أَنصَارَ ٱللَّهِ كَمَا قَالَ عِيسَى ٱبْنُ مَرْيَمَ لِلْحَوَارِيِّۦنَ مَنْ أَنصَارِىٓ إِلَى ٱللَّهِ قَالَ ٱلْحَوَارِيُّونَ نَحْنُ أَنصَارُ ٱللَّهِ فَـَٔامَنَت طَّآئِفَةٌ مِّنۢ بَنِىٓ إِسْرَٰٓءِيلَ وَكَفَرَت طَّآئِفَةٌ فَأَيَّدْنَا ٱلَّذِينَ ءَامَنُوا۟ عَلَىٰ عَدُوِّهِمْ فَأَصْبَحُوا۟ ظَٰهِرِينَ ﴿١٤﴾

14. ఓ విశ్వాసులారా! మర్యమ్ కుమారుడు 'ఈసా తన శిష్యు (హవారియ్యూన్)లకు ఉపదేశించిన విధంగా, మీరు కూడా అల్లాహ్‌కు సహాయకులుగా ఉండండి. (ఆయన వారితో ఇలా అన్నాడు): "అల్లాహ్ మార్గంలో నాకు తోడ్పడేవారు ఎవరు?" ఆ శిష్యులు ఇలా జవాబిచ్చారు: "మేము అల్లాహ్ (మార్గంలో) తోడ్పడేవారము!" అప్పుడు ఇస్రాయీల్ సంతతి వారిలో ఒక వర్గంవారు విశ్వసించారు, మరొక వర్గంవారు తిరస్కరించారు. తరువాత మేము విశ్వసించిన వారికి, వారి శత్రువులకు వ్యతిరేకంగా సహాయంచేశాము, కావున వారు ఆధిక్యతను పొందారు! (1/2)

*****

1. చూడండి, 38:50.

2. మీరు అల్లాహ్ (సు.తా.) మార్గంలో పోరాడితే మీకు విజయం లభిస్తుంది. చూడండి, 47:7 మరియు 22:40 ఇంకా చూడండి, 3:139.

## 62. సూరహ్ అల్-జుము'అహ్ — سُورَةُ الجُمُعَةِ

అల్-జుము'అహ్: The Congregation, సమావేశం, మతవిధుల నిర్వహణకు కూడిన జనసముదాయం. ఇది ఈ సమూహపు **మదీనా** సూరాహ్‌లలో 6వది. దీని పేరు **9**వ **ఆయత్**నుండి తీసుకోబడింది. మదీనా ప్రారంభపు కాలంలో (2-4వ హి'జ్రీ)లలో అవతరింపజేయబడింది. దైవప్రవక్త ('స'అస) జుము'అహ్ నమాజులో సూరహ్ అల్-జుము'అహ్ (62) మరియు సూరహ్ అల్-మునాఫిఖూన్ (63) చదివే వారు, ('స'హీ'హ్ ముస్లిం). ఇందులో **11 ఆయతులు** ఉన్నాయి.

C B A

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

يُسَبِّحُ لِلَّهِ مَا فِي ٱلسَّمَٰوَٰتِ وَمَا فِي ٱلْأَرْضِ ٱلْمَلِكِ ٱلْقُدُّوسِ ٱلْعَزِيزِ ٱلْحَكِيمِ ﴿١﴾

**1.*** ఆకాశాలలోనున్నవి మరియు భూమిలోనున్నవి, సమస్తమూ విశ్వసార్వభౌముడు,[1] పరమపవిత్రుడు, సర్వశక్తిమంతుడు, మహా వివేకవంతుడు అయిన అల్లాహ్ పవిత్రతను కొనియాడుతూ ఉంటాయి.

هُوَ ٱلَّذِي بَعَثَ فِي ٱلْأُمِّيِّـۧنَ رَسُولًا مِّنْهُمْ يَتْلُوا۟ عَلَيْهِمْ ءَايَٰتِهِۦ وَيُزَكِّيهِمْ وَيُعَلِّمُهُمُ ٱلْكِتَٰبَ وَٱلْحِكْمَةَ وَإِن كَانُوا۟ مِن قَبْلُ لَفِي ضَلَٰلٍ مُّبِينٍ ﴿٢﴾

**2.** ఆయనే ఆ నిరక్షరాస్యులైన[2] వారిలో నుండి ఒక సందేశహరుణ్ణి లేపాడు. అతను వారికి ఆయన సూచన(ఆయతు)లను చదివి వినిపిస్తున్నాడు మరియు వారిని సంస్కరిస్తున్నాడు మరియు వారికి గ్రంథాన్ని మరియు వివేకాన్ని బోధిస్తున్నాడు మరియు వాస్తవానికి వారు, అంతకు పూర్వం స్పష్టమైన మార్గభ్రష్టత్వంలో పడిఉండేవారు.

وَءَاخَرِينَ مِنْهُمْ لَمَّا يَلْحَقُوا۟ بِهِمْ ۚ وَهُوَ ٱلْعَزِيزُ ٱلْحَكِيمُ ﴿٣﴾

**3.** మరియు ఇంకా వారిలో చేరని ఇతరులకు కూడా (బోధించటానికి). మరియు ఆయన సర్వశక్తిమంతుడు, మహా వివేకవంతుడు.

---

**1**. చూడండి 20:114 వ్యాఖ్యానం 3.

**2**. అల్-ఉమ్మియ్యీన: నిరక్షరాస్యులు. అంటే ఆ కాలంలో అరబ్బులలో చాలామందికి చదవటం వ్రాయటం వచ్చేది కాదు. స్వయంగా దైవప్రవక్త ('స'అస) కూడా నిరక్షరాస్యులే. చూడండి, 7:157-158.

ذَٰلِكَ فَضۡلُ ٱللَّهِ يُؤۡتِيهِ مَن يَشَآءُۚ وَٱللَّهُ ذُو ٱلۡفَضۡلِ ٱلۡعَظِيمِ ﴿٤﴾ مَثَلُ ٱلَّذِينَ حُمِّلُواْ ٱلتَّوۡرَىٰةَ ثُمَّ لَمۡ يَحۡمِلُوهَا كَمَثَلِ ٱلۡحِمَارِ يَحۡمِلُ أَسۡفَارَۢاۚ بِئۡسَ مَثَلُ ٱلۡقَوۡمِ ٱلَّذِينَ كَذَّبُواْ بِـَٔايَٰتِ ٱللَّهِۚ وَٱللَّهُ لَا يَهۡدِي ٱلۡقَوۡمَ ٱلظَّٰلِمِينَ ﴿٥﴾ قُلۡ يَٰٓأَيُّهَا ٱلَّذِينَ هَادُوٓاْ إِن زَعَمۡتُمۡ أَنَّكُمۡ أَوۡلِيَآءُ لِلَّهِ مِن دُونِ ٱلنَّاسِ فَتَمَنَّوُاْ ٱلۡمَوۡتَ إِن كُنتُمۡ صَٰدِقِينَ ﴿٦﴾ وَلَا يَتَمَنَّوۡنَهُۥٓ أَبَدَۢا بِمَا قَدَّمَتۡ أَيۡدِيهِمۡۚ وَٱللَّهُ عَلِيمُۢ بِٱلظَّٰلِمِينَ ﴿٧﴾ قُلۡ إِنَّ ٱلۡمَوۡتَ ٱلَّذِي تَفِرُّونَ مِنۡهُ فَإِنَّهُۥ مُلَٰقِيكُمۡۖ ثُمَّ تُرَدُّونَ إِلَىٰ عَٰلِمِ ٱلۡغَيۡبِ وَٱلشَّهَٰدَةِ فَيُنَبِّئُكُم بِمَا كُنتُمۡ تَعۡمَلُونَ ﴿٨﴾

**4**. ఇది అల్లాహ్ అనుగ్రహం, ఆయన దానిని తానుకోరిన వారికి ప్రసాదిస్తాడు. మరియు అల్లాహ్ సర్వోత్తముడైన అనుగ్రహశాలి.

**5**. తౌరాత్ బాధ్యత (భారం) మోపబడిన తరువాత దానిపై అమలు చేయలేకపోయిన వారి పోలిక, పుస్తకాల భారాన్ని మోసే ఆ గాడిద వలే ఉంది. (వారు ఆ భారాన్ని భరించారే గానీ, దానిని అర్థంచేసుకోలేక పోయారు). అల్లాహ్ సూచన(ఆయతు)లను తిరస్కరించిన వారి దృష్టాంతము ఎంతచెడ్డది. మరియు అల్లాహ్ దుర్మార్గులకు మార్గదర్శకత్వం చేయడు.

**6**. వారితో ఇలా అను: "ఓ యూదులారా! నిశ్చయంగా, ఇతర ప్రజలకంటే మీరు మాత్రమే అల్లాహ్‌కు ప్రియమైనవారు (స్నేహితులు) అనే భావం మీకుంటే, మీ (వాదంలో) మీరు సత్యవంతులే అయితే మీరు చావును కోరండి."[1]

**7**. కాని వారు తాము చేసి పంపుకున్న కర్మల (ఫలితాలకు భయపడి) దానిని ఏ మాత్రం కోరుకోరు![2] మరియు అల్లాహ్‌కు దుర్మార్గులను గురించి బాగా తెలుసు.

**8**. వారితో ఇలా అను: "వాస్తవానికి ఏ చావునుండి అయితే మీరు పారిపోతున్నారో! నిశ్చయంగా అదే మిమ్మల్ని పట్టుకుంటుంది. ఆ తరువాత మీరు, అగోచర మరియు గోచర విషయాలు తెలిసిన ఆయన (అల్లాహ్) వైపునకు మరలింపబడతారు, అప్పుడు ఆయన మీరు చేస్తూఉండిన కర్మలను మీకు తెలుపుతాడు."

---

**1**. చూడండి, 5:18 మరియు 2:111.

**2**. చూడండి, 2 : 94.

يَـٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوٓاْ إِذَا نُودِىَ لِلصَّلَوٰةِ مِن يَوۡمِ ٱلۡجُمُعَةِ فَٱسۡعَوۡاْ إِلَىٰ ذِكۡرِ ٱللَّهِ وَذَرُواْ ٱلۡبَيۡعَۚ ذَٰلِكُمۡ خَيۡرٌ لَّكُمۡ إِن كُنتُمۡ تَعۡلَمُونَ ﴿٩﴾

**9**. ఓ విశ్వాసులారా! శుక్రవారం (జుము'అహ్) రోజు నమా'జ్ కొరకు పిలుపు ఇవ్వబడినప్పుడు, మీరు మీ వ్యాపారాలను విడిచి అల్లాహ్ స్మరణ వైపునకు పరుగెత్తండి. మీరు తెలుసుకోగలిగితే, ఇది మీకు ఎంతో ఉత్తమమైనది!

فَإِذَا قُضِيَتِ ٱلصَّلَوٰةُ فَٱنتَشِرُواْ فِى ٱلۡأَرۡضِ وَٱبۡتَغُواْ مِن فَضۡلِ ٱللَّهِ وَٱذۡكُرُواْ ٱللَّهَ كَثِيرًا لَّعَلَّكُمۡ تُفۡلِحُونَ ﴿١٠﴾

**10**. ఇక నమా'జ్ పూర్తిఅయిన తరువాత భూమిలో వ్యాపించండి మరియు అల్లాహ్ అనుగ్రహాన్ని అన్వేషించండి మరియు అల్లాహ్‌ను అత్యధికంగా స్మరిస్తూ ఉంటే, మీరు సాఫల్యం పొందవచ్చు!

وَإِذَا رَأَوۡاْ تِجَٰرَةً أَوۡ لَهۡوًا ٱنفَضُّوٓاْ إِلَيۡهَا وَتَرَكُوكَ قَآئِمًاۚ قُلۡ مَا عِندَ ٱللَّهِ خَيۡرٌ مِّنَ ٱللَّهۡوِ وَمِنَ ٱلتِّجَٰرَةِۚ وَٱللَّهُ خَيۡرُ ٱلرَّٰزِقِينَ ﴿١١﴾

**11**. మరియు (ఓ ము'హమ్మద్!) వారు వ్యాపారాన్ని గానీ లేదా వినోదక్రీడను గానీ చూసినప్పుడు, నిన్ను నిలబడివున్న స్థితిలోనే వదలిపెట్టి, దానిచుట్టు గుమిగూడుతారు.[1] వారితో ఇలా అను: "వినోదక్రీడల కంటే మరియు వ్యాపారం కంటే, అల్లాహ్ వద్ద ఉన్నదే ఎంతో ఉత్తమమైనది. మరియు అల్లాహ్ యే జీవనోపాధి ప్రసాదించటంలో సర్వోత్తముడు."

*****

---

1. ఒక జుము'అహ్ రోజు దైవప్రవక్త ('స'అస) జుము'అహ్ ఉపన్యాసం (ఖుత్బా) ఇస్తుంటారు. అప్పుడు ఒక వ్యాపార బృందం మదీనాలో ప్రవేశిస్తుంది. అప్పుడు ఖుత్బా వింటున్న వారిలో నుండి చాలా మంది ఉపన్యాసాన్ని వదలి, వస్తువులు అయిపోకముందే త్వరగా కొనుక్కుందాం అనే పేరాశతో వెళ్ళిపోతారు. కేవలం 12 మంది మాత్రమే మస్జిద్‌లో మిగిలి పోతారు. అప్పుడు ఈ ఆయత్ అవతరింపజేయబడింది.

## 63. సూరహ్ అల్-మునాఫిఖూన్

## سُورَةُ المُنَافِقُونَ

అల్-మునాఫిఖూన్: **కపటవిశ్వాసులు**, వంచకులు, డాంబికులు, ఈ మదీనా సూరాహ్‌ల సమూహంలో ఇది 7వది. ఇది ఉ'హుద్ యుద్ధం తరువాత 3-4 హి్జ్రీలలో అవతరింపజేయబడింది. ఇందులో కపటవిశ్వాసులను గురించిన విషయాలు ఉన్నాయి. దీనిపేరు **మొదటి ఆయత్**‌లోనే పేర్కొబడింది. ఇందులో **11 ఆయతులు** ఉన్నాయి.

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

C B A

**1**. (ఓ ప్రవక్తా!) ఈ **కపటవిశ్వాసులు** (మునాఫిఖూన్) నీ వద్దకు వచ్చినపుడు,[1] ఇలా అంటారు: "నీవు అల్లాహ్ యొక్క సందేశహరుడవని మేము సాక్ష్యమిస్తున్నాము." మరియు నిశ్చయంగా, నీవు ఆయన సందేశహరుడవని అల్లాహ్‌కు తెలుసు మరియు ఈ కపటవిశ్వాసులు నిశ్చయంగా అసత్యవాదులని అల్లాహ్ సాక్ష్యమిస్తున్నాడు.

إِذَا جَآءَكَ ٱلْمُنَٰفِقُونَ قَالُوا۟ نَشْهَدُ إِنَّكَ لَرَسُولُ ٱللَّهِ ۗ وَٱللَّهُ يَعْلَمُ إِنَّكَ لَرَسُولُهُۥ وَٱللَّهُ يَشْهَدُ إِنَّ ٱلْمُنَٰفِقِينَ لَكَٰذِبُونَ ﴿١﴾

**2**. వారు తమ ప్రమాణాలను డాలుగా చేసుకున్నారు. ఆవిధంగా వారు (ఇతరులను) అల్లాహ్ మార్గంనుండి నిరోధిస్తున్నారు.[2] నిశ్చయంగా, వారు చేస్తున్న చేష్టలు ఎంతో నీచమైనవి.

ٱتَّخَذُوٓا۟ أَيْمَٰنَهُمْ جُنَّةً فَصَدُّوا۟ عَن سَبِيلِ ٱللَّهِ ۚ إِنَّهُمْ سَآءَ مَا كَانُوا۟ يَعْمَلُونَ ﴿٢﴾

**3**. ఇది నిశ్చయంగా, వారు విశ్వసించిన తరువాత సత్యతిరస్కారులు అవటం మూలంగానే జరిగింది కావున వారి హృదయాల మీద ముద్ర వేయబడి ఉంది. కనుక వారు ఏమీ అర్థంచేసుకోలేరు. (5/8)

ذَٰلِكَ بِأَنَّهُمْ ءَامَنُوا۟ ثُمَّ كَفَرُوا۟ فَطُبِعَ عَلَىٰ قُلُوبِهِمْ فَهُمْ لَا يَفْقَهُونَ ﴿٣﴾

---

**1**. ఇక్కడ 'అబ్దుల్లాహ్ బిన్ ఉబై మరియు అతని తోటివారిని గురించి చెప్పబడుతోంది.
**2**. ఇటువంటి వాక్యానికై చూడండి, 58:16.

۞ وَإِذَا رَأَيْتَهُمْ تُعْجِبُكَ أَجْسَامُهُمْ ۖ وَإِن يَقُولُوا تَسْمَعْ لِقَوْلِهِمْ ۖ كَأَنَّهُمْ خُشُبٌ مُّسَنَّدَةٌ ۖ يَحْسَبُونَ كُلَّ صَيْحَةٍ عَلَيْهِمْ ۚ هُمُ الْعَدُوُّ فَاحْذَرْهُمْ ۚ قَاتَلَهُمُ اللَّهُ ۖ أَنَّىٰ يُؤْفَكُونَ ﴿٤﴾

4. * మరియు నీవు గనక వారిని చూస్తే! వారి రూపాలు నీకు ఎంతో అద్భుతమైనవిగా కనిపిస్తాయి. మరియు వారు మాట్లాడినప్పుడు, నీవు వారి మాటలను వింటూ ఉండిపోతావు. నిశ్చయంగా, వారు గోడకు ఆనించబడిన మొద్దులవలే ఉన్నారు. వారు ప్రతి అరుపును తమకు వ్యతిరేకమైనది గానే భావిస్తారు. వారు శత్రువులు, కావున వారి పట్ల జాగ్రత్తగా ఉండు. అల్లాహ్ వారిని నాశనం చేయుగాక![1] వారెంత పెడమార్గంలో పడివున్నారు.

وَإِذَا قِيلَ لَهُمْ تَعَالَوْا يَسْتَغْفِرْ لَكُمْ رَسُولُ اللَّهِ لَوَّوْا رُءُوسَهُمْ وَرَأَيْتَهُمْ يَصُدُّونَ وَهُم مُّسْتَكْبِرُونَ ﴿٥﴾

5. మరియు వారితో: "రండి అల్లాహ్ ప్రవక్త మీ క్షమాపణ కొరకు (అల్లాహ్‌ను) ప్రార్థిస్తాడు." అని అన్నప్పుడు, వారు తమ తలలు త్రిప్పు కోవటాన్ని మరియు దురహంకారంతో మరలి పోవటాన్ని నీవు చూస్తావు.

سَوَاءٌ عَلَيْهِمْ أَسْتَغْفَرْتَ لَهُمْ أَمْ لَمْ تَسْتَغْفِرْ لَهُمْ لَن يَغْفِرَ اللَّهُ لَهُمْ ۚ إِنَّ اللَّهَ لَا يَهْدِي الْقَوْمَ الْفَاسِقِينَ ﴿٦﴾

6. (ఓ ప్రవక్తా!) నీవు వారి కొరకు క్షమాపణ కోరినా లేక క్షమాపణ కోరకపోయినా వారి విషయంలో రెండూ సమానమే! (ఎందుకంటే) అల్లాహ్ వారిని ఎంత మాత్రం క్షమించడు. నిశ్చయంగా, అల్లాహ్ అవిధేయులకు మార్గదర్శకత్వం చేయడు.[2]

هُمُ الَّذِينَ يَقُولُونَ لَا تُنفِقُوا عَلَىٰ مَنْ عِندَ رَسُولِ اللَّهِ حَتَّىٰ يَنفَضُّوا ۗ وَلِلَّهِ

7. వారే ఇలా అంటూ ఉండే వారు: "అల్లాహ్ సందేశహరుని వద్ద నున్న వారిపై మీరు ఖర్చుచేయకుండా ఉంటే! చివరకు వారే చెల్లాచెదురైపోతారు."[3] వాస్తవానికి

---

1. ఇట్టి వాక్యానికై చూడండి, 9:30.
2. చూడండి, 9:80.
3. దైవప్రవక్త (స'అస) మదీనా రాకముందు 'అబ్దుల్లా బిన్ ఉబై మదీనావాసుల నాయకుడయ్యే సూచనలుంటాయి. దైవప్రవక్త (స'అస) ప్రాబల్యం హెచ్చయి అతని (స'అస) అనుచరు (ర'ది.'అన్హుమ్)ల సంఖ్య దినదినానికి పెరుగటం చూసి, అతడు బాహ్యంగా ముస్లిం అయినా! అతని హృదయంలో దైవప్రవక్త (స'అస) మరియు ముస్లింల పట్ల ద్వేషం ఉంటుంది. కావున అతడు వారిని ఎత్తిపొడవటానికి ఏ అవకాశం దొరికినా వదిలేవాడు కాదు. బనీ ము'స్'తలిఖ్' గజ్వ నుండి తిరిగి వస్తున్నప్పుడు ఒక అన్సారి మరియు ఒక ముహాజిర్

خَزَآئِنُ ٱلسَّمَٰوَٰتِ وَٱلۡأَرۡضِ وَلَٰكِنَّ ٱلۡمُنَٰفِقِينَ لَا يَفۡقَهُونَ ﴿٧﴾

ఆకాశాలలో మరియు భూమిలో నున్న సమస్త కోశాగారాలు అల్లాహ్‌కే చెందినవి. కాని ఈ కపటవిశ్వాసులు అది గ్రహించలేరు.

يَقُولُونَ لَئِن رَّجَعۡنَآ إِلَى ٱلۡمَدِينَةِ لَيُخۡرِجَنَّ ٱلۡأَعَزُّ مِنۡهَا ٱلۡأَذَلَّۚ وَلِلَّهِ ٱلۡعِزَّةُ وَلِرَسُولِهِۦ وَلِلۡمُؤۡمِنِينَ وَلَٰكِنَّ ٱلۡمُنَٰفِقِينَ لَا يَعۡلَمُونَ ﴿٨﴾

**8**. వారు (కపటవిశ్వాసులు) ఇంకా ఇలా అంటున్నారు: "మనం మదీనా నగరానికి తిరిగి వెళ్ళిన తరువాత, నిశ్చయంగా గౌరవనీయులైన (మనం), అక్కడవున్న తుచ్ఛమైన వారిని తప్పక వెడలగొడ్డాం." మరియు గౌరవమనేది అల్లాహ్‌కు, ఆయన సందేశహరునికి మరియు విశ్వాసులకు మాత్రమే చెందినది, కాని ఈ కపటవిశ్వాసులకు అది తెలియదు.

يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُواْ لَا تُلۡهِكُمۡ أَمۡوَٰلُكُمۡ وَلَآ أَوۡلَٰدُكُمۡ عَن ذِكۡرِ ٱللَّهِۚ وَمَن يَفۡعَلۡ ذَٰلِكَ فَأُوْلَٰٓئِكَ هُمُ ٱلۡخَٰسِرُونَ ﴿٩﴾

**9**. ఓ విశ్వాసులారా! మీ సంపదలు, మీ సంతానం మిమ్మల్ని అల్లాహ్ స్మరణనుండి నిర్లక్ష్యంలో పడవేయరాదు సుమా! ఎవరైతే ఇలా నిర్లక్ష్యంలో పడతారో అలాంటి వారే నష్టపడే వారు.

وَأَنفِقُواْ مِن مَّا رَزَقۡنَٰكُم مِّن قَبۡلِ أَن يَأۡتِيَ أَحَدَكُمُ ٱلۡمَوۡتُ فَيَقُولَ رَبِّ لَوۡلَآ أَخَّرۡتَنِيٓ إِلَىٰٓ أَجَلٖ قَرِيبٖ فَأَصَّدَّقَ وَأَكُن مِّنَ ٱلصَّٰلِحِينَ ﴿١٠﴾

**10**. మరియు మీలో ఎవరికైనా మరణ సమయం సమీపించి: "ఓ నా ప్రభూ! నీవు నాకు మరికొంత వ్యవధి ఎందుకివ్వలేదు! నేను దాన ధర్మాలు చేసి, సత్పురుషులలో చేరిపోయేవాడిని కదా?" అని పలికే స్థితి రాకముందే, మేము మీకు ప్రసాదించిన జీవనోపాధి నుండి ఖర్చుచేయండి.

وَلَن يُؤَخِّرَ ٱللَّهُ نَفۡسًا إِذَا جَآءَ أَجَلُهَاۚ وَٱللَّهُ خَبِيرُۢ بِمَا تَعۡمَلُونَ ﴿١١﴾

**11**. కాని ఒక వ్యక్తికి (మరణ) సమయం ఆసన్నమైనప్పుడు అల్లాహ్ అతనికి ఏ మాత్రం వ్యవధినివ్వడు. మరియు మీరు చేస్తున్నదంతా అల్లాహ్ బాగా ఎరుగును. *****

---

(ర'ది.'అన్హుమ్)ల మధ్య చిన్న కలహం చెలరేగుతుంది. వారిద్దరు తమతమ తెగలవారిని పిలుచుకుంటారు. అప్పుడు సమయం చూసి 'అబ్దుల్లా బిన్ ఉబై అన్సారులతో: 'చూశారా! మీదే తిని ఇప్పుడు మీ మీదికే వస్తున్నారు, ఈ ముహాజిర్‌లు! వీరికి పెట్టడం మానేస్తే, మదీనా విడిచిపోతారు!' ఈ మాటలు 'జైద్ బిన్-అర్ఖమ్ (ర'ది.'అ.) దైవప్రవక్త('స'అస)కు తెలుపుతారు. దైవప్రవక్త('స'అస) విచారించగా, 'అబ్దుల్లాబిన్-ఉబై తాను అలా అనలేదని నిరాకరిస్తాడు. ఆ సందర్భంలో ఈ సూరహ్ అవతరింపజేయబడింది, ('స'హీ'హ్ బు'ఖారీ).

## 64. సూరహ్ అత్-త'గాబున్

## سُورَةُ التَّغَـابُنِ

అత్-త'గాబున్: **లాభనష్టాలు**. దీనిపేరు **9**వ **ఆయత్** నుండి తీసుకోబడింది. ఈ సూరహ్ మొదటి హి'జ్రీలో **మదీనాలో** అవతరింపజేయబడిందని చాలామంది వ్యాఖ్యాతల అభిప్రాయం. ఈ సమూహంలో ఇది 8వ సూరహ్. ఈ సూరహ్‌లో సమాజపు పరస్పర వ్యవహార సంబంధాలు వివరించబడ్డాయి. ఇందులో **18 ఆయతులు** ఉన్నాయి.

بِسۡمِ ٱللَّهِ ٱلرَّحۡمَٰنِ ٱلرَّحِيمِ

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

يُسَبِّحُ لِلَّهِ مَا فِي ٱلسَّمَٰوَٰتِ وَمَا فِي ٱلۡأَرۡضِۖ لَهُ ٱلۡمُلۡكُ وَلَهُ ٱلۡحَمۡدُۖ وَهُوَ عَلَىٰ كُلِّ شَيۡءٖ قَدِيرٌ ١

**1**. ఆకాశాలలో నున్న సమస్తమూ మరియు భూమిలోనున్న సమస్తమూ, అల్లాహ్ పవిత్రతను కొనియాడుతూ ఉంటాయి. విశ్వ సామ్రాజ్యాధిపత్యం ఆయనదే మరియు సర్వస్తోత్రాలు ఆయనకే. మరియు ఆయనే ప్రతిదీ చేయగల సమర్థుడు.

هُوَ ٱلَّذِي خَلَقَكُمۡ فَمِنكُمۡ كَافِرٞ وَمِنكُم مُّؤۡمِنٞۚ وَٱللَّهُ بِمَا تَعۡمَلُونَ بَصِيرٌ ٢

**2**. ఆయనే మిమ్మల్ని సృష్టించాడు. మీలో కొందరు సత్యతిరస్కారులున్నారు మరియు మీలో కొందరు విశ్వాసులున్నారు. మరియు మీరు చేసేదంతా అల్లాహ్ చూస్తున్నాడు.[1]

خَلَقَ ٱلسَّمَٰوَٰتِ وَٱلۡأَرۡضَ بِٱلۡحَقِّ وَصَوَّرَكُمۡ فَأَحۡسَنَ صُوَرَكُمۡۖ وَإِلَيۡهِ ٱلۡمَصِيرُ ٣

**3**. ఆయన ఆకాశాలను మరియు భూమిని సత్యంతో సృష్టించాడు మరియు మిమ్మల్ని ఉత్తమ రూపంలో రూపొందించాడు.[2] మరియు మీ గమ్యస్థానం ఆయన వైపునకే ఉంది.

---

**1**. చూడండి, 67:2.

**2**. చూడండి, 82:6-8 మరియు 40:64.

يَعۡلَمُ مَا فِي ٱلسَّمَٰوَٰتِ وَٱلۡأَرۡضِ وَيَعۡلَمُ مَا تُسِرُّونَ وَمَا تُعۡلِنُونَۚ وَٱللَّهُ عَلِيمُۢ بِذَاتِ ٱلصُّدُورِ ٤

4. ఆకాశాలలో మరియు భూమిలో ఉన్నదంతా ఆయనకు తెలుసు మరియు మీరు దాచేది మరియు వెలిబుచ్చేది అంతా ఆయనకు బాగాతెలుసు. మరియు అల్లాహ్‌కు హృదయాలలో దాగిఉన్నదంతా తెలుసు.

أَلَمۡ يَأۡتِكُمۡ نَبَؤُاْ ٱلَّذِينَ كَفَرُواْ مِن قَبۡلُ فَذَاقُواْ وَبَالَ أَمۡرِهِمۡ وَلَهُمۡ عَذَابٌ أَلِيمٞ ٥

5. ఇంతకు పూర్వం, సత్యాన్ని తిరస్కరించి, తమ కర్మల దుష్ఫలితాన్ని చవిచూసిన వారి వృత్తాంతం మీకు అందలేదా? మరియు వారికి (పరలోకంలో) బాధాకరమైన శిక్ష ఉంటుంది.

ذَٰلِكَ بِأَنَّهُۥ كَانَت تَّأۡتِيهِمۡ رُسُلُهُم بِٱلۡبَيِّنَٰتِ فَقَالُوٓاْ أَبَشَرٞ يَهۡدُونَنَا فَكَفَرُواْ وَتَوَلَّواْۚ وَّٱسۡتَغۡنَى ٱللَّهُۚ وَٱللَّهُ غَنِيٌّ حَمِيدٞ ٦

6. దీనికి కారణమేమిటంటే, వాస్తవానికి వారివద్దకు వారి ప్రవక్తలు, స్పష్టమైన సూచనలు తీసుకొని వచ్చినప్పటికీ, వారు: "ఏమీ? మాకు మానవులు మార్గదర్శకత్వం చేస్తారా?"[1] అని పలుకుతూ సత్యాన్ని తిరస్కరించి మరలిపోయారు. మరియు అల్లాహ్ కూడా వారిని నిర్లక్ష్యంచేశాడు. మరియు అల్లాహ్ స్వయంసమృద్ధుడు, సర్వస్తోత్రాలకు అర్హుడు.

زَعَمَ ٱلَّذِينَ كَفَرُوٓاْ أَن لَّن يُبۡعَثُواْۚ قُلۡ بَلَىٰ وَرَبِّي لَتُبۡعَثُنَّ ثُمَّ لَتُنَبَّؤُنَّ بِمَا عَمِلۡتُمۡۚ وَذَٰلِكَ عَلَى ٱللَّهِ يَسِيرٞ ٧

7. సత్యాన్ని తిరస్కరించిన వారు (చనిపోయిన తరువాత) మరల సజీవులుగా లేపబడమని భావిస్తున్నారు. వారితో ఇలా అను: "అది కాదు, నా ప్రభువు సాక్షిగా! మీరు తప్పకుండా లేపబడతారు.[2] తరువాత మీరు

1. ఏ విధంగానైతే ఈనాడుకూడా బిద్'అత్‌చేసేవారు దైవప్రవక్త('స'అస)ను మానవునిగా భావించటంలేదో!

2. ఖుర్ఆన్‌లో మూడుసార్లు అల్లాహ్ (సు.తా.) తన సందేశహరునికి ('స'అస) ఆదేశించాడు: "నీ ప్రభువు సాక్షిగా చెప్పు: 'అల్లాహ్ (సు.తా.) పునరుత్థానం తప్పక చేస్తాడని.' వాటిలో ఇది ఒకటి." చూడండి, 10:53, 34:3. అది మీరు ప్రపంచంలో చేసిన కర్మలకు తగిన ప్రతిఫల మివ్వటానికి. ఎందుకంటే చాలామందికి ఈ లోకంలో వారికి తగిన ప్రతిఫలం

(ప్రపంచంలో) చేసిందంతా మీకు తెలుపబడుతుంది. మరియు ఇది అల్లాహ్‌కు ఎంతో సులభం."

فَـَٔامِنُواْ بِٱللَّهِ وَرَسُولِهِۦ وَٱلنُّورِ ٱلَّذِيٓ أَنزَلۡنَاۚ وَٱللَّهُ بِمَا تَعۡمَلُونَ خَبِيرٞ ٨

**8**. కావున మీరు అల్లాహ్‌ను మరియు ఆయన ప్రవక్తను మరియు మేము అవతరింపజేసిన జ్యోతిని (ఈ ఖుర్ఆన్‌ను) విశ్వసించండి. మరియు మీరు చేసేదంతా అల్లాహ్ బాగా ఎరుగును.

يَوۡمَ يَجۡمَعُكُمۡ لِيَوۡمِ ٱلۡجَمۡعِۖ ذَٰلِكَ يَوۡمُ ٱلتَّغَابُنِۗ وَمَن يُؤۡمِنۢ بِٱللَّهِ وَيَعۡمَلۡ صَٰلِحٗا يُكَفِّرۡ عَنۡهُ سَيِّـَٔاتِهِۦ وَيُدۡخِلۡهُ جَنَّٰتٖ تَجۡرِي مِن تَحۡتِهَا ٱلۡأَنۡهَٰرُ خَٰلِدِينَ فِيهَآ أَبَدٗاۚ ذَٰلِكَ ٱلۡفَوۡزُ ٱلۡعَظِيمُ ٩

**9**. (జ్ఞాపకముంచుకోండి) సమావేశపు రోజున ఆయన మీ అందరిని సమావేశ పరుస్తాడు.[1] అదే **లాభనష్టాల** దినం. మరియు ఎవడైతే అల్లాహ్‌ను విశ్వసించి సత్కార్యాలు చేస్తాడో, అలాంటి వాని పాపాలను ఆయన తొలగిస్తాడు. మరియు అతనిని క్రింద సెలయేళ్ళు ప్రవహించే స్వర్గవనాలలో ప్రవేశింపజేస్తాడు, వారందులో శాశ్వతంగా కలకాలం ఉంటారు. అదే గొప్ప విజయం.

وَٱلَّذِينَ كَفَرُواْ وَكَذَّبُواْ بِـَٔايَٰتِنَآ أُوْلَٰٓئِكَ أَصۡحَٰبُ ٱلنَّارِ خَٰلِدِينَ فِيهَاۖ وَبِئۡسَ ٱلۡمَصِيرُ ١٠

**10**. మరియు ఎవరైతే సత్యాన్ని తిరస్కరిస్తారో మరియు మా సూచన (ఆయత్)లను అబద్ధాలని తిరస్కరిస్తారో, అలాంటి వారు నరకవాసులవుతారు; అందు వారు శాశ్వతంగా ఉంటారు. మరియు అది ఎంత చెడ్డ గమ్యస్థానం!

దొరకదు. దుర్మార్గులు ఇక్కడ శిక్షింపబడకుండా పోవచ్చు. సన్మార్గులకు వారి మంచిపనులకు పూర్తి ప్రతిఫలం దొరకక పోవచ్చు! కాని వచ్చే జీవితంలో ప్రతి ఒక్కరికి వారి కర్మలకు తగిన ప్రతిఫలం లభిస్తుంది. వారికి ఎలాంటి అన్యాయం జరుగదు. పునరుత్థరింపజేయటం అల్లాహ్ (సు.తా.)కు ఎంతో సులభమైనది.

**1**. చూడండి,11:103. మరియు 56:49-50 పునరుత్థాన దినం, సమావేశదినం ఎందుకు అనబడిందంటే - ఆ రోజు యుగయుగాల ప్రజలందరు ఒకేసారి బ్రతికించి లేపబడతారు. మరియు ఒకేచోట సమావేశపరచబడతారు. అది ఒక పెద్ద మైదానం. ప్రతి ఒక్కడు ఎంతో దూరం వరకు చూడగల్గుతాడు.

مَآ أَصَابَ مِن مُّصِيبَةٍ إِلَّا بِإِذْنِ ٱللَّهِ ۗ وَمَن يُؤْمِنۢ بِٱللَّهِ يَهْدِ قَلْبَهُۥ ۚ وَٱللَّهُ بِكُلِّ شَيْءٍ عَلِيمٌ ﴿١١﴾

**11**. ఏ ఆపద కూడా, అల్లాహ్ అనుమతి లేనిదే సంభవించదు. మరియు ఎవడైతే అల్లాహ్‌ను విశ్వసిస్తాడో, అల్లాహ్ అతని హృదయానికి మార్గదర్శకత్వం చేస్తాడు. మరియు అల్లాహ్‌కు ప్రతి విషయం గురించి బాగా తెలుసు.

وَأَطِيعُوا۟ ٱللَّهَ وَأَطِيعُوا۟ ٱلرَّسُولَ ۚ فَإِن تَوَلَّيْتُمْ فَإِنَّمَا عَلَىٰ رَسُولِنَا ٱلْبَلَـٰغُ ٱلْمُبِينُ ﴿١٢﴾

**12**. మీరు అల్లాహ్‌కు విధేయులై ఉండండి మరియు సందేశహరుణ్ణి అనుసరించండి. ఒకవేళ మీరు మరలిపోతే, (తెలుసుకోండి!) వాస్తవానికి మా సందేశహరుని బాధ్యత కేవలం (మాసందేశాన్ని) మీకు స్పష్టంగా అందజేయటం మాత్రమే!

ٱللَّهُ لَآ إِلَـٰهَ إِلَّا هُوَ ۚ وَعَلَى ٱللَّهِ فَلْيَتَوَكَّلِ ٱلْمُؤْمِنُونَ ﴿١٣﴾

**13**. అల్లాహ్! ఆయన తప్ప, మరొక ఆరాధ్యుడు లేడు! మరియు విశ్వాసులు కేవలం అల్లాహ్ మీదే నమ్మకం ఉంచుకోవాలి!

يَـٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوٓا۟ إِنَّ مِنْ أَزْوَٰجِكُمْ وَأَوْلَـٰدِكُمْ عَدُوًّا لَّكُمْ فَٱحْذَرُوهُمْ ۚ وَإِن تَعْفُوا۟ وَتَصْفَحُوا۟ وَتَغْفِرُوا۟ فَإِنَّ ٱللَّهَ غَفُورٌ رَّحِيمٌ ﴿١٤﴾

**14**. ఓ విశ్వాసులారా! నిశ్చయంగా, మీ సహవాసులు (అ'జ్వాజ్) మరియు మీ సంతానంలో మీ శత్రువులుండవచ్చు! కావున మీరు వారి పట్ల జాగ్రత్త వహించండి. కాని ఒకవేళ మీరు వారి అపరాధాన్ని మన్నించి వారిని ఉపేక్షించి వారిని క్షమించితే! నిశ్చయంగా, అల్లాహ్ క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత (అని తెలుసుకోండి).

إِنَّمَآ أَمْوَٰلُكُمْ وَأَوْلَـٰدُكُمْ فِتْنَةٌ ۚ وَٱللَّهُ عِندَهُۥٓ أَجْرٌ عَظِيمٌ ﴿١٥﴾

**15**. నిశ్చయంగా, మీ సంపదలు మరియు మీ సంతానం మీ కొరకు ఒక పరీక్ష. మరియు అల్లాహ్! ఆయన దగ్గర గొప్ప ప్రతిఫలం (స్వర్గం) ఉంది.[1]

---

**1**. ఇటువంటి వాక్యానికై చూడండి, 8:28.

فَٱتَّقُواْ ٱللَّهَ مَا ٱسْتَطَعْتُمْ وَٱسْمَعُواْ وَأَطِيعُواْ وَأَنفِقُواْ خَيْرًا لِّأَنفُسِكُمْۗ وَمَن يُوقَ شُحَّ نَفْسِهِۦ فَأُوْلَٰٓئِكَ هُمُ ٱلْمُفْلِحُونَ ١٦

**16**. కావున మీరు మీ శక్తిమేరకు అల్లాహ్‌యందు భయభక్తులు కలిగిఉండండి, (ఆయన సూచనలను విని), ఆయనకు విధేయులై ఉండండి మరియు (మీ ధనం నుండి) దానం చేస్తే! అది మీ సొంత మేలుకే. మరియు ఎవరైతే తమ హృదయలోభత్వం నుండి రక్షణ పొందుతారో, అలాంటి వారే సాఫల్యం పొందేవారు.[1]

إِن تُقْرِضُواْ ٱللَّهَ قَرْضًا حَسَنًا يُضَٰعِفْهُ لَكُمْ وَيَغْفِرْ لَكُمْۚ وَٱللَّهُ شَكُورٌ حَلِيمٌ ١٧

**17**. ఒకవేళ మీరు అల్లాహ్‌కు అప్పుగా మంచి అప్పుఇస్తే, ఆయన దానిని ఎన్నోరెట్లు పెంచి తిరిగి మీకు ప్రసాదిస్తాడు మరియు మిమ్మల్ని క్షమిస్తాడు. వాస్తవానికి అల్లాహ్ కృతజ్ఞతలను ఆమోదించేవాడు సహనశీలుడు.

عَٰلِمُ ٱلْغَيْبِ وَٱلشَّهَٰدَةِ ٱلْعَزِيزُ ٱلْحَكِيمُ ١٨

**18**. ఆయన అగోచర మరియు గోచర విషయాలన్నీ బాగా తెలిసినవాడు, అపార శక్తి సంపన్నుడు, మహా వివేకవంతుడు. (3/4)

*****

---

1. ఇట్టి వాక్యానికై చూడండి, 59:9.

## 65. సూరహ్ అత్-'తలాఖ్

## سُورَةُ الطَّلَاقِ

అత్-'తలాఖు: **విడాకులు.** ఈ విషయం **1-7 ఆయతులలో** వివరించబడింది. ఇది, ఈ సమూహపు 10 **మదీనా** చిన్న చిన్న సూరాహ్‌లలో 9వది. దాదాపు 6వ హిజ్రీలో అవతరింపజేయబడింది. ఇందులో **12 ఆయతులు** ఉన్నాయి. దైవప్రవక్త ('స'అస) ప్రవచనం: 'విడాకులు అల్లాహ్ (సు.తా.) దృష్టిలో అనుమతింపబడిన వాటిలో అత్యంత అయిష్టకరమైన విషయం.' (అబూ-దావూద్ - 'అబ్దుల్లాహ్ బిన్-'ఉమర్ కథనం). చూడండి, 2:228-233.

بِسۡمِ ٱللَّهِ ٱلرَّحۡمَٰنِ ٱلرَّحِيمِ

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

يَٰٓأَيُّهَا ٱلنَّبِيُّ إِذَا طَلَّقۡتُمُ ٱلنِّسَآءَ فَطَلِّقُوهُنَّ لِعِدَّتِهِنَّ وَأَحۡصُواْ ٱلۡعِدَّةَۖ وَٱتَّقُواْ ٱللَّهَ رَبَّكُمۡۖ لَا تُخۡرِجُوهُنَّ مِنۢ بُيُوتِهِنَّ وَلَا يَخۡرُجۡنَ إِلَّآ أَن يَأۡتِينَ بِفَٰحِشَةٖ مُّبَيِّنَةٖۚ وَتِلۡكَ حُدُودُ ٱللَّهِۚ وَمَن يَتَعَدَّ حُدُودَ ٱللَّهِ فَقَدۡ ظَلَمَ نَفۡسَهُۥۚ لَا تَدۡرِي لَعَلَّ ٱللَّهَ يُحۡدِثُ بَعۡدَ ذَٰلِكَ أَمۡرٗا ١

**1.** * ఓ ప్రవక్తా! మీరు స్త్రీలకు **విడాకులు** ('తలాఖ్) ఇచ్చేటప్పుడు వారికి, వారి నిర్ణీత గడువు('ఇద్దత్)తో విడాకులివ్వండి. మరియు ఆ గడువును ఖచ్చితంగా లెక్క పెట్టండి.[1] మరియు మీ ప్రభువైన అల్లాహ్ పట్ల భయభక్తులు కలిగిఉండండి. వారు బహిరంగంగా అశ్లీలచేష్టలకు పాల్పడితే తప్ప, మీరు వారిని వారి ఇండ్లనుండి వెడలగొట్టకండి మరియు వారు కూడా స్వయంగా వెళ్ళిపోకూడదు.[2] మరియు ఇవి అల్లాహ్ నిర్ణయించిన హద్దులు. మరియు ఎవడైతే అల్లాహ్ (నిర్ణయించిన) హద్దులను అతిక్రమిస్తాడో వాస్తవానికి వాడు తనకు తానే అన్యాయం చేసుకున్నట్లు. నీకు తెలియదు,

**1.** నిర్ణీతగడువుతో అంటే గడువు ప్రారంభం కాగల సమయంలో, నిర్ణీతగడువు లోపల ఆమెతో రాజీపడే అవకాశం ఉండేరీతిలో విడాకులివ్వాలి. ఇబ్నె ఉమర్ (ర'ది.'అ.) తన భార్యకు ఋతుస్రావకాలం (బహిష్ఠు సమయం)లో విడాకులిస్తే దైవప్రవక్త ('స'అస) క్రోధితులయ్యారు. స్త్రీలు పరిశుద్ధులుగా ఉన్నకాలంలో వారితో లైంగిక సంబంధం చేయకముందు విడాకులివ్వాలి అని బోధించారు, ('స. బు'ఖారీ). ఇక్కడ పేర్కొన్న 'హదీస్' ఈ ఆయత్ వెలుగులో ఉంది. ఆ గడువును ఖచ్చితంగా లెక్కపెట్టాలి.

**2.** ఇద్దత్ కాలం పూర్తిఅయ్యే వరకు స్త్రీలు తమ భర్త ఇంటిలోనే ఉండాలి. భర్త ఆమె అన్న వస్త్రాల ఖర్చులు భరించాలి.

فَإِذَا بَلَغْنَ أَجَلَهُنَّ فَأَمْسِكُوهُنَّ بِمَعْرُوفٍ أَوْ فَارِقُوهُنَّ بِمَعْرُوفٍ وَأَشْهِدُوا۟ ذَوَىْ عَدْلٍ مِّنكُمْ وَأَقِيمُوا۟ ٱلشَّهَـٰدَةَ لِلَّهِ ۚ ذَٰلِكُمْ يُوعَظُ بِهِۦ مَن كَانَ يُؤْمِنُ بِٱللَّهِ وَٱلْيَوْمِ ٱلْـَٔاخِرِ ۚ وَمَن يَتَّقِ ٱللَّهَ يَجْعَل لَّهُۥ مَخْرَجًا ﴿٢﴾

وَيَرْزُقْهُ مِنْ حَيْثُ لَا يَحْتَسِبُ ۚ وَمَن يَتَوَكَّلْ عَلَى ٱللَّهِ فَهُوَ حَسْبُهُۥٓ ۚ إِنَّ ٱللَّهَ بَـٰلِغُ أَمْرِهِۦ ۚ قَدْ جَعَلَ ٱللَّهُ لِكُلِّ شَىْءٍ قَدْرًا ﴿٣﴾

బహుశా! దాని తరువాత అల్లాహ్ ఏదైనా క్రొత్తమార్గం చూపించవచ్చు![1]

**2**. ఇక వారి నిర్ణీతగడువు ముగిసి నప్పుడు, వారిని ధర్మప్రకారంగా (వివాహ బంధంలో) ఉంచుకోండి, లేదా ధర్మ ప్రకారంగా వారిని విడిచిపెట్టండి. మరియు మీలో న్యాయవంతులైన ఇద్దరు వ్యక్తులను సాక్షులుగా పెట్టుకోండి. మరియు అల్లాహ్ కొరకు సాక్ష్యం సరిగ్గా ఇవ్వండి. అల్లాహ్‌ను మరియు అంతిమ దినమును విశ్వసించే ప్రతివ్యక్తి కొరకు, ఈ విధమైన ఉపదేశ మివ్వబడుతోంది. మరియు అల్లాహ్ యందు భయభక్తులు గలవానికి, ఆయన ముక్తిమార్గం చూపుతాడు.

**3**. మరియు ఆయన, అతనికి, అతడు ఊహించని దిక్కునుండి జీవనోపాధిని ప్రసాదిస్తాడు. మరియు అల్లాహ్ మీద నమ్మకం ఉంచుకున్నవానికి ఆయనే చాలు. నిశ్చయంగా, అల్లాహ్ తన పని పూర్తిచేసి తీరుతాడు. వాస్తవానికి, అల్లాహ్ ప్రతిదానికి దాని విధి (ఖద్ర్) నిర్ణయించి ఉన్నాడు.

**1**. అంటే అల్లాహ్ (సు.తా.) వారిమధ్య మళ్ళీ ప్రేమకలిగించవచ్చు మరియు వారు తిరిగి తమ వివాహబంధాన్ని స్థిరపరచుకోవచ్చు! అందుకే ఒకసారి ఒకే విడాకులివ్వడం ప్రోత్సహించబడింది. మరియు చాలామంది వ్యాఖ్యాతల అభిప్రాయం ప్రకారం-ఈ ఆయత్ వెలుగులో-మూడు విడాకులు ఒకేసారిఇవ్వడం నిషేధింపబడింది. ఎందుకంటే మొదటి మరియు రెండవ విడాకు తరువాత వివాహాన్ని తిరిగి స్థిరపరచుకోవచ్చు! (ఫ'త్హ్ అల్-ఖదీర్). ఒక స్త్రీకి అంతకుముందు రెండువిడాకులివ్వబడి ఆతరువాత మూడవవిడాకు ఇస్తే! అప్పుడు ఆమె తనభర్తఇంట్లో ఉండజాలదు. మరియు అలాంటి పరిస్థితిలో, ఆమె మరొకపురుషుణ్ణి వివాహమాడకముందు, తిరిగి తనమొదటిభర్తతో వివాహంకూడా చేసుకోజాలదు. ఇది ఫాతిమబిన్తెఖైస్(ర. 'అన్హా)కు జరిగిన విషయంతో స్పష్టమవుతోంది. ఆమెభర్త ఆమెకు మూడవసారివిడాకులిచ్చిన తరువాత ఆమె తనభర్త ఇంటినుండివెళ్ళిపోవటానికి నిరాకరించింది. అప్పుడావిషయం దైవప్రవక్త('స'అస) దగ్గరికి వస్తే అతనామెను, తనభర్తఇల్లు విడవమనిఆజ్ఞాపించారు,(అ'హ్మద్, నసాయీ').

**4**. మరియు మీ స్త్రీలు ఋతుస్రావపు వయస్సు గడిచిపోయిన వారైతే లేక మీకు దానిని గురించి ఎలాంటి అనుమానం ఉంటే; లేక వారి ఋతుస్రావం ఇంకా ప్రారంభం కాని వారైతే, అలాంటి వారి గడువు మూడు మాసాలు.[1] మరియు గర్భవతులైన స్త్రీల గడువు వారి కాన్పు అయ్యేవరకు.[2] మరియు అల్లాహ్ పట్ల భయభక్తులు గలవానికి ఆయన, అతని వ్యవహారంలో సౌలభ్యం కలిగిస్తాడు.

وَٱلَّٰٓـِٔي يَئِسۡنَ مِنَ ٱلۡمَحِيضِ مِن نِّسَآئِكُمۡ إِنِ ٱرۡتَبۡتُمۡ فَعِدَّتُهُنَّ ثَلَٰثَةُ أَشۡهُرٖ وَٱلَّٰٓـِٔي لَمۡ يَحِضۡنَۚ وَأُوْلَٰتُ ٱلۡأَحۡمَالِ أَجَلُهُنَّ أَن يَضَعۡنَ حَمۡلَهُنَّۚ وَمَن يَتَّقِ ٱللَّهَ يَجۡعَل لَّهُۥ مِنۡ أَمۡرِهِۦ يُسۡرٗا ٤

**5**. ఇది అల్లాహ్ ఆజ్ఞ, ఆయన దానిని మీపై అవతరింపజేశాడు. మరియు ఎవడైతే అల్లాహ్ పట్ల భయభక్తులు కలిగి ఉంటాడో, ఆయన అతని పాపాలను తొలగిస్తాడు మరియు అతని ప్రతిఫలాన్ని అధికంచేస్తాడు.

ذَٰلِكَ أَمۡرُ ٱللَّهِ أَنزَلَهُۥٓ إِلَيۡكُمۡۚ وَمَن يَتَّقِ ٱللَّهَ يُكَفِّرۡ عَنۡهُ سَيِّـَٔاتِهِۦ وَيُعۡظِمۡ لَهُۥٓ أَجۡرًا ٥

**6**. (నిర్ణీత గడువు కాలంలో) మీ శక్తి మేరకు, మీరు నివసించే చోటనే, వారిని కూడా నివసించనివ్వండి. మరియు వారిని ఇబ్బందులకు గురిచేయడానికి వారిని బాధించకండి మరియు వారు గర్భవతులైతే, వారు ప్రసవించే వరకు వారిమీద ఖర్చుపెట్టండి. ఒకవేళ వారు మీ బిడ్డలకు పాలు పడుతున్నట్లైతే వారికి వారి ప్రతిఫలం ఇవ్వండి. దాని కొరకు మీరు ధర్మసమ్మతంగా మీ మధ్య

أَسۡكِنُوهُنَّ مِنۡ حَيۡثُ سَكَنتُم مِّن وُجۡدِكُمۡ وَلَا تُضَآرُّوهُنَّ لِتُضَيِّقُواْ عَلَيۡهِنَّۚ وَإِن كُنَّ أُوْلَٰتِ حَمۡلٖ فَأَنفِقُواْ عَلَيۡهِنَّ حَتَّىٰ يَضَعۡنَ حَمۡلَهُنَّۚ فَإِنۡ أَرۡضَعۡنَ لَكُمۡ فَـَٔاتُوهُنَّ أُجُورَهُنَّ وَأۡتَمِرُواْ بَيۡنَكُم بِمَعۡرُوفٖۖ وَإِن تَعَاسَرۡتُمۡ فَسَتُرۡضِعُ لَهُۥٓ أُخۡرَىٰ ٦

---

1. ఋతుస్రావం ప్రారంభంకాని స్త్రీలకు మరియు ఋతుస్రావం ఆగిపోయిన స్త్రీలకు వేచి ఉండే గడువు **మూడు** నెలలు.
2. గర్భవతులైన స్త్రీల గడువు - విడాకులివ్వబడినా లేక భర్తమరణించినా - ప్రసవించే వరకు! అలాంటి ప్రసవం విడాకుల తరువాత లేక భర్త మరణించిన రెండవరోజే అయినా సరే! ఈ విషయం 'హదీస్'లలో కూడా ఉంది. (బు'ఖారీ, ముస్లిం). ఇతర స్త్రీలు భర్త మరణించిన తరువాత **నాలుగు మాసాల పదిరోజులు** వేచిఉండాలి. (2:234).

సంప్రదింపులు చేసుకోండి. ఒకవేళ మీకు దాని (పాలిచ్చే) విషయంలో ఇబ్బందులు కలిగితే, (తండ్రి) మరొక స్త్రీతో (బిడ్డకు) పాలిప్పించవచ్చు!

لِيُنفِقْ ذُو سَعَةٍ مِّن سَعَتِهِۦ ۖ وَمَن قُدِرَ عَلَيْهِ رِزْقُهُۥ فَلْيُنفِقْ مِمَّآ ءَاتَىٰهُ ٱللَّهُ ۚ لَا يُكَلِّفُ ٱللَّهُ نَفْسًا إِلَّا مَآ ءَاتَىٰهَا ۚ سَيَجْعَلُ ٱللَّهُ بَعْدَ عُسْرٍ يُسْرًا ﴿٧﴾

**7**. సంపన్నుడైన వ్యక్తి తన ఆర్థిక స్తోమత ప్రకారం ఖర్చుపెట్టాలి. మరియు తక్కువ జీవనోపాధి గలవ్యక్తి అల్లాహ్ తనకు ప్రసాదించిన విధంగా ఖర్చు పెట్టాలి. అల్లాహ్ ఏ వ్యక్తిపై కూడా అతనికి ప్రసాదించిన దానికంటే మించిన భారం వేయడు.[1] అల్లాహ్ కష్టం తరువాత సుఖం కూడా కలిగిస్తాడు.

وَكَأَيِّن مِّن قَرْيَةٍ عَتَتْ عَنْ أَمْرِ رَبِّهَا وَرُسُلِهِۦ فَحَاسَبْنَٰهَا حِسَابًا شَدِيدًا وَعَذَّبْنَٰهَا عَذَابًا نُّكْرًا ﴿٨﴾

**8**. మరియు ఎన్నో నగరవాసులు, తమ ప్రభువు మరియు ఆయన ప్రవక్తల ఆజ్ఞలను తిరస్కరించారు. అప్పుడు మేము వాటి ప్రజల నుండి కఠినంగా లెక్క తీసుకున్నాము మరియు వారికి తీవ్రమైన శిక్షను సిద్ధపరిచాము.

فَذَاقَتْ وَبَالَ أَمْرِهَا وَكَانَ عَٰقِبَةُ أَمْرِهَا خُسْرًا ﴿٩﴾

**9**. కావున వారు తమ వ్యవహారాల దుష్ఫలితాన్ని రుచిచూశారు[2] మరియు వారి వ్యవహారాల పర్యవసానం నష్టమే!

أَعَدَّ ٱللَّهُ لَهُمْ عَذَابًا شَدِيدًا ۖ فَٱتَّقُوا۟ ٱللَّهَ يَٰٓأُو۟لِى ٱلْأَلْبَٰبِ ٱلَّذِينَ ءَامَنُوا۟ ۚ قَدْ أَنزَلَ ٱللَّهُ إِلَيْكُمْ ذِكْرًا ﴿١٠﴾

**10**. అల్లాహ్ వారి కొరకు కఠినమైన శిక్షను సిద్ధపరచి ఉంచాడు. కావున విశ్వాసులైన బుద్ధిమంతులారా! అల్లాహ్ పట్ల భయభక్తులు కలిగి ఉండండి. వాస్తవానికి అల్లాహ్ మీ వద్దకు హితబోధను (ఖుర్ఆన్ను) అవతరింపజేశాడు.

---

**1**. చూడండి, 2:233.
**2**. చూడండి, 64:5.

**11**. ఒక ప్రవక్తను కూడా! అతను మీకు స్పష్టమైన అల్లాహ్ సూచన(ఆయతు)లను వినిపిస్తున్నాడు.[1] అది, విశ్వసించి సత్కార్యాలు చేసేవారిని అంధకారాల నుండి వెలుగులోనికి తీసుకురావటానికి. మరియు అల్లాహ్‌ను విశ్వసించి సత్కార్యాలు చేసేవారిని, ఆయన క్రింద సెలయేళ్ళు ప్రవహించే స్వర్గవనాలలో ప్రవేశింపజేస్తాడు. అక్కడ వారు శాశ్వతంగా కలకాలం ఉంటారు. వాస్తవానికి అల్లాహ్ అలాంటి వ్యక్తి కొరకు ఉత్తమ జీవనోపాధిని ప్రసాదించాడు.

رَّسُولًا يَتْلُوا۟ عَلَيْكُمْ ءَايَٰتِ ٱللَّهِ مُبَيِّنَٰتٍ لِّيُخْرِجَ ٱلَّذِينَ ءَامَنُوا۟ وَعَمِلُوا۟ ٱلصَّٰلِحَٰتِ مِنَ ٱلظُّلُمَٰتِ إِلَى ٱلنُّورِ ۚ وَمَن يُؤْمِنۢ بِٱللَّهِ وَيَعْمَلْ صَٰلِحًا يُدْخِلْهُ جَنَّٰتٍ تَجْرِى مِن تَحْتِهَا ٱلْأَنْهَٰرُ خَٰلِدِينَ فِيهَآ أَبَدًا ۖ قَدْ أَحْسَنَ ٱللَّهُ لَهُۥ رِزْقًا ﴿١١﴾

**12**. అల్లాహ్‌యే సప్తాకాశాలను మరియు వాటిని పోలిన భూమండలాన్ని సృష్టించి, వాటి మధ్య ఆయన తన ఆదేశాలను అవతరింపజేస్తూ వుంటాడు. నిశ్చయంగా, అల్లాహ్ ప్రతిదీ చేయగల సమర్థుడు మరియు వాస్తవానికి అల్లాహ్ తన జ్ఞానంతో ప్రతిదానిని పరివేష్టించి వున్నాడని మీరు తెలుసుకోవటానికి. (7/8)

ٱللَّهُ ٱلَّذِى خَلَقَ سَبْعَ سَمَٰوَٰتٍ وَمِنَ ٱلْأَرْضِ مِثْلَهُنَّ يَتَنَزَّلُ ٱلْأَمْرُ بَيْنَهُنَّ لِتَعْلَمُوٓا۟ أَنَّ ٱللَّهَ عَلَىٰ كُلِّ شَىْءٍ قَدِيرٌ وَأَنَّ ٱللَّهَ قَدْ أَحَاطَ بِكُلِّ شَىْءٍ عِلْمًۢا ﴿١٢﴾

*****

1. ఇక్కడ ప్రవక్త అంటే ముహమ్మద్ ('స'అస).

## 66. సూరహ్ అత్-త'హ్రీమ్ سُورَةُ التَّحْرِيمِ

అత్-'త'హ్రీము: నిషేధించటం. ఈ చిన్నచిన్న మదీనాసూరాహ్(57-66)లలో ఇది 10వది మరియు చివరిది. ఇది దాదాపు 7వహిజ్రీలో మదీనాలో అవతరింపజేయ బడింది. దీని పేరు మొదటి ఆయత్‌లోనే వచ్చింది. ఇందులో 12 ఆయతులున్నాయి.

దైవప్రవక్త ('స'అస) తమ భార్యలలో ఒకామె 'జైనబ్ బింతె జ'హష్ (ర.'అన్హా) ఇంటికి పోయినప్పుడు, అక్కడ తేనె త్రాగేవారు మరియు అక్కడ కొంత ఎక్కువ కాలం ఆగేవారు. ఈ విషయం 'ఆయి'షహ్ మరియు 'హ'ఫ్స(ర.'అన్హా)లకు, సహించరానిదయ్యింది. ఈ విషయాన్ని వారు మాన్పించదలచి, ఒకరోజు దైవప్రవక్త ('స'అస), 'జైనబ్ బింతె జ'హష్ (ర.'అన్హా), ఇంటినుండి వారిలో ఒకామె ఇంటికి రాగానే ఆమె: 'ఓ దైవప్రవక్త ('స'అస) మీ నోటినుండి మ'గాఫీర్ (దుర్వాసన గల ఒకపువ్వు) వాసన వస్తుందేమిటీ?' అని అన్నది. దానికి దైవప్రవక్త ('స'అస): 'నేను తేనె మాత్రమే త్రాగాను! అల్లాహ్ (సు.తా.) సాక్షిగా ఇకముందు నేను తేనె త్రాగను.' అని దానిని తమపై నిషేధించుకున్నారు. ఆ సందర్భంలో ఈ ఆయతులు అవతరింపజేయబడ్డాయి, ('స'హీ'హ్ బు'ఖారీ).

بِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో

يَٰٓأَيُّهَا ٱلنَّبِيُّ لِمَ تُحَرِّمُ مَآ أَحَلَّ ٱللَّهُ لَكَ تَبْتَغِي مَرْضَاتَ أَزْوَٰجِكَ وَٱللَّهُ غَفُورٌ رَّحِيمٌ ﴿١﴾

**1.** * ఓ ప్రవక్తా! అల్లాహ్ నీకు ధర్మసమ్మతం చేసిన దానిని నీవు ఎందుకు నిషేధించుకుంటున్నావు?[1] నీవు నీ భార్యల ప్రసన్నతను కోరుతున్నావా? మరియు అల్లాహ్ క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత.

قَدْ فَرَضَ ٱللَّهُ لَكُمْ تَحِلَّةَ أَيْمَٰنِكُمْ وَٱللَّهُ مَوْلَىٰكُمْ وَهُوَ ٱلْعَلِيمُ ٱلْحَكِيمُ ﴿٢﴾

**2.** వాస్తవానికి అల్లాహ్ మీ ప్రమాణాల పరిహారపద్ధతి మీకు నిర్దేశించాడు.[2] మరియు అల్లాహ్‌యే మీ యజమాని. మరియు ఆయన సర్వజ్ఞుడు, మహా వివేకవంతుడు.

---

**1.** ఈ ఆయత్ ద్వారా విశదమయ్యేదేమిటంటే దైవప్రవక్త ('స'అస)కు కూడా అల్లాహ్ (సు.తా.) 'హలాల్ చేసిన దానిని 'హరాం చేసే అధికారం లేదు.

**2.** ప్రమాణాలకు పరిహారం ఇచ్చే విధానానికై చూడండి, 5:89. దైవప్రవక్త ('స'అస) కూడా పై ఆయత్ అవతరింపజేయబడిన తరువాత అదే విధంగా పరిహారం ఇచ్చారు, (ఫ'త్హ్ అల్-ఖదీర్) ఇంకా చూడండి, 2:224.

وَإِذۡ أَسَرَّ ٱلنَّبِيُّ إِلَىٰ بَعۡضِ أَزۡوَٰجِهِۦ حَدِيثٗا فَلَمَّا نَبَّأَتۡ بِهِۦ وَأَظۡهَرَهُ ٱللَّهُ عَلَيۡهِ عَرَّفَ بَعۡضَهُۥ وَأَعۡرَضَ عَنۢ بَعۡضٖۖ فَلَمَّا نَبَّأَهَا بِهِۦ قَالَتۡ مَنۡ أَنۢبَأَكَ هَٰذَاۖ قَالَ نَبَّأَنِيَ ٱلۡعَلِيمُ ٱلۡخَبِيرُ ٣

**3.** మరియు (జ్ఞాపకం చేసుకోండి) ప్రవక్త తన భార్యలలో ఒకామెకు[1] రహస్యంగా ఒక విషయం చెప్పగా ఆమె దానిని (ఆ రహస్యాన్ని) మరొకామెకు[2] చెప్పింది మరియు అల్లాహ్ అతనికి (ప్రవక్తకు) ఆ విషయాన్ని తెలియజేశాడు. (వాస్తవానికి) అతను (ప్రవక్త) ఆ విషయాన్ని (మొదటి) ఆమెకు కొంత తెలిపి, మరికొంత తెలుపలేదు. ఇక అతను (ప్రవక్త, మొదటి) ఆమెకు దానిని (రహస్యం బయటపడిన సంగతిని) తెలిపినప్పుడు, ఆమె (ఆశ్చర్యపోతూ) అతనితో ఇలా అడిగింది: "ఇది నీకు ఎవరు తెలిపారు?" అతను జవాబిచ్చాడు: "నాకు ఈ విషయం ఆ సర్వజ్ఞుడు, ఆ సర్వం తెలిసినవాడు తెలిపాడు."[3]

إِن تَتُوبَآ إِلَى ٱللَّهِ فَقَدۡ صَغَتۡ قُلُوبُكُمَاۖ وَإِن تَظَٰهَرَا عَلَيۡهِ فَإِنَّ ٱللَّهَ هُوَ مَوۡلَىٰهُ وَجِبۡرِيلُ وَصَٰلِحُ ٱلۡمُؤۡمِنِينَۖ وَٱلۡمَلَٰٓئِكَةُ بَعۡدَ ذَٰلِكَ ظَهِيرٌ ٤

**4.** (ఆ ఇద్దరు స్త్రీలతో ఇలా అనబడింది): "ఒకవేళ మీరిద్దరూ అల్లాహ్ వైపునకు పశ్చాత్తాపంతో మరలితే (అది మీ మేలుకే), వాస్తవానికి మీ ఇద్దరి హృదయాలు (ఋజుమార్గం నుండి) తొలగిపోయాయి. ఒకవేళ మీరిద్దరు ప్రవక్తకు విరోధంగా పోతే! నిశ్చయంగా, అల్లాహ్ అతని సంరక్షకుడు మరియు జిబ్రీల్ మరియు సత్పురుషులైన విశ్వాసులు అతని (సహాయకులు). మరియు దేవదూతలందరు కూడా అతని సహాయకులని (తెలుసుకోండి).

---

**1 .** 'హఫ్స.

**2 .** 'ఆయి'షహ్.

**3** . ఖుర్ఆన్ మాత్రమే కాక ఇతరవిషయాలు కూడా దైవప్రవక్త ('స'అస)కు దివ్యజ్ఞానం ద్వారా తెలియజేయబడేవి.

عَسَىٰ رَبُّهُۥٓ إِن طَلَّقَكُنَّ أَن يُبْدِلَهُۥٓ أَزْوَٰجًا خَيْرًا مِّنكُنَّ مُسْلِمَٰتٍ مُّؤْمِنَٰتٍ قَٰنِتَٰتٍ تَٰٓئِبَٰتٍ عَٰبِدَٰتٍ سَٰٓئِحَٰتٍ ثَيِّبَٰتٍ وَأَبْكَارًا ٥

5. ''ఒకవేళ అతను (ము'హమ్మద్) మీ అందరికీ విడాకులిస్తే! అల్లాహ్, మీకు బదులుగా, మీకంటే మంచి భార్యలను, అతనికి (ప్రవక్తకు) ప్రసాదించగలడు! వారు మంచి ముస్లింలు, విశ్వాసులు, భక్తిపరులు, పశ్చాత్తాపపడే వారు, (అల్లాహ్‌ను) ఆరాధించే వారు, వలస పోయే (ఉపవాసాలు చేసే)[1] వారు అయిన విధవలు లేదా కన్యలు అయిఉంటారు!''[2]

يَٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوا۟ قُوٓا۟ أَنفُسَكُمْ وَأَهْلِيكُمْ نَارًا وَقُودُهَا ٱلنَّاسُ وَٱلْحِجَارَةُ عَلَيْهَا مَلَٰٓئِكَةٌ غِلَاظٌ شِدَادٌ لَّا يَعْصُونَ ٱللَّهَ مَآ أَمَرَهُمْ وَيَفْعَلُونَ مَا يُؤْمَرُونَ ٦

6. ఓ విశ్వాసులారా! మీరు మిమ్మల్ని మరియు మీ కుటుంబంవారిని, మానవులు మరియు రాళ్ళు ఇంధనం కాబోయే నరకాగ్ని నుండి కాపాడుకోండి![3] దానిపై ఎంతో బలిష్ఠులూ, కఠినులూ అయిన దేవదూతలు నియమింపబడి ఉంటారు. వారు అల్లాహ్ ఇచ్చిన ఆజ్ఞను ఉల్లంఘించరు మరియు వారికిచ్చిన ఆజ్ఞలనే నెరవేరుస్తూ ఉంటారు.

يَٰٓأَيُّهَا ٱلَّذِينَ كَفَرُوا۟ لَا تَعْتَذِرُوا۟ ٱلْيَوْمَ إِنَّمَا تُجْزَوْنَ مَا كُنتُمْ تَعْمَلُونَ ٧

7. ఓ సత్యతిరస్కారులారా! ఈ రోజు మీరు సాకులు చెప్పకండి. నిశ్చయంగా, మీరు చేస్తూ ఉండిన కర్మలకు, తగిన ప్రతిఫలమే మీకు ఇవ్వబడుతోంది.

1. సాఇ''హాత్‌కై చూడండి, 9:112.
2. దైవప్రవక్త ('స'అస) భార్య (ర.'అన్హుమ్)లలో కేవలం 'ఆయి'షహ్ (ర.'అన్హా) మాత్రమే కన్య, 'జైనబ్ బిన్తె జహష్ (ర.'అన్హా) విడాకురాలు మరియు మిగతా భార్యలందరూ విధవలు. అతను ఏ భార్యకు కూడా విడాకులివ్వలేదు.
3. ఇక్కడ విశ్వాసులతో: 'మీరు మీ ఇంటి వారికి ఇస్లాం బోధించండి మరియు సద్వర్తనులుగా ఉండటానికి తగిన శిక్షణ ఇవ్వండి. బిడ్డ ఏడు సంవత్సరాల వాడు అయినప్పుడు నమా'జ్ చేయటానికి ప్రోత్సహించండి. పదిసంవత్సరాల వయస్సులో నమా'జ్ చేయకుంటే శిక్షించండి.' (అబూదావూద్, తిర్మి'జీ'). ఇదే విధంగా ఉపవాసాల కోసం మరియు మంచి పనుల కోసం ప్రోత్సహించండి. నరకానికై చూడండి, 74:27.

يَـٰٓأَيُّهَا ٱلَّذِينَ ءَامَنُوا۟ تُوبُوٓا۟ إِلَى ٱللَّهِ تَوْبَةً نَّصُوحًا عَسَىٰ رَبُّكُمْ أَن يُكَفِّرَ عَنكُمْ سَيِّـَٔاتِكُمْ وَيُدْخِلَكُمْ جَنَّـٰتٍ تَجْرِى مِن تَحْتِهَا ٱلْأَنْهَـٰرُ يَوْمَ لَا يُخْزِى ٱللَّهُ ٱلنَّبِىَّ وَٱلَّذِينَ ءَامَنُوا۟ مَعَهُۥ ۖ نُورُهُمْ يَسْعَىٰ بَيْنَ أَيْدِيهِمْ وَبِأَيْمَـٰنِهِمْ يَقُولُونَ رَبَّنَآ أَتْمِمْ لَنَا نُورَنَا وَٱغْفِرْ لَنَآ ۖ إِنَّكَ عَلَىٰ كُلِّ شَىْءٍ قَدِيرٌ ﴿٨﴾

**8.** ఓ విశ్వాసులారా! మీరు అల్లాహ్ వైపునకు మనఃపూర్వకమైన పశ్చాత్తాపంతో, క్షమాపణ కొరకు మరలితే![1] మీ ప్రభువు మీ పాపాలను తొలగించి, మిమ్మల్ని క్రింద సెలయేళ్ళు ప్రవహించే స్వర్గవనాలలో ప్రవేశింపజేస్తాడు; ఆ రోజు అల్లాహ్ తన ప్రవక్తను మరియు అతనితో పాటు విశ్వసించిన వారిని అవమానంపాలు చేయడు. వారి కాంతి, వారి ముందు మరియు వారి కుడివైపు నుండి ప్రసరిస్తూ ఉంటుంది.[2] వారు ఇలా ప్రార్థిస్తారు: "ఓ మా ప్రభూ! మా కాంతిని మా కొరకు పరిపూర్ణం చేయి మరియు మమ్మల్ని క్షమించు. నిశ్చయంగా, నీవే ప్రతిదీ చేయగల సమర్థుడవు!"

يَـٰٓأَيُّهَا ٱلنَّبِىُّ جَـٰهِدِ ٱلْكُفَّارَ وَٱلْمُنَـٰفِقِينَ وَٱغْلُظْ عَلَيْهِمْ ۚ وَمَأْوَىٰهُمْ جَهَنَّمُ ۖ وَبِئْسَ ٱلْمَصِيرُ ﴿٩﴾

**9.** ఓ ప్రవక్తా! నీవు సత్యతిరస్కారులతో మరియు కపటవిశ్వాసులతో ధర్మయుద్ధం చెయ్యి. మరియు వారి విషయంలో కఠినంగా వ్యవహరించు. మరియు వారి ఆశ్రయం నరకమే! అది అతిచెడ్డ గమ్యస్థానం.[3]

---

**1.** మనఃపూర్వక పశ్చాత్తాపం అంటే: 1) తాము చేసిన పాపాన్ని వదులుకోవాలి. 2) అల్లాహ్ (సు.తా.) ముందు వినమ్రులై పశ్చాత్తాపపడాలి. 3) మరల దానిని చేయకుండా ఉండాలి. 4) ఒకవేళ దాని సంబంధం మానవులతో ఉంటే, ఎవరి హక్కుకు హాని కలిగిందో, అతనితో క్షమాపణ కోరుకోవాలి. కేవలం నోటితో పశ్చాత్తాపపడితే సరిపోదు.

**2.** చూడండి, 57:12-13.

**3.** చూడండి, 9:73 సత్యతిరస్కారుల మరియు కపటవిశ్వాసుల గమ్యస్థానం నరకమే!

ضَرَبَ ٱللَّهُ مَثَلًا لِّلَّذِينَ كَفَرُوا۟ ٱمْرَأَتَ نُوحٍ وَٱمْرَأَتَ لُوطٍ ۖ كَانَتَا تَحْتَ عَبْدَيْنِ مِنْ عِبَادِنَا صَـٰلِحَيْنِ فَخَانَتَاهُمَا فَلَمْ يُغْنِيَا عَنْهُمَا مِنَ ٱللَّهِ شَيْـًۭٔا وَقِيلَ ٱدْخُلَا ٱلنَّارَ مَعَ ٱلدَّٰخِلِينَ ﴿١٠﴾

**10**. సత్యతిరస్కారుల విషయంలో అల్లాహ్ నూ'హ్ భార్య మరియు లూ'త్ భార్యల ఉదాహరణలను ఇచ్చాడు.[1] ఆ ఇద్దరు స్త్రీలు మా సత్పురుషులైన మా ఇద్దరు దాసుల (వివాహ) బంధంలో ఉండిరి. కాని ఆ ఇద్దరు స్త్రీలు వారిద్దరి పట్ల విశ్వాసఘాతానికి పాల్పడ్డారు. కావున వారిద్దరు, ఆ ఇద్దరు స్త్రీల విషయంలో అల్లాహ్ ముందు (పరలోకంలో) ఏ విధంగాను సహాయపడలేరు.[2] మరియు (తీర్పు దినమున) వారితో: "నరకాగ్నిలో ప్రవేశించేవారితో సహా మీరిద్దరు స్త్రీలు కూడా ప్రవేశించండి!" అని చెప్పబడుతుంది.

وَضَرَبَ ٱللَّهُ مَثَلًا لِّلَّذِينَ ءَامَنُوا۟ ٱمْرَأَتَ فِرْعَوْنَ إِذْ قَالَتْ رَبِّ ٱبْنِ لِى عِندَكَ بَيْتًا فِى ٱلْجَنَّةِ وَنَجِّنِى مِن فِرْعَوْنَ وَعَمَلِهِۦ وَنَجِّنِى مِنَ ٱلْقَوْمِ ٱلظَّـٰلِمِينَ ﴿١١﴾

**11**. మరియు అల్లాహ్, విశ్వసించిన వారిలో ఫిర్'ఔన్ భార్యను ఉదాహరణగా పేర్కొన్నాడు.[3] ఆమె ఇలా అన్న విషయం (జ్ఞాపకం చేసుకోండి): "ఓ నా ప్రభూ! నా కొరకు నీ వద్ద స్వర్గంలో ఒక గృహాన్ని నిర్మించు! మరియు నన్ను, ఫిర్'ఔన్ మరియు అతని చేష్టలనుండి కాపాడు మరియు నన్ను ఈ దుర్మార్గ జాతివారి నుండి కాపాడు."

---

**1**. లూ'త్ ('అ.స.) భార్య విషయానికై చూడండి, 7:83 మరియు 11:81. నూ'హ్ ('అ.స.) భార్యను గురించి కేవలం ఇక్కడ మాత్రమే చెప్పబడింది. వీరిద్దరు చెడునడవడిక, చెడుచరిత్రవారు కారు, కానీ సత్యతిరస్కారులు.

**2**. సత్యతిరస్కారులు దగ్గరి బంధువులైనా వారితో సంబంధాలు తెంపుకోవాలి. చూడండి, 11:46.

**3**. చూడండి, 28:9.

وَمَرۡيَمَ ٱبۡنَتَ عِمۡرَٰنَ ٱلَّتِيٓ أَحۡصَنَتۡ فَرۡجَهَا فَنَفَخۡنَا فِيهِ مِن رُّوحِنَا وَصَدَّقَتۡ بِكَلِمَٰتِ رَبِّهَا وَكُتُبِهِۦ وَكَانَتۡ مِنَ ٱلۡقَٰنِتِينَ ١٢

**12**. మరియు 'ఇమ్రాన్ కుమార్తె మర్యమ్‌ను[1] (కూడా ఉదాహరణగా పేర్కొన్నాడు) ఆమె తన శీలాన్ని కాపాడుకున్నది. మరియు మేము ఆమెలోకి మా (తరఫు నుండి) జీవం (ఆత్మ) ఊదాము.[2] మరియు ఆమె తన ప్రభువు సమాచారాలను మరియు ఆయన గ్రంథాలను, సత్యాలని ధృవపరిచింది మరియు ఆమె భక్తిపరులలో చేరిపోయింది.[3]

*****

**1**. చూడండి, 3:33.

**2**. చూడండి, 21:91.

**3**. స్త్రీలందరిలో 'ఖదీజా బింత్ 'ఖువైలిద్, ఫాతిమా, మర్యం మరియు ఫిర్'ఔన్ భార్య ఆసియహ్ (ర'ది.'అన్హుమ్)లు, అతి ఉత్తమమైన వారు. (ముస్నద్ అ'హ్మద్). మరొక 'హదీస్': చాలామంది పురుషులు పరిపూర్ణతకు చేరుకున్నారు. కాని స్త్రీలలో కేవలం ఫిర్'ఔన్ భార్య ఆసియహ్ మరియు 'ఇమ్రాన్ కూతురు మర్యం (ర'ది.'అన్హుమ్)లు పరిపూర్ణతకు చేరుకున్నారు. మరియు 'ఆయి'షహ్ (ర.'అన్హా) యొక్క ఔన్నత్యం ఇతర స్త్రీలపై స'రీద్‌కు ఇతర ఆహారంపై ఉన్నట్లు ఉంది. ('స'హీ'హ్ బు'ఖారీ).

## 67. సూరహ్ అల్-ముల్క్ سُورَةُ المُلْكِ

ఇంతవరకు 14/15వ వంతు ఖుర్ఆన్ పూర్తి అయ్యింది. ఇక మిగిలిన 1/15 భాగంలో చిన్న చిన్న సూరాహ్‌లు చాలా మట్టుకు **మక్కా**కు చెందినవి ఉన్నాయి. ఈ సూరహ్‌లో **30 ఆయతులు** ఉన్నాయి. అల్-ముల్క్: The Dominion, అధికారం, **ఆధిపత్యం**, రాజ్యం, సామ్రాజ్యాధిపత్యం, ప్రభుత్వం. ఈ పేరు **మొదటి ఆయత్** నుండి తీసుకోబడింది. దీని గొప్పతనాలను గురించిన 'హదీస్'లు ఎన్నో ఉన్నాయి. వాటిలో ఒకటి: "ఒక సూరహ్ 30 ఆయతులది ఉంది. అది మానవునికి సిఫారసు చేస్తుంది, దానివల్ల అతడు క్షమించబడతాడు." అన్న 'హదీస్' (సునన్ తిర్మిజీ', సునన్ అబూ-దావూద్, ఇబ్నె-మాజా మరియు ముస్నద్ అ'హ్మద్). మరొక 'హదీస్': "ఖుర్ఆన్‌లో ఒక సూరహ్ ఉంది అది తనను చదివిన వాడిని స్వర్గానికి పంపేవరకు అల్లాహ్‌తో వాదులాడుతుంది." (మజ్మ'అ అ'జ్జవాయి'ద్ 7/172,) మరొక 'హదీస్': "దైవప్రవక్త ('స'అస) రాత్రి నిద్రపోకముందు సూరహ్ అస్-సజ్దా (32) మరియు సూరహ్ అల్-ముల్క్ (67) తప్పక చదివే వారు." మరొక షే'ఖ్ అల్బానీ సమకూర్చిన 'స'హీ'హ్ రివాయత్‌లో: "సూరహ్ అల్-ముల్క్ గోరీ శిక్షనుండి కాపాడుతుంది. అయితే చదివేవాడు ఇస్లాం ఆజ్ఞలను మరియు విధులను పాటించే వాడై ఉండాలి!" అని ఉంది.

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بِسۡمِ ٱللَّهِ ٱلرَّحۡمَٰنِ ٱلرَّحِيمِ

**1.** (*) ఎవరి చేతిలోనయితే విశ్వ సామ్రాజ్యాధిపత్యం ఉందో! ఆయన సర్వశ్రేష్ఠుడు (శుభదాయకుడు) మరియు ఆయన ప్రతిదీ చేయగల సమర్థుడు.

تَبَٰرَكَ ٱلَّذِي بِيَدِهِ ٱلۡمُلۡكُ وَهُوَ عَلَىٰ كُلِّ شَيۡءٖ قَدِيرٌ ١

**2.** ఆయనే! మీలో మంచిపనులు చేసేవారెవరో పరీక్షించటానికి, చావు - బ్రతుకులను సృష్టించాడు.[1] మరియు ఆయన సర్వశక్తిమంతుడు, క్షమాశీలుడు.

ٱلَّذِي خَلَقَ ٱلۡمَوۡتَ وَٱلۡحَيَوٰةَ لِيَبۡلُوَكُمۡ أَيُّكُمۡ أَحۡسَنُ عَمَلٗاۚ وَهُوَ ٱلۡعَزِيزُ ٱلۡغَفُورُ ٢

---

**1.** *రూ'హ్:* ఒక విచిత్రమైన శక్తి. దానివాస్తవం అల్లాహ్(సు.తా.)కు తప్ప మరెవ్వరికీ తెలియదు. దాని సంబంధం ఒక శరీరంతో ఏర్పడినప్పుడు అది సజీవిగా పరిగణించబడుతుంది. దాని సంబంధం తెగిపోయిన శరీరం, మృతదేహంగా (నిర్జీవిగా) పరిగణించబడుతుంది. అల్లాహ్ (సు.తా.) ఈ తాత్కాలిక జీవితాన్నిచ్చి, తరువాత మరణింపజేస్తాడు. ఈ తాత్కాలి కజీవితాన్ని సరైనవిధంగా ఎవడు వినియోగిస్తాడనేది ఆయన (సు.తా.) పరీక్షిస్తున్నాడు. ఎవడైతే ఈ తాత్కాలిక జీవితాన్ని విశ్వాసం మరియు అల్లాహ్ (సు.తా.) విధేయత కోసం వినియోగిస్తాడో వాడు మంచి ప్రతిఫలం పొందుతాడు. అలా చేయని వాడి కొరకు నరకశిక్ష ఉంటుంది.

ٱلَّذِى خَلَقَ سَبۡعَ سَمَٰوَٰتٖ طِبَاقٗاۖ مَّا تَرَىٰ فِى خَلۡقِ ٱلرَّحۡمَٰنِ مِن تَفَٰوُتٖۖ فَٱرۡجِعِ ٱلۡبَصَرَ هَلۡ تَرَىٰ مِن فُطُورٖ ﴿٣﴾

**3**. ఆయనే, ఒకదానిపై ఒకటి ఏడు ఆకాశాలను సృష్టించాడు. ఆ అనంత కరుణామయుని సృష్టిలో నీవు ఎలాంటి లోపాన్నీ చూడలేవు. కావాలంటే మరొకసారి చూడు: "ఏమీ? నీకేమైనా లోపం కనిపిస్తుందా?"

ثُمَّ ٱرۡجِعِ ٱلۡبَصَرَ كَرَّتَيۡنِ يَنقَلِبۡ إِلَيۡكَ ٱلۡبَصَرُ خَاسِئٗا وَهُوَ حَسِيرٞ ﴿٤﴾

**4**. ఇంకా, మాటిమాటికీ నీ చూపులు త్రిప్పిచూడు. అది (నీ చూపు) విఫలమై, అలిసిసొలసి తిరిగి నీ వైపుకే వస్తుంది.

وَلَقَدۡ زَيَّنَّا ٱلسَّمَآءَ ٱلدُّنۡيَا بِمَصَٰبِيحَ وَجَعَلۡنَٰهَا رُجُومٗا لِّلشَّيَٰطِينِۖ وَأَعۡتَدۡنَا لَهُمۡ عَذَابَ ٱلسَّعِيرِ ﴿٥﴾

**5**. మరియు వాస్తవంగా, మేము భూమికి దగ్గరగా ఉన్న ఆకాశాన్ని దీపాలతో అలంకరించాము. మరియు వాటిని, షైతాన్‌లను తరిమికొట్టే సాధనాలుగా చేశాము.[1] మరియు వారి(షైతాన్‌ల)కొరకు మేము భగభగ మండే అగ్ని జ్వాలల శిక్షను సిద్ధపరచి ఉంచాము.

وَلِلَّذِينَ كَفَرُواْ بِرَبِّهِمۡ عَذَابُ جَهَنَّمَۖ وَبِئۡسَ ٱلۡمَصِيرُ ﴿٦﴾

**6**. మరియు తమ ప్రభువు(అల్లాహ్)ను తిరస్కరించే వారికి నరకశిక్ష ఉంది. అది ఎంత చెడ్డ గమ్యస్థానం.

إِذَآ أُلۡقُواْ فِيهَا سَمِعُواْ لَهَا شَهِيقٗا وَهِىَ تَفُورُ ﴿٧﴾

**7**. వారు అందులోకి విసిరివేయబడి నప్పుడు, వారు దాని (భయంకరమైన) గర్జనను వింటారు మరియు అది మరిగి పొంగుతూ ఉంటుంది.

تَكَادُ تَمَيَّزُ مِنَ ٱلۡغَيۡظِۖ كُلَّمَآ أُلۡقِىَ فِيهَا فَوۡجٞ سَأَلَهُمۡ خَزَنَتُهَآ أَلَمۡ يَأۡتِكُمۡ نَذِيرٞ ﴿٨﴾

**8**. అది దాదాపు ఉద్రేకంతో ప్రేలిపోతూ ఉంటుంది. ప్రతిసారి అందులోకి (పాపుల) గుంపు పడవేయబడినప్పుడు! దాని కాపలాదారులు వారితో: "ఏమీ? మీ వద్దకు ఏ హెచ్చరిక చేసేవాడు రాలేదా?" అని ప్రశ్నిస్తారు.

---

**1**. చూడండి, 37:6-10.

**9**. వారంటారు: ''ఎందుకు రాలేదు! వాస్తవానికి మా వద్దకు హెచ్చరిక చేసేవాడు వచ్చాడు, కాని మేము అతనిని అసత్యుడవని తిరస్కరించాము మరియు అతనితో ఇలా అన్నాము: 'అల్లాహ్ దేనినీ (ఏ దివ్యజ్ఞానాన్ని) అవతరింపజేయలేదు; మీరు కేవలం చాలా పెద్ద మార్గభ్రష్టత్వంలో పడి ఉన్నారు!' ''

قَالُوا۟ بَلَىٰ قَدْ جَآءَنَا نَذِيرٌ فَكَذَّبْنَا وَقُلْنَا مَا نَزَّلَ ٱللَّهُ مِن شَىْءٍ إِنْ أَنتُمْ إِلَّا فِى ضَلَـٰلٍ كَبِيرٍ ﴿٩﴾

**10**. ఇంకా వారు ఇలా అంటారు: ''ఒకవేళ మేము విని ఉంటే లేదా గ్రహించి ఉంటే, మేము మండే అగ్నిజ్వాలలలో పడివుండే వారితో చేరేవారం కాము కదా!''

وَقَالُوا۟ لَوْ كُنَّا نَسْمَعُ أَوْ نَعْقِلُ مَا كُنَّا فِىٓ أَصْحَـٰبِ ٱلسَّعِيرِ ﴿١٠﴾

**11**. అప్పుడు వారే స్వయంగా తమ పాపాన్ని ఒప్పుకుంటారు. కావున, భగభగ మండే అగ్నిజ్వాల వాసులు దూరమైపోవు గాక!

فَٱعْتَرَفُوا۟ بِذَنۢبِهِمْ فَسُحْقًا لِّأَصْحَـٰبِ ٱلسَّعِيرِ ﴿١١﴾

**12**. నిశ్చయంగా, ఎవరైతే అగోచరుడైన తమ ప్రభువుకు భయపడతారో! వారికి క్షమాపణ మరియు గొప్ప ప్రతిఫలం ఉంటాయి.

إِنَّ ٱلَّذِينَ يَخْشَوْنَ رَبَّهُم بِٱلْغَيْبِ لَهُم مَّغْفِرَةٌ وَأَجْرٌ كَبِيرٌ ﴿١٢﴾

**13**. మరియు మీరు మీ మాటలను రహస్యంగా ఉంచినా సరే! లేక వాటిని వెల్లడి చేసినా సరే! నిశ్చయంగా, ఆయనకు హృదయాలస్థితి బాగా తెలుసు.

وَأَسِرُّوا۟ قَوْلَكُمْ أَوِ ٱجْهَرُوا۟ بِهِۦٓ ۖ إِنَّهُۥ عَلِيمٌۢ بِذَاتِ ٱلصُّدُورِ ﴿١٣﴾

**14**. ఏమిటీ? పుట్టించిన వాడికే తెలియదా? మరియు ఆయన సూక్ష్మగ్రాహి, సర్వం తెలిసినవాడు!

أَلَا يَعْلَمُ مَنْ خَلَقَ وَهُوَ ٱللَّطِيفُ ٱلْخَبِيرُ ﴿١٤﴾

**15**. భూమిని మీ అధీనంలో ఉంచినవాడు ఆయనే! కావున మీరు దాని దారులలో తిరగండి మరియు ఆయన ప్రసాదించిన జీవనోపాధిని తినండి. మరియు మీరు ఆయన వైపునకే సజీవులై మరలి పోవలసి ఉంది.

هُوَ ٱلَّذِى جَعَلَ لَكُمُ ٱلْأَرْضَ ذَلُولًا فَٱمْشُوا۟ فِى مَنَاكِبِهَا وَكُلُوا۟ مِن رِّزْقِهِۦ ۖ وَإِلَيْهِ ٱلنُّشُورُ ﴿١٥﴾

**16**. ఏమీ? మీరు నిర్భయంగా ఉన్నారా? ఆకాశాలలో ఉన్నవాడు, మిమ్మల్ని భూమిలోకి అణగద్రొక్కడని, ఎప్పుడైతే అది తీవ్ర కంపనాలకు గురిఅవుతుందో?

ءَأَمِنتُم مَّن فِى ٱلسَّمَآءِ أَن يَخْسِفَ بِكُمُ ٱلْأَرْضَ فَإِذَا هِىَ تَمُورُ ﴿١٦﴾

**17**. లేక, ఆకాశాలలో ఉన్నవాడు, మీపైకి రాళ్ళు కురిపించే గాలివాన పంపడని మీరు నిర్భయంగా ఉన్నారా? నా హెచ్చరిక ఎలాంటిదో అప్పుడు మీరు తెలుసుకోగలరు.

أَمْ أَمِنتُم مَّن فِى ٱلسَّمَآءِ أَن يُرْسِلَ عَلَيْكُمْ حَاصِبًا ۖ فَسَتَعْلَمُونَ كَيْفَ نَذِيرِ ﴿١٧﴾

**18**. మరియు వాస్తవానికి వారికి పూర్వం గతించిన వారు కూడా (ప్రవక్తలను) తిరస్కరించారు. నా పట్టు (శిక్ష) ఎంత తీవ్రంగా ఉండిందో (చూశారా)?

وَلَقَدْ كَذَّبَ ٱلَّذِينَ مِن قَبْلِهِمْ فَكَيْفَ كَانَ نَكِيرِ ﴿١٨﴾

**19**. ఏమీ? వారు తమ మీద ఎగిరే పక్షులు రెక్కలను ఎలా చాపుతూ ముడుచుకుంటూ, ఎగురుతున్నాయో చూడటం లేదా? ఆ అనంత కరుణామయుడు తప్ప మరెవ్వరూ వాటిని అలా నిలిపి ఉంచలేరు కదా! నిశ్చయంగా ఆయన ప్రతిదానినీ చూస్తున్నాడు!

أَوَلَمْ يَرَوْا۟ إِلَى ٱلطَّيْرِ فَوْقَهُمْ صَٰٓفَّٰتٍ وَيَقْبِضْنَ ۚ مَا يُمْسِكُهُنَّ إِلَّا ٱلرَّحْمَٰنُ ۚ إِنَّهُۥ بِكُلِّ شَىْءٍۭ بَصِيرٌ ﴿١٩﴾

أَمَّنۡ هَٰذَا ٱلَّذِي هُوَ جُندٞ لَّكُمۡ يَنصُرُكُم مِّن دُونِ ٱلرَّحۡمَٰنِۚ إِنِ ٱلۡكَٰفِرُونَ إِلَّا فِي غُرُورٍ ٢٠

**20**. ఏమీ? అనంత కరుణామయుడు తప్ప మీకు సేనవలే అడ్డుగా నిలిచి, మీకు సహాయపడగల వాడెవడైనా ఉన్నాడా? ఈ సత్యతిరస్కారులు కేవలం మోసంలో పడి వున్నారు.

أَمَّنۡ هَٰذَا ٱلَّذِي يَرۡزُقُكُمۡ إِنۡ أَمۡسَكَ رِزۡقَهُۥۚ بَل لَّجُّواْ فِي عُتُوّٖ وَنُفُورٍ ٢١

**21**. ఒకవేళ ఆయన మీ జీవనోపాధిని ఆపివేస్తే, మీకు జీవనోపాధి ఇచ్చేవాడు ఎవడున్నాడు? అయినా వారు తలబిరుసు తనంలో మునిగి (సత్యానికి) దూరమై పోతున్నారు.

أَفَمَن يَمۡشِي مُكِبًّا عَلَىٰ وَجۡهِهِۦٓ أَهۡدَىٰٓ أَمَّن يَمۡشِي سَوِيًّا عَلَىٰ صِرَٰطٖ مُّسۡتَقِيمٖ ٢٢

**22**. ఏమీ? ఎవడైతే తన ముఖంమీద దేవులాడుతూ నడుస్తాడో, అతడు సరైనమార్గం పొందుతాడా?[1] లేక చక్కగా ఋజుమార్గం మీద నడిచేవాడు పొందుతాడా?

قُلۡ هُوَ ٱلَّذِيٓ أَنشَأَكُمۡ وَجَعَلَ لَكُمُ ٱلسَّمۡعَ وَٱلۡأَبۡصَٰرَ وَٱلۡأَفۡـِٔدَةَۖ قَلِيلٗا مَّا تَشۡكُرُونَ ٢٣

**23**. వారితో ఇలాఅను: "ఆయనే మిమ్మల్ని సృజించాడు. మరియు ఆయనే మీకు వినికిడినీ, దృష్టినీ మరియు హృదయాలనూ ఇచ్చాడు. (అయినా) మీరు కృతజ్ఞతలు తెలిపేది చాలా తక్కువ!"

قُلۡ هُوَ ٱلَّذِي ذَرَأَكُمۡ فِي ٱلۡأَرۡضِ وَإِلَيۡهِ تُحۡشَرُونَ ٢٤

**24**. (ఇంకా) ఇలా అను: "ఆయనే మిమ్మల్ని భూమిలో వ్యాపింపజేశాడు మరియు ఆయన వద్దనే మీరంతా సమావేశపరచబడతారు."

وَيَقُولُونَ مَتَىٰ هَٰذَا ٱلۡوَعۡدُ إِن كُنتُمۡ صَٰدِقِينَ ٢٥

**25**. మరియు వారు ఇలా అడుగుతున్నారు: "మీరు సత్యవంతులే అయితే, ఈ వాగ్దానం ఎప్పుడు నెరవేరనున్నది?"

---

**1**. చూడండి, 17:97.

قُلْ إِنَّمَا ٱلْعِلْمُ عِندَ ٱللَّهِ وَإِنَّمَآ أَنَا۠ نَذِيرٌ مُّبِينٌ ﴿٢٦﴾

26. వారితో ఇలా అను: "నిశ్చయంగా, దాని జ్ఞానం కేవలం అల్లాహ్‌కే ఉంది.[1] మరియు నేను స్పష్టంగా హెచ్చరిక చేసేవాడిని మాత్రమే!"

فَلَمَّا رَأَوْهُ زُلْفَةً سِيٓـَٔتْ وُجُوهُ ٱلَّذِينَ كَفَرُوا۟ وَقِيلَ هَـٰذَا ٱلَّذِى كُنتُم بِهِۦ تَدَّعُونَ ﴿٢٧﴾

27. తరువాత వారు దానిని సమీపంలో ఉండటం చూసినప్పుడు, సత్యతిరస్కారుల ముఖాలు దుఃఖంతో నిండి నల్లబడిపోతాయి.[2] మరియు వారితో ఇలా అనబడుతుంది: "మీరు దేని నయితే అడుగుతూ ఉండేవారో అది (ఆ వాగ్దానం) ఇదే!"[3]

قُلْ أَرَءَيْتُمْ إِنْ أَهْلَكَنِىَ ٱللَّهُ وَمَن مَّعِىَ أَوْ رَحِمَنَا فَمَن يُجِيرُ ٱلْكَـٰفِرِينَ مِنْ عَذَابٍ أَلِيمٍ ﴿٢٨﴾

28. (ఓ ప్రవక్తా!) వారితో ఇలా అను: "ఏమీ? మీరు ఆలోచించారా? ఒకవేళ అల్లాహ్ నన్ను మరియు నా తోటివారిని నాశనం చేయనూ వచ్చు! లేదా మమ్మల్ని కరుణించనూ వచ్చు. కాని సత్యతిరస్కారులను బాధాకరమైన శిక్ష నుండి ఎవడు రక్షించగలడు?"

قُلْ هُوَ ٱلرَّحْمَـٰنُ ءَامَنَّا بِهِۦ وَعَلَيْهِ تَوَكَّلْنَا ۖ فَسَتَعْلَمُونَ مَنْ هُوَ فِى ضَلَـٰلٍ مُّبِينٍ ﴿٢٩﴾

29. వారితో ఇంకా ఇలా అను: "ఆయనే అనంత కరుణామయుడు, మేము ఆయననే విశ్వసించాము మరియు ఆయననే నమ్ముకున్నాము. ఇక ఎవరు స్పష్టమైన మార్గభ్రష్టత్వంలో పడిఉన్నారో త్వరలోనే మీరు తెలుసుకోగలరు!"

قُلْ أَرَءَيْتُمْ إِنْ أَصْبَحَ مَآؤُكُمْ غَوْرًا فَمَن يَأْتِيكُم بِمَآءٍ مَّعِينٍۭ ﴿٣٠﴾

30. వారితో ఇలా అను: "ఏమీ? మీరు ఆలోచించారా? ఒకవేళ మీ బావులలోని నీరు, భూమిలోనికి ఇంకిపోతే, ప్రవహించే ఈ నీటి ఊటలను మీ కొరకు ఎవడు బయటికి తేగలడు?" (1/8)

*****

1. ఇంకా చూడండి, 7:187.
2. చూడండి, 3:106.
3. చూడండి, 38:16 మరియు 8:32 మొదలైనవి.

## 68. సూరహ్ అల్-ఖలమ్ سُورَةُ القَلَمِ

ఖలమున్: The Pen, కలం. ఈ సూరహ్ పేరు మొదటి ఆయత్ నుండి తీసుకోబడింది. ఇది మొదటి మక్కా కాలపు సూరహ్. అవతరణాక్రమంలో ఇది 3వది. సూరహ్ అల్-'అలఖ్(96) యొక్క మొదటి 5ఆయతుల తరువాత సూరహ్ అల్-ముద్దస్సి'ర్(74) అవతరింపజేయబడింది. దాని తరువాత ఈ సూరహ్ అల్-ఖలమ్(68) అవతరింపజేయబడిందని, చాలామంది వ్యాఖ్యాతల అభిప్రాయం. దీని మరొక పేరు సూరహ్ నూన్. ఇందులో **52 ఆయతులు** ఉన్నాయి.

بِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

نٓ ۚ وَٱلْقَلَمِ وَمَا يَسْطُرُونَ ﴿١﴾

**1.** * నూన్.[1] కలం సాక్షిగా![2] మరియు వారు (దేవదూతలు) వ్రాస్తున్నదాని సాక్షిగా!

مَآ أَنتَ بِنِعْمَةِ رَبِّكَ بِمَجْنُونٍ ﴿٢﴾

**2.** నీ ప్రభువు అనుగ్రహం వలన నీవు (ఓ ము'హమ్మద్) పిచ్చివాడవు కావు!

وَإِنَّ لَكَ لَأَجْرًا غَيْرَ مَمْنُونٍ ﴿٣﴾

**3.** మరియు నిశ్చయంగా, నీకు ఎన్నటికీ తరిగిపోని ప్రతిఫలం ఉంది.

وَإِنَّكَ لَعَلَىٰ خُلُقٍ عَظِيمٍ ﴿٤﴾

**4.** మరియు నిశ్చయంగా, నీవు ఉత్తమమైన శీలవంతుడవు![3]

فَسَتُبْصِرُ وَيُبْصِرُونَ ﴿٥﴾

**5.** కావున త్వరలోనే నీవు చూడగలవు మరియు వారు కూడా చూడగలరు;

---

**1.** ఖుర్ఆన్ అవతరణలో, అవతరించిన మొదటి బీజ అక్షరం ఇది 'నూన్,'. ఈ అక్షరం ముఖ'త్త'ఆత్‌లలోనిది.

**2.** అల్-ఖలమ్: చూడండి, 96:3-5. కొందరు: ఇక్కడ ప్రమాణంచేసే కలం, అంటే ఆ మొట్టమొదట సృష్టించబడి, 'విధివ్రాత' వ్రాయమని ఆజ్ఞాపించబడిన కలము, అని చెబుతారు, సునన్ తిర్మిజీ' - అల్బానీ ప్రమాణీకం (త'స్హీ'హ్).

**3.** అంటే అల్లాహ్ (సు.తా.) నీకు ఆదేశించిన మార్గం(ఇస్లాం)లో నీవు ఉన్నావు. దీని మరొక భావం నీవు మొదటి నుండియే ఉత్తమమైన గుణగణాలు గలవాడవు, సత్యసంధుడవు. 'ఆయి'షహ్(ర.'అన్హా)తో దైవప్రవక్త ('స'అస) యొక్క గుణగణాలు మరియు ప్రవర్తనను గురించి ప్రశ్నించగా ఆమె (ర.'అన్హా) అన్నారు: '' 'ఖులుఖుహూ ఖుర్ఆన్'' అంటే అతని గుణగణాలు ఖుర్ఆన్‌కు ప్రతి రూపాలు, ('స.ముస్లిం).

بِأَييِّكُمُ ٱلْمَفْتُونُ ۝٦

6. మీలో ఎవరికి పిచ్చి ఉందో!

إِنَّ رَبَّكَ هُوَ أَعْلَمُ بِمَن ضَلَّ عَن سَبِيلِهِۦ وَهُوَ أَعْلَمُ بِٱلْمُهْتَدِينَ ۝٧

7. నిశ్చయంగా, నీ ప్రభువు! ఆయనకు ఎవడు మార్గభ్రష్టుడయ్యాడో తెలుసు మరియు ఎవడు సన్మార్గం మీద ఉన్నాడో కూడా ఆయనకు బాగా తెలుసు!

فَلَا تُطِعِ ٱلْمُكَذِّبِينَ ۝٨

8. కావున నీవు ఈ అసత్యవాదులను అనుసరించకు.

وَدُّواْ لَوْ تُدْهِنُ فَيُدْهِنُونَ ۝٩

9. ఒకవేళ నీవు (ధర్మం విషయంలో) మెత్తపడితే వారు కూడా మెత్తపడ గోరుతున్నారు.[1]

وَلَا تُطِعْ كُلَّ حَلَّافٍ مَّهِينٍ ۝١٠

10. కావున నీవు ప్రమాణాలు చేసే ప్రతి నీచుడిని అనుసరించకు;

هَمَّازٍ مَّشَّآءِۭ بِنَمِيمٍ ۝١١

11. చాడీలు చెప్పేవాడిని, ఎత్తి పొడుస్తూ ఉండే వాడిని;

مَّنَّاعٍ لِّلْخَيْرِ مُعْتَدٍ أَثِيمٍ ۝١٢

12. మంచిని నిరోధించే వాడిని, హద్దులు మీరి ప్రవర్తించే పాపిష్ఠుడిని;

عُتُلِّۭ بَعْدَ ذَٰلِكَ زَنِيمٍ ۝١٣

13. నిర్దయుడిని, ఇంతే గాకుండా అపఖ్యాతి గల (నిందార్హుడైన) వాడిని;

أَن كَانَ ذَا مَالٍ وَبَنِينَ ۝١٤

14. వాడు ధనవంతుడూ మరియు సంతాన భాగ్యంతో తులతూగుతూ ఉన్న వాడు అయినా సరే!

إِذَا تُتْلَىٰ عَلَيْهِ ءَايَٰتُنَا قَالَ أَسَٰطِيرُ ٱلْأَوَّلِينَ ۝١٥

15. ఒకవేళ వాడికి మా సూచనలు (ఆయాత్) వినిపిస్తే, అందుకు వాడు: "ఇవి పూర్వకాలపు కట్టుకథలే!" అని అంటాడు.

---

1. అంటే నీవు ('స'అస) ధర్మ విషయంలో కొన్ని సవరణలు చేయటానికి ఒప్పుకుంటే, వారు నీతో రాజీపడటానికి సిద్ధంగా ఉన్నారు.

**16**. మేము త్వరలోనే వాడి ముక్కుమీద వాత పెడ్తాము.

**17**. నిశ్చయంగా, మేము ఆ తోట వారిని పరీక్షించినట్లుగా వీరిని కూడా పరీక్షిస్తాము. ఎవరైతే తెల్లవారగానే తప్పక దాని పంట కోసుకుందామని ప్రతిజ్ఞ చేసుకున్నారో!

**18**. మరియు (అల్లాహ్ కోరితే అనే), మినహాయింపుకు తావు ఇవ్వకుండా!

**19**. కావున వారు పడుకొని ఉండగానే నీ ప్రభువు తరఫునుండి దానిపై (ఆ తోటపై) ఒక ఆపద వచ్చిపడింది.

**20**. దాంతో తెల్లవారే సరికి అది (ఆ తోట) పంటకోసిన పొలంవలే మారిపోయింది.

**21**. తరువాత ఉదయం లేచి వారు ఒకరితోనొకరు ఇలా చెప్పుకోసాగారు:

**22**. "మీరు పంటను కోయదలచు కుంటే, ఉదయమే మీ పొలానికి వెళ్ళండి."

**23**. ఆ తరువాత వారు ఒకరితోనొకరు (ఈ విధంగా) మెల్లగా చెప్పుకుంటూ బయలుదేరారు.

**24**. "ఈ రోజు ఏ పేదవాడిని కూడా మీ దగ్గరకు రానివ్వకండి!"

**25**. మరియు వారు (పేదవారిని) దగ్గరకు రానివ్వకూడదని గట్టి నిర్ణయంతో తెల్లవారురఝామున బయలుదేరారు.

سَنَسِمُهُۥ عَلَى ٱلْخُرْطُومِ ﴿١٦﴾

إِنَّا بَلَوْنَٰهُمْ كَمَا بَلَوْنَآ أَصْحَٰبَ ٱلْجَنَّةِ إِذْ أَقْسَمُوا۟ لَيَصْرِمُنَّهَا مُصْبِحِينَ ﴿١٧﴾

وَلَا يَسْتَثْنُونَ ﴿١٨﴾

فَطَافَ عَلَيْهَا طَآئِفٌ مِّن رَّبِّكَ وَهُمْ نَآئِمُونَ ﴿١٩﴾

فَأَصْبَحَتْ كَٱلصَّرِيمِ ﴿٢٠﴾

فَتَنَادَوْا۟ مُصْبِحِينَ ﴿٢١﴾

أَنِ ٱغْدُوا۟ عَلَىٰ حَرْثِكُمْ إِن كُنتُمْ صَٰرِمِينَ ﴿٢٢﴾

فَٱنطَلَقُوا۟ وَهُمْ يَتَخَٰفَتُونَ ﴿٢٣﴾

أَن لَّا يَدْخُلَنَّهَا ٱلْيَوْمَ عَلَيْكُم مِّسْكِينٌ ﴿٢٤﴾

وَغَدَوْا۟ عَلَىٰ حَرْدٍ قَٰدِرِينَ ﴿٢٥﴾

فَلَمَّا رَأَوۡهَا قَالُوٓاْ إِنَّا لَضَآلُّونَ ﴿٢٦﴾

**26**. వారు దానిని (తోటను) చూసి ఇలా వాపోయారు: "నిశ్చయంగా, మనం దారి తప్పాము!

بَلۡ نَحۡنُ مَحۡرُومُونَ ﴿٢٧﴾

**27**. "కాదు కాదు! మనం సర్వం కోల్పోయాము!"

قَالَ أَوۡسَطُهُمۡ أَلَمۡ أَقُل لَّكُمۡ لَوۡلَا تُسَبِّحُونَ ﴿٢٨﴾

**28**. వారిలో మధ్య రకానికి చెందిన వాడు ఇలా అన్నాడు: "ఏమీ? నేను మీతో అనలేదా? మీరు ఎందుకు ఆయన (అల్లాహ్) పవిత్రతను కొనియాడరని (ఇన్షా అల్లాహ్! అనరని)?"[1]

قَالُواْ سُبۡحَٰنَ رَبِّنَآ إِنَّا كُنَّا ظَٰلِمِينَ ﴿٢٩﴾

**29**. వారు ఇలా అన్నారు: "మా ప్రభువు సర్వలోపాలకూ అతీతుడు! నిశ్చయంగా, మేమే దుర్మార్గులము!"

فَأَقۡبَلَ بَعۡضُهُمۡ عَلَىٰ بَعۡضٖ يَتَلَٰوَمُونَ ﴿٣٠﴾

**30**. తరువాత వారు అభిముఖులై ఒకరి నొకరు నిందించు కోసాగారు.

قَالُواْ يَٰوَيۡلَنَآ إِنَّا كُنَّا طَٰغِينَ ﴿٣١﴾

**31**. వారు ఇలా వాపోయారు: "అయ్యో! మా పాడుగాను! నిశ్చయంగా, మేము తలబిరుసుతనం చూపాము!

عَسَىٰ رَبُّنَآ أَن يُبۡدِلَنَا خَيۡرٗا مِّنۡهَآ إِنَّآ إِلَىٰ رَبِّنَا رَٰغِبُونَ ﴿٣٢﴾

**32**. "బహుశా! మన ప్రభువు మనకు దీనికి బదులుగా దీనికంటే శ్రేష్ఠమైన దానిని ప్రసాదించవచ్చు! నిశ్చయంగా, మనం మన ప్రభువు వైపునకు (పశ్చాత్తాపంతో) మరలుదాము!"

كَذَٰلِكَ ٱلۡعَذَابُۖ وَلَعَذَابُ ٱلۡأٓخِرَةِ أَكۡبَرُۚ لَوۡ كَانُواْ يَعۡلَمُونَ ﴿٣٣﴾

**33**. ఈ విధంగా ఉంటుంది శిక్ష! మరియు పరలోక శిక్ష దీనికంటే ఘోరంగా ఉంటుంది. వారు ఇది తెలుసుకుంటే ఎంత బాగుండేది!

---

**1**. కొందరు వ్యాఖ్యాతలు ఇక్కడ తస్బీహ్ అంటే: ఇన్షా' అల్లాహ్ - అల్లాహ్ కోరితే! అని అనటమని వ్యాఖ్యానించారు.

**34**. నిశ్చయంగా, దైవభీతి గలవారికి వారి ప్రభువువద్ద పరమానందకరమైన స్వర్గవనాలు ఉంటాయి.

**35**. ఏమీ? మేము విధేయులను (ముస్లింలను) నేరస్థులతో సమానంగా ఎంచుదుమా?[1]

**36**. మీ కేమయింది? మీరు ఏ విధమైన నిర్ణయాలు చేస్తున్నారు?

**37**. మీ వద్ద ఏదయినా (దివ్య) గ్రంథముందా? దానినుండి మీరు నేర్చుకోవటానికి!

**38**. నిశ్చయంగా, అందులో మీకు మీరు కోరేదంతా ఉందని?

**39**. లేక, పునరుత్థానదినం వరకు, మీరు నిర్ణయించుకున్నదే మీకు తప్పక లభిస్తుందని, మేము మీతో చేసిన గట్టి ప్రమాణం ఏదైనా ఉందా?

**40**. వారిలో దీనికి ఎవడు హామీగా ఉన్నాడో అడుగు.

**41**. లేక, వారికి ఎవరైనా (వారు అల్లాహ్‌కు కల్పించిన) భాగస్వాములు ఉన్నారా? ఒకవేళ వారు సత్యవంతులే అయితే తమ ఆ భాగస్వాములను తీసుకురమ్మను.

إِنَّ لِلْمُتَّقِينَ عِندَ رَبِّهِمْ جَنَّٰتِ ٱلنَّعِيمِ ﴿٣٤﴾

أَفَنَجْعَلُ ٱلْمُسْلِمِينَ كَٱلْمُجْرِمِينَ ﴿٣٥﴾

مَا لَكُمْ كَيْفَ تَحْكُمُونَ ﴿٣٦﴾

أَمْ لَكُمْ كِتَٰبٌ فِيهِ تَدْرُسُونَ ﴿٣٧﴾

إِنَّ لَكُمْ فِيهِ لَمَا تَخَيَّرُونَ ﴿٣٨﴾

أَمْ لَكُمْ أَيْمَٰنٌ عَلَيْنَا بَٰلِغَةٌ إِلَىٰ يَوْمِ ٱلْقِيَٰمَةِ ۙ إِنَّ لَكُمْ لَمَا تَحْكُمُونَ ﴿٣٩﴾

سَلْهُمْ أَيُّهُم بِذَٰلِكَ زَعِيمٌ ﴿٤٠﴾

أَمْ لَهُمْ شُرَكَآءُ فَلْيَأْتُوا۟ بِشُرَكَآئِهِمْ إِن كَانُوا۟ صَٰدِقِينَ ﴿٤١﴾

---

**1**. ఖుర్ఆన్ అవతరణాక్రమంలో **ముస్లిం** పదం ఇక్కడ **మొట్టమొదటిసారి** వచ్చింది. ముస్లిం అంటే అల్లాహ్(సు,తా.)కు విధేయుడై, ఆయన (సు.తా.) ఆజ్ఞాపించిన ఏకదైవ సిద్ధాంతంపై ఉండి, ఆరాధనను కేవలం ఆయన(సు,తా.)కే ప్రత్యేకించుకొని, ఆరాధనలో ఎవ్వరినీకూడా ఆయన(సు.తా.)కు సాటిగా నిలబెట్టకుండా ఉండేవాడు. తనను తాను కేవలం అల్లాహ్ (సు.తా.) దాస్యానికి మాత్రమే అంకితం చేసుకున్నవాడు. దీని మూల పదం సలాం, అంటే శాంతి.

**42.** (జ్ఞాపకముంచుకోండి) ఏ రోజయితే పిక్క ఎముక తెరిచివేయ బడుతుందో! మరియు వారు సాష్టాంగం (సజ్దా) చేయటానికి పిలువబడతారో, అప్పుడు వారు (కపటవిశ్వాసులు), అలా (సజ్దా) చేయలేరు!

يَوۡمَ يُكۡشَفُ عَن سَاقٖ وَيُدۡعَوۡنَ إِلَى ٱلسُّجُودِ فَلَا يَسۡتَطِيعُونَ ٤٢

**43.** వారి చూపులు క్రిందికి వాలిపోయి ఉంటాయి, అవమానం వారిని ఆవరించి ఉంటుంది. మరియు వాస్తవానికి వారు నిక్షేపంగా ఉన్నప్పుడు సాష్టాంగం (సజ్దా) చేయటానికి ఆహ్వానించబడితే (తిరస్కరించే వారు)!

خَٰشِعَةً أَبۡصَٰرُهُمۡ تَرۡهَقُهُمۡ ذِلَّةٞۖ وَقَدۡ كَانُواْ يُدۡعَوۡنَ إِلَى ٱلسُّجُودِ وَهُمۡ سَٰلِمُونَ ٤٣

**44.** కావున నన్ను మరియు ఈ సందేశాన్ని అబద్ధమని తిరస్కరించే వారిని వదలండి. వారు గ్రహించని విధంగా మేము వారిని క్రమక్రమంగా (వినాశం వైపునకు) తీసుకొని పోతాము.[1]

فَذَرۡنِي وَمَن يُكَذِّبُ بِهَٰذَا ٱلۡحَدِيثِۖ سَنَسۡتَدۡرِجُهُم مِّنۡ حَيۡثُ لَا يَعۡلَمُونَ ٤٤

**45.** మరియు నేను వారికి కొంత వ్యవధినిస్తున్నాను. నిశ్చయంగా నా పన్నాగం చాలా దృఢమైనది.[2]

وَأُمۡلِي لَهُمۡۚ إِنَّ كَيۡدِي مَتِينٌ ٤٥

**46.** లేక, (ఓ ప్రవక్తా!) నీవు వారిని ఏదైనా ప్రతిఫలం ఇవ్వమని అడుగుతున్నావా? వారికి దాని రుణం భారమవటానికి?

أَمۡ تَسۡـَٔلُهُمۡ أَجۡرٗا فَهُم مِّن مَّغۡرَمٖ مُّثۡقَلُونَ ٤٦

---

**1**. చూడండి, 7:182-183.

**2**. కైదున్: పన్నుగడ, పన్నాగం, పథకం, యోజన, వ్యూహం. ఇంకా చూడండి, 10:5.

أَمْ عِندَهُمُ ٱلْغَيْبُ فَهُمْ يَكْتُبُونَ ﴿٤٧﴾

**47**. లేక, వారివద్ద ఏదైనా అగోచరజ్ఞానం ఉందా?[1] వారు దానిని వ్రాసి పెట్టడానికి?

فَٱصْبِرْ لِحُكْمِ رَبِّكَ وَلَا تَكُن كَصَاحِبِ ٱلْحُوتِ إِذْ نَادَىٰ وَهُوَ مَكْظُومٌ ﴿٤٨﴾

**48**. కావున నీవు నీ ప్రభువు ఆజ్ఞ కొరకు వేచిఉండు. మరియు నీవు, చేపవాని (యూనుస్) వలే వ్యవహరించకు.[2] (గుర్తుకు తెచ్చుకో) అతను దుఃఖంలో ఉన్నప్పుడు (తన ప్రభువును) మొరపెట్టుకున్నాడు.

لَّوْلَآ أَن تَدَٰرَكَهُۥ نِعْمَةٌ مِّن رَّبِّهِۦ لَنُبِذَ بِٱلْعَرَآءِ وَهُوَ مَذْمُومٌ ﴿٤٩﴾

**49**. అతని ప్రభువు అనుగ్రహమే గనక అతనికి అందకపోయి ఉంటే, అతను అవమానకరమైన స్థితిలో (చేప కడుపులో పడిఉండే వాడు కాని మేము అతనిని క్షమించాము). కావున అతను చౌట (బంజరు) మైదానంలో విసరి వేయబడ్డాడు.[3]

فَٱجْتَبَٰهُ رَبُّهُۥ فَجَعَلَهُۥ مِنَ ٱلصَّٰلِحِينَ ﴿٥٠﴾

**50**. చివరకు అతని ప్రభువతనిని ఎన్నుకొని సత్పురుషులలో చేర్చాడు.

---

**1**. గైబున్: అగోచరం. ఈ పదం ఖుర్ఆన్ అవతరణాక్రమంలో ఇక్కడ మొట్టమొదటి సారి వచ్చింది. ఇంకా చూడండి, 96:6.

**2**. యూనుస్ ('అ.స.) యొక్క వివరాల కోసం చూడండి, 21:87 మరియు 37:140.

**3**. దీని మరొక తాత్పర్యం ఇలా ఉంది: ''ఒకవేళ అతనిపై అతని ప్రభువు (సు.తా.) అనుగ్రహమే గనక లేకుంటే! నిశ్చయంగా, అతను అవమానకరమైన స్థితిలో బంజరు మైదానంలో విసరివేయబడేవాడు.'' మరొక వ్యాఖ్యానం: ''అల్లాహ్ (సు.తా.) అతనికి పశ్చాత్తాపపడే సద్బుద్ధి గనక ఇవ్వకుండా ఉంటే మరియు అతని ప్రార్థన అంగీకరించబడకుండా ఉంటే అతను సముద్రపు అంచున వేయబడకుండా ఉంటే - ఎక్కడైతే అతనికి ఆహారం ఇచ్చాడో మరియు తీగ పెంచాడో - బంజరు భూమిలో విసరివేయబడిఉండే వాడు. మరియు అల్లాహ్ (సు.తా.) వద్ద అతని పరిస్థితి అవమానకరమైనదై ఉండేది. కాని అతని ప్రార్థన అంగీకరించబడిన తరువాత అతను అనుగ్రహించబడ్డాడు.'' ఇంకా చూడండి, 37:143.

وَإِن يَكَادُ ٱلَّذِينَ كَفَرُواْ لَيُزْلِقُونَكَ بِأَبْصَٰرِهِمْ لَمَّا سَمِعُواْ ٱلذِّكْرَ وَيَقُولُونَ إِنَّهُۥ لَمَجْنُونٌ ﴿٥١﴾

**51**. మరియు ఈ సత్య తిరస్కారులు, ఈ సందేశాన్ని (ఖుర్ఆన్‌ను) విన్నప్పుడు, తమ చూపులతో నీ కాళ్ళు ఊడగొడతారా అన్నట్లు (నిన్ను జారించి పడవేసేటట్లు) నిన్ను చూస్తున్నారు.[1] మరియు వారు నిన్ను (ఓ ము'హమ్మద్!): ''నిశ్చయంగా ఇతడు పిచ్చివాడు!'' అని అంటున్నారు.

وَمَا هُوَ إِلَّا ذِكْرٌ لِّلْعَٰلَمِينَ ﴿٥٢﴾

**52**. కాని సర్వలోకాల (వారికి) ఇదొక హితోపదేశం మాత్రమే! (1/4)

*****

---

**1**. ఒకవేళ నీకు అల్లాహ్ (సు.తా.) రక్షణయే గనక లేకుంటే! వారిదిష్టి నీకు తగిలేది. (ఇబ్నె-కసీ'ర్). ఇబ్నె-కసీ'ర్ ఇంకా ఇలా వ్రాశారు. దిష్టి తగలటం మరియు అల్లాహ్ (సు.తా.) అనుమతితో దానివల్ల నష్టం కలగటం నిజమే. కావున 'హదీస్'లలో దీని నుండి విముక్తి పొందటానికి దు'ఆలు ఇవ్వబడ్డాయి మరియు ఈ సలహాలు కూడా ఇవ్వబడ్డాయి: ఏదైనా మంచి వస్తువును చూస్తే దిష్టి తగులకుండా ఉండటానికి: 'మాషాఅల్లాహ్' లేక 'బారకల్లాహ్' అనాలి. ఒకవేళ దిష్టి తగిలితే: దిష్టి పెట్టిన వాడు ఒకపాత్రలో స్నానంచేసి ఆ నీటిని దిష్టి తగిలినవాడిమీద పోయాలి. (ఇబ్నె-కసీ'ర్).

## 69. సూరహ్ అల్-'హాఖ్ఖహ్

سُورَةُ الحَاقَّةِ

అల్-'హాఖ్ఖహ్: The Reality, The Inevitable, పరమయథార్థం, నిజం, సత్యం, **అనివార్య సంఘటన**. (ఇది పునరుత్థాన దినానికి గల మరొక పేరు). ఈ సూరహ్ మక్కాలో, సూరహ్ అల్-ముల్క్ (67), తరువాత అవతరింపజేయబడింది. దాదాపు హిజ్రత్‌కు 3-4 సంవత్సరాలకు ముందు. దీనిపేరు **మొదటి మూడు** ఆయత్‌లలో పేర్కొనబడింది. ఇందులో **52 ఆయతులు** ఉన్నాయి. ఇంకా చూడండి, 37-19, 39-68 చివరి భాగం మరియు 50:21-22.

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بِسۡمِ ٱللَّهِ ٱلرَّحۡمَٰنِ ٱلرَّحِيمِ

ٱلۡحَآقَّةُ ﴿١﴾

**1.** * ఆ **అనివార్య సంఘటన** (పునరుత్థానం)!

مَا ٱلۡحَآقَّةُ ﴿٢﴾

**2.** ఏమిటా అనివార్య సంఘటన?

وَمَآ أَدۡرَىٰكَ مَا ٱلۡحَآقَّةُ ﴿٣﴾

**3.** మరియు ఆ అనివార్య సంఘటన, అంటే ఏమిటో నీకేమితెలుసు?

كَذَّبَتۡ ثَمُودُ وَعَادُۢ بِٱلۡقَارِعَةِ ﴿٤﴾

**4.** స'మూద్ మరియు 'ఆద్ జాతివారు అకస్మాత్తుగా విరుచుకుపడే ఆ ఉపద్రవాన్ని అసత్యమని తిరస్కరించారు.[1]

فَأَمَّا ثَمُودُ فَأُهۡلِكُواْ بِٱلطَّاغِيَةِ ﴿٥﴾

**5.** కావున స'మూద్ జాతివారైతే ఒక భయంకరమైన గర్జన ద్వారా నాశనం చేయబడ్డారు.

وَأَمَّا عَادٌ فَأُهۡلِكُواْ بِرِيحٍ صَرۡصَرٍ عَاتِيَةٍ ﴿٦﴾

**6.** మరియు 'ఆద్ జాతివారేమో అతి తీవ్రమైన తుఫాను గాలి ద్వారా నాశనం చేయబడ్డారు.

سَخَّرَهَا عَلَيۡهِمۡ سَبۡعَ لَيَالٖ وَثَمَٰنِيَةَ أَيَّامٍ حُسُومٗاۖ فَتَرَى ٱلۡقَوۡمَ فِيهَا صَرۡعَىٰ كَأَنَّهُمۡ أَعۡجَازُ نَخۡلٍ خَاوِيَةٖ ﴿٧﴾

**7.** ఆయన (అల్లాహ్), దానిని వారి మీద ఏడు రాత్రులు మరియు ఎనిమిది పగళ్ళవరకు ఎడతెగకుండా ఆవరింపజేశాడు.[2] దానివలన వారు వేళ్ళతో పెళ్ళగించబడిన ఖర్జూరపు బోదెలవలే పాడైపోవటం, నీవు చూస్తావు!

---

**1**. 'ఆద్ మరియు స'మూద్ జాతుల సమాచారం కొరకు చూడండి, 7:65-79.

**2**. చూడండి, 7:78.

فَهَلۡ تَرَىٰ لَهُم مِّنۢ بَاقِيَةٖ ۝٨

**8**. అయితే ఇప్పుడు వారిలో ఎవరైనా మిగిలి ఉన్నట్లు నీవు చూస్తున్నావా?

وَجَآءَ فِرۡعَوۡنُ وَمَن قَبۡلَهُۥ وَٱلۡمُؤۡتَفِكَٰتُ بِٱلۡخَاطِئَةِ ۝٩

**9**. ఫిర్'ఔన్ మరియు అతనికి పూర్వం గతించిన వారూ మరియు తలక్రిందులు చేయబడిన నగరాల వారూ,[1] అందరూ గొప్ప నేరాలకు పాల్పడిన వారే.

فَعَصَوۡاْ رَسُولَ رَبِّهِمۡ فَأَخَذَهُمۡ أَخۡذَةٗ رَّابِيَةً ۝١٠

**10**. మరియు వారు తమ ప్రభువు పంపిన ప్రవక్తలకు అవిధేయత కనబరచారు, కావున ఆయన వారిని కఠినమైన పట్టుతో పట్టుకున్నాడు.

إِنَّا لَمَّا طَغَا ٱلۡمَآءُ حَمَلۡنَٰكُمۡ فِي ٱلۡجَارِيَةِ ۝١١

**11**. నిశ్చయంగా, ఎప్పుడైతే (నూ'హ్ 'తుఫాన్) నీరు హద్దులు లేకుండా ఉప్పొంగి పోయిందో! అప్పుడు మేము, మిమ్మల్ని[2] పయనించే (నావలో) ఎక్కించాము.

لِنَجۡعَلَهَا لَكُمۡ تَذۡكِرَةٗ وَتَعِيَهَآ أُذُنٞ وَٰعِيَةٞ ۝١٢

**12**. దానిని, మీకొక హితబోధగానూ మరియు జ్ఞాపకముంచుకోగల చెవి, దానిని జ్ఞాపకం ఉంచుకోవటానికి అనువైనదిగా చేశాము.

فَإِذَا نُفِخَ فِي ٱلصُّورِ نَفۡخَةٞ وَٰحِدَةٞ ۝١٣

**13**. ఇక ఎప్పుడైతే ఒకపెద్ద ధ్వనితో బాకా ఊదబడుతుందో![3]

وَحُمِلَتِ ٱلۡأَرۡضُ وَٱلۡجِبَالُ فَدُكَّتَا دَكَّةٗ وَٰحِدَةٗ ۝١٤

**14**. మరియు భూమి మరియు పర్వతాలు పైకి ఎత్తబడి ఒక పెద్ద దెబ్బతో తుత్తునియలుగా చేయబడతాయో!

فَيَوۡمَئِذٖ وَقَعَتِ ٱلۡوَاقِعَةُ ۝١٥

**15**. అప్పుడు, ఆ రోజున సంభవించ వలసిన, ఆ అనివార్య సంఘటన సంభవిస్తుంది.

---

**1**. అంటే లూ'త్ ('అ.స.) ప్రజలు. సోడోమ్, గొమొర్రాహ్ వాసులు చూడండి,11:69-83.

**2**. మిమ్మల్ని అంటే మీ పూర్వీకులను.

**3**. అల్-'హాఖ్ఖహ్ :ఏ విధంగా సంభవిస్తుందో ఇక్కడ వివరించబడుతోంది. ఇస్రాఫీల్ ('అ.స.) పెద్ద ధ్వనితో బాకా ఊదగానే అది సంభవిస్తుంది.

وَٱنشَقَّتِ ٱلسَّمَآءُ فَهِيَ يَوۡمَئِذٖ وَاهِيَةٞ ١٦

16. మరియు ఆ రోజున ఆకాశం బ్రద్దలైపోతుంది మరియు దాని వ్యవస్థ సడలిపోతుంది.[1]

وَٱلۡمَلَكُ عَلَىٰٓ أَرۡجَآئِهَاۚ وَيَحۡمِلُ عَرۡشَ رَبِّكَ فَوۡقَهُمۡ يَوۡمَئِذٖ ثَمَٰنِيَةٞ ١٧

17. మరియు దేవదూతలు దాని ('అర్ష్) ప్రక్కలలో ఉంటారు. మరియు నీ ప్రభువు యొక్క సింహాసనాన్ని ('అర్ష్‌ను), ఆ రోజు ఎనిమిది మంది (దేవదూతలు) ఎత్తుకొని ఉంటారు.

يَوۡمَئِذٖ تُعۡرَضُونَ لَا تَخۡفَىٰ مِنكُمۡ خَافِيَةٞ ١٨

18. ఆ రోజు మీరు (తీర్పుకొరకు) హాజరుచేయబడతారు. మీరు దాచిన ఏ రహస్యం కూడా (ఆ రోజు) దాగి ఉండదు.[2]

فَأَمَّا مَنۡ أُوتِيَ كِتَٰبَهُۥ بِيَمِينِهِۦ فَيَقُولُ هَآؤُمُ ٱقۡرَءُواْ كِتَٰبِيَهۡ ١٩

19. ఇక ఎవనికైతే తన కర్మపత్రము కుడిచేతిలో ఇవ్వబడుతుందో, అతడు ఇలా అంటాడు: "ఇదిగో నా కర్మపత్రాన్ని తీసుకొని చదవండి!

إِنِّي ظَنَنتُ أَنِّي مُلَٰقٍ حِسَابِيَهۡ ٢٠

20. "నిశ్చయంగా, నా లెక్క నాకు తప్పకుండా లభిస్తుందని నేను భావించే వాడిని!"

فَهُوَ فِي عِيشَةٖ رَّاضِيَةٖ ٢١

21. కావున, అతడు సంతోషకరమైన జీవితం గడుపుతాడు.

فِي جَنَّةٍ عَالِيَةٖ ٢٢

22. అత్యున్నతమైన స్వర్గవనంలో;[3]

قُطُوفُهَا دَانِيَةٞ ٢٣

23. దాని పండ్లగుత్తులు, సమీపంలో వ్రేలాడుతూ ఉంటాయి.

---

1. అంటే దీని అర్థం ఇది కావచ్చు. ఆకాశంలోని నక్షత్రాల వ్యవస్థ సడలిపోతుంది. అవి బ్రద్దలైపోయి వాటి మధ్య నున్న గురుత్వాకర్షణ శక్తి నశించిపోతుంది.
2. అంటే 'హాజరు చేయబడి, ప్రతివాని కర్మపత్రాలు అతని చేతికిచ్చి వాటి ఆధారంగా అతని తీర్పు జరుగుతుంది. ఆ తీర్పు ప్రకారం అతడు తన గమ్యస్థానానికి (స్వర్గం లేక నరకానికి) పంపబడతాడు.
3. స్వర్గాలలో ఎన్నోదరజాలు ఉన్నాయి. నూరు దరజాలున్నాయని 'హదీస్'లో చెప్పబడింది. దరజా అంటే వర్గం, క్రమం, శ్రేణి, కక్ష్య, లేక తరగతి.

كُلُوا۟ وَٱشْرَبُوا۟ هَنِيٓـًٔۢا بِمَآ أَسْلَفْتُمْ فِى ٱلْأَيَّامِ ٱلْخَالِيَةِ ﴿٢٤﴾

24. (వారితో ఇలా అనబడుతుంది): "గడిచిపోయిన దినాలలో మీరు చేసి పంపిన కర్మలకు ప్రతిఫలంగా, ఇప్పుడు మీరు హాయిగా తినండి మరియు త్రాగండి!"

وَأَمَّا مَنْ أُوتِىَ كِتَـٰبَهُۥ بِشِمَالِهِۦ فَيَقُولُ يَـٰلَيْتَنِى لَمْ أُوتَ كِتَـٰبِيَهْ ﴿٢٥﴾

25. ఇక ఎవడికైతే, తన కర్మపత్రం ఎడమ చేతికి ఇవ్వబడుతుందో, అతడు ఇలా వాపోతాడు: "అయ్యో నా పాడుగాను! నా కర్మపత్రం అసలు నాకు ఇవ్వబడకుండా ఉంటే ఎంత బాగుండేది!

وَلَمْ أَدْرِ مَا حِسَابِيَهْ ﴿٢٦﴾

26. "మరియు నా లెక్క ఏమిటో నాకు తెలియకుంటే ఎంత బాగుండేది!

يَـٰلَيْتَهَا كَانَتِ ٱلْقَاضِيَةَ ﴿٢٧﴾

27. "అయ్యో, నా పాడుగాను! అది (ఆ మరణమే) నాకు అంతిమ మరణమై ఉంటే ఎంతబాగుండేది!

مَآ أَغْنَىٰ عَنِّى مَالِيَهْ ۜ ﴿٢٨﴾

28. "నా సంపద నాకేమీ పనికిరాలేదు;

هَلَكَ عَنِّى سُلْطَـٰنِيَهْ ﴿٢٩﴾

29. "నా అధికారమంతా అంతమై పోయింది!"

خُذُوهُ فَغُلُّوهُ ﴿٣٠﴾

30. (అప్పుడు ఇలా ఆజ్ఞ ఇవ్వబడు తుంది): "అతన్ని పట్టుకోండి మరియు అతని మెడలో సంకెళ్ళు వేయండి;[1]

ثُمَّ ٱلْجَحِيمَ صَلُّوهُ ﴿٣١﴾

31. "తరువాత అతనిని భగభగ మండే నరకాగ్నిలో వేయండి.

ثُمَّ فِى سِلْسِلَةٍ ذَرْعُهَا سَبْعُونَ ذِرَاعًا فَٱسْلُكُوهُ ﴿٣٢﴾

32. "ఆ తరువాత అతనిని డెబ్భై మూరల పొడువుగల గొలుసుతో బంధించండి!"[2]

---

1. 'గుల్లూహున్: అతనికి సంకెళ్ళు వేయండి. చూడండి, 13:5, 34:33, 36:8, 40:71.
2. చూడండి, 14:49.

إِنَّهُۥ كَانَ لَا يُؤۡمِنُ بِٱللَّهِ ٱلۡعَظِيمِ ﴿٣٣﴾

**33**. వాస్తవానికి అతడు సర్వోత్తముడైన అల్లాహ్‌ను విశ్వసించేవాడు కాదు.

وَلَا يَحُضُّ عَلَىٰ طَعَامِ ٱلۡمِسۡكِينِ ﴿٣٤﴾

**34**. మరియు నిరుపేదలకు ఆహారం పెట్టమని ప్రోత్సహించే వాడు కాదు.

فَلَيۡسَ لَهُ ٱلۡيَوۡمَ هَٰهُنَا حَمِيمٞ ﴿٣٥﴾

**35**. కావున, ఈ నాడు అతనికి ఇక్కడ ఏ స్నేహితుడూ లేడు;

وَلَا طَعَامٌ إِلَّا مِنۡ غِسۡلِينٖ ﴿٣٦﴾

**36**. మరియు అసహ్యాకరమైన గాయాల కడుగు తప్ప, మరొక ఆహారమూ లేదు!

لَّا يَأۡكُلُهُۥٓ إِلَّا ٱلۡخَٰطِـُٔونَ ﴿٣٧﴾

**37**. దానిని పాపులు తప్ప మరెవ్వరూ తినరు!

فَلَآ أُقۡسِمُ بِمَا تُبۡصِرُونَ ﴿٣٨﴾

**38**. కావున, నేను మీరు చూడగలిగే వాటి శపథం చేస్తున్నాను;

وَمَا لَا تُبۡصِرُونَ ﴿٣٩﴾

**39**. మరియు మీరు చూడలేనట్టి వాటి (శపథం) కూడా!

إِنَّهُۥ لَقَوۡلُ رَسُولٖ كَرِيمٖ ﴿٤٠﴾

**40**. నిశ్చయంగా, ఇది (ఈ ఖుర్ఆన్) గౌరవనీయుడైన సందేశహరుని (పై అవతరింపజేయబడిన) వాక్కు.

وَمَا هُوَ بِقَوۡلِ شَاعِرٖۚ قَلِيلٗا مَّا تُؤۡمِنُونَ ﴿٤١﴾

**41**. మరియు ఇది ఒక కవి యొక్క వాక్కు కాదు. మీరు విశ్వసించేది చాలా తక్కువ.

وَلَا بِقَوۡلِ كَاهِنٖۚ قَلِيلٗا مَّا تَذَكَّرُونَ ﴿٤٢﴾

**42**. మరియు ఇది ఏ జ్యోతిష్కుని వాక్కు కూడా కాదు! మీరు గ్రహించేది చాలా తక్కువ.

تَنزِيلٞ مِّن رَّبِّ ٱلۡعَٰلَمِينَ ﴿٤٣﴾

**43**. ఇది సర్వలోకాల ప్రభువు తరఫు నుండి అవతరించింది.

وَلَوۡ تَقَوَّلَ عَلَيۡنَا بَعۡضَ ٱلۡأَقَاوِيلِ ﴿٤٤﴾

**44**. ఒక వేళ ఇతను (ఈ ప్రవక్త), మా (అల్లాహ్‌ను) గురించి ఏదైనా అబద్ధపు మాట కల్పించి ఉంటే!

لَأَخَذْنَا مِنْهُ بِٱلْيَمِينِ ﴿٤٥﴾

**45**. మేము అతని కుడిచేతిని పట్టుకునే వారం.

ثُمَّ لَقَطَعْنَا مِنْهُ ٱلْوَتِينَ ﴿٤٦﴾

**46**. తరువాత అతని (మెడ) రక్తనాళాన్ని కోసేవారం.

فَمَا مِنكُم مِّنْ أَحَدٍ عَنْهُ حَٰجِزِينَ ﴿٤٧﴾

**47**. అప్పుడు మీలోనుండి ఏ ఒక్కడు కూడా అతనిని (మా శిక్షనుండి) కాపాడలేక పోయేవాడు.

وَإِنَّهُۥ لَتَذْكِرَةٌ لِّلْمُتَّقِينَ ﴿٤٨﴾

**48**. మరియు నిశ్చయంగా, ఇది (ఈ ఖుర్ఆన్) దైవభీతి గలవారి కొరకు హితోపదేశం.

وَإِنَّا لَنَعْلَمُ أَنَّ مِنكُم مُّكَذِّبِينَ ﴿٤٩﴾

**49**. మరియు నిశ్చయంగా మీలో కొందరు దీనిని (ఈ ఖుర్ఆన్‌ను) అసత్యమని అనేవారు ఉన్నారని మాకు బాగా తెలుసు.

وَإِنَّهُۥ لَحَسْرَةٌ عَلَى ٱلْكَٰفِرِينَ ﴿٥٠﴾

**50**. మరియు నిశ్చయంగా, ఇది (ఈ తిరస్కారం) సత్యతిరస్కారులకు దుఃఖకారణమవుతుంది.

وَإِنَّهُۥ لَحَقُّ ٱلْيَقِينِ ﴿٥١﴾

**51**. మరియు నిశ్చయంగా, ఇది (ఈ ఖుర్ఆన్) నమ్మదగిన సత్యం.

فَسَبِّحْ بِٱسْمِ رَبِّكَ ٱلْعَظِيمِ ﴿٥٢﴾

**52**. కావున నీవు సర్వోత్తముడైన నీ ప్రభువు పవిత్ర నామాన్ని స్తుతించు.

*****

## 70. సూరహ్ అల్-మ'ఆరిజ్

## سُورَةُ المَعَارِجِ

అల్-మ'ఆరిజ్: The Ways of Ascent, అధిరోహణ, ఊర్ధ్వగమన, **ఆరోహణ**, లేక పైకి వెళ్ళే మార్గాలు. ఈ సూరహ్ పేరు **3**వ **ఆయత్** నుండి తీసుకోబడింది. ఇది మధ్య **మక్కా** కాలపు సూరహ్. ఇందులో **44 ఆయతులు** ఉన్నాయి.

بِسۡمِ ٱللَّهِ ٱلرَّحۡمَٰنِ ٱلرَّحِيمِ

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

سَأَلَ سَآئِلُۢ بِعَذَابٖ وَاقِعٖ ١

**1.** ప్రశ్నించేవాడు,[1] ఆ అనివార్యమైన శిక్షను గురించి ప్రశ్నించాడు;

لِّلۡكَٰفِرِينَ لَيۡسَ لَهُۥ دَافِعٞ ٢

**2.** సత్యతిరస్కారులకు విధించబడే దాని గురించి; దానిని ఎవ్వడూ తొలగించలేడు.

مِّنَ ٱللَّهِ ذِي ٱلۡمَعَارِجِ ٣

**3.** అది **ఆరోహణ** మార్గాలకు యజమానుడైన అల్లాహ్ తరఫునుండి వస్తుంది.[2]

تَعۡرُجُ ٱلۡمَلَٰٓئِكَةُ وَٱلرُّوحُ إِلَيۡهِ فِي يَوۡمٖ كَانَ مِقۡدَارُهُۥ خَمۡسِينَ أَلۡفَ سَنَةٖ ٤

**4.** యాభై వేల సంవత్సరాలకు సమానమైన (ప్రమాణంగల) ఒక రోజులో,[3] దేవదూతలు మరియు ఆత్మ(జిబ్రీల్)[4] ఆయన వద్దకు అధిరోహిస్తారు.

فَٱصۡبِرۡ صَبۡرٗا جَمِيلًا ٥

**5.** కావున (ఓ ము'హమ్మద్!) నీవు సహనంవహించు, ఉత్తమమైన సహనంతో!

---

**1.** ఈ ప్రశ్నించే, సత్యతిరస్కారి న'దర్ బిన్-'హారిస్' లేక అబూ-జహల్ కావచ్చని వ్యాఖ్యాతలు అభిప్రాయపడ్డారు. చూడండి, 8:32. అతడు బద్ర్ యుద్ధంలో చంపబడ్డాడు.

**2.** చూడండి, 76:3.

**3.** చూడండి, 22:47. అక్కడ నీ ప్రభువు దృష్టిలో ఒక దినము మీరు లెక్కించే వేయి సంవత్సరాలకు సమానం. ఇంకా చూడండి, 32:5. అల్లాహ్ (సు.తా.) అనంతుడు, అపారుడు, అంతులేనివాడు, కాలపరిమితికి అతీతుడు. పరలోక జీవితంలో మానవునికి కూడా కాలమనే దానికి ఎలాంటి అర్థం ఉండదు.

**4.** రూ'హ్ : దీనిని ఇక్కడ కొందరు వ్యాఖ్యాతలు జిబ్రీల్ ('అ.స.) అన్నారు. మరికొందరు మానవుల ఆత్మలన్నారు. చూడండి, 19:17 వ్యాఖ్యానం 1.

إِنَّهُمۡ يَرَوۡنَهُۥ بَعِيدٗا ٦

**6**. వాస్తవానికి, వారు (ప్రజలు) అది (ఆ దినం) దూరంగా ఉందని అనుకుంటున్నారు.

وَنَرَىٰهُ قَرِيبٗا ٧

**7**. కాని మాకది అతి దగ్గరలో కనిపిస్తోంది.

يَوۡمَ تَكُونُ ٱلسَّمَآءُ كَٱلۡمُهۡلِ ٨

**8**. ఆ రోజు ఆకాశం మరిగే సీసంవలే (నూనెవలే) అయిపోతుంది.

وَتَكُونُ ٱلۡجِبَالُ كَٱلۡعِهۡنِ ٩

**9**. మరియు కొండలు ఏకిన ఉన్నివలె అయిపోతాయి.[1]

وَلَا يَسۡـَٔلُ حَمِيمٌ حَمِيمٗا ١٠

**10**. మరియు ప్రాణస్నేహితుడు కూడా తన స్నేహితుని (క్షేమాన్ని) అడగడు.

يُبَصَّرُونَهُمۡۚ يَوَدُّ ٱلۡمُجۡرِمُ لَوۡ يَفۡتَدِي مِنۡ عَذَابِ يَوۡمِئِذِۭ بِبَنِيهِ ١١

**11**. వారు ఒకరినొకరు చూసుకుంటూ ఉంటారు. ఆ రోజు అపరాధి తన సంతానాన్ని పరిహారంగా ఇచ్చి అయినా శిక్ష నుండి తప్పించుకో గోరుతాడు;

وَصَٰحِبَتِهِۦ وَأَخِيهِ ١٢

**12**. మరియు తన సహవాసిని (భార్యను) మరియు తన సోదరుణ్ణి;

وَفَصِيلَتِهِ ٱلَّتِي تُـٔۡوِيهِ ١٣

**13**. మరియు తనకు ఆశ్రయమిచ్చిన దగ్గరి బంధువులను;

وَمَن فِي ٱلۡأَرۡضِ جَمِيعٗا ثُمَّ يُنجِيهِ ١٤

**14**. మరియు భూమిలో ఉన్న వారి నందరినీ కూడా ఇచ్చి అయినా, తాను విముక్తి పొందాలని కోరుతాడు.

كَلَّآۖ إِنَّهَا لَظَىٰ ١٥

**15**. కాని అలా కానేరదు! నిశ్చయంగా, ఆ మండే అగ్నిజ్వాల (అతని కొరకు వేచి ఉంటుంది)!

نَزَّاعَةٗ لِّلشَّوَىٰ ١٦

**16**. అది అతని చర్మాన్ని పూర్తిగా వలచి కాల్చివేస్తుంది.

---

**1**. చూడండి, 101:5 ఇటువంటి ఆయత్‌కు.

تَدۡعُواْ مَنۡ أَدۡبَرَ وَتَوَلَّىٰ ١٧

17. అది (సత్యం నుండి) వెనుదిరిగి మరియు వెన్నుచూపి, పోయేవారిని (అందరినీ) పిలుస్తుంది.

وَجَمَعَ فَأَوۡعَىٰٓ ١٨

18. మరియు (ధనాన్ని) కూడబెట్టి, దానిని దాచే వారిని. (3/8)

۞ إِنَّ ٱلۡإِنسَٰنَ خُلِقَ هَلُوعًا ١٩

19. * నిశ్చయంగా మానవుడు ఆత్రగాడుగా (తొందరపడే వాడిగా) సృష్టించబడ్డాడు;

إِذَا مَسَّهُ ٱلشَّرُّ جَزُوعًا ٢٠

20. తనకు కీడు కలిగినప్పుడు వాడు ఆందోళన చెందుతాడు;

وَإِذَا مَسَّهُ ٱلۡخَيۡرُ مَنُوعًا ٢١

21. మరియు తనకు మేలు కలిగినపుడు స్వార్థపరునిగా ప్రవర్తిస్తాడు.

إِلَّا ٱلۡمُصَلِّينَ ٢٢

22. నమా'జ్‌ను ఖచ్చితంగా పాటించే వారు తప్ప!

ٱلَّذِينَ هُمۡ عَلَىٰ صَلَاتِهِمۡ دَآئِمُونَ ٢٣

23. ఎవరైతే తమ నమా'జ్‌ను సదా నియమంతో పాటిస్తారో;

وَٱلَّذِينَ فِيٓ أَمۡوَٰلِهِمۡ حَقّٞ مَّعۡلُومٞ ٢٤

24. మరియు అలాంటి వారు, ఎవరైతే తమ సంపదలలో (ఇతరులకు) ఉన్న హక్కును సమ్మతిస్తారో![1]

لِّلسَّآئِلِ وَٱلۡمَحۡرُومِ ٢٥

25. యాచకులకు మరియు లేమికి గురి అయిన వారికి;[2]

وَٱلَّذِينَ يُصَدِّقُونَ بِيَوۡمِ ٱلدِّينِ ٢٦

26. మరియు అలాంటి వారికి, ఎవరైతే తీర్పుదినాన్ని సత్యమని నమ్ముతారో;

وَٱلَّذِينَ هُم مِّنۡ عَذَابِ رَبِّهِم مُّشۡفِقُونَ ٢٧

27. మరియు ఎవరైతే తమ ప్రభువు శిక్షకు భయపడుతూవుంటారో!

---

1. అంటే, 'జకాత్ మరియు ఇతర దానధర్మాలు చేసేవారు.
2. ఇటువంటి ఆయత్‌కై చూడండి, 51:19.

**28**. నిశ్చయంగా, వారి ప్రభువు యొక్క ఆ శిక్ష! దాని పట్ల ఎవ్వరూ నిర్భయంగా ఉండలేరు.

إِنَّ عَذَابَ رَبِّهِمْ غَيْرُ مَأْمُونٍ ﴿٢٨﴾

**29**. మరియు ఎవరైతే, తమ మర్మాంగాలను కాపాడుకుంటారో!

وَالَّذِينَ هُمْ لِفُرُوجِهِمْ حَافِظُونَ ﴿٢٩﴾

**30**. తమ భార్యలు (అ'జ్వాజ్), లేదా ధర్మసమ్మతంగా తమ ఆధీనంలో ఉన్న (బానిస) స్త్రీలతో తప్ప![1] అలాంటప్పుడు వారు నిందార్హులు కారు.

إِلَّا عَلَىٰ أَزْوَاجِهِمْ أَوْ مَا مَلَكَتْ أَيْمَانُهُمْ فَإِنَّهُمْ غَيْرُ مَلُومِينَ ﴿٣٠﴾

**31**. కాని ఎవరైతే వీటిని మించి పోగోరుతారో, అలాంటి వారే మితిమీరి పోయేవారు.

فَمَنِ ابْتَغَىٰ وَرَاءَ ذَٰلِكَ فَأُولَٰئِكَ هُمُ الْعَادُونَ ﴿٣١﴾

**32**. మరియు ఎవరైతే తమ అమానతులను మరియు తమ వాగ్దానాలను కాపాడుకుంటారో;

وَالَّذِينَ هُمْ لِأَمَانَاتِهِمْ وَعَهْدِهِمْ رَاعُونَ ﴿٣٢﴾

**33**. మరియు ఎవరైతే తమ సాక్ష్యాల మీద స్థిరంగా ఉంటారో;

وَالَّذِينَ هُمْ بِشَهَادَاتِهِمْ قَائِمُونَ ﴿٣٣﴾

**34**. మరియు ఎవరైతే తమ నమా'జ్‌లను కాపాడుకుంటారో;

وَالَّذِينَ هُمْ عَلَىٰ صَلَاتِهِمْ يُحَافِظُونَ ﴿٣٤﴾

**35**. ఇలాంటి వారంతా సగౌరవంగా స్వర్గవనాలలో ఉంటారు.

أُولَٰئِكَ فِي جَنَّاتٍ مُكْرَمُونَ ﴿٣٥﴾

**36**. ఈ సత్యతిరస్కారులకు ఏమయ్యింది? వీరెందుకు హడావిడిగా, నీ ముందు ఇటూఅటూ తిరుగుతున్నారు?

فَمَالِ الَّذِينَ كَفَرُوا قِبَلَكَ مُهْطِعِينَ ﴿٣٦﴾

---

**1**. ధర్మయుద్ధం (జిహాద్)లో ఖైదీలుగా పట్టుబడ్డవారే బానిసలు, కనుక ఈ కాలంలో, ఇస్లాం నిర్దేశం ప్రకారం, బానిసలు అనబడేవారు అసలు లేరు. ఇంకా చూడండి, 23:5-7, 4:3.

عَنِ ٱلۡيَمِينِ وَعَنِ ٱلشِّمَالِ عِزِينَ ﴿٣٧﴾

**37**. కుడి ప్రక్కనుండి మరియు ఎడమ ప్రక్కనుండి గుంపులుగా;[1]

أَيَطۡمَعُ كُلُّ ٱمۡرِيٕٖ مِّنۡهُمۡ أَن يُدۡخَلَ جَنَّةَ نَعِيمٖ ﴿٣٨﴾

**38**. ఏమీ? వారిలో ప్రతి ఒక్కడూ, తాను పరమసుఖాలు గల స్వర్గవనంలో ప్రవేశింపజేయబడతానని ఆశిస్తున్నాడా?

كَلَّآۖ إِنَّا خَلَقۡنَٰهُم مِّمَّا يَعۡلَمُونَ ﴿٣٩﴾

**39**. అలా కానేరదు! నిశ్చయంగా, మేము వారిని దేనితో పుట్టించామో వారికి బాగా తెలుసు!

فَلَآ أُقۡسِمُ بِرَبِّ ٱلۡمَشَٰرِقِ وَٱلۡمَغَٰرِبِ إِنَّا لَقَٰدِرُونَ ﴿٤٠﴾

**40**. కావున! నేను తూర్పుల మరియు పడమరల ప్రభువు శపథంచేసి చెబుతున్నాను.[2] నిశ్చయంగా, మేము అలా చేయగల సమర్థులము;

عَلَىٰٓ أَن نُّبَدِّلَ خَيۡرٗا مِّنۡهُمۡ وَمَا نَحۡنُ بِمَسۡبُوقِينَ ﴿٤١﴾

**41**. వారికి బదులుగా వారికంటే ఉత్తములైన వారిని వారి స్థానంలో తీసుకురావటానికి మరియు మమ్మల్ని మించిపోయే వారు ఎవ్వరూ లేరు.

فَذَرۡهُمۡ يَخُوضُواْ وَيَلۡعَبُواْ حَتَّىٰ يُلَٰقُواْ يَوۡمَهُمُ ٱلَّذِي يُوعَدُونَ ﴿٤٢﴾

**42**. కావున వారిని - వారితో వాగ్దానం చేయబడిన ఆ దినానికి చేరేవరకు - వ్యర్థపు మాటలలో మరియు విలాస వినోదాల్లో విడిచిపెట్టు.

---

**1**. దైవప్రవక్త ('స'అస) కాలంలో సత్యతిరస్కారులు అతని సమావేశాలలో వచ్చేవారు. కాని అతని మాటలు విని, వాటిని ఆచరించక ఎగతాళి చేస్తూ గుంపులుగా వెళ్ళిపోయే వారు. మీరు (విశ్వాసులు) కాదు మేమే స్వర్గంలోకి ప్రవేశిస్తాము, అని అనేవారు.

**2**. చూడండి, 37:5 మరియు 55:17 తూర్పులూ మరియు పడమరలూ అంటే ఒక సంవత్సరపు కాలంలో ప్రతిరోజు సూర్యుడు ఒక కొత్త స్థానం నుండి ఉదయిస్తాడు మరియు ఒక కొత్త స్థానంలో అస్తమిస్తాడు. మరొక వ్యాఖ్యాన మేమిటంటే భూగోళంలోని విభిన్న భాగాలలో సూర్యుడు వేర్వేరు సమయాలలో వరుసగా ఉదయిస్తూ, అస్తమిస్తూ ఉంటాడు.

يَوْمَ يَخْرُجُونَ مِنَ ٱلْأَجْدَاثِ سِرَاعًا كَأَنَّهُمْ إِلَىٰ نُصُبٍ يُوفِضُونَ ﴿٤٣﴾

**43**. ఆ రోజు వారు తమ సమాధుల నుండి లేచి, తమ గమ్యస్థానాలకు చేరుకోవటానికి తొందరపడుతూ వేగంగా బయటికి వస్తారు.

خَٰشِعَةً أَبْصَٰرُهُمْ تَرْهَقُهُمْ ذِلَّةٌ ۚ ذَٰلِكَ ٱلْيَوْمُ ٱلَّذِى كَانُوا۟ يُوعَدُونَ ﴿٤٤﴾

**44**. వారి చూపులు క్రిందికి వాలి ఉంటాయి, అవమానం వారిని క్రమ్ముకొని ఉంటుంది. అదే వారికి వాగ్దానం చేయబడిన దినం!

*****

## 71. సూరహ్ నూ'హ్

## سُورَةُ نُوحٍ

ఖుర్ఆన్‌లో నూ'హ్ (Noah) ప్రస్తావన ఎన్నో సార్లు వచ్చింది. ఈ సూరహ్ మొదటి **మక్కా** కాలంలో అవతరింపజేయబడింది. చూడండి, 11:25. దీని పేరు **మొదటి ఆయత్‌**లో ఉంది. ఇందులో **28 ఆయతులు** ఉన్నాయి.

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

بِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

**1.** నిశ్చయంగా, మేము నూ'హ్‌ను, అతని జాతి వారి వద్దకు: "వారిపై బాధాకరమైన శిక్ష రాకముందే వారిని హెచ్చరించు!" అని (ఆజ్ఞాపించి) పంపాము.

إِنَّآ أَرْسَلْنَا نُوحًا إِلَىٰ قَوْمِهِۦٓ أَنْ أَنذِرْ قَوْمَكَ مِن قَبْلِ أَن يَأْتِيَهُمْ عَذَابٌ أَلِيمٌ ﴿١﴾

**2.** అతను వారితో ఇలా అన్నాడు: "ఓ నాజాతి ప్రజలారా! నిశ్చయంగా, నేను మీకు స్పష్టంగా హెచ్చరిక చేయటానికి వచ్చిన వాడిని!

قَالَ يَٰقَوْمِ إِنِّى لَكُمْ نَذِيرٌ مُّبِينٌ ﴿٢﴾

**3.** "కావున మీరు అల్లాహ్‌నే ఆరాధించండి మరియు ఆయనయందు భయభక్తులు కలిగి ఉండండి మరియు నన్ను అనుసరించండి.

أَنِ ٱعْبُدُوا۟ ٱللَّهَ وَٱتَّقُوهُ وَأَطِيعُونِ ﴿٣﴾

**4.** "అలా చేస్తే ఆయన మీ పాపాలను క్షమిస్తాడు. మరియు ఒక నియమిత కాలం వరకు మిమ్మల్ని వదలిపెడ్తాడు. నిశ్చయంగా అల్లాహ్ నిర్ణయించిన కాలం వచ్చినపుడు, దానిని తప్పించడం సాధ్యంకాదు. ఇది మీరు తెలుసుకుంటే ఎంత బాగుండేది!"

يَغْفِرْ لَكُم مِّن ذُنُوبِكُمْ وَيُؤَخِّرْكُمْ إِلَىٰٓ أَجَلٍ مُّسَمًّى ۚ إِنَّ أَجَلَ ٱللَّهِ إِذَا جَآءَ لَا يُؤَخَّرُ ۖ لَوْ كُنتُمْ تَعْلَمُونَ ﴿٤﴾

**5.** అతను ఇలా ప్రార్థించాడు: "ఓ నా ప్రభూ! నిశ్చయంగా, నేను నాజాతి వారిని రేయింబవళ్ళు పిలిచాను;

قَالَ رَبِّ إِنِّى دَعَوْتُ قَوْمِى لَيْلًا وَنَهَارًا ﴿٥﴾

فَلَمۡ يَزِدۡهُمۡ دُعَآءِيٓ إِلَّا فِرَارٗا ٦

**6**. "కాని, నా పిలుపు, వారి పలాయనాన్ని మాత్రమే హెచ్చించింది.

وَإِنِّي كُلَّمَا دَعَوۡتُهُمۡ لِتَغۡفِرَ لَهُمۡ جَعَلُوٓاْ أَصَٰبِعَهُمۡ فِيٓ ءَاذَانِهِمۡ وَٱسۡتَغۡشَوۡاْ ثِيَابَهُمۡ وَأَصَرُّواْ وَٱسۡتَكۡبَرُواْ ٱسۡتِكۡبَارٗا ٧

**7**. "మరియు వాస్తవానికి, నేను వారిని, నీ క్షమాభిక్ష వైపునకు పిలిచినప్పుడల్లా, వారు తమ చెవులలో (వ్రేళ్ళు) దూర్చుకునే వారు మరియు తమ వస్త్రాలను తమపై కప్పుకునే వారు మరియు వారు మొండి వైఖరి అవలంబిస్తూ దురహంకారంలో మునిగి ఉండే వారు.

ثُمَّ إِنِّي دَعَوۡتُهُمۡ جِهَارٗا ٨

**8**. "తరువాత వాస్తవానికి నేను వారిని ఎలుగెత్తి పిలిచాను.

ثُمَّ إِنِّيٓ أَعۡلَنتُ لَهُمۡ وَأَسۡرَرۡتُ لَهُمۡ إِسۡرَارٗا ٩

**9**. "ఆ తరువాత వాస్తవంగా, నేను వారికి బహిరంగంగా చాటి చెప్పాను మరియు ఏకాంతంలో, రహస్యంగా కూడా పిలిచాను.

فَقُلۡتُ ٱسۡتَغۡفِرُواْ رَبَّكُمۡ إِنَّهُۥ كَانَ غَفَّارٗا ١٠

**10**. "ఇంకా వారితో ఇలా అన్నాను: 'మీ ప్రభువును క్షమాపణకై వేడుకోండి, నిశ్చయంగా ఆయన ఎంతో క్షమాశీలుడు!

يُرۡسِلِ ٱلسَّمَآءَ عَلَيۡكُم مِّدۡرَارٗا ١١

**11**. " 'ఆయన మీపై ఆకాశం నుండి ధారాళంగా వర్షాన్ని కురిపింపజేస్తాడు.[1]

وَيُمۡدِدۡكُم بِأَمۡوَٰلٖ وَبَنِينَ وَيَجۡعَل لَّكُمۡ جَنَّٰتٖ وَيَجۡعَل لَّكُمۡ أَنۡهَٰرٗا ١٢

**12**. " 'మరియు మీకు ధన సంపదలలోను మరియు సంతానంలోను వృద్ధినొసంగుతాడు మరియు మీకొరకు తోటలను ఉత్పత్తిచేస్తాడు మరియు నదులను ప్రవహింపజేస్తాడు.' "

---

**1**. ఈ ఆయత్ ఆధారంగా కొందరు విద్వాంసులు ఈ సూరహ్‌ను వర్షం కొరకు చేసే నమా'జ్‌లో చదువటం ముస్త'హాబ్ అని అంటారు. ఇటువంటి ఆయత్ కోసం చూడండి, 11:52.

مَّا لَكُمْ لَا تَرْجُونَ لِلَّهِ وَقَارًا ﴿١٣﴾

**13**. మీకేమయింది? మీరు అల్లాహ్ మహత్త్వమును ఎందుకు ఆదరించరు?[1]

وَقَدْ خَلَقَكُمْ أَطْوَارًا ﴿١٤﴾

**14**. మరియు వాస్తవానికి ఆయనే, మిమ్మల్ని విభిన్న దశలలో సృష్టించాడు.[2]

أَلَمْ تَرَوْا كَيْفَ خَلَقَ اللَّهُ سَبْعَ سَمَاوَاتٍ طِبَاقًا ﴿١٥﴾

**15**. ఏమీ? మీరు చూడటం లేదా? అల్లాహ్ ఏడు ఆకాశాలను ఏ విధంగా అంతస్తులలో సృష్టించాడో![3]

وَجَعَلَ الْقَمَرَ فِيهِنَّ نُورًا وَجَعَلَ الشَّمْسَ سِرَاجًا ﴿١٦﴾

**16**. మరియు వాటి మధ్య చంద్రుణ్ణి (ప్రతిబింబించే) కాంతిగాను మరియు సూర్యుణ్ణి (వెలిగే) దీపంగాను చేశాడు![4]

وَاللَّهُ أَنْبَتَكُمْ مِنَ الْأَرْضِ نَبَاتًا ﴿١٧﴾

**17**. మరియు అల్లాహ్ యే మిమ్మల్ని భూమి(మట్టి)నుండి[5] ఉత్పత్తి చేశాడు!

ثُمَّ يُعِيدُكُمْ فِيهَا وَيُخْرِجُكُمْ إِخْرَاجًا ﴿١٨﴾

**18**. తరువాత ఆయన మిమ్మల్ని అందులోకే తీసుకొని పోతాడు మరియు మిమ్మల్ని దానినుండి (బ్రతికించి) బయటికి తీస్తాడు!

وَاللَّهُ جَعَلَ لَكُمُ الْأَرْضَ بِسَاطًا ﴿١٩﴾

**19**. మరియు అల్లాహ్ యే మీ కొరకు భూమిని విస్తరింపజేశాడు.

لِتَسْلُكُوا مِنْهَا سُبُلًا فِجَاجًا ﴿٢٠﴾

**20**. మీరు దానిపై నున్న విశాలమైన మార్గాలలో నడవటానికి.

---

**1**. వఖారున్: అంటే మహత్త్వం, ప్రభావం, ప్రతాపం, ఘనత.
రజా: అంటే లక్ష్యపెట్టు, ఆదరించు భయపడు.

**2**. చూడండి, 22:5, 23:14 మొదలైనవి.

**3**. చూడండి, 67:3.

**4**. చూడండి, 10:5.

**5**. అంటే భూమిలో ఉన్న మూల పదార్థాలనుండి.

قَالَ نُوحٌ رَّبِّ إِنَّهُمْ عَصَوْنِي وَٱتَّبَعُواْ مَن لَّمْ يَزِدْهُ مَالُهُۥ وَوَلَدُهُۥٓ إِلَّا خَسَارًا ﴿٢١﴾

**21**. నూ'హ్ ఇంకా ఇలా విన్నవించుకున్నాడు: "ఓ నా ప్రభూ! వాస్తవానికి వారు నామాటను ధిక్కరించారు. మరియు వాడిని అనుసరించారు, ఎవడి సంపద మరియు సంతానం వారికి కేవలం నష్టం తప్ప మరేమి అధికంచేయదో!

وَمَكَرُواْ مَكۡرًا كُبَّارًا ﴿٢٢﴾

**22**. "మరియు వారు పెద్దకుట్ర పన్నారు.[1]

وَقَالُواْ لَا تَذَرُنَّ ءَالِهَتَكُمۡ وَلَا تَذَرُنَّ وَدًّا وَلَا سُوَاعًا وَلَا يَغُوثَ وَيَعُوقَ وَنَسۡرًا ﴿٢٣﴾

**23**. "మరియు వారు ఒకరితోనొకరు ఇలా అనుకున్నారు: 'మీరు మీ ఆరాధ్య దైవాలను విడిచిపెట్టకండి. వద్ద్ మరియు సువా'అ, య'గూస్', య'ఊఖ్ మరియు నస్ర్‌లను విడిచిపెట్టకండి!'

وَقَدۡ أَضَلُّواْ كَثِيرًاۖ وَلَا تَزِدِ ٱلظَّٰلِمِينَ إِلَّا ضَلَٰلًا ﴿٢٤﴾

**24**. "మరియు వాస్తవానికి, వారు చాలా మందిని తప్పుదారిలో పడవేశారు. కావున (ఓ నా ప్రభూ!): "నీవు కూడా ఈ దుర్మార్గులకు కేవలం వారి మార్గభ్రష్టత్వాన్నే హెచ్చించు!""

مِّمَّا خَطِيٓـَٰٔتِهِمۡ أُغۡرِقُواْ فَأُدۡخِلُواْ نَارًا فَلَمۡ يَجِدُواْ لَهُم مِّن دُونِ ٱللَّهِ أَنصَارًا ﴿٢٥﴾

**25**. వారు తమ పాపాల కారణంగా ముంచివేయబడ్డారు మరియు నరకాగ్నిలోకి త్రోయబడ్డారు, కావున వారు అల్లాహ్ తప్ప తమను కాపాడే వారినెవ్వరినీ పొందలేక పోయారు.

وَقَالَ نُوحٌ رَّبِّ لَا تَذَرۡ عَلَى ٱلۡأَرۡضِ مِنَ ٱلۡكَٰفِرِينَ دَيَّارًا ﴿٢٦﴾

**26**. మరియు నూ'హ్ ఇలా ప్రార్థించాడు: "ఓ నా ప్రభూ! సత్యతిరస్కారులలో ఒక్కరిని కూడా భూమి మీద వదలకు.[2]

---

**1**. నూ'హ్('అ.స.)ను చంపటానికి కుట్రపన్నారని కొందరి అభిప్రాయం.
**2**. చూడండి, 11:36.

إِنَّكَ إِن تَذَرْهُمْ يُضِلُّواْ عِبَادَكَ وَلَا يَلِدُوٓاْ إِلَّا فَاجِرًا كَفَّارًا ﴿٢٧﴾

**27.** "ఒకవేళ నీవు వారిని వదలిపెడితే, నిశ్చయంగా, వారు నీ దాసులను మార్గభ్రష్టత్వంలో పడవేస్తారు. మరియు వారు పాపులను మరియు కృతఘ్నులను మాత్రమే పుట్టిస్తారు.

رَّبِّ ٱغْفِرْ لِى وَلِوَٰلِدَىَّ وَلِمَن دَخَلَ بَيْتِىَ مُؤْمِنًا وَلِلْمُؤْمِنِينَ وَٱلْمُؤْمِنَٰتِ وَلَا تَزِدِ ٱلظَّٰلِمِينَ إِلَّا تَبَارًا ﴿٢٨﴾

**28.** "ఓ నా ప్రభూ! నన్నూ, నా తల్లిదండ్రులను మరియు విశ్వాసిగా నా ఇంటిలోనికి ప్రవేశించేవానిని మరియు విశ్వాసులైన పురుషులను మరియు విశ్వాసులైన స్త్రీలను, అందరినీ క్షమించు. మరియు దుర్మార్గులకు వినాశం తప్ప మరేమీ అధికం చేయకు!" (1/2)

*****

## 72. సూరహ్ అల్-జిన్న్

## سُورَةُ الجِنِّ

ఈ సూరహ్ పేరు **మొదటి ఆయత్** నుండి తీసుకోబడింది. ఇది చివరి **మక్కా** కాలంలో అవతరింపజేయబడింది. దాదాపు ప్రస్థానం (హిజ్రత్)కు రెండు సంవత్సరాలకు ముందు. మక్కా వారు తిరస్కరించినందుకు దైవప్రవక్త ('స'అస) ధర్మప్రచారం చేయటానికి 'తాయఫ్‌కు వెళ్ళారు. కాని 'తాయఫ్ వాసులు అతనిని అవమానిస్తారు. అప్పుడు దైవప్రవక్త ('స'అస) అల్లాహ్(సు.తా.)ను ప్రార్థిస్తారు. దాదాపు రెండు నెలల తరువాత యస్'రిబ్ (మదీనా) నుండి కొందరు వచ్చి ఇస్లాం స్వీకరిస్తారు. వారు దైవప్రవక్త ('స'అస)ను మదీనాకు రమ్మని ఆహ్వానిస్తారు. ఇందులో **28 ఆయతులు** ఉన్నాయి.

بِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

قُلْ أُوحِيَ إِلَيَّ أَنَّهُ ٱسْتَمَعَ نَفَرٌ مِّنَ ٱلْجِنِّ فَقَالُوٓا۟ إِنَّا سَمِعْنَا قُرْءَانًا عَجَبًا ﴿١﴾

**1.** * (ఓ ప్రవక్తా!) ఇలా అను: "నాకు ఈ విధంగా దివ్యసందేశం పంపబడింది; నిశ్చయంగా ఒక **జిన్నాతుల** సమూహం,[1] దీనిని (ఈ ఖుర్ఆన్‌ను) విని, తమ జాతివారితో ఇలా అన్నారు: 'వాస్తవానికి మేము ఒక అద్భుతమైన పఠనం (ఖుర్ఆన్) విన్నాము!

يَهْدِيٓ إِلَى ٱلرُّشْدِ فَـَٔامَنَّا بِهِۦ ۖ وَلَن نُّشْرِكَ بِرَبِّنَآ أَحَدًا ﴿٢﴾

**2.** " 'అది సరైనమార్గం వైపునకు మార్గదర్శకత్వం చేస్తుంది. కావున మేము దానిని విశ్వసించాము.[2] మరియు మేము మా ప్రభువుకు ఎవ్వడిని కూడా భాగస్వామిగా సాటి కల్పించము.

---

**1.** నఫరున్: అంటే 3నుండి 10 వరకు ఉండే సంఖ్యల సమూహం. నఖ్‌లా లోయలో దైవప్రవక్త ('స'అస) తమ అనుచరు(ర'ది.'అన్హుమ్)లతో సహా ఫజ్ర్ నమా'జ్ చేస్తుండగా అక్కడి నుండి కొందరు జిన్నాతులు పోతూ వారి ఖుర్ఆన్ విని ప్రభావితులయి విశ్వసిస్తారు. ఈ విషయం 46:29లో వచ్చింది. జిన్నాతులు ఖుర్ఆన్ విన్నది దైవప్రవక్త ('స'అస)కు తెలియదు. అది వ'హీ ద్వారా తెలుపబడిందని ఇక్కడ పేర్కొనబడింది.

**2.** ఖుర్ఆన్‌ను వినగానే జిన్నాతులు విశ్వసించారు. కాని మానవులు మాత్రం దానిని మళ్ళీమళ్ళీ వినికూడా విశ్వసించడం లేదు.

3. “ ‘మరియు నిశ్చయంగా, మా ప్రభువు వైభవం ఎంతో ఉన్నతమైనది. ఆయన ఎవ్వడినీ భార్య(’సా’హిబతున్)గా గానీ, కుమారునిగా గానీ చేసుకోలేదు.

4. “ ‘మరియు నిశ్చయంగా, మనలోని అవివేకులు, కొందరు అల్లాహ్ విషయంలో దారుణమైన మాటలు పలుకుతున్నారు.

5. “ ‘మరియు వాస్తవానికి, మనం మానవులుగానీ, జిన్నాతులుగానీ అల్లాహ్‌ను గురించి అబద్ధం పలకరని భావించేవారము.

6. “ ‘మరియు వాస్తవానికి, మానవులలో నుండి కొందరు పురుషులు, జిన్నాతులలో నుండి కొందరు పురుషుల శరణువేడుతూ ఉండే వారు. ఈ విధంగా వారు, వారి (జిన్నాతుల) తలబిరుసుతనం మరింత అధికమే చేసేవారు.[1]

7. “ ‘మరియు వాస్తవానికి, వారు (మానవులు) కూడా మీరు భావించినట్లు, అల్లాహ్ ఎవ్వడినీ కూడా సందేశహరునిగా పంపడని భావించారు.

8. “ ‘మరియు నిశ్చయంగా, మేము ఆకాశాలలో (రహస్యాలను) తొంగి చూడటానికి ప్రయత్నించినపుడు, మేము దానిని కఠినమైన కావలివారితో మరియు అగ్ని జ్వాలలతో నిండి ఉండటాన్ని చూశాము.[2]

وَأَنَّهُۥ تَعَٰلَىٰ جَدُّ رَبِّنَا مَا ٱتَّخَذَ صَٰحِبَةً وَلَا وَلَدًا ﴿٣﴾

وَأَنَّهُۥ كَانَ يَقُولُ سَفِيهُنَا عَلَى ٱللَّهِ شَطَطًا ﴿٤﴾

وَأَنَّا ظَنَنَّآ أَن لَّن تَقُولَ ٱلْإِنسُ وَٱلْجِنُّ عَلَى ٱللَّهِ كَذِبًا ﴿٥﴾

وَأَنَّهُۥ كَانَ رِجَالٌ مِّنَ ٱلْإِنسِ يَعُوذُونَ بِرِجَالٍ مِّنَ ٱلْجِنِّ فَزَادُوهُمْ رَهَقًا ﴿٦﴾

وَأَنَّهُمْ ظَنُّوا۟ كَمَا ظَنَنتُمْ أَن لَّن يَبْعَثَ ٱللَّهُ أَحَدًا ﴿٧﴾

وَأَنَّا لَمَسْنَا ٱلسَّمَآءَ فَوَجَدْنَٰهَا مُلِئَتْ حَرَسًا شَدِيدًا وَشُهُبًا ﴿٨﴾

---

1. చివరి వాక్యానికి కొందరు వ్యాఖ్యాతలు ఈ విధంగా తాత్పర్యం చెప్పారు: “కాని వారు, వారి(మానవుల) పాపాన్ని అవిశ్వాసాన్ని మరింత అధికం చేశారు.” ఇస్లాంకు ముందు ‘అరబ్బులు తమ ప్రయాణాలలో ఎక్కడైనా ఆగితే, అక్కడి జిన్నాతులతో శరణుకోరే వారు. ఇస్లాం దీనినిని షేధించింది మరియు కేవలం ఒకే ఒక్క ప్రభువు, అల్లాహ్(సు.తా.)తో శరణు కోరటాన్ని మాత్రమే విధిగా చేసింది.

2. చూడండి,15:17-18 ఆకాశాలలో దైవదూతలు (‘అలైహిమ్.స.), ఇతరులు అక్కడి మాటలు వినకుండా కాపలాకాస్తూ ఉంటారు మరియు ఈ అగ్నికణాలు(షుహుబున్) ఆకాశాలలోని మాటలు వినటానికిపైకి పోయే జిన్నాతులపై పడతాయి. షుహుబున్-షిహాబున్ యొక్క బ.వ.

وَأَنَّا كُنَّا نَقۡعُدُ مِنۡهَا مَقَٰعِدَ لِلسَّمۡعِۖ فَمَن يَسۡتَمِعِ ٱلۡأٓنَ يَجِدۡ لَهُۥ شِهَابٗا رَّصَدٗا ٩

9. " 'మరియు వాస్తవానికి పూర్వం అక్కడి మాటలు వినటానికి మేము రహస్యంగా అక్కడ కూర్చునే వారం.[1] కాని ఇప్పుడు ఎవడైనా (రహస్యంగా) వినే ప్రయత్నం చేస్తే, అతడికొరకు అక్కడ ఒక అగ్నిజ్వాల పొంచిఉంటుంది.[2]

وَأَنَّا لَا نَدۡرِيٓ أَشَرٌّ أُرِيدَ بِمَن فِي ٱلۡأَرۡضِ أَمۡ أَرَادَ بِهِمۡ رَبُّهُمۡ رَشَدٗا ١٠

10. " 'మరియు వాస్తవానికి, భూమిలో ఉన్నవారికి ఏదైనా కీడు ఉద్దేశింపబడిందా, లేక వారి ప్రభువు వారికి సరైనమార్గం చూపగోరుతున్నాడా, అనే విషయం మాకు అర్థం కావడం లేదు.

وَأَنَّا مِنَّا ٱلصَّٰلِحُونَ وَمِنَّا دُونَ ذَٰلِكَۖ كُنَّا طَرَآئِقَ قِدَدٗا ١١

11. " 'మరియు వాస్తవానికి, మనలో కొందరు సద్వర్తనులున్నారు మరికొందరు దానికి విరుద్ధంగా ఉన్నారు. వాస్తవానికి మనం విభిన్నమార్గాలను అనుసరిస్తూ వచ్చాము.[3]

وَأَنَّا ظَنَنَّآ أَن لَّن نُّعۡجِزَ ٱللَّهَ فِي ٱلۡأَرۡضِ وَلَن نُّعۡجِزَهُۥ هَرَبٗا ١٢

12. " 'మరియు నిశ్చయంగా, మేము అల్లాహ్ నుండి భూలోకంలో తప్పించుకోలేము అని అర్థం చేసుకున్నాము మరియు పారిపోయి కూడా ఆయన నుండి తప్పించుకోలేము.

---

1. మరియు ఆకాశాల మాటలు విని జ్యోతిష్యులకు చెప్పేవారము. వాటిలో వారు తమ వైపునుండి నూరు అబద్ధాలు కలిపి చెప్పేవారు.
2. కాని దైవప్రవక్త ('స'అస) వచ్చిన తరువాత నుండి ఈ పని ఆపబడింది. ఇప్పుడు ఎవడైనా పైకి పోవటానికి ప్రయత్నిస్తే అగ్నికణం అతనిపై పడుతుంది.
3. జిన్నాతులలో కూడా వేర్వేరు జాతులవారు, యూదులు, క్రైస్తవులు, ముస్లింలు మరియు సత్యతిరస్కారులు మొదలైనవారు ఉన్నారు.

وَأَنَّا لَمَّا سَمِعْنَا ٱلْهُدَىٰٓ ءَامَنَّا بِهِۦ ۖ فَمَن يُؤْمِنۢ بِرَبِّهِۦ فَلَا يَخَافُ بَخْسًا وَلَا رَهَقًا ﴿١٣﴾

13. " 'మరియు నిశ్చయంగా, మేము ఈ మార్గదర్శకత్వాన్ని (ఖుర్ఆన్‌ను) విన్నప్పుడు దానిని విశ్వసించాము. కావున ఎవడైతే తన ప్రభువును విశ్వసిస్తాడో అతడికి తన సత్కర్మల ఫలితంలో నష్టాన్ని గురించీ మరియు శిక్షలో హెచ్చింపును గురించీ భయపడే అవసరం ఉండదు.

وَأَنَّا مِنَّا ٱلْمُسْلِمُونَ وَمِنَّا ٱلْقَـٰسِطُونَ ۖ فَمَنْ أَسْلَمَ فَأُو۟لَـٰٓئِكَ تَحَرَّوْا۟ رَشَدًا ﴿١٤﴾

14. " 'మరియు నిశ్చయంగా, మనలో కొందరు అల్లాహ్‌కు విధేయులైన వారు (ముస్లింలు) ఉన్నారు. మరికొందరు నిశ్చయంగా, అన్యాయపరులు[1] (సత్యానికి దూరమైన వారు) ఉన్నారు. కావున ఎవరైతే అల్లాహ్‌కు విధేయత (ఇస్లాం)ను అవలంబించారో, అలాంటి వారే సరైనమార్గాన్ని కనుగొన్న వారు!' "

وَأَمَّا ٱلْقَـٰسِطُونَ فَكَانُوا۟ لِجَهَنَّمَ حَطَبًا ﴿١٥﴾

15. మరియు అన్యాయపరులే (సత్యానికి దూరమైన వారు) నరకానికి ఇంధనమయ్యే వారు![2]

وَأَلَّوِ ٱسْتَقَـٰمُوا۟ عَلَى ٱلطَّرِيقَةِ لَأَسْقَيْنَـٰهُم مَّآءً غَدَقًا ﴿١٦﴾

16. ఒకవేళ వారు (సత్యతిరస్కారులు) ఋజుమార్గం మీద స్థిరంగా ఉన్నట్లైతే, మేము వారిపై పుష్కలంగా నీటిని కురిపించే వారము.

لِّنَفْتِنَهُمْ فِيهِ ۚ وَمَن يُعْرِضْ عَن ذِكْرِ رَبِّهِۦ يَسْلُكْهُ عَذَابًا صَعَدًا ﴿١٧﴾

17. దానితో వారిని పరీక్షించటానికి! మరియు ఎవడైతే తన ప్రభువు ధ్యానం నుండి విముఖుడవుతాడో, ఆయన వానిని తీవ్రమైన శిక్షకు గురిచేస్తాడు.

---

1. ఖాసి'తూన్: ఈ పదానికి - సందర్భాన్ని బట్టి - న్యాయవర్తనులు, అన్యాయపరులు అనే రెండూ అర్థాలు వస్తాయి. ఈ సందర్భంలో అన్యాయపరులు, లేక సన్మార్గం నుండి లేక సత్యం నుండి విముఖులైన వారు అనే అర్థంలో వాడబడింది.
2. అంటే జిన్నాతులలో కూడా నరకం మరియు స్వర్గంలోకి పోయేవారున్నారు. సత్యతిరస్కారులు నరకంలోకి మరియు విశ్వాసులు స్వర్గంలోకి పోతారు.

**18**. మరియు నిశ్చయంగా, మస్జిదులు అల్లాహ్ కొరకే ప్రత్యేకించబడ్డాయి. కావున వాటిలో అల్లాహ్‌తో బాటు ఇతరులెవ్వరినీ ప్రార్థించకండి.

وَأَنَّ ٱلْمَسَٰجِدَ لِلَّهِ فَلَا تَدْعُواْ مَعَ ٱللَّهِ أَحَدًا ﴿١٨﴾

**19**. మరియు నిశ్చయంగా, అల్లాహ్ యొక్క దాసుడు (ము'హమ్మద్) ఆయన(అల్లాహ్)ను ప్రార్థించటానికి నిలబడినప్పుడు, వారు (జిన్నాతులు) అతనిచుట్టు దట్టంగా (అతని ఖుర్ఆన్ పఠనాన్ని వినటానికి) గుమిగూడుతారు.[1]

وَأَنَّهُۥ لَمَّا قَامَ عَبْدُ ٱللَّهِ يَدْعُوهُ كَادُواْ يَكُونُونَ عَلَيْهِ لِبَدًا ﴿١٩﴾

**20**. వారితో ఇలా అను: "నిశ్చయంగా నేను, నా ప్రభువును మాత్రమే ప్రార్థిస్తాను మరియు ఆయనకు ఎవ్వరినీ సాటి కల్పించను."[2]

قُلْ إِنَّمَآ أَدْعُواْ رَبِّي وَلَآ أُشْرِكُ بِهِۦٓ أَحَدًا ﴿٢٠﴾

**21**. వారితో ఇలా అను: "నిశ్చయంగా, మీకు కీడుచేయటంగానీ, లేదా సరైన మార్గం చూపటంగానీ నా వశంలో లేదు."

قُلْ إِنِّي لَآ أَمْلِكُ لَكُمْ ضَرًّا وَلَا رَشَدًا ﴿٢١﴾

**22**. ఇంకా ఇలా అను: "నిశ్చయంగా, నన్ను అల్లాహ్ నుండి ఎవ్వడునూ కాపాడలేడు మరియు నాకు ఆయన తప్ప మరొకరి ఆశ్రయం కూడా లేదు;

قُلْ إِنِّي لَن يُجِيرَنِي مِنَ ٱللَّهِ أَحَدٌ وَلَنْ أَجِدَ مِن دُونِهِۦ مُلْتَحَدًا ﴿٢٢﴾

---

**1**. దీని మరొక తాత్పర్యంలో: "(మానవులు మరియు జిన్నాతులు) అల్లాహ్ (సు.తా.) దాసుడు (ము'హమ్మద్ 'స'అస, అల్లాహుతా'ఆలాను) ప్రార్థించటానికి నిలబడినపుడు అతని చుట్టు దట్టంగా గుమిగూడి (అల్లాహ్ జ్యోతిని తమ నోట్లతో ఊది ఆర్పివేయగోరుతారు)." అని ఉంది. ఈ తాత్పర్యం ఇబ్నె-'అబ్బాస్, ముజాహిద్, సయ్యద్ బిన్-'జుబైర్ మరియు ఇబ్నె-'జైద్ (ర'ది. 'అన్హుమ్)లు ఇచ్చారు. ఇబ్నె-జరీర్ (ర'హ్మా) దీనికి ప్రాధాన్యత నిచ్చారు. ఇది ఇబ్నె-కసీ'ర్(ర'హ్మా)లో పేర్కొనబడింది.

**2**. అలాంటప్పుడు వారితో ఇలా అను: "నేను నా ప్రభువును మాత్రమే ప్రార్థిస్తాను. మరియు ఆయనకు ఎవ్వరినీ సాటి కల్పించను."

إِلَّا بَلَٰغًا مِّنَ ٱللَّهِ وَرِسَٰلَٰتِهِۦۚ وَمَن يَعْصِ ٱللَّهَ وَرَسُولَهُۥ فَإِنَّ لَهُۥ نَارَ جَهَنَّمَ خَٰلِدِينَ فِيهَآ أَبَدًا ﴿٢٣﴾

23. "(నా పని) కేవలం అల్లాహ్ ఉపదేశాన్ని మరియు ఆయన సందేశాన్ని అందజేయటమే!" ఇక ఎవడైతే అల్లాహ్ మరియు ఆయన ప్రవక్త ఆజ్ఞలను ఉల్లంఘిస్తాడో! అతడు నిశ్చయంగా, నరకాగ్నికి గురిఅవుతాడు; అందులో శాశ్వతంగా కలకాలం ఉంటాడు.

حَتَّىٰٓ إِذَا رَأَوْا۟ مَا يُوعَدُونَ فَسَيَعْلَمُونَ مَنْ أَضْعَفُ نَاصِرًا وَأَقَلُّ عَدَدًا ﴿٢٤﴾

24. చివరకు వారికి వాగ్దానం చేయబడిన దానిని వారు చూసినప్పుడు, ఎవరి సహాయకులు బలహీనులో, మరెవరి వర్గం సంఖ్యాపరంగా తక్కువో వారికి తెలిసిపోతుంది.[1]

قُلْ إِنْ أَدْرِىٓ أَقَرِيبٌ مَّا تُوعَدُونَ أَمْ يَجْعَلُ لَهُۥ رَبِّىٓ أَمَدًا ﴿٢٥﴾

25. ఇలా అను: "మీకు వాగ్దానం చేయబడినది(శిక్ష) సమీపంలోనేరానున్నదో, లేక దానికొరకు నాప్రభువు దీర్ఘకాలవ్యవధి నియమించాడో నాకు తెలియదు."

عَٰلِمُ ٱلْغَيْبِ فَلَا يُظْهِرُ عَلَىٰ غَيْبِهِۦٓ أَحَدًا ﴿٢٦﴾

26. ఆయనే అగోచర జ్ఞానం గలవాడు, కావున ఆయన అగోచర విషయాలు ఎవ్వడికీ తెలియజేయడు -

إِلَّا مَنِ ٱرْتَضَىٰ مِن رَّسُولٍ فَإِنَّهُۥ يَسْلُكُ مِنۢ بَيْنِ يَدَيْهِ وَمِنْ خَلْفِهِۦ رَصَدًا ﴿٢٧﴾

27. తాను కోరి ఎన్నుకొన్న ప్రవక్తకు తప్ప[2]-ఎందుకంటే, ఆయన నిశ్చయంగా, అతని (ఆ ప్రవక్త) ముందు మరియు వెనుక రక్షకభటులను నియమిస్తాడు.

لِّيَعْلَمَ أَن قَدْ أَبْلَغُوا۟ رِسَٰلَٰتِ رَبِّهِمْ وَأَحَاطَ بِمَا لَدَيْهِمْ وَأَحْصَىٰ كُلَّ شَىْءٍ عَدَدًۢا ﴿٢٨﴾

28. వారు, అతను తనప్రభువుయొక్క సందేశాన్ని యథాతథంగా అందజేస్తున్నాడని తెలుసుకోవటానికి మరియు ఆయన వారి అన్ని విషయాలను పరివేష్టించి ఉన్నాడు మరియు వారి ప్రతి ఒక్క విషయాన్ని లెక్కపెట్టిఉంచుతాడు.

*****

---

1. ఇటువంటి ఆయత్ కోసం చూడండి, 19:75.
2. చూడండి, 3:179.

## 73. సూరహ్ అల్-ముజ్జమ్మిల్

## سُورَةُ المُزَّمِّلِ

అల్-ముజ్జమ్మిల్: The Enwrapped One దుప్పటి కప్పుకున్నవాడు. ఈ సూరహ్ అవతరణాక్రమంలో నాలుగవది. మొదటి మక్కా కాలానికి చెందినది. దీనిపేరు మొదటి ఆయత్‌లోనుండి తీసుకోబడింది. ఇందులో **20** ఆయతులు ఉన్నాయి.

بِسْمِ ٱللَّهِ ٱلرَّحْمَٰنِ ٱلرَّحِيمِ

అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో

يَٰٓأَيُّهَا ٱلْمُزَّمِّلُ ①

**1**. ఓ దుప్పటి కప్పుకున్నవాడా![1]

قُمِ ٱلَّيْلَ إِلَّا قَلِيلًا ②

**2**. రాత్రంతా (నమాజ్‌లో) నిలబడు, కొంత భాగాన్ని విడిచి;

نِّصْفَهُۥٓ أَوِ ٱنقُصْ مِنْهُ قَلِيلًا ③

**3**. దాని సగభాగంలో, లేదా దానికంటే కొంత తక్కువ;

أَوْ زِدْ عَلَيْهِ وَرَتِّلِ ٱلْقُرْءَانَ تَرْتِيلًا ④

**4**. లేదా దానికంటే కొంత ఎక్కువ; మరియు ఖుర్ఆన్‌ను ఆగి-ఆగి, నెమ్మదిగా, స్పష్టంగా పఠించు.

إِنَّا سَنُلْقِى عَلَيْكَ قَوْلًا ثَقِيلًا ⑤

**5**. నిశ్చయంగా, మేము నీపై భారమైన సందేశాన్ని అవతరింపజేయబోతున్నాము.

إِنَّ نَاشِئَةَ ٱلَّيْلِ هِىَ أَشَدُّ وَطْـًٔا وَأَقْوَمُ قِيلًا ⑥

**6**. నిశ్చయంగా, రాత్రివేళ లేవటం (మనస్సును) అదుపులో ఉంచుకోవటానికి ఎంతో ఉపయుక్తమైనది మరియు (అల్లాహ్) ప్రవచనాలను (అర్థం చేసుకోవ టానికి) కూడా ఎంతో అనుగుణమైనది.

إِنَّ لَكَ فِى ٱلنَّهَارِ سَبْحًا طَوِيلًا ⑦

**7**. వాస్తవానికి, పగటివేళ నీకు చాలా పనులుంటాయి.

---

**1**. ఈ సూరహ్ అవతరింపజేయబడినప్పుడు దైవప్రవక్త ('స'అస) దుప్పటి కప్పుకొని పడుకొని ఉంటారు. అతనికి లేచి తహజ్జుద్ నమాజ్ చేయమని ఆజ్ఞ ఇవ్వబడింది. తహజ్జుద్ అతని కొరకు వాజిబ్-తప్పనిసరి చేయబడి ఉండెను. (ఇబ్నె-కసీ'ర్).

وَٱذۡكُرِ ٱسۡمَ رَبِّكَ وَتَبَتَّلۡ إِلَيۡهِ تَبۡتِيلٗا ﴿٨﴾

8. మరియు నీవు నీ ప్రభువు నామాన్ని స్మరిస్తూ ఉండు. మరియు అత్యంత శ్రద్ధతో ఆయనవైపుకు మరలుతూ ఉండు.

رَّبُّ ٱلۡمَشۡرِقِ وَٱلۡمَغۡرِبِ لَآ إِلَٰهَ إِلَّا هُوَ فَٱتَّخِذۡهُ وَكِيلٗا ﴿٩﴾

9. ఆయనే తూర్పు పడమరల స్వామి, ఆయన తప్ప మరొక ఆరాధ్య దైవం లేడు, కావున నీవు ఆయననే కార్యకర్తగా చేసుకో.

وَٱصۡبِرۡ عَلَىٰ مَا يَقُولُونَ وَٱهۡجُرۡهُمۡ هَجۡرٗا جَمِيلٗا ﴿١٠﴾

10. మరియు వారు పలికే మాటలకు సహనంవహించు మరియు మంచితనంతో వారినుండి తొలగిపో.

وَذَرۡنِي وَٱلۡمُكَذِّبِينَ أُوْلِي ٱلنَّعۡمَةِ وَمَهِّلۡهُمۡ قَلِيلًا ﴿١١﴾

11. మరియు అసత్యవాదులైన ఈ సంపన్నులను, నాకు వదలిపెట్టు.[1] మరియు వారికి కొంత వ్యవధినివ్వు.

إِنَّ لَدَيۡنَآ أَنكَالٗا وَجَحِيمٗا ﴿١٢﴾

12. నిశ్చయంగా, మా వద్ద వారికొరకు సంకెళ్ళు మరియు భగభగమండే నరకాగ్ని ఉన్నాయి.

وَطَعَامٗا ذَا غُصَّةٖ وَعَذَابًا أَلِيمٗا ﴿١٣﴾

13. మరియు గొంతులో ఇరుక్కుపోయే ఆహారం మరియు బాధాకరమైన శిక్ష (ఉన్నాయి).

يَوۡمَ تَرۡجُفُ ٱلۡأَرۡضُ وَٱلۡجِبَالُ وَكَانَتِ ٱلۡجِبَالُ كَثِيبٗا مَّهِيلًا ﴿١٤﴾

14. ఆ రోజు భూమి మరియు పర్వతాలు కంపించిపోతాయి మరియు పర్వతాలు ప్రవహించే ఇసుక దిబ్బలుగా మారిపోతాయి.[2]

إِنَّآ أَرۡسَلۡنَآ إِلَيۡكُمۡ رَسُولٗا شَٰهِدًا عَلَيۡكُمۡ كَمَآ أَرۡسَلۡنَآ إِلَىٰ فِرۡعَوۡنَ رَسُولٗا ﴿١٥﴾

15. మేము ఫిర్ఔన్ వద్దకు సందేశహరుణ్ణి పంపినట్లు, నిశ్చయంగా మీ వద్దకు కూడా ఒక సందేశహరుణ్ణి, మీకు సాక్షిగా ఉండటానికి పంపాము.

---

1. చూడండి, 74:11.
2. చూడండి, 14:48 మరియు 20:105-107.

فَعَصَىٰ فِرْعَوْنُ ٱلرَّسُولَ فَأَخَذْنَٰهُ أَخْذًا وَبِيلًا ﴿١٦﴾

16. కాని ఫిర్'ఔన్ ఆ సందేశహరునికి అవిధేయత చూపాడు. కావున మేము అతనిని తీవ్రమైన శిక్షకు గురిచేశాము.

فَكَيْفَ تَتَّقُونَ إِن كَفَرْتُمْ يَوْمًا يَجْعَلُ ٱلْوِلْدَٰنَ شِيبًا ﴿١٧﴾

17. ఒకవేళ మీరు సత్యాన్ని తిరస్కరిస్తే, బాలురను ముసలివారిగా చేసేటటువంటి ఆ దినపు శిక్షనుండి ఎలా తప్పించుకోగలరు?[1]

ٱلسَّمَآءُ مُنفَطِرٌۢ بِهِۦ ۚ كَانَ وَعْدُهُۥ مَفْعُولًا ﴿١٨﴾

18. అప్పుడు ఆకాశం బ్రద్దలైపోతుంది. ఆయన యొక్క వాగ్దానం తప్పక నెరవేరి తీరుతుంది.

إِنَّ هَٰذِهِۦ تَذْكِرَةٌ ۖ فَمَن شَآءَ ٱتَّخَذَ إِلَىٰ رَبِّهِۦ سَبِيلًا ﴿١٩﴾

19. నిశ్చయంగా, ఇదొక ఉపదేశం కావున ఇష్టమైన వాడు తన ప్రభువువద్దకు పోయే మార్గాన్ని అవలంబించవచ్చు! (5/8)

۞ إِنَّ رَبَّكَ يَعْلَمُ أَنَّكَ تَقُومُ أَدْنَىٰ مِن ثُلُثَىِ ٱلَّيْلِ وَنِصْفَهُۥ وَثُلُثَهُۥ وَطَآئِفَةٌ مِّنَ ٱلَّذِينَ مَعَكَ ۚ وَٱللَّهُ يُقَدِّرُ ٱلَّيْلَ وَٱلنَّهَارَ ۚ عَلِمَ أَن لَّن تُحْصُوهُ فَتَابَ عَلَيْكُمْ ۖ فَٱقْرَءُوا۟ مَا تَيَسَّرَ مِنَ ٱلْقُرْءَانِ ۚ

20. * (ఓ ము'హమ్మద్!) నీవు, వాస్తవానికి దాదాపు మూడింట రెండువంతుల రాత్రి లేక సగం (రాత్రి) లేక మూడింట ఒక భాగం (నమా'జ్‌లో) నిలుస్తావనేది నీ ప్రభువుకు బాగా తెలుసు. మరియు నీతోపాటు ఉన్న వారిలో కొందరు కూడా! మరియు అల్లాహ్ రేయింబవళ్ళ పరిమాణాలను నిర్ణయిస్తాడు. మీరు ఖచ్చితంగా పూర్తి

---

1. పునరుత్థాన దినమున ఆదమ్ ('అ.స.)తో ఇలా అనబడుతుంది: "నీ సంతానం నుండి నరకం వారిని ఎన్నుకో." అతను ప్రశ్నిస్తారు: "ఓ అల్లాహ్ (సు.తా.)! ఏ విధంగా?" అల్లాహ్ (సు.తా.) అంటాడు: "ప్రతి వేయిమంది నుండి 999 మందిని, అప్పుడు గర్భవతులైన స్త్రీల పిండాలు పడిపోతాయి మరియు పిల్లలు వృద్ధులైపోతారు." ఈ విషయం విని అనుచరు(ర'ది.'అన్హుమ్)లు చాలా చింతలో పడిపోయారు. అప్పుడు దైవప్రవక్త ('స'అస) అంటారు: "యాజూజ్ మాజూజ్ జాతివారి నుండి 999 ఉంటారు. మరియు మీలో నుండి ఒకడు; అల్లాహ్ (సు.తా.) కరుణపై నాకు విశ్వాసముంది. స్వర్గవాసులలోనుండి సగంమంది మీరుంటారు." ('స. బు'ఖారీ).

عَلِمَ أَن سَيَكُونُ مِنكُم مَّرْضَىٰ وَءَاخَرُونَ يَضْرِبُونَ فِي ٱلْأَرْضِ يَبْتَغُونَ مِن فَضْلِ ٱللَّهِ وَءَاخَرُونَ يُقَٰتِلُونَ فِي سَبِيلِ ٱللَّهِ فَٱقْرَءُواْ مَا تَيَسَّرَ مِنْهُ وَأَقِيمُواْ ٱلصَّلَوٰةَ وَءَاتُواْ ٱلزَّكَوٰةَ وَأَقْرِضُواْ ٱللَّهَ قَرْضًا حَسَنًا وَمَا تُقَدِّمُواْ لِأَنفُسِكُم مِّنْ خَيْرٍ تَجِدُوهُ عِندَ ٱللَّهِ هُوَ خَيْرًا وَأَعْظَمَ أَجْرًا وَٱسْتَغْفِرُواْ ٱللَّهَ إِنَّ ٱللَّهَ غَفُورٌ رَّحِيمٌ ﴿٢٠﴾

రాత్రి (ప్రార్థించ) లేరని ఆయనకు తెలుసు. కావున ఆయన మీ వైపునకు (కనికరంతో) మరలాడు. కావున ఖుర్ఆన్‌ను, మీరు సులభంగా పఠించగలిగినంతే పఠించండి. మీలో కొందరు వ్యాధిగ్రస్తులు కావచ్చు, మరికొందరు అల్లాహ్ అనుగ్రహాన్ని అన్వేషిస్తూ భూమిలో ప్రయాణంలో ఉండవచ్చు, మరి కొందరు అల్లాహ్ మార్గంలో ధర్మయుద్ధం చేస్తూ ఉండవచ్చు, అని ఆయనకు బాగా తెలుసు. కావున మీకు దానిలో సులభమైనంత దానినే పఠించండి.[1] మరియు నమా'జ్‌ను స్థాపించండి,[2] విధిదానం ('జకాత్) ఇవ్వండి. మరియు అల్లాహ్‌కు మంచి అప్పును, అప్పుగా ఇస్తూ ఉండండి. మరియు మీరు, మీ కొరకు ముందుగా చేసి పంపుకున్న మంచి కార్యాలన్నింటినీ అల్లాహ్ దగ్గర పొందుతారు. అదే చాలా ఉత్తమమైనది. మరియు దాని ప్రతిఫలం చాలా గొప్పది. మరియు మీరు అల్లాహ్‌ను క్షమాభిక్ష అర్థిస్తూ ఉండండి. నిశ్చయంగా అల్లాహ్ క్షమాశీలుడు, అపార కరుణాప్రదాత.

*****

1. అల్లాహ్ (సు.తా.) మిమ్మల్ని కనికరించాడు కావున, తహజ్జుద్‌లో మీకు సులభమైనంతనే పఠించండి. రెండు రకాతులైనా సరే. దైవప్రవక్త చాలా మట్టుకు **ఎనిమిది** రకాతులు చేసేవారు. అతనినే అనుసరించినా ఎంతో మేలు. మీ తహజ్జుద్ నమాజ్‌లో వీలైనంత ఖుర్ఆన్ పఠనంచేయండి. నెమ్మదిగా స్పష్టంగా పఠించండి.

2. అంటే ఐదు సార్లు చేసే ఫ'ర్ద్ నమాజులు. చాలా మంది వ్యాఖ్యాతల అభిప్రాయంలో ఈ ఆయత్ మదీనాలో అవతరింపజేయబడింది.

## 74. సూరహ్ అల్-ముద్దస్సి'ర్

## سُورَةُ الْمُدَّثِّرِ

అల్-ముద్దస్సి'ర్: The Enfolded One, బట్టల (దుప్పటి)లో చుట్టుకున్నవాడు! మొదటి ఆయత్‌లోనే ఈ పదముంది. దైవప్రవక్త ము'హమ్మద్ ('స'అస)పై సూరహ్ అల్-ఇఖ్‌రఅ' (96:1-5) మొదటి అయిదు ఆయతులు అవతరించిన తరువాత కొంతకాలం (6 నెలల నుండి 3 సంవత్సరాల) వరకు ఏ వ'హీ అవతరింపజేయబడలేదు. ఈ కాలాన్ని, ఫతరతుల్ వ'హీ అంటారు. అప్పుడు దైవప్రవక్త ('స'అస) ఎంతో కలవరపడ్డారు. అప్పుడు అతని భార్య 'ఖదీజహ్ (ర.'అన్హా) అతనికి నైతిక ప్రోత్సాహాన్నిచ్చారు. ఆ తరువాత ఒకరోజు జిబ్రీల్ ('అ.స.) ఆకాశాలు మరియు భూమి మధ్య ప్రత్యక్షమయ్యారు. ఆ తరువాత ఈ సూరహ్ అవతరిపంజేయబడింది. ఆ తరువాత వ'హీ త్వరత్వరగా రావడం ఆరంభమయ్యింది, ('స. బు'ఖారీ, ముస్లిం). దీని కొన్ని ఆయతులు తరువాత అవతరింపజేయబడ్డాయి. **మక్కాలో** అవతరింపజేయబడిన ఈ సూరహ్‌లో **56 ఆయతులు** ఉన్నాయి.

ఈ సూరహ్ ఇస్లాం విధులను, అల్లాహ్ ఏకత్వాన్ని పునరుత్థానాన్ని మరియు అంతిమ తీర్పును వివరిస్తోంది. మానవుడు బలహీనుడని, అల్లాహ్ (సు.తా.)పై అతడు ఆధారపడి ఉన్నాడని, ప్రతి మానవుడు తన కర్మలకు తానే బాధ్యుడని, అతడు వాటి ఫలితాన్ని అనుభవిస్తాడని మరియు అతని కర్మలను బట్టి స్వర్గనరకాలున్నాయని బోధిస్తోంది.

بِسْمِ اللَّهِ الرَّحْمَٰنِ الرَّحِيمِ

**అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో**

يَا أَيُّهَا الْمُدَّثِّرُ ﴿١﴾

**1.** ఓ దుప్పటిలోచుట్టుకున్నవాడా!

قُمْ فَأَنذِرْ ﴿٢﴾

**2.** లే! ఇక హెచ్చరించు!

وَرَبَّكَ فَكَبِّرْ ﴿٣﴾

**3.** మరియు నీ ప్రభువు గొప్పతనాన్ని (ఘనతను) కొనియాడు!

وَثِيَابَكَ فَطَهِّرْ ﴿٤﴾

**4.** మరియు నీ వస్త్రాలను పరిశుభ్రంగా ఉంచుకో!

وَالرُّجْزَ فَاهْجُرْ ﴿٥﴾

**5.** మరియు మాలిన్యానికి దూరంగా ఉండు!

وَلَا تَمْنُن تَسْتَكْثِرُ ﴿٦﴾

**6.** మరియు ఎక్కువ పొందాలనే ఆశతో ఇవ్వకు (ఉపకారం చేయకు)!

وَلِرَبِّكَ فَٱصۡبِرۡ ﴿٧﴾

**7**. మరియు నీ ప్రభువు కొరకు సహనం వహించు!

فَإِذَا نُقِرَ فِي ٱلنَّاقُورِ ﴿٨﴾

**8**. మరియు బాకా (నాఖూర్) ఊదబడి నప్పుడు;

فَذَٰلِكَ يَوۡمَئِذٖ يَوۡمٌ عَسِيرٌ ﴿٩﴾

**9**. ఆ దినం చాలా కఠినమైన దినమై ఉంటుంది;

عَلَى ٱلۡكَٰفِرِينَ غَيۡرُ يَسِيرٖ ﴿١٠﴾

**10**. సత్యతిరస్కారులకు అది సులభమైన (దినం) కాదు.[1]

ذَرۡنِي وَمَنۡ خَلَقۡتُ وَحِيدٗا ﴿١١﴾

**11**. వదలండి! నన్నూ మరియు నేను ఒంటరిగా పుట్టించిన వానినీ![2]

وَجَعَلۡتُ لَهُۥ مَالٗا مَّمۡدُودٗا ﴿١٢﴾

**12**. మరియు నేను అతనికి పుష్కలంగా సంపదనిచ్చాను.

وَبَنِينَ شُهُودٗا ﴿١٣﴾

**13**. మరియు అతనికి తోడుగా ఉండే కుమారులను!

وَمَهَّدتُّ لَهُۥ تَمۡهِيدٗا ﴿١٤﴾

**14**. మరియు అతని కొరకు అతని జీవన సౌకర్యాలను సులభం చేశాను.

ثُمَّ يَطۡمَعُ أَنۡ أَزِيدَ ﴿١٥﴾

**15**. అయినా నేను అతనికి ఇంకా ఇవ్వాలని అతడు ఆశిస్తూ ఉంటాడు.

كَلَّآۖ إِنَّهُۥ كَانَ لِأٓيَٰتِنَا عَنِيدٗا ﴿١٦﴾

**16**. అలాకాదు! వాస్తవానికి అతడు మా (అల్లాహ్) సూచన(ఆయాత్)ల పట్ల విరోధం కలిగివున్నాడు.

---

**1**. అల్-కాఫిరీన్: అంటే సత్యతిరస్కారులు. ఈ పదం ఇక్కడ ఖుర్ఆన్ అవతరణా క్రమంలో మొదటి సారి వచ్చింది. 57:20లో మాత్రం ఈ పదానికి భూమిని దున్నేవాడు అనే అర్థం ఉంది. మిగతా అన్నీ చోట్లలో ఈ పదం సత్యతిరస్కారులనే అర్థంలోనే వాడబడింది.

**2**. చూడండి, 6:94, 19:80, 95. కొందరు వ్యాఖ్యాతలు ఈ ఆయత్ వలీద్ బిన్ ము'గైరాను ఉద్దేశిస్తోంది అని అభిప్రాయపడ్డారు. అతడు సత్యతిరస్కారం మరియు దురహంకారంలో మితిమీరి పోయాడు. ఈ ఆయత్ ఇటువంటి ప్రతి సత్యతిరస్కారిని సూచిస్తుంది.

سَأُرۡهِقُهُۥ صَعُودًا ﴿١٧﴾

**17**. నేను త్వరలోనే అతనిని దుర్గమమైన స్థానానికి (శిక్షకు) నెట్టుతాను!

إِنَّهُۥ فَكَّرَ وَقَدَّرَ ﴿١٨﴾

**18**. వాస్తవానికి అతడు ఆలోచించాడు మరియు మనస్సులో ప్రణాళిక చేసుకున్నాడు.

فَقُتِلَ كَيۡفَ قَدَّرَ ﴿١٩﴾

**19**. కావున (అతనిని) తాను ప్రణాళిక చేసుకున్నట్లు నాశనానికి గురికానివ్వండి!

ثُمَّ قُتِلَ كَيۡفَ قَدَّرَ ﴿٢٠﴾

**20**. అవును (అతనిని) తాను ప్రణాళిక చేసుకున్నట్లు, నాశనానికి గురికానివ్వండి!

ثُمَّ نَظَرَ ﴿٢١﴾

**21**. అప్పుడు అతడు ఆలోచించాడు.

ثُمَّ عَبَسَ وَبَسَرَ ﴿٢٢﴾

**22**. తరువాత అతడు నుదురు చిట్లించుకున్నాడు మరియు కోపంతో చూశాడు (ముఖం మాడ్చుకున్నాడు);

ثُمَّ أَدۡبَرَ وَٱسۡتَكۡبَرَ ﴿٢٣﴾

**23**. తరువాత అతడు వెనుకకు మరలి దురహంకారం చూపాడు.[1]

فَقَالَ إِنۡ هَٰذَآ إِلَّا سِحۡرٞ يُؤۡثَرُ ﴿٢٤﴾

**24**. అప్పుడు అతడు ఇలా అన్నాడు: "ఇది పూర్వం నుండి వస్తూవున్న ఒక మంత్రజాలం మాత్రమే!

إِنۡ هَٰذَآ إِلَّا قَوۡلُ ٱلۡبَشَرِ ﴿٢٥﴾

**25**. "ఇది కేవలం ఒక మానవ వాక్కు మాత్రమే!"

سَأُصۡلِيهِ سَقَرَ ﴿٢٦﴾

**26**. త్వరలోనే నేను అతనిని నరకాగ్నిలో కాల్చుతాను.

وَمَآ أَدۡرَىٰكَ مَا سَقَرُ ﴿٢٧﴾

**27**. మరియు ఆ నరకాగ్ని అంటే నీవు ఏమనుకుంటున్నావు?[2]

---

**1**. చూడండి, 96:6-7.

**2**. సఖరున్: నరకానికి ఏడు అంతస్తులు లేక శ్రేణులున్నాయి. 1) జహన్నమ్ (నరకం), 2) ల''జ్జా (ధ్వంసం చేసే అగ్ని), 3) 'హు'త్మ (అణగ/చితకగొట్టే శిక్ష), 4) స'యీర్ (ప్రజ్వలించే అగ్ని), 5) సఖర్ (నరకాగ్ని), 6) జ'హీమ్ (మండే అగ్ని), 7) హావియహ్. ఇది అన్నిటి కంటే క్రింది అంతస్తు, ఇందులో మునాఫిఖులు (కపటవిశ్వాసులు) ఉంటారు. ఏడు ద్వారాలు అంటే ఏడు విధాలైన పాపుల దారులు. చూడండి, 15:44.

**28**. అది (ఎవరినీ) మిగల్చదు మరియు వదలిపెట్టదు.[1]

لَا تُبۡقِي وَلَا تَذَرُ ۝٢٨

**29**. అది మానవుణ్ణి (అతడి చర్మాన్ని) దహించివేస్తుంది.[2]

لَوَّاحَةٞ لِّلۡبَشَرِ ۝٢٩

**30**. దానిపై పందొమ్మిది మంది (దేవదూతలు నియమించబడి) ఉన్నారు.

عَلَيۡهَا تِسۡعَةَ عَشَرَ ۝٣٠

**31**. మరియు మేము దేవదూతలను మాత్రమే నరకానికి రక్షకులుగా నియమించాము మరియు మేము వారి సంఖ్యను (పందొమ్మిదిని), సత్య తిరస్కారులకు ఒక పరీక్షగా, గ్రంథ ప్రజలకు నమ్మకం కలగటానికి, విశ్వాసుల విశ్వాసాన్ని అధికం చేయటానికి మరియు గ్రంథప్రజలు మరియు విశ్వాసులు సందేహంలో పడకుండా ఉండటానికి మరియు తమ హృదయాలలో రోగమున్న వారు మరియు సత్యతిరస్కారులు: "ఈ ఉపమానం ఇవ్వటంలో అల్లాహ్ ఉద్దేశమేమిటి?" అని పలుకటానికి! ఈ విధంగా అల్లాహ్ తానుకోరిన వారిని మార్గభ్రష్టత్వంలో వదులుతాడు మరియు తానుకోరిన వారికి మార్గదర్శకత్వం చేస్తాడు.[3] మరియు నీ ప్రభువు సైన్యాలను ఆయన తప్ప మరెవ్వరూ ఎరుగరు. మరియు ఇదంతా మానవునికి ఒక జ్ఞాపిక మాత్రమే.

وَمَا جَعَلۡنَآ أَصۡحَٰبَ ٱلنَّارِ إِلَّا مَلَٰٓئِكَةٗۙ وَمَا جَعَلۡنَا عِدَّتَهُمۡ إِلَّا فِتۡنَةٗ لِّلَّذِينَ كَفَرُواْ لِيَسۡتَيۡقِنَ ٱلَّذِينَ أُوتُواْ ٱلۡكِتَٰبَ وَيَزۡدَادَ ٱلَّذِينَ ءَامَنُوٓاْ إِيمَٰنٗاۙ وَلَا يَرۡتَابَ ٱلَّذِينَ أُوتُواْ ٱلۡكِتَٰبَ وَٱلۡمُؤۡمِنُونَۙ وَلِيَقُولَ ٱلَّذِينَ فِي قُلُوبِهِم مَّرَضٞ وَٱلۡكَٰفِرُونَ مَاذَآ أَرَادَ ٱللَّهُ بِهَٰذَا مَثَلٗاۚ كَذَٰلِكَ يُضِلُّ ٱللَّهُ مَن يَشَآءُ وَيَهۡدِي مَن يَشَآءُۚ وَمَا يَعۡلَمُ جُنُودَ رَبِّكَ إِلَّا هُوَۚ وَمَا هِيَ إِلَّا ذِكۡرَىٰ لِلۡبَشَرِ ۝٣١

---

1. అంటే అది నరకవాసులను బ్రతుకనివ్వదూ మరియు చావనివ్వదూ, వారి శరీరపు ప్రతి భాగాన్ని కాల్చుతుంది.
2. చూడండి, 87:12-13.
3. చూడండి, 2:26.

كَلَّا وَٱلْقَمَرِ ﴿٣٢﴾

32. అలాకాదు! చంద్రుని సాక్షిగా!

وَٱلَّيْلِ إِذْ أَدْبَرَ ﴿٣٣﴾

33. గడిచిపోయే రాత్రి సాక్షిగా!

وَٱلصُّبْحِ إِذَآ أَسْفَرَ ﴿٣٤﴾

34. ప్రకాశించే, ఉదయం సాక్షిగా!

إِنَّهَا لَإِحْدَى ٱلْكُبَرِ ﴿٣٥﴾

35. నిశ్చయంగా, ఇది (ఈ నరకాగ్ని ప్రస్తావన) ఒక గొప్ప విషయం.

نَذِيرًا لِّلْبَشَرِ ﴿٣٦﴾

36. మానవునికి ఒక హెచ్చరిక!

لِمَن شَآءَ مِنكُمْ أَن يَتَقَدَّمَ أَوْ يَتَأَخَّرَ ﴿٣٧﴾

37. మీలో ముందుకు రావాలని కోరుకునే వానికి లేదా వెనుక ఉండిపోయే వానికి;

كُلُّ نَفْسٍۭ بِمَا كَسَبَتْ رَهِينَةٌ ﴿٣٨﴾

38. ప్రతి మానవుడు తానుచేసిన కర్మలకు తాకట్టుగా ఉంటాడు.

إِلَّآ أَصْحَٰبَ ٱلْيَمِينِ ﴿٣٩﴾

39. కుడి పక్షం వారు తప్ప!

فِى جَنَّٰتٍ يَتَسَآءَلُونَ ﴿٤٠﴾

40. వారు స్వర్గాలలో ఉంటూ ఒకరినొకరు ఇలా ప్రశ్నించుకుంటారు!

عَنِ ٱلْمُجْرِمِينَ ﴿٤١﴾

41. అపరాధులను గురించి (మరియు వారితో అంటారు):

مَا سَلَكَكُمْ فِى سَقَرَ ﴿٤٢﴾

42. "మిమ్మల్ని ఏ విషయం నరకంలోకి ప్రవేశింపజేసింది?"

قَالُوا۟ لَمْ نَكُ مِنَ ٱلْمُصَلِّينَ ﴿٤٣﴾

43. వారు (నరకవాసులు) ఇలా జవాబిస్తారు: "మేము నమా'జ్ చేసే వాళ్ళంకాము.

وَلَمْ نَكُ نُطْعِمُ ٱلْمِسْكِينَ ﴿٤٤﴾

44. "మరియు నిరుపేదకు ఆహారం పెట్టే వాళ్ళంకాము;

وَكُنَّا نَخُوضُ مَعَ ٱلْخَآئِضِينَ ﴿٤٥﴾

45. "మరియు వృథా కాలక్షేపం చేసే వారితో కలిసి వ్యర్థ ప్రలాపాలు (ప్రసంగాలు) చేస్తూ ఉండేవాళ్ళము;

وَكُنَّا نُكَذِّبُ بِيَوْمِ ٱلدِّينِ ﴿٤٦﴾

**46**. "మరియు తీర్పుదినాన్ని అబద్ధమని నిరాకరిస్తూ ఉండేవాళ్ళము;

حَتَّىٰٓ أَتَىٰنَا ٱلْيَقِينُ ﴿٤٧﴾

**47**. "చివరకు ఆ అనివార్యమైన (ఘడియ) మాపై వచ్చిపడింది."[1]

فَمَا تَنفَعُهُمْ شَفَٰعَةُ ٱلشَّٰفِعِينَ ﴿٤٨﴾

**48**. అప్పుడు సిఫారసుచేసే వారి సిఫారసు, వారికి ఏమాత్రం ఉపయోగపడదు.[2]

فَمَا لَهُمْ عَنِ ٱلتَّذْكِرَةِ مُعْرِضِينَ ﴿٤٩﴾

**49**. అయితే, వారికేమయింది? ఈ హితోపదేశం నుండి వారెందుకు ముఖం త్రిప్పుకుంటున్నారు.

كَأَنَّهُمْ حُمُرٌ مُّسْتَنفِرَةٌ ﴿٥٠﴾

**50**. వారిస్థితి బెదిరిన అడవి గాడిదల మాదిరిగా ఉంది;

فَرَّتْ مِن قَسْوَرَةٍۭ ﴿٥١﴾

**51**. సింహం నుండి పారిపోయే (గాడిదల మాదిరిగా)![3]

بَلْ يُرِيدُ كُلُّ ٱمْرِئٍ مِّنْهُمْ أَن يُؤْتَىٰ صُحُفًا مُّنَشَّرَةً ﴿٥٢﴾

**52**. అలాకాదు! వారిలో ప్రతి ఒక్కవ్యక్తి తనకు విప్పబడిన గ్రంథాలు ఇవ్వబడాలని కోరుతున్నాడు.[4]

---

**1**. చూడండి, 15:99.

**2**. సిఫారస్ కొరకు చూడండి, 10:3.

**3**. దీనిని వ్యాఖ్యాతలు - సింహం, పులి లేక వేటగాడి నుండి - పారిపోవటం, అని అన్నారు.

**4**. విప్పబడిన గ్రంథాలు అంటే: ము'హమ్మద్ ('స'అస), అల్లాహ్ (సు.తా.) యొక్క ప్రవక్త అని వ్రాయబడిన గ్రంథం ప్రతి ఒక్కరికి ఇవ్వబడాలని లేక దైవగ్రంథం ప్రతిఒక్కరికి ఇవ్వబడాలని. చూడండి, 2:118 వారు ఇలా పలకడం వారి దురహంకారాన్ని సూచిస్తుంది.

كَلَّا بَل لَّا يَخَافُونَ ٱلْـَٔاخِرَةَ ﴿٥٣﴾

**53**. కాదుకాదు! అసలు వారు పరలోక జీవితం గురించి భయపడటం లేదు.

كَلَّآ إِنَّهُۥ تَذْكِرَةٌ ﴿٥٤﴾

**54**. అలాకాదు! నిశ్చయంగా, ఇది ఒక హితోపదేశం.

فَمَن شَآءَ ذَكَرَهُۥ ﴿٥٥﴾

**55**. కావున కోరినవాడు దీనినుండి హితబోధ గ్రహించవచ్చు.

وَمَا يَذْكُرُونَ إِلَّآ أَن يَشَآءَ ٱللَّهُ ۚ هُوَ أَهْلُ ٱلتَّقْوَىٰ وَأَهْلُ ٱلْمَغْفِرَةِ ﴿٥٦﴾

**56**. కాని అల్లాహ్ కోరితే తప్ప![1] వీరు దీనినుండి హితబోధ గ్రహించలేరు. ఆయనే (అల్లాహ్‌యే) భయభక్తులకు అర్హుడు మరియు ఆయనే క్షమించే అర్హతగలవాడు. (3/4)

*****

**1**. చూడండి, 81:28-29 మరియు 14:4.

## 75. సూరహ్ అల్-ఖియామహ్

## سُورَةُ القِيَامَةِ

అల్-ఖియామహ్: The Resurrection, పునరుత్థానం. ఈ సూరహ్ పేరు మొదటి ఆయత్‌లోనే ఉంది. ఇందులో పునరుత్థానదినం గురించి వివరాలున్నాయి. ఇది మొదటి మక్కా కాలపు సూరహ్. ఇందులో **40 ఆయతులు** ఉన్నాయి.

అనంత కరుణామయుడు అపార కరుణాప్రదాత అయిన అల్లాహ్ పేరుతో

بِسۡمِ ٱللَّهِ ٱلرَّحۡمَٰنِ ٱلرَّحِيمِ

لَآ أُقۡسِمُ بِيَوۡمِ ٱلۡقِيَٰمَةِ ١

**1.** * అలాకాదు! నేను పునరుత్థానదినపు శపథం చేస్తున్నాను.

وَلَآ أُقۡسِمُ بِٱلنَّفۡسِ ٱللَّوَّامَةِ ٢

**2.** అలాకాదు! నేను తనను తాను నిందించుకునే అంతరాత్మ శపథం చేస్తున్నాను.

أَيَحۡسَبُ ٱلۡإِنسَٰنُ أَلَّن نَّجۡمَعَ عِظَامَهُۥ ٣

**3.** ఏమిటి? మేము అతని ఎముకలను ప్రోగుచేయలేమని మానవుడు భావిస్తున్నాడా?

بَلَىٰ قَٰدِرِينَ عَلَىٰٓ أَن نُّسَوِّيَ بَنَانَهُۥ ٤

**4.** వాస్తవానికి! మేము అతని వ్రేళ్ళ కొనలను గూడా సరిగ్గా సవరించగల సమర్థులము.

بَلۡ يُرِيدُ ٱلۡإِنسَٰنُ لِيَفۡجُرَ أَمَامَهُۥ ٥

**5.** అయినా, మానవుడు ఇక మీద కూడా దుష్కార్యాలు చేయగోరుతున్నాడు.

يَسۡـَٔلُ أَيَّانَ يَوۡمُ ٱلۡقِيَٰمَةِ ٦

**6.** అతడు: "అయితే ఈ పునరుత్థానదినం ఎప్పుడు వస్తుంది?" అని అడుగుతున్నాడు.

فَإِذَا بَرِقَ ٱلۡبَصَرُ ٧

**7.** కళ్ళు మిరుమిట్లు గొన్నప్పుడు;

وَخَسَفَ ٱلۡقَمَرُ ٨

**8.** మరియు చంద్రునికి గ్రహణం పట్టినప్పుడు;

وَجُمِعَ ٱلشَّمۡسُ وَٱلۡقَمَرُ ٩

**9.** మరియు సూర్యచంద్రులు కలిపివేయబడినప్పుడు;

يَقُولُ ٱلۡإِنسَٰنُ يَوۡمَئِذٍ أَيۡنَ ٱلۡمَفَرُّ ١٠

**10**. మానవుడు ఆ రోజు: "ఎక్కడికి పారిపోవాలి?" అని అంటాడు.

كَلَّا لَا وَزَرَ ١١

**11**. అది కాదు! (అతనికి) ఎక్కడా శరణం ఉండదు!

إِلَىٰ رَبِّكَ يَوۡمَئِذٍ ٱلۡمُسۡتَقَرُّ ١٢

**12**. ఆ రోజు నీ ప్రభువువద్దనే ఆశ్రయం ఉంటుంది.

يُنَبَّؤُاْ ٱلۡإِنسَٰنُ يَوۡمَئِذِۭ بِمَا قَدَّمَ وَأَخَّرَ ١٣

**13**. ఆ రోజు మానవుడికి, తాను చేసి పంపింది మరియు వెనక వదలింది అంతా తెలుపబడుతుంది.[1]

بَلِ ٱلۡإِنسَٰنُ عَلَىٰ نَفۡسِهِۦ بَصِيرَةٞ ١٤

**14**. అలాకాదు! మానవుడు తనకు విరుద్ధంగా, తానే సాక్షి అవుతాడు;

وَلَوۡ أَلۡقَىٰ مَعَاذِيرَهُۥ ١٥

**15**. మరియు అతడు ఎన్ని సాకులు చెప్పినా సరే![2]

لَا تُحَرِّكۡ بِهِۦ لِسَانَكَ لِتَعۡجَلَ بِهِۦٓ ١٦

**16**. నీవు దీనిని (ఈ ఖుర్ఆన్‌ను గ్రహించటానికి) నీ నాలుకను త్వరత్వరగా కదిలించకు.[3]

إِنَّ عَلَيۡنَا جَمۡعَهُۥ وَقُرۡءَانَهُۥ ١٧

**17**. నిశ్చయంగా, దీనిని సేకరించటం మరియు దీనిని చదివించటం మా భాధ్యతే!

فَإِذَا قَرَأۡنَٰهُ فَٱتَّبِعۡ قُرۡءَانَهُۥ ١٨

**18**. కావున మేము దీనిని పఠించినప్పుడు నీవు ఆ పారాయణాన్ని శ్రద్ధగా అనుసరించు!

ثُمَّ إِنَّ عَلَيۡنَا بَيَانَهُۥ ١٩

**19**. ఇక దాని భావాన్ని అర్థమయ్యేలా చేయటం మా బాధ్యతే![4]

---

**1**. చూడండి, 18:49.

**2**. చూడండి, 24:24, 36:25 లేక 41:20-22.

**3**. జిబ్రీల్('అ.స.) ఖుర్ఆన్ అవతరింపజేసేటప్పుడు, దైవప్రవక్త('స'అస) ఏపదాన్ని కూడా మరచిపోరాదని త్వరత్వరగా చదివేవారు. అల్లాహుతా'అలా త్వరత్వరగా చదువటం నుండి నివారించాడు. ('స.బు'ఖారీ) ఇటువంటి వాక్యానికై చూడండి, 20:114.

**4**. దైవప్రవక్త ('స'అస) ఖుర్ఆన్‌ను ప్రజలకు అర్థమవటానికి వివరించి చెప్పింది కూడా అల్లాహ్ (సు.తా.) తరఫునుండి, తనకు తెలుపబడిందే. ఈ వివరణలే 'హదీసులు!

**20**. అలాకాదు! వాస్తవానికి మీరు అనిశ్చితమైన (ఇహలోక జీవితం పట్ల) వ్యామోహం పెంచుకుంటున్నారు;

كَلَّا بَلْ تُحِبُّونَ ٱلْعَاجِلَةَ ﴿٢٠﴾

**21**. మరియు పరలోకజీవితాన్ని వదలిపెడ్తున్నారు![1]

وَتَذَرُونَ ٱلْآخِرَةَ ﴿٢١﴾

**22**. ఆ రోజున కొన్ని ముఖాలు కళకళలాడుతూ ఉంటాయి;

وُجُوهٌ يَوْمَئِذٍ نَّاضِرَةٌ ﴿٢٢﴾

**23**. తమ ప్రభువు (అల్లాహ్) వైపునకు చూస్తూ ఉంటాయి;[2]

إِلَىٰ رَبِّهَا نَاظِرَةٌ ﴿٢٣﴾

**24**. మరికొన్ని ముఖాలు ఆ రోజు, కాంతిహీనమై ఉంటాయి;[3]

وَوُجُوهٌ يَوْمَئِذٍ بَاسِرَةٌ ﴿٢٤﴾

**25**. నడుమును విరిచే బాధ వారికి కలుగుతుందని భావించి.[4]

تَظُنُّ أَن يُفْعَلَ بِهَا فَاقِرَةٌ ﴿٢٥﴾

**26**. అలాకాదు! ప్రాణం గొంతులోకి వచ్చినపుడు;[5]

كَلَّآ إِذَا بَلَغَتِ ٱلتَّرَاقِيَ ﴿٢٦﴾

**27**. మరియు: "ఎవడైనా ఉన్నాడా? అతనిని (మరణం నుండి) కాపాడటానికి?" అని అనబడుతుంది.[6]

وَقِيلَ مَنْۜ رَاقٍ ﴿٢٧﴾

**28**. మరియు అప్పుడు అతడు వాస్తవానికి తన ఎడబాటుకాలం వచ్చిందని గ్రహిస్తాడు;

وَظَنَّ أَنَّهُ ٱلْفِرَاقُ ﴿٢٨﴾

---

**1**. అంటే పరలోక జీవితాన్ని నమ్మటంలేదు. మీరు మీ జీవితం కేవలం ఈ ఇహలోక జీవితం మాత్రమే అనే భ్రమలో పడిఉన్నారు. మీరు పునరుత్థరింపబడతారని నమ్మటంలేదు.

**2**. ఇవి విశ్వాసుల ముఖాలు.

**3**. ఇవి సత్యతిరస్కారుల ముఖాలు.

**4**. అంటే వారు నరకంలో వేయబడతారని తెలుసుకొని.

**5**. మరణం ఆసన్నమైనప్పుడు.

**6**. ఇటువంటి ఆయత్ కోసం చూడండి, 28:71-72.

وَٱلۡتَفَّتِ ٱلسَّاقُ بِٱلسَّاقِ ﴿٢٩﴾

**29**. మరియు ఒక పిక్క మరొక పిక్కతో కలిసిపోతుంది.[1]

إِلَىٰ رَبِّكَ يَوۡمَئِذٍ ٱلۡمَسَاقُ ﴿٣٠﴾

**30**. ఆ రోజు నీ ప్రభువు వైపునకు ప్రయాణం ఉంటుంది!

فَلَا صَدَّقَ وَلَا صَلَّىٰ ﴿٣١﴾

**31**. కాని అతడు సత్యాన్ని నమ్మలేదు మరియు నమాజ్ సలపనూ లేదు![2]

وَلَٰكِن كَذَّبَ وَتَوَلَّىٰ ﴿٣٢﴾

**32**. మరియు అతడు (ఈ సందేశాన్ని) అసత్యమన్నాడు మరియు దాని నుండి వెనుదిరిగాడు!

ثُمَّ ذَهَبَ إِلَىٰٓ أَهۡلِهِۦ يَتَمَطَّىٰٓ ﴿٣٣﴾

**33**. ఆ తరువాత నిక్కుతూ నీల్గుతూ తన ఇంటివారి వద్దకు పోయాడు!

أَوۡلَىٰ لَكَ فَأَوۡلَىٰ ﴿٣٤﴾

**34**. (ఓ సత్యతిరస్కారుడా!) నీకు నాశనం మీద నాశనం రానున్నది!

ثُمَّ أَوۡلَىٰ لَكَ فَأَوۡلَىٰٓ ﴿٣٥﴾

**35**. అవును, నీకు నాశనం మీద నాశనం రానున్నది!

أَيَحۡسَبُ ٱلۡإِنسَٰنُ أَن يُتۡرَكَ سُدًى ﴿٣٦﴾

**36**. ఏమిటి? మానవుడు తనను విచ్చలవిడిగా వదలిపెట్టడం జరుగుతుందని భావిస్తున్నాడా?

أَلَمۡ يَكُ نُطۡفَةً مِّن مَّنِيٍّ يُمۡنَىٰ ﴿٣٧﴾

**37**. ఏమీ? అతడు ప్రసరింపజేయబడిన ఒక వీర్యబిందువు కాడా?

ثُمَّ كَانَ عَلَقَةً فَخَلَقَ فَسَوَّىٰ ﴿٣٨﴾

**38**. తరువాత ఒక రక్తకండగా (జలగగా) ఉండేవాడు కాదా? తరువాత ఆయన (అల్లాహ్) అతనిని సృష్టించి అతని రూపాన్ని తీర్చిదిద్దాడు.[3]

---

**1**. అంటే అతడు, తాను కష్టాలపాలవుతున్నానని తెలుసుకుంటాడు.
**2**. చూడండి, 4:17-18.
**3**. చూడండి, 87:2 మరియు 91:7.

فَجَعَلَ مِنْهُ ٱلزَّوْجَيْنِ ٱلذَّكَرَ وَٱلْأُنثَىٰٓ ﴿٣٩﴾

**39.** ఆ తరువాత అతని నుండి స్త్రీ పురుషుల రెండు రకాలను (జాతులను) ఏర్పరచాడు.

أَلَيْسَ ذَٰلِكَ بِقَٰدِرٍ عَلَىٰٓ أَن يُحْـِۧيَ ٱلْمَوْتَىٰ ﴿٤٠﴾

**40.** అలాంటప్పుడు ఆయనకు మరణించిన వారిని మళ్ళీ బ్రతికించే సామర్థ్యం లేదా?

*****